

డాక్టర్ నేలటూరి వెంకటరమణయ్యగారు ఎమ్. ఏ., పిఎచ్. డి.

శ్రీ

# పల్లవులు - చాళుక్యులు

[చారిత్రక వ్యాసములు]

రచయిత : ప్రకాశకుడు

డా. నేలటూరు వేంకటరమణయ్య ఎం. ఏ. పిఎచ్. డి.,

ప్రతులకు

వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్

4. మల్లికేశ్వరగుడిసందు, లింగిసెట్టివీధి,

మద్రాసు - 1

1969

రు 16 - 00

# కృతిసమర్పణ

ఎవరి సహకారౌదార్యముల వలన నాంధ్ర
దేశమున చరిత్రపరిశోధన పెంపొందెనో
యా విశ్వదాత దేశోద్ధారక శ్రీ కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారి
కీర్తిమూర్తికి
ఈ కృతిని సమర్పించుచున్నాడను.

నేలటూరు వెంకటరమణయ్య.

# పీ ఠి క

ఈ సంపుటములోని వ్యాసములు 1928-50 ల మధ్య, అప్పు డప్పుడు, చరిత్ర పరిశోధన సందర్భమున నాకు గల్గిన సంశయములను నివర్తిజేసికొనుటకై విరచించినవి. ఇవి యన్నియు భారతి పత్రిక యందు వెలువడినవే. వీని నన్నిటిని నిరాటంకముగ బ్రచురించి నందు లకు తత్పత్రికాధిపతులైన విశ్వదాత దేశోద్ధారకులైన శ్రీ కాశీ నాథుని నాగేశ్వరరావు పంతులు గారికిని శ్రీ శివలెంక శంభుప్రసాదు గారికిని నా కృతజ్ఞతాపూర్వక వందనములను సమర్పించుచున్నాడను. వారి సహకారమే లేకయుండిన నేనిన్ని వ్యాసములను రచించి ప్రక టించి యుండజాలను.

ఈ వ్యాసములను బుస్తకరూపమున బ్రచురించిన చరిత్ర పరి శోధకుల కుపయుక్తముగ నుండునని మిత్రులు కొందఱు చెప్పిరి. ఆ కార్యము అస్మదాదులకు ధనసంపద లేక సాధ్యముగాదు. ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీవారును, ఆంధ్రప్రదేశ గవరన్మెంటు వారును నా విజ్ఞాపనముపై గొంత ధనమును బ్రసాదించిరి. తన్మూల మున ముద్రణకార్యము కొనసాగినది. వారియెడ కృతజ్ఞుడను. ఈ సందర్భమున నాకు మహోపకారమొనర్చిన గౌ॥ మన విద్యాశాఖ మంత్రిగారగు శ్రీ పి. వి. నరసింహారావు గారికిని, సాహిత్య అకా డమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు పంతులు గారికిని నా ఋణము తీర్పరానిది. చంద్రునికి ఒక నూలిపోగు అన్నట్లు వారికి నా చేమోడ్పులు సమర్పించి సంతృప్తినందుచున్నాడను.

ముద్రణ కార్యమును సర్వమును మీద వేసికొని సర్వమునకు దానయై గ్రంథము నచ్చొత్తించి చక్కని రూపొసగి సత్వరము అందజేసిన వేదం బ్రదర్సును, ముఖ్యముగ శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి గారిని అభినందించుచున్నాడను.

విద్యానగరు, హైదరాబాదు
10-10-69

నేలటూరు వేంకటరమణయ్య.

# వి ష య సూ చి క





శ్రీ

# ఆంధ్రదేశమున చరిత్రపరిశోధన

సర్వశాస్త్రములను, విద్యలను పరిశీలించి గ్రంథములను రచించిన మన పూర్వు లేలనో చరిత్రరచన చేయలేదు. ఇది యొక యాంధ్రదేశముననే కాదు, భరతఖండమంతటను ప్రాచీను లెవ్వరును దేశచరిత్రను గూర్చి చింతించినవారు గారు. కల్హాను డొక్కఁడు మాత్రము రాజతరంగిణి యను పేరఁ గాశ్మీరదేశచరిత్రను వ్రాసెను. మహమ్మదీయులతోడి సంపర్కము రాజతరంగిణిరచనకుఁ గారణ మగుటవలన నది కేవలము భారతీయులకుఁ జరిత్రయందు గల అభిమానమువలన విరచింపఁబడె నని యెంచుటకు వీలులేదు. మహమ్మదీయయుగమున హిందువు లనేకులు చరిత్రరచనకుఁ గడఁగిరి; కాని వీరిరచనలు మహమ్మదీయ రచయితల గ్రంథములబడి సర్వసామాన్య మహమ్మదీయ రాజులయొక్కయు, రాజ్యముల యొక్కయు చరిత్రలే యగుటచేత హిందూమహాయుగ చరిత్ర వానివలన దెలియవచ్చుట లేదు. ప్రాచీన భారతదేశ స్థితిగతులను దెలుపు చరిత్రగ్రంథములు లేకపోయినను, చరిత్ర లేకపోలేదు. మన ప్రాచీనుల చరిత్రను దెలుపగల పరికరములు పెక్కు లభ్యమైనవి. వీని నాధారపఱచుకొని యత్యంత సూక్ష్మముగ గాకపోయినను స్థూలముగ నైనను మన పూర్వ చరిత్రను విరచించుటకు సాధ్యమగుచున్నది. ఆధునికచరిత్ర పరిశోధకు లీ పరికరములను నాలుగైదు తరగతులుగ విభజించి యున్నారు. ప్రాచీనవాస్తువిశేషములు, శిల్పములు, శాసనములు, నాణెములు, వాఙ్మయము మొదలగువాని మూలమున జరిత్రకారులు మన పూర్వచరిత్రను పునర్నిర్మాణము గావించుటకు ప్రయత్నము చేయుచున్నారు.

# చారిత్రక వ్యాసములు

పాశ్చాత్యసంయోగమువలన మన కలవడిన విద్యలలోఁ జరిత్ర
రిశోధన యొకటి. తత్పూర్వము మనవారు జాతీయజీవనమందు
చరిత్రయొక్క ప్రాముఖ్యమును గుర్తించియుండలేదు. అటుతరువాతనే
మ. పాఠశాలలయందును కళాశాలలయందును, విశ్వవిద్యాలయము
లందును చరిత్రపఠనకు తావు చిక్కినది; అన్యదేశ చరిత్రల నభ్య
సించి పట్టభద్రులైన మన యువకులకు నిజదేశచరిత్రను దెలిసికొన
వలయు నని యుత్సాహము గలిగినది. దీనికిఁదోడు దేశపాలనార్థము
నియుక్తులై వచ్చిన యాంగ్లేయాధికారుల కనేకులకు దాము పాలించు
ప్రజల చరిత్రను, సంస్కృతిని దెలిసికొనవలయు నను నభిలాష కలిగి
నది. కావున వారు చరిత్రరచన కనువగు సామగ్రిని సమకూర్ప
నారంభించుటయేకాక మన దేశభాషల నలవఱచుకొని చారిత్రక
వాఙ్మయాది పరిశోధనకు మార్గదర్శకులైరి; ఆంగ్లవిద్యావిశారదులైన
మనవారిని చరిత్రరచనకు బ్రోత్సహించిరి. ఇట్లు పాశ్చాత్య భార
తీయ పరిశోధకుల సహకారమువలన మనదేశమున చరిత్రపరిశోధ
నము, దాని ఫలితమగు చరిత్రరచనయు బ్రారంభమైనవి.

చరిత్రపరిశోధన భరతఖండమునందలి యన్ని దేశములకంటె
ముందే యాంధ్రదేశమున నారంభమైనది. క్రీ. శ. ౧౯ వ శతాబ్ద
పూర్వార్ధమున కుంఫిణీ ప్రభుత్వమువారు కర్నల్ కాలిన్ మెకంజీ
యనునతనిని దక్షిణభారతదేశమునందు సర్వేయరుజనరల్ పదవికి
నియమించిరి. ఇతనికి హైందవసంస్కృతిని జక్కగ గ్రహించి దాని
యభ్యుదయమును వివరించు చరిత్ర గ్రంథమును వ్రాయవలయు నని
యభిలాష గలిగినది. తన యుద్యమము నెఱవేఱుటకు దగిన సామగ్రిని
సేకరించుటకొఱకు నిజద్రవ్యమును వెచ్చపెట్టి కొందఱు వ్రాయస
కాండ్రను, గుమాస్తాలను ఏర్పాటుచేసికొని, వారిని దక్షిణాపథమందలి
గ్రామగ్రామమునకు బోయి యచ్చట లభ్యమగు తామ్రశిలాశాసనము
లను, తాళపత్ర గ్రంథములను బ్రతులు లిఖించుటయేకాక

యచటిజనుల జాతివిశేషములను, వారి మతసాంఘికార్థిక పరిస్థితులను విచారించి వాని వివరములను, వ్రాసి తేవలయునని నియోగించెను.

మెకంజీగారి గుమాస్తాల కందఱికిని నాయకుఁడొక యాంధ్ర బ్రాహ్మణుఁడు. అతని పేరు కావలి వెంకటబొర్రయ్య; ఇతనిక్రింద నితని సోదరుఁడు రామస్వామియు, వెంకటరావు, నారాయణరావు, నిట్టలనైనారు మొదలగు గుమాస్తా లనేకులు పనిచేయుచుండిరి. వెంకటబొర్రయ్యగారి యుత్తరవు ననుసరించి పైఁ బేర్కొనిన గుమాస్తాలు దేశసంచారము జేసి ప్రతి గ్రామముయొక్క పుట్టుపూర్వోత్తరమును, నందుండు శాసనాదులను యథామాతృకముగ వ్రాసిపంపిరి; వారికి దెలియని వ్రాతయం దుల్లేఖింపబడియుండిన శాసనములను దామ్రఫలకములందుగాని, శిలాతలమునందుగాని యేరీతి జెక్కఁబడియుండెనో యట్లే వానికి మాఱుప్రతులను దయారుచేసి యంపిరి. గుమాస్తాల పైని అధికారియగు కావలి వెంకటబొర్రయ్యయు, దక్కిన గుమాస్తాలలో బెక్కండ్రును దెనుఁగువారగుటచేత వారిచే దయారు చేయఁబడిన గ్రామ కైఫియ్యతులు మున్నగు సర్వవిషయములును దెనుఁగు భాషయందే వ్రాయఁబడినవి. వీని నాధారపఱచుకొని వెంకట బొర్రయ్యగారు సందర్భానుసారముగ నచట నచట నాడులచరిత్రలను, రాజుల చరిత్రములను విరచించిరి. మెకంజీగుమాస్తాలే మొదటి యాంధ్రచరిత్ర పరిశోధకులు. పరిశోధనాపద్ధతులను వీరికి నేర్పి శాస్త్ర సమ్మతమార్గముల నుల్లంఘింపనీయక పరిశోధన నడిపించిన వెంకట బొర్రయ్యగా రాంధ్రచారిత్రకపితామహు లనదగినవారు. ఆంధ్ర చరిత్రకు వీరు వేసిన పునాదుల ననుసరించియే తరువాత పరిశోధకులు చరిత్రరచనను సాగించిరి. వెంకటబొర్రయ్యగారి పరిశోధన కేవలము స్థానికచరిత్రరచనతోడనే ముగియలేదు. ఆయన గొప్ప లిపిమర్మజ్ఞుఁడు. మెకంజీ గుమాస్తాల దేశసంచారమున వారికి దెలియని లిపియందు వ్రాయఁబడియుండు ప్రాచీన శాసనములు పెక్కుతావుల గాన

వచ్చినవి. మఱియు గ్రామాదులయం దచటనచట లభ్యములైన తామ్రపట్టికలున్నైత మీలిపియందే వ్రాయఁబడియుండినవి. వీనినిఁ జదువ నప్పటివా రెవ్వరు నెఱుఁగరు. ఈ లిపి సామాన్యముగ నాంధ్ర కర్ణాట శాసనములయందే కానవచ్చుచుండుటచే నప్పటి పరిశోధక పండితులు దీనికి తెలుగుకన్నడలిపి యని నామకరణము గావించిరి. తెలుగుకన్నడలిపిమర్మమును గనిపట్టి ప్రాచీన దాక్షిణాత్యశాసనములను జదువు మార్గమును చరిత్రపరిశోధకులకు గఱపి శాసనపరిశోధనకుఁ బునాది వేసినవాఁడు కావలి వెంకటబొఱ్ఱయ్య. చరిత్రరచనకు వలసిన సాధనములందు శాసనముల ప్రాముఖ్యము అందఱు నెఱింగినదే. కావున దాక్షిణాత్యచరిత్ర రచనకు వెంకటబొఱ్ఱయ్యగా రొనర్చిన సేవ యమూల్యమని చెప్పుట యతిశయోక్తి కాదు.

మెకంజీ గుమాస్తాల వ్రాఁతలు దాదాఁపు నాలుగువందల సంపుటములు మదరాసుప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున గలవు. వీనికి మెకంజీ వ్రాఁతపుస్తకములని పేరు. కాలక్రమమున క్రిమిదష్టములైపోవు వానిని సంరక్షింప నిశ్చయించి వీనియందు జాలభాగమును చార్లెసు ఫిలిప్ బ్రౌనుగారు ఆఱువదికి నెక్కుడైన సంపుటములను దిరుగవ్రాయించిరి. ఇట్లు తిరుగవ్రాయఁబడిన గ్రంథములకు లోకల్ రికార్డ్సు అని పేరు. మెకంజీ వ్రాఁతపుస్తకములుగాని, వానికి బ్రత్యంతరము లనఁదగిన లోకల్ రికార్డ్సు గాని యాంధ్ర చరిత్రరచనకమూల్యమైన సాధనములు. వాఙ్మయ దృష్టితో జూచినను వాని విలువ కొంచెమైనదికాదు. ఇట్టి గ్రంథసంచయ మింకను నముద్రితముగ నుండుట శోచనీయము. ఆంధ్రవిశ్వవిద్యాలయమువంటి మహానీయ సంస్థ లీ కార్యమునకు బూనుకొనవలసియున్నది.

కావలి వెంకటబొఱ్ఱయ్యకు దరువాత పేర్కొనఁదగిన చరిత్ర పరిశోధకుఁడు శ్రీమాన్ బుక్కపట్టణము రాఘవాచార్యులవారు.

వీరు క్రీ. శ. ౧౯ వ శతాబ్దపు టుత్తరార్ధమున గుంటూరు మండలమున వెలసిరి. వీరు మొదట ఫస్ట్ క్లాసు రివిన్యూ ఇన్స్పెక్టరై యుండి తరువాత సబ్ మేజస్ట్రేటు పదమును బడసిరి. ఆ కాలమున మదరాసు గవర్నరుగారి కౌన్సిలు మెంబరు కార్మైకేలు దొరగారి ప్రోత్సాహము వలన నాయన దనకు లభ్యములైన చారిత్రకసాధనసామగ్రి నాధారపఱచుకొని యాంధ్రదేశచరిత్రను కొన్ని సంపుటముల గ్రంథముగా దయారుచేసిరి. రాఘవాచార్యులవారి యాంధ్రదేశ చరిత్రనుగూర్చి బ్రహ్మశ్రీ వేటూరు ప్రభాకరశాస్త్రిలవా రిట్లు వ్రాయుచున్నారు:

"బోర్డుమెంబరగు కార్మైకేలు దొరగారి ప్రాపున వీరు పెక్కు-శాసనములను బరిశోధించి యాంధ్రదేశ చరిత్రను గొన్నివాల్యూములుగా వ్రాసిరి. అందుఁ గొన్ని వాల్యూములను మద్రాసులో నున్న యా దొరగారికి పంపినట్లు తెలియును. దొరవా రాగ్రంథమును సరిగా సంరక్షింపకపోయియుందురు. మన్మిత్రులు మా. రామకృష్ణకవిగారు పెక్కు-సంవత్సరములకు ముందు గుజలీ పుస్తకముల యంగళ్లలో వ్రాఁతప్రతులను - శాసనచారిత్ర విషయములతో నున్నవానిని జూచి కొంత సొమ్మిచ్చి కొనిరట! కాకతీయులనుగూర్చి వ్రాసిన భాగము వారిదగ్గఱ గలదట! మఱొక పట్టు చరిత్రలో వ్రాసిన విషయములకు ఆకరములయిన శాసనములు గొన్నిగలది. అట్టిది కవిగారు నాకు ఎరువుగా ఒసగిరి. . .అందలి శాసనము లిటీవల ప్రకటితము లయినవే. క్రొత్తవిగా దోఁచినవి కవిగారుగాని, వారి యనుమతిని నేనుగాని ప్రకటింతుము——నర్సారావుపేటలోను, పొన్నూరులోను గ్రంథకర్తయగు శ్రీరాఘవాచార్యులవారి కుటుంబము వారిని యాదృచ్ఛికముగా తెలిసికొనగల్గితిని. వారి దత్తపుత్రులు తమయింట బాడిపాడియై చెడిపోయి యొక వాల్యూము పెంటపాలు కాగా దత్తుల్యాదశలో నున్న వేఱొక వాల్యూమును నాకు జూపిరి. కార్మైకేలు దొరగారికి బంపిన వాల్యూముల ప్రత్యంతరములుగాబోలును వారియింట నున్నవి. నేడు

క్రొత్తగా నపేక్షింపదగిన విషయము లనేకములు లేకున్నను నేటి చరిత్రకారు లెవ్వరును దలలెత్తకపూర్వము అనన్య సాధారణమయిన పరిశ్రమ చేసిన మహనీయుని గ్రంథమని కన్నుల కద్దుకొని పెద్దల యస్థుల బోలె నా చినిగిన తునకలకట్టను ప్రాచ్యలిఖిత పుస్తకశాలకు జేర్చితిని. ” *

రాఘవాచార్యులనాటికంటె నేడు పెక్కండ్రు పరిశోధకుల కృషికి ఫలితముగ మన చరిత్రజ్ఞాన మత్యంతాభివృద్ధి నందినది. కావున శ్రీ ప్రభాకరశాస్త్రిలవారన్నట్లు నేడు క్రొత్తగా నపేక్షింపదగిన విషయము లనేకములు లేకపోయినను ఆంధ్ర చారిత్రక పరిశోధన వాఙ్మయ స్థానమున దానిస్థాన మున్నతమైనది. చరిత్రరచనయందు రాఘవాచార్యులవా రవలంబించిన పద్ధతి యుత్తమమైనది. ఆధునిక చరిత్రకారులవలె రాఘవాచార్యులవారు నిరాధారమైన వ్రాతకు మదింపు కలుగదని గుర్తించి శాసనాద్యుత్తమచారిత్రక సాధన సామగ్రి నాధారపఱచుకొనియే చరిత్రరచనను సాగించిరి. క్రొత్తవిషయములను దెలిసికొనుటకొఱకు గాకపోయినను చరిత్ర రచనాపద్ధతిని గనుగొనుటకైనను రాఘవాచార్యులవారి గ్రంథమును జదువవలసియున్నది.

రాఘవాచార్యులవారి పరిశోధనలతో క్రీ. శ. ౧౯ వ శతాబ్దము ముగిసినది. ఇరువదవ శతాబ్దముతో మన జాతీయచరిత్రయందు నూతనయుగము ప్రారంభమైనది. అప్పటికి ఆంగ్లభాషాభ్యాసము దేశమున విస్తరించుటచే దన్మూలమున పాశ్చాత్యవిజ్ఞాన మెల్లయెడలను బ్రసరించినది. మన జాతీయజీవనమున నూతన చైతన్యము బొడసూపినది. విద్యావంతులకు పాశ్చాత్య శాస్త్రపరిశోధనా పద్ధతులు సుపరిచితములైనవి. సర్వవిషయములయందు పాశ్చాత్య

* దుందుభి సంవత్సరాది సంచిక పుట ౧౬౭, ఆన్వీక్షికి.

పద్ధతులే సర్వోత్కృష్టములైన వను నమ్మకము జనసామాన్యమున కలిగినది. వాఙ్మయమునందేమి, కళలయందేమి, శాస్త్రములయందేమి మనవారికి పాశ్చాత్యదేశము లాదర్శప్రాయములైనవి. పాశ్చాత్య మార్గముల ననుసరించి నవీన వాఙ్మయమును సృజించుటకును, కళానిర్మాణము గావించుటకును, శాస్త్రవిచారము చేయుటకును మనవా రారంభించిరి. ప్రప్రథమమున మన పాశ్చాత్య మార్గానువర్తుల దృష్టికి గురియైన విషయము చరిత్రరచన; చరిత్ర లేని జన పదమునకు నాగరక ప్రపంచమున గణుతి లేదని పాశ్చాత్యుల యభిప్రాయ మగుటవలన చరిత్ర గ్రంథములు లేని మన దేశమునకు ఆ లోపమును దొలఁగించుట దమ ప్రథమకర్తవ్య మని నిశ్చయించి మన యాంగ్ల విద్యావిశారదులు చరిత్రపరిశోధనకు గడంగిరి. ఈ నవయుగ ప్రారంభమున నాంధ్ర దేశచరిత్రపరిశోధనకు గడఁగిన ప్రముఖులలో నగ్రగణ్యుఁడు కందుకూరి వీరేశలింగంపంతులు; కాని పంతులవారి పరిశోధనకు గారణము వారి చరిత్రాభిమానము గాదు. వారి కాంధ్ర దేశచరిత్రను రచింప వలయునను నుద్దేశము లేదు; వారి హృదయమున దేశాభిమానముయొక్క స్థలమును భాషాభిమాన మాక్రమించుకొనెను. ఆయన స్వయము కవియును, విద్వాంసుఁడును నగుటచేత నాంధ్రభాషను బెంపొందించిన యాంధ్రకవుల చరిత్రను రచింప వలయునను నభిలాష గలిగెను. కవుల కాలము నెఱుఁగక వారి చరిత్రను వ్రాయుటకు సాధ్యము గాదు: కావున వీరేశలింగంపంతులు గారు మొట్టమొదట ప్రతియాంధ్ర కవియొక్క కాలమును నిర్ణయించుకొనవలసివచ్చెను. కొంచె మించుమించుగ నాంధ్రకవు లందఱును రాజాశ్రయమును బొంది వారి ప్రోత్సాహాదరణమీఁద కావ్యరచనఁ జేసియుండుటచేత నారాజుల కాలముఁ దెలిసిన వారి కాలము సులభముగ దెలిసికొనవచ్చును. కావున వీరేశలింగంపంతులుగారు రాజవంశచరిత్ర పరిశోధనకును, తన్మూలమున దేశచరిత్రపరిశోధనకును

బూనుకొనవలసివచ్చినది, వీరేశలింగంపంతులుగారు తత్పూర్వ పరిశోధకులవలె చారిత్రక సాధనసామగ్రిని సమకూర్చుకొనుటకు దేశాటనము గావింపలేదు. వీరి పరిశోధనయంతయు మెకంజీగ్రంథపరిచయముమీఁదను, లోకల్ రికార్డ్సుమీఁదను నాధారపడియున్నది. వీరేశలింగంపంతులుగారు కేవలము చరిత్రపరిశోధకుఁడు కాకపోయినను, వీరి యాంధ్రకవులచరిత్ర పెక్కండ్రను చరిత్రపరిశోధనకుఁ బురికొల్పినది.

వీరేశలింగముగారి వెనుకఁ బేర్కొనఁదగిన పరిశోధకులు చిలుకూరి వీరభద్రరావుగారు. ఆంధ్రకవుల చరిత్రను బఠియించిన పిమ్మట వీరభద్రరావుగారికి ఆంధ్రదేశ చరిత్రను రచింపవలయు ననునాస పొడమినది. నిజనివాసస్థలమగు రాజమహేంద్రవరమున చరిత్ర పరిశోధనము సాగించు వసతి లేకపోవుటచేత వీరభద్రరావుగారు తమ ద్రవ్యమును వెచ్చపెట్టుకొని వచ్చి మదరాసున గాపురము సేయవలసినవారైరి.

చిలుకూరి వీరభద్రరావుగారితోఁగూడఁ బేర్కొనవలసిన మఱియొక పరిశోధకమహాశయుఁడు కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావు పంతులుగారు. వీరు గొప్ప విద్వాంసులు; సంస్కృత మహారాష్ట్రాంధ్ర భాషలయందు వీరి పాండిత్యమద్వితీయము. లక్ష్మణరావుగారు చరిత్ర నభిమాన శాస్త్రముగ గొని, ఎం. ఏ. పరీక్షయందు త్తీర్ణులై పట్టభద్రులగుటచే వారికి పాశ్చాత్యచారిత్రక పరిశోధనా పద్ధతులన్నియు జక్కఁగ నలవడియుండినవి. విద్యార్థిదశయందు మహారాష్ట్రదేశమునందుండిన కారణమున సుప్రసిద్ధ మహారాష్ట్రపరిశోధకులతోఁ జెలిమి కుదిరినది. వారి యుదాహరణము ననుసరించి యాంధ్రదేశమున న్యవిజ్ఞానమును బ్రసరింపజేయవలయు ననియు, సాధన సామగ్రిని సమకూర్చి దేశచరిత్రను రచింపవలయుననియు నిశ్చయించి, తన

యుద్దేశమును నెఱవేర్చుకొనుటకొఱకు విజ్ఞానచంద్రికామండలి యను సంస్థను స్థాపించెను. ఆంధ్రాభ్యుదయముకొఱకు విజ్ఞానచంద్రికా మండలి యొనర్చిన దేశసేవ ప్రశస్తము; చిరస్మరణీయము. దీని యాదర్శము లత్యున్నతములు; కృషి బహుళఫలప్రదాయకము. కాని మండలి యాదరణకు పాత్రములైన యంశములన్నిటను ప్రకటితములైన గ్రంథములను వర్ణించుట కిది యదను గాదు; చరిత్ర పరిశోధన కది యెట్లు తోడ్పడెనో తెల్పుటయే ప్రస్తుతోద్దేశము. లక్ష్మణరావు పంతులుగారు స్వయము చరిత్రకారులు. మహారాష్ట్ర స్వాతంత్ర్య సంస్థాపకుడైన ఛత్రపతి శివాజీ చరిత్రను తెలుగున వ్రాసిరి. హిందూదేశచరిత్రను సమగ్రముగా వ్రాయ సంకల్పించి హిందూ మహమ్మదీయ మహాయుగము లను రెండు సంపుటములను విజ్ఞాన చంద్రికయందు ప్రకటించిరి. లక్ష్మణరావుగారి హిందూదేశ చరిత్ర గ్రంథశైలి మృదుమధురము; భాష పటుత్వము గలది; చదువుటకు హృదయంగమముగ నుండును. రచన నిష్పక్షపాతము; జంకు గొంకు లేని విమర్శ. ఇట్టి గుణసంపత్తి గల వగుటచే పై గ్రంథముల మూలమున లక్ష్మణరావుగారికి ఆంధ్రచారిత్రక వాఙ్మయ మున నత్యున్నతస్థానము చేకూఱినది. లక్ష్మణరావుగారు కేవలము చరిత్ర రచయిత మాత్రమే కాదు; శాసనపరిశోధకుడుగూడ. ఆంధ్ర దేశచరిత్రకు సంబంధించిన శిలాతామ్రశాసనములను వెక్కింటిని బయలుపఱచి పరిష్కరించి ప్రకటించిరి. వీరి పరిశ్రమవలననే ఆంధ్ర దేశపుశాసనముల ప్రాముఖ్యము జనులకు దెలియవచ్చినది.

లక్ష్మణరావుగారు స్వరచనలతో దృప్తిపడియుండలేదు. చరి త్రాభిమానుల నెల్ల వీరు పరిశోధనకును, గ్రంథరచనకును బురికొల్పి నారు. వీరి ప్రోత్సాహ సహాయములవలన చరిత్రరచన యొనర్చిన వారిలో ముఖ్యుడు శ్రీ చిలుకూరు వీరభద్రరావుగారు. లక్ష్మణరావు గారి చరిత్రాభిమానము వలననే వీరభద్రరావుగారికి విజ్ఞానచంద్రికా

మండలిప్రాపు చేకూరినది. లక్ష్మణరావుగారు తన కొనర్చిన సాహాయ్యమునుగూర్చి వీరభద్రరావుగారే యిట్లు చెప్పియున్నారు:

"విజ్ఞానచంద్రికామండలివారు నా కీ గ్రంథము (ఆంధ్రదేశ కథాసంగ్రహము) నుచితముగా ముద్రించి యిచ్చుటకు నౌదార్యము గలవారైనను, వారి గ్రంథములపై వచ్చు నాదాయమంతయు వారి గ్రంథముల ముద్రాభృతికే సరిపోవుచున్నందున నంతకన్న నెక్కువ సాహాయ్యమును జేయజాలకుండిరి. కాని మండలివారే యొకానొక విద్యాప్రియుడగు శ్రీమంతునకు జెప్పి ముద్రాభృతియు నాకు నిప్పించిరి. చరిత్రాసక్తియు నౌదార్యము గల యీ శ్రీమంతుడు నా ప్రయాసమును స్వయముగా వీక్షించుచుండిన మండలి సభాసదుడగు లక్ష్మణరావుపంతులుగారిచే నా చేయుచున్న పనినంతయు విని దయార్ద్రహృదయుడై నా గ్రంథముయొక్క యీ ప్రథమభాగమునకగు ముద్రాభృతినంతయు దాము వహింతుమని తెలియజేయుటయేగాక వాగ్దత్తముప్రకారము నెఱవేర్చి నా కష్టముల నన్నిటిని తుదముట్టించి నాకు మహోపకారము జేసిరి."

ఇంతవఱకు లక్ష్మణరావుగారి మూలమున దాను పొందిన ధనసాహాయ్యమును గూర్చి చెప్పినారు వీరభద్రరావుగారు. ఇక ఆయన తనకు గ్రంథరచనయం దెట్లు తోడ్పడినారో చెప్పుచున్నారు:

"అందఱికంటెను ముఖ్యముగా గంటికి ఱెప్పవలె దగ్గరనుండి నిరుత్సాహ పడుచుండినప్పుడు ధైర్యమును జెప్పుచు సర్వవిధముల తోడ్పడి మఱువగూడని సాహాయ్యమొనర్చి నాచే నీ కార్యము నిర్వహింపజేసిన బ్రహ్మశ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు పంతులు ఎమ్. ఎ. గారికి నా కృతజ్ఞతావందనములను దెలుపుకొనుచున్నాను. దేశాభిమానులయిన యిట్టి మిత్రవర్గము యొక్క తోడ్పాటుతో నొక సంవత్సరకాల మహోరాత్రములు కృషిచేసి యేదో యొక్క

విధముగా నాంధ్ర దేశ చరిత్రయొక్క యీ ప్రథమ భాగమును రచించి ప్రకటింపగల్గితిని ''*.

ఇట్లు వీరభద్రరావుగారు లక్ష్మణరావుగారి వలన దాము పొందిన సాహాయ్యమును స్పష్టముగ దెలియజేసియున్నను ఒక్క విషయము నిచ్చట నొక్కి చెప్పవలసియున్నది. లక్ష్మణరావుగారి తోడి చెలిమివలన వీరభద్రరావుగారి పరిశీలనాదృష్టి విశాలతను బొందినది; లక్ష్మణరావుగారి సలహావలన పూర్వచరిత్రపరిశోధకుల వలె కేవలము మెకంజీ పుస్తకముల మీదను, పరంపరగ జన సామాన్యమున వాడుకయం దుండు నైతిహ్యములమీదను, నాధార పడక గవర్నమెంటు శాసనపరిశోధన శాఖవారిచే బ్రకటితములైన శాసనగ్రంథములను, వారి సాంవత్సరిక కార్యనివేదికలను పరిశీలించి గ్రంథరచన జేయగడగిరి.

వీరభద్రరావుగారి యూహకు ఱెక్కలు గలవు. తఱచుగ నది వాస్తవప్రపంచమును వీడి యంతర్మేఘసీమకు సంచారము వెడలు చుండును. అట్టిసమయమున లక్ష్మణరావుగారి సునిశితవిమర్శనా ప్రతిభ దానిని శృంఖలాబద్ధము గావించి వాస్తవదూరము గానీయక పట్టి నిలిపెడిదని చెప్పుదురు.

వీరభద్రరావు ఆంధ్రుల చరిత్రగాక మఱికొన్ని చరిత్రగ్రంథము లను, శ్రీనాథచరిత్రాదులను రచించిరి; కాని వీరు వ్రాసిన గ్రంథము లన్నిటియందును ఆంధ్రుల చరిత్రయే శ్రేష్ఠతమమైనది. ఆంధ్రుల చరిత్ర కేవలము ఆంధ్ర దేశమును పాలించిన రాజవంశముల చరిత్ర కాదు. ఆంధ్రప్రజల రాజకీయార్థిక సాంఘిక మతాదివిషయములు అందు వర్ణింపబడియున్నవి. తెలుగున చరిత్రరచనకు గడగిన గ్రంథకర్త లలో, రాజవంశ చరిత్రతోపాటు ప్రజల యభ్యుదయమును వర్ణింప

* ఆంధ్ర దేశకథాసంగ్రహము — పూర్వయుగము, అవతారిక, పుటలు, ౧౩, ౧౫, ౧౬.

మొదట దలపెట్టినవారు వీరభద్రరావుగారే. వీరిది మనోహరమైన శైలి, చదువజదువ బాఠకుల యభిలాష యధికమగుచుండును. వాదములను నడుపుటయందు వీరి దండె వేసిన చేయి ; వివాదగ్రస్తమైన విషయములను జర్చించు సమయములందు వీరి భాషకు నూతన గుణము లలవడును. అమ్ముపోటువలెను, శూలఘాత విధమునను, కత్తివ్రేటు తెఱగునను నొప్పింప గలదు ; పామువలె బుసకొట్టును ; పులివలె చీఱివేయును.

వీరభద్రరావుగారి యాంధ్రుల చరిత్రయందొక గొప్ప లోపము గలదు. అది శాఖాచంక్రమణము. తాము వ్రాయుచున్నది యాంధ్ర దేశచరిత్ర యను విషయమును విస్మరించి, సమయము చిక్కినప్పుడెల్లను రాజులకంటెను, రాజవంశముల కంటెను నధికముగ మంత్రులను, వారి వంశములను వర్ణించియున్నారు. ఇందువలన నౌచిత్యభంగము గలుగుచున్నది. వీరభద్రరావుగారి ప్రశంసకు బాత్రులైన మంత్రు లనేకులు నియోగిబ్రాహ్మణశాఖను జెందినవారగుటచేత, వీరు వ్రాసిన గ్రంథము నాంధ్రుల చరిత్ర యనుటకంటె నియోగిచరిత్ర యనుట యుక్తమని కొందఱు చెప్పుదురు. ఇది సరికాదు. ఏలన, ఔచితిని పరిగణింపక వీరభద్రరావుగారు విశేషముగ బ్రశంసించిన దొక మంత్రులను మాత్రమే కాదు ; కవులయెడగూడ వీరీ పద్ధతినే యవలంబించియున్నారు. కవులందఱును నియోగులు గారు ; నన్నెచోడకవిరాజు, బద్దెన మొదలగు క్షత్రియకవులుగూడ గలరు ; కావున వీరభద్రరావుగారు మంత్రులను గూర్చియు, గవులను గూర్చియు నౌచిత్యమును బరిగణింపక విశేషముగ బెంచి వ్రాయుటకు గారణము వారి స్వకులాభిమాన మనుట సరికాదు. రాజ్యపాలనయందు బేరెన్నికకెక్కిన రాజకార్యమర్మవిదులైన మంత్రిసత్తముల యొక్కయు, వాఙ్మయమున కలంకారభూతులైన మహాకవుల

యొక్కయు చరిత్రమును బ్రకటించుటకొఱకే యని తలచుట యుక్తము.

క్రీ. శ. ౨౦ వ శతాబ్ద ప్రథమ ద్వితీయ దశకములందు లక్ష్మణ రావుగారును, వీరభద్రరావుగారును నాంధ్రచారిత్రక పరిశోధక ప్రపంచమున సూర్యచంద్రులవలె వెలుగొందిరి. అక్షరజ్ఞులైన యాంధ్రులలో వీరి గ్రంథములను జదువనివా రరుదు. ఆంధ్రయువ జనులకెల్ల వా రాదర్శప్రాయులైరి. వారివలె చరిత్ర పరిశోధన సేయ వలయు ననియు, నాంధ్రదేశచరిత్రను రచియింపవలయు ననియు నాశ ప్రతివిద్యావంతుని హృదయమున నంకురించెను. వీరి కృషిమూలమున నాంధ్రలోకమున గాఢమైన చరిత్రాభిమానము గలిగినది. వీరి దేశ సేవ యద్వితీయము. ఇట్టి మహనీయులు ఋషికల్పులు గదా.

విజ్ఞానచంద్రికామండలి క్రమక్రమముగ ఖిలపడి పోయినది; కాని యాంధ్రచరిత్రపరిశోధన పెక్కుతావుల నెలకొనినది. వీని యందు ముఖ్యముగ బరిగణింపదగినది మద్రాసు. క్రీ. శ. ౧౯౧౪ వ సంవత్సర ప్రాంతమున మదరాసువిశ్వవిద్యాలయమున దక్షిణ హిందూదేశచరిత్ర పరిశోధనార్థము చరిత్రపరిశోధనశాఖ యేర్పఱుప బడినప్పటినుండియు నచట నాంధ్రదేశచరిత్రపరిశోధన ప్రారంభ మాయెను. వీరి పరిశోధనకు ముఖ్యముగ గుఱియైన విజయనగర సామ్రాజ్యచరిత్ర. మదరాసు విశ్వవిద్యాలయమున మొదటి ఇండి యన్ హిస్టరీ ప్రొఫెసరుగా నుండిన డాక్టరు యస్. కృష్ణస్వామి అయ్యంగారికి విజయనగర సామ్రాజ్యముపై నభిమానము మెండు. కాని వారికి సంస్కృతాంధ్రకర్ణాటకభాషలు దెలియకపోవుటచే నా భాషలయందు త్రవ్వితండములుగ లభించు విజయనగరచరిత్ర సాధనసామగ్రి యందవిమానిపం ఢ్లాయెను. కావున వారు దమ యొద్ద పరిశోధక విద్యార్థిగ బనిసేయుచుండిన ఆసూరి రంగస్వామి సరస్వతిగారిని పై భాషలయందు గానవచ్చెడి విజయనగర సంస్థా

నమునకు సంబంధించిన యావద్విషయమును సమకూర్చి యాంగ్ల
భాషాపరివర్తనముతోఁగూడ నొక గ్రంథమును దయారుసేయ నియో
గించిరి. రంగస్వామి సరస్వతి మహామేధావి. సంస్కృతాంధ్రముల
యందు చక్కని వైదుష్యము గలవారు; ద్రావిడకర్ణాటభాషల పరి
చయము గలవారు; ప్రతిభావంతులు; చరిత్రపరిశోధనయందు
సహజ నైపుణ్యము గలవారు. సంస్కృతాంధ్రాదివాఙ్మయములను
బరిశోధించి వీరచిరకాలముననే ఆంగ్లానువాదములతోఁగూడ
౩౮౭ పుటల గ్రంథమును దయారుగావించిరి. యూనివర్సిటీ ప్రొఫె
సరగు డాక్టరు .స్వామి అయ్యంగారు దీనికి 'సోర్సెస్ ఆఫ్
విజయనగర హిస్టరీ యని నామకరణము గావించి తమ పేరిట
బ్రకటించుకొన్నను, నది రంగస్వామిసరస్వతిగారిచే విరచితమని
పీఠికయం దొప్పుకొనియున్నారు. రంగస్వామిసరస్వతి కొన్ని చారి
త్రక వ్యాసములను ఆంధ్రమునను, ఆంగ్లమునను వ్రాసియున్నారు;
కాని వారి ముఖ్య గ్రంథము 'విజయనగరచారిత్రకాధారము'లే.
సాధారణముగ పరిశోధకుల కందని చరిత్రాంశములనెల్ల బరిశోధించి
యొకచో సమకూర్చి తరువాత విజయనగర చరిత్ర పరిశోధనలకు
బునాది వేసిరి. కావున వీరి కృషి కడుంగడు ప్రశంసనీయము.

ఇంతవఱకును దెనుగున చరిత్రపరిశోధనాంశములను జర్చిం
చుట కనుకూలమైన పత్రికలు లేవు. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక,
శారద మున్నగు పత్రికల యందు కొన్ని చరిత్రాత్మక వ్యాసములు
బ్రచురింపబడియుండుట వాస్తవమే; కాని ఆంధ్రసాహిత్యపరిష
త్పత్రిక ముఖ్యముగ వాఙ్మయవిషయ చర్చలకొఱ కేర్పడినది; మఱి
ఇది సామాన్యుల కందుబాటగునది కాదు. పలుకుబడిగల గొప్ప
వారల వ్యాసములకేగాని యన్యుల వ్రాతలకందు తావు దొరకనట
యరుదు. శారదకు ధనసంపత్తి చాలదు. కాదాచిత్కముగ నందు
చరిత్రాత్మకవ్యాసములు బ్రకటితములగుచు వచ్చినను శాసనాదు

లను ప్రతిబింబములతోఁగూడ ప్రకటించుట కవకాశముండెడిది కాదు. ఈ పరిస్థితులందు విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు గారు భారతి మాసపత్రికను ప్రకటింప నారంభించి యాంధ్రచరిత్ర పరిశోధకులకు పెన్నిధాపై నిలిచిరి. విశ్వదాతగారి సర్వతోముఖ వదాన్యతను జగమెఱుగును. వారి యీవిని పొగడుట కిది సమయము గాదు. పొలిటీషియనులకును, కవులకును ఆయన పట్టుగొమ్మ యని యందఱెఱిగిన విషయమే. చరిత్రపరిశోధకులకు నాగేశ్వర రావు పంతులుగారొనర్చిన మేలు మరువరానిది. ప్రతిమాస భారతి యందును చరిత్రపరిశోధకుల నాహ్వానించి పారితోషికముల నిచ్చి వారిచే వ్యాసములను వ్రాయించి ప్రకటించుటయే కాక శాసన ప్రకటనకు ధనము ధారాళముగ వెచ్చపెట్టి చక్కని ప్రతిబింబము లను తయారుచేసి ముద్రించుటకు దగు నేర్పాటులను గావించిరి. భారతి యందు ప్రకటితములైనన్ని శాసనములు మఱే యేభాషా పత్రికలోను ప్రకటితముగాలేదు. క్రమక్రమముగ నది చారిత్రక విషయచర్చలకు సహజరంగస్థల మైనది. పరిశోధనలయం దారితేఱి పేరుప్రఖ్యాతులు గన్న పండితులనేకు లమూల్యములైన వ్యాసము లను వ్రాసి యజ్ఞాతమైన మన పూర్వచరిత్రను భారతిమూలమున నాంధ్రప్రపంచమునకు వెల్లడిసేయగడగిరి. భారతి ప్రకటనలవలన నాంధ్రదేశమున చారిత్రకవిజ్ఞానము పెంపొందినది. ప్రజలకు చరి త్రాభిమానము మెండైనది. ఇట్టి దేశసేవ జేయు భాగ్యము మఱే యేపత్రికకును గలుగలేదు.

ఆంధ్రచరిత్రపరిశోధనయే ప్రధానోద్దేశముగ గల మఱికొన్ని యాంగ్ల త్రైమాసిక పత్రికలు గలవు. ఇందు ముఖ్యమైనది యాంధ్రైతిహాసకసంశోధక * త్రైమాసిక. రాజమహేంద్రవర

* త్రైమాసిక యనుపేర నిది యింకను ప్రకటితమగుచున్నను వాస్తవముగ నిటీవల నిది వార్షికపత్రికగ మారినది. ఇది కడు శోచనీయము.

చారిత్రకపరిశోధక సంఘమువారి పరిశోధనలు అందు ప్రకటింపబడు చున్నవి. ఈ త్రైమాసికయందు దమ పరిశోధనల నాంగ్లమున బ్రకటించుటయేకాక ఆంధ్రేతిహాసకపరిశోధక సంఘమువా రాంధ్రమున గూడ కొన్ని చరిత్రగ్రంథములను బ్రచురించియున్నారు. ఇంతవఱకును వీరి కృషివలన నాలుగు 'సంచిక'లు వెలువడినవి. ఇందు మొదటిది శ్రీరాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక; ౧౯౨౨ వ సంవత్సరమున బ్రచురింపబడెను; సంపాదకుడు భావరాజు వేంకట కృష్ణరావుపంతులుగారు. పూర్వచాళుక్యవంశజుడును, నాంధ్రమహాభారత ప్రథమపర్వత్రయమునకు గృతిపతియు నగు రాజరాజనరేంద్రుని మంగళకీర్తిని స్మరించుటకొఱకు ఈ సంచిక ప్రకటితమైనను, పూర్వచాళుక్య చరిత్రకు సంబంధించిన పెక్కు విషయము లిందు వర్ణింపబడియున్నవి. రెండవది కళింగసంచిక, కళింగదేశచరిత్ర యని తత్సంపాదకులు శ్రీ రాళ్లబండి సుబ్బారావు పంతులుగారు దీనికి నామకరణము జేసియున్నను, సంకీర్ణగ్రంథ మగుటచే దీనిని సంచిక యనుటయే యుక్తము. ఇది ౧౯౩౦ వ సంవత్సరమున బ్రచురింపబడెను. కళింగదేశచరిత్రకు సంబంధించిన పెక్కు విషయము లిందు వర్ణింపబడియున్నవి. మూడవది కాకతీయ సంచిక. ఇది శ్రీ డాక్టరు మారేమండ రామారావుగారి సంపాదకత్వమున ౧౯౩౫ వ సం. న బ్రకటింపబడెను. కాకతీయచరిత్ర మిందు వర్ణింపబడియున్నది. నాల్గవది రెడ్డి సంచిక: శ్రీ వఝ్ఝాది అప్పారావుగారి సంపాదకత్వమున ౧౯౪౭ వ సంవత్సరమున బ్రకటింప బడెను. ఇందు కొండవీటిరెడ్ల చరిత్ర వర్ణింపబడియున్నది. రాజమహేంద్రవర రెడ్ల ప్రస్తావనయు గొంత కలదు.

పై బేర్కొనిన నాలుగు సంచికలను బ్రకటించి ఆంధ్రేతిహాసక సంశోధకమండలివారు ఆంగ్ల భాష నెఱుగని యాంధ్రజనులకు మహోపకారము గావించిరి. ఇటీవల శ్రీ డాక్టరు మారేమండ

రామారావుగారి కృషివలన నాంధ్రేతిహాసకసంశోధకమండలి యొకటి గుంటూరునం దేర్పడెను. 'ఆంధ్రచరిత్ర - సంస్కృతి' యను త్రైమాసికపత్రిక యొకటి ప్రకటింపబడుచున్నది. కొంత పరిశ్రమ సాగినది. కొన్నివిషయములు చర్చింపబడినవి. శ్రీ పి. శేషాద్రిశాస్త్రి గారు కొన్ని యప్రకటితములైన తెలుగు శాసనములను బ్రకటించిరి. ఈ మండలివలన నింతవఱకు నడచిన కృషి యింతయే.

ఆంధ్రేతిహాసకపరిశోధక, సంశోధకమండలులేకాక నైజాము రాష్ట్రమునందు చరిత్రపరిశోధక సంస్థలు కొన్ని యున్నవి. హైదరాబాదు నగరమందలి లక్ష్మణరాయ పరిశోధకమండలి నైజాముపాలన క్రింది యాంధ్రరాష్ట్ర ప్రాచీనచరిత్రనుగూర్చి కొంత కృషిని చేసి యున్నారు. తెలింగాణమున నుండు శాసనములను వెదకి కనుగొని వానిని తెలంగాణాశాసనము లనునొక ప్రత్యేక గ్రంథముగ బ్రకటించిరి. ఈ సంపుటమున బ్రాచీనాంధ్ర దేశచరిత్రకు సంబంధించిన శాసనము లపూర్వములైనవి పెక్కులు గలవు; కాని ఈ గ్రంథము పరిష్కృతమైనగాని పరిశోధకుల కంతగ నుపయోగకారి గాదు.

పై సంస్థలతోపాటు గవరన్మెంటు ఆర్కియాలజీ శాఖవారును జాల కృషిసల్పి వేలకొలది ప్రాచీన శాసనములకు బ్రతిబింబములను దీయించి ప్రకటించిరి. ఎపిగ్రాఫియా ఇండికాయందును, దక్షిణ ఇండియా శాసన సంపుటములందును నాంధ్రదేశచరిత్రకు సంబంధించిన శాసనము లనేకములు సంపూర్ణ శాసన గ్రంథములతో ముద్రింపబడియున్నవి. ఇట్లే నైజాము గవరన్మెంటు ఆర్కియాలజీ శాఖలవారు తెలింగాణచరిత్రకు సంబంధించిన శాసనములను గొన్నింటిని ప్రచురించిరి. ఈ శాసనగ్రంథము లాంధ్రచరిత్రపరిశోధకుల పాలిటి పెన్నిధు లని చెప్పవచ్చును.

గవరన్మెంటు ఆర్కియాలజీశాఖను బోలి మన విశ్వవిద్యాలయములును చరిత్రపరిశోధనను బ్రోదిసేయ గడగినవి. మదరాసు

విశ్వవిద్యాలయమందు విజయనగర సామ్రాజ్యచరిత్రపరిశోధన యెట్లు ప్రారంభమాయెనో పూర్వప్రకరణమున వర్ణింపబడెను. ఆచార్య కృష్ణస్వామి అయ్యంగారికి వెనుక విశ్వవిద్యాలయపు చరిత్రశాఖ కధ్యక్షుడైన ఆచార్య నీలకంఠశాస్త్రిలవారును విజయనగర చరిత్ర పరిశోధనయందే కాక యావదాంధ్ర దేశచరిత్ర విషయమున గడు శ్రద్ధవహించి, తన యాధిపత్యము క్రింద బనిసేయుచుండిన తోడి పరిశోధకులను, పరిశోధక విద్యార్థులను బురికొల్పి వారిచే బెక్కు గ్రంథము లాంగ్లమున వ్రాయించిరి. ఆంధ్రదేశచరిత్ర పరిశోధనలకు మదరాసు విశ్వవిద్యాలయమువా రొసగిన చేయూత యలతిదైనది కాదు ; ఈ మేలునకు ఆంధ్రలోకము వారికి దగురీతిని కృతజ్ఞత సూపవలసియున్నది.

ఆంధ్రవిశ్వవిద్యాలయ మాంధ్ర సంస్కృతిని బ్రోదిసేయు నుద్దేశముతో స్థాపింపబడినను నాంధ్రచరిత్రపరిశోధన కందు తావు లేకపోయెను. కాదాచిత్కముగ నొకటి రెండు చరిత్రపరిశోధన గ్రంథము లీ విశ్వవిద్యాలయము నుండి వెలువడినను నవి విశ్వవిద్యాలయాధికారుల చరిత్రాభిమానమునకు సూచకములు గావు. మన జన్మదేశచరిత్రను దెలిసికొనుటకు మన యువకు లన్యవిద్యాపీఠములపై నాధారపడవలసియున్నది. చీనా, జపాను, జర్మనీ, రష్యా మొదలగు ప్రాచ్యపాశ్చాత్య చరిత్రలను గఱపుట కవకాశము కలదు గాని యాంధ్రదేశ చరిత్రను బోధించుట కందు వలను లేదు. మన విశ్వవిద్యాలయపరిస్థితు లిట్లుండినను చరిత్రాభిమానము గల పరిశోధక పండితు లుద్యోగమునకు గుదురుటవలన గొంత పరిశ్రమ నడచినది. ఆంధ్రదేశచరిత్రకు సంబంధించిన గ్రంథములు రెండు మూడు వెలువడినవి. ఈపాటి మే లొనరించినందులకైనను ఆంధ్రులు వీరికి గృతజ్ఞతాబద్ధులు కావలసియున్నది.

పరిశోధకసంఘములు, విశ్వవిద్యాలయములు మున్నగు సంస్థల మూలమున నడచిన చరిత్రపరిశోధన ఇంతవఱకు స్థూలముగ వివరింపబడినది. ఇక నీ సంఘముల పక్షముననుు, దమంతట స్వాతంత్రముగను సాగించిన పరిశోధనలను గూర్చి యించుకంత వ్రాయవలసి యున్నది. లక్ష్మణరావు, వీరభద్రరావుగార్లచే నుద్బోధితులై విద్యాధికు లనేకులు చరిత్రరచనకు బూనుకొనిరి. వీరిలో ప్రముఖుడు శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు. ఆద్యమున శర్మగారు కొన్ని యేండ్లపాటు లక్ష్మణరావుగారికి చేదోడువాదోడుగ పనిచేసి చరిత్రపరిశోధనమునం దధునాతన పద్ధతులను గ్రహించిరి. వీరభద్రరావు గారి యెడ వీరికి గాఢమైత్రి గలదు. ఉద్యోగ ధర్మమువలన పరిశోధనకు గడగు విద్యాధికులవలె గాక శర్మగారికి చరిత్రపరిశోధన సహజక్రీడ; శాసనపరిష్కార మభిమానవిద్య. లిపిశాస్త్రమున వీరితో సమానమైన జ్ఞానముగలవారి సంఖ్య యల్పిష్ఠము. లిపిమర్మవిశారదు డగుటచే నెట్టి ప్రాచీనశాసనముయొక్క గుప్తార్థమును నాయనకు బట్టబయలు. శర్మగారు సంపాదించి పరిష్కరించి ప్రకటించినన్ని శాసనములను మఱియెవ్వరును బ్రకటించియుండలేదు. ప్రాచీనదక్షిణహిందూదేశచరిత్రయందు శర్మగారికి దెలియని విషయము లేదు; ఎంతటి గూఢసమస్యయైనను వీరి దృక్పథమున బడిన చిక్కులను బెడబాసి విశదము కాగలదు. ఆంధ్రముననుు, ఆంగ్లముననుు సోమశేఖర శర్మగారు పెక్కు పరిశోధన వ్యాసములను, గ్రంథములను విరచించి యున్నారు. అన్నిటిని ఇచట పేర్కొనుటకు తావు లేదు. అమరావతీ స్తూపము, మన ప్రాచీన విద్యాసంస్థలు, హిందూదేశ చరిత్ర వీరి ప్రధానాంధ్రగ్రంథములు. శర్మగారి వచన రచన మనోహరమైనది; మాటలు మధురములు; భావోద్రేకమును గల్గించి పాఠకుల నుఱ్ఱూతలూపజాలు శైలి. కాని వ్యావహారికభాషావాది; పంచెదు పాలలోని పాంసులేశమునుబోలి వీరి రచనల నీ వ్యావహారికభాష కళంకాంకి

తము సేయుచున్నది. ఇవిగాక ఆంగ్లభాషయందు 'ఎ ఫర్గాటన్ చాప్టర్ ఆఫ్ ఆంధ్రహిస్టరీ' 'ది హిస్టరీ ఆఫ్ ది రెడ్డి కింగ్డమ్స్' అను చరిత్రగ్రంథములను రచించియున్నారు. వీనివలన నాంధ్రదేశచరిత్ర యందును, సంస్కృతియందును నజ్ఞాతములైన పెక్కు విషయములు వెల్లడియగుచున్నవి.

సోమశేఖరశర్మగారి తరువాత పేర్కొనదగిన వారు బ్రహ్మశ్రీ వేటూరు ప్రభాకరశాస్త్రిగారు. వీరు మహామేధావియగు సంస్కృతాంధ్రభాషావిశారదులు. పండితప్రపంచమున తప్పబుట్టిన మహనీయులు; కేవలభాషాపండితులయందు లేని చరిత్రజిజ్ఞాస వీరియందు గానవచ్చుచున్నది. ఇది ప్రయత్నపూర్వకముగ నలవరచుకొన్నది కాదు; పూర్వజన్మ వాసనవలన గలిగినది. చరిత్ర రచియింపవలయు నను నుద్దేశము లేకపోయినను, శ్రీనాథకవిరాజు జీవనచరిత్రను రచియించుటకు కొండవీడు రాజమహేంద్రవర రెడ్డిరాజ్యముల చరిత్రను జక్కగ పరిశీలించి తమ శృంగారశ్రీనాథమున సంగ్రహముగ వర్ణించియున్నారు. ప్రభాకరశాస్త్రిలవారి యభిప్రాయము లందఱికి నంగీకార్యములు గాకపోవచ్చును; కాని పరిశోధనాపద్ధతులు నిర్దుష్టములు. శృంగారశ్రీనాథ రచనచే ప్రభాకరశాస్త్రిలవారు రెడ్డిరాజ్యసంశోధనకు బునాది వేసిరని చెప్పవచ్చును; ఇతరపరిశోధకులకు వీరు మార్గదర్శకులైరనుట యతిశయోక్తి కాదు.

శ్రీ కుందూరు ఈశ్వరదత్తుగారు: ఈ పేరిటి సుప్రసిద్ధ పత్రికా విలేఖరికంటె భిన్నుడు. సర్కారు ఆడిటుశాఖయం దుద్యోగము సేయుచున్నను దేశచరిత్రయందలి గాఢాభిమానమువలన పరిశోధనకు గడగి యమూల్యములైన పెక్కు వ్యాసముల నాంధ్రాంగ్లభాషలందు రెంటియందును వ్రాసియున్నారు. విజయనగర పరిపాలనవిధానమును వర్ణించుచు నాంగ్లమున వీరు వ్రాసి ప్రకటించిన వ్యాసావళి వీరి పరిశ్రమను వెల్లడిచేయుచున్నది. జీర్ణకర్ణాటసామ్రాజ్య మను పేర నైను

గున విజయనగర చరిత్రమును సంగ్రహముగ వర్ణించియున్నారు. వీరి చిల్లర వ్యాసము లెన్నియో కలవు. వానిని బేర్కొనుట కిచట వీలు లేదు. వాదమును నడపుటయందు ఈశ్వరదత్తుగారు నేర్పరి. తాబట్టిన కుందేటికి మూడే కాళ్లని వాదించు స్వభావము; అభిప్రాయభేదమును సహింపని బుద్ధి. సామాన్య గ్రంథరచనయందు వీరిది సరసమైన శైలియైనను వివాదసందర్భములయందు పెళుచుదనమును బొందును. ఈ నెరసు లంతగ పరిగణింపదగినవి కావు. ఈశ్వరదత్తుగారు దొడ్డ పరిశోధకులు; అమూల్యమగు కృషి సల్పియున్నారు; ఇంక ఎంత యేనియు జేయగలరు.

శ్రీభావరాజు వెంకటకృష్ణరావుపంతులుగారు: వీరు ఆంధ్ర పరిశోధకులలో మొదటిబంతికి జెందినవారు; చరిత్రపరిశోధనయందు వీరికి గల యాసక్తి యసాధారణమైనది. వీరికి ఆంధ్రాభిమానము మెండు. వృత్తిచే న్యాయవాదులైనను ఆంధ్రదేశచరిత్రకు వీరుచేసిన సేవ యద్వితీయము. ఆంధ్రేతిహాసపరిశోధకమండలి రాజమహేంద్ర వరమున ముఖ్యముగ వీరి కృషిమూలముననే నెలకొనినది. పూర్వ చాళుక్యచరిత్రయందు వీరి కత్యంతాభిమానము; ఆంగ్లమున నొక గ్రంథమును వ్రాసి రని వినికిడి. ప్రాచీనాంధ్రదేశచరిత్రనుగూర్చిన గొప్ప గ్రంథమును వ్రాసి ప్రకటించియున్నారు; రాజమహేంద్రవర చరిత్రపై పెక్కు వ్యాసములను ఆంధ్రేతిహాసపరిశోధన పత్రిక యందు ప్రకటించిరి; రాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచికకు వీరు సంపాదకులని ఇంతకు పూర్వము చెప్పియున్నాను. ఆంధ్రాభిమానము వలన వీరి రచనలయందు చరిత్రకారునికి ముఖ్యమైన సర్వసమత్వము లేకపోయినదని కొందఱు విమర్శకుల యభిప్రాయము. ఇందలి సత్యా సత్యము లెట్లున్నను ఇప్పటి యాంధ్రచరిత్రపరిశోధకులలో కృష్ణరావు పంతులుగారి స్థాన మున్నతమైన దని దృఢముగ జెప్పవచ్చును.

కృష్ణరావు పంతులుగారితోఁగూడ బేర్కొనదగిన వారు వారి చిరమిత్రులును, జోడును నగు శ్రీ రాళ్లబండి సుబ్బారావుపంతులు గారు. ఆంధ్రేతిహాసక పరిశోధకమండలి రథమునకు వీ రిరువురును రెండు కన్నుల వంటివారు. పుట్టుకచే సుబ్బారావుపంతులుగారాంధ్రులైనను, చరిత్రాభిమానాతిశయమువలన కాళింగులు. వీరి పరిశోధన కొంచె మించుమించుగ సర్వమును కళింగదేశ చరిత్రయందే. అందును ముఖ్యముగ పూర్వగాంగచరిత్ర సుబ్బారావు గారికి పులకండమువంటిది. కళింగ సంచికయందు వీరు కళింగదేశచరిత్రను విపులముగ వ్రాసియున్నారు; ఆంధ్రేతిహాసపరిశోధనపత్రికయందు పూర్వగాంగచరిత్రపై పెక్కు వ్యాసములను ప్రకటించియున్నారు. సుబ్బారావుగారి రచన మహాగహనమువంటి దని కొందఱందురు; పద్మవ్యూహ మని యొకానొక విమర్శకుని యభిప్రాయము. వాస్తవముగ వీరి కళింగదేశచరిత్రయందు కొంత గజిబిజి గానవచ్చుచున్నను నది విషయనిగూఢతవలన గలిగినదికాని కావలయు నని తెచ్చి పెట్టినది కాదు. సుబ్బారావుగారు పట్టుదల గల కార్యకాడు. ఉద్దేశించిన కార్యము నెఱవేరునంతవఱ కాయనకు నిదురపట్టదు. ఆంధ్రచారిత్రక పరిశోధనకు సుబ్బారావుగారు చేయగల సేవ యెంతయేనియు గలదు.

కళింగదేశచరిత్ర పరిశోధనయందు పాల్గొనిన పండితుల నిద్దరినిచట బేర్కొనుట యుక్తము. వీరు ప్రత్యేకగ్రంథములను వ్రాయకపోయినను ఇంగ్లీషునను దెనుగునను పెక్కు వ్యాసములను రచియించియున్నారు. వీరియందు ప్రథముడు శ్రీ గొడవర్తి రామదాసుపంతులుగారు. ఖారవేలుని కాలమునుండి యొడ్డె గజపతుల యేలుబడివరకును గల కళింగదేశచరిత్ర వీరి పరిశోధనకు లోనైనది. పూర్వగాంగచరిత్రపై వీరి కభిమానము మెండు. పూర్వగాంగ శక ప్రారంభకాల నిర్ణయమును గూర్చి వీరు విపులముగ వ్రాసియున్నారు. చరిత్ర పరి

శోధనరంగమున రామదాసుపంతులుగా రసహాయశూరులు; ఏకాంగ వీరులు. కళింగ దేశ చరిత్రవిషయమున తాము సర్వజ్ఞులమని వీరి యభిప్రాయము; కాని యన్యపరిశోధకులు వీరితో నేకీభవింపరు. రెండవ వారు సత్యనారాయణరాజగురువులవారు. వీరు పూర్వగాంగచరిత్ర యందు కొంత పరిశోధన సలిపియున్నారు.

శ్రీ కురుగంటి సీతారామభట్టాచార్యులవారు: సంస్కృతాంధ్రములందు భట్టాచార్యులవారి పాండిత్యము ప్రశంసనీయము. దేశచరిత్రయందు వీరికిగల గాఢాభిమానము వీరిని వాఙ్మయరంగము నుండి చరిత్రపరిశోధనకు దింపినది. వీరి ముఖ్యచరిత్రరచన తంజాపు రాంధ్రరాజుల చరిత్ర. వీరు తమ భాషాజ్ఞానమును చరిత్రరచనయందు చక్కగ వినియోగపెట్టి యన్యచరిత్రపరిశోధకుల కందని విషయముల ననేకములను బయలుపఱచినారు. వీరి రచన ఇంపైనది. భట్టాచార్యులవారి సిద్ధాంతము లన్నియు నంగీకార్యములు గాకపోయినను వీరి కృషి.మూలమున దంజాపురాంధ్రనాయకుల చరిత్ర చక్కగ విదశపడినది.

డాక్టరు మారేమండ రామారావుగారు: మదరాసు విశ్వవిద్యాలయమున చరిత్రశాఖయందు పరిశోధనపద్ధతులలో శిక్షితులైన యాంధ్రయువకులలో రామారావుగారు ప్రథములు. వీరు మొదట డాక్టరు యస్. కృష్ణస్వామి అయ్యంగార్ల కడను, నటు పిమ్మట నాచార్య కె. ఎ. నీలకంఠశాస్త్రిలవారియొద్దను చరిత్రపరిశోధనా పద్ధతుల నభ్యసించిరి. గురుభక్తి గల శిష్యుడు. ఇంకను పసితనము సంపూర్ణముగ వీడిపోకున్నను నపారమైన కృషివలన కీర్తి వహించినాడు. మంచి వక్త. నెఱవాది. కాకతీయ రెడ్డిరాజ్యముల చరిత్రములను జక్కగ శోధించి యనేకనూతనాంశములను గనుగొని యా కాలపరిస్థితులను విపులముగ గ్రంథములందును, ప్రత్యేక వ్యాసములందును వర్ణించియున్నాడు. కాకతీయసంచికకు సంపాద

కీయవ్యాసమున గాకతివంశ చరిత్రను వివరించియున్నాడు. ఆంగ్లమున రచించిన కాకతీయచరిత్ర ఇంకను ముద్రితము గాలేదు. డాక్టరు రామారావుగారి వ్రాతలలో నొంత తొందరపాటు గానవచ్చును; లభ్యములగు చరిత్రాంశముల నన్నిటిని గ్రోడీకరించి సిద్ధాంతము సేయుటకు దగిన తాలిమియు లేదు; కాని యనుభవముమీాద నిట్టి నెరసులు దమంతటనవియె పాసిపోగలవు.

డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులువారు: మంచి మేధావి. ఆంధ్రచరిత్ర పరిశోధకు లందరిలో శ్రీనివాసాచార్యుల వా రొక్కరే ఇంగ్లాండున లండను యూనివర్సిటీలో పరిశోధనాపద్ధతులను నేర్చి డాక్టరేటును పొందినవారు. క్రీ. శ. ౧౦౦౦ మొదలు ౧౫౦౦ ల మధ్య ఆంధ్రదేశచరిత్రను పరిశోధించి యాంగ్లమున నొక గ్రంథమును వ్రాసిరి. ఇది యింకను అప్రకటితము. హైదరాబాదు సర్కారు పక్షమున కాకతీయ శాసనములను బరిష్కరించిరి. ఇది నైజాము గవరన్మెంటుచే బ్రకటింపబడినది. డాక్టర్ రామారావు గారిచే బరిష్కరింపబడిన తెలింగాణాశాసనములకంటె నిది సర్వవిధముల శ్రేష్ఠతరము. శ్రీనివాసాచార్యులవారు మంచివక్త. చరిత్రపరిశోధనను జనసామాన్యమునకు దెలుపుటకు వీరు చాల కృషి సల్పియున్నారు; కాని వీరికి ఓపిక తక్కువ; ఎంతటి ప్రతిభాశాలియైనను ఓపికలేని పరిశోధకుడు నుతికెక్కడు. ఓపికతో లభ్యమైన చరిత్రాంశముల నన్నిటి నేర్చికూర్చి పరిశీలించి గ్రంథరచనకు గడగిన శ్రీనివాసాచార్యులవారు చక్కని పరిశోధకులుగ తేలగలరు.

శ్రీ వడ్డాది అప్పారావుగారు: వృత్తిచే న్యాయవాదులైనను అప్పారావుగారికి ఆంధ్రేతిహాస పరిశోధకమండలివారి సంపర్కము వలన చరిత్రపరిశోధనయం దభిరుచి కలిగినది. అన్నదేవచోడుని రాజమహేంద్రవరమ్యూజియపు దామ్రశాసనము బ్రకటించి కీర్తిని గడించిరి. రెడ్డిసంచికకు సంపాదకులై తమ సంపాదకీయ వ్యాసమున

కొండవీడు రాజమహేంద్రవర రెడ్డిరాజుల చరిత్రను వివరించిరి. రెడ్డి రాజ్యముల చరిత్ర సంపూర్ణముగ విరచించియుండినచో అప్పారావు పంతులుగారి వ్యాసము మఱియును నుపయోగకారియై యుండెడిది. ఇది వీరి ప్రథమచరిత్రరచన. రాబోవు గ్రంథములయందు అప్పారావు గారి పరిశోధనల యాధిక్యత తెల్లముకాగలదు.

శ్రీ పి. శేషాద్రిశాస్త్రిగారు: ఆంధ్రులయందు అలపునెఱుగని పరిశోధకుడు. వ్రాసిన గ్రంథము లనేకములు లేవు. చరిత్రసాధనసామ గ్రిని వెదకి కనిపట్టి సేకరించుటయందు శేషాద్రిశాస్త్రిగారికి సమాను లెవ్వరును లేరు. గుంటూరిసీమ వీరి కాణయాచి. వెలుపట సాధారణ ముగ నడుగిడడు. అందు వెదకివెదకి ప్రాచీన వస్తుసముదాయమును వెలికీడ్చుట యతని క్రీడ. అముద్రితశాసనముల నెన్నిటినో సంపాదించి ప్రకటించియున్నాడు. ఇట్టి పరిశోధకపండితుని యునికిచే గుంటూరు మండలము ధన్యమైనది.

డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య: ప్రస్తుత వ్యాసకర్త యగు నితడును నాంధ్రదేశచరిత్రపరిశోధనయందు వ్రేలిడి యున్నాడు. తెనుగునను, నింగ్లీషునను కొన్ని వ్యాసములను, గ్రంథము లను వ్రాసియున్నాడు. ఇతనికి అభిమానవిషయము విజయనగర సామ్రాజ్యచరిత్రము. ప్రాచీనరాజులపైని వ్యాసావళి; లేములవాడ చాళుక్యుల చరిత్ర ఇతని తెనుగురచనలలో ముఖ్యమైనవి. వెలుగోటి వారి వంశావళిని పరిష్కరించి మదరాసు విశ్వవిద్యాలయచరిత్రశాఖ ప్రచురణలయందు ప్రకటించియున్నాడు; 'కంపిలి అండ్ విజయ నగర', 'ఆరిజిన్ ఆఫ్ ది సిటీ అండ్ యంపైర్ ఆఫ్ విజయనగర', 'స్టడీస్ ఇన్ ది హిస్టరీ ఆఫ్ విజయనగర', 'యర్లీ ముస్లిమ్ యక్స్పాన్షన్ ఇన్ సౌత్ ఇండియా', 'ఫర్దర్ సోర్సెస్ ఆఫ్ ది హిస్టరీ ఆఫ్ విజయనగర', 'ది హిస్టరీ ఆఫ్ ది యీస్టర్న్ చాళు క్యాస్' అను గ్రంథముల నింగ్లీషున వ్రాసియున్నాడు. కొన్ని ప్రాచీనతామ్రశిలాశాసనములను పరిష్కరించియున్నాడు. డాక్టరు వెంకటరమణయ్యగారి వ్రాతలు నిలుకడ లేని వనియు, నతడు దన

యభిప్రాయములను దఱచుగా మార్చుకొనుచుండు ననియు నొకానొక విమర్శకుడు జెప్పియున్నాడు. సత్యమే. ప్రాచీనచరిత్రపరిశోధకుల కందఱకును ఈ జాడ్యము సామాన్యమైనదే. దీనికి కారణము లేకపోలేదు. ప్రాచీనకాలపు చరిత్రకు సంబంధించిన విషయము సర్వమును మనకు లభ్యపడలేదు. దొరకిన సాధనసామగ్రి నాధారపఱచుకొని పరిశోధకులు ప్రాచీనచరిత్రపునర్నిర్మాణమును సాగించుచుందురు. క్రొత్తవిషయ మెద్దియేనియు బయలుపడినప్పుడు దాని ననుసరించి యొకప్పుడు పూర్వాభిప్రాయములను పరిశోధకులు మార్చుకొనవలసివచ్చును. ఇది గుణమే కాని దోషము గాదు.

పై బేర్కొనిన పరిశోధకుల కృషివలన నాంధ్రదేశము చరిత్రపఠన జనాదరణమును బొందినది. విద్యావంతులగు యువక లనేకులు చరిత్రపరిశోధనకు దొడగి కొంత కృషి సల్పియున్నారు. వీరి పరిశోధన లింకను బయలుపడలేదు. వీరిలో ముఖ్యులను, వారి యభిమానవిషయములను ఈ క్రింద బేర్కొనుచున్నాను; డాక్టరు ఓరగంటి రామచంద్రయ్యగారు—కృష్ణదేవరాయలు; డాక్టరు అనంతరావుబాజీగారు—పాశ్చాత్యగాంగులు; డాక్టరు సత్యనోలు కామేశ్వరరావుగారు-పూర్వగాంగులు; శ్రీ ముట్లూరి వెంకటరామయ్య గారు-తెలుగుచోళులు; శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు—కల్యాణిచాళుక్యులు; డాక్టరు రాయప్రోలు సుబ్రహ్మణ్యముగారు—కళింగ సూర్యవంశగజపతులు; శ్రీ మామిడిపూడి వెంకటేశ్వరులు గారు—వెల్నాటి చోళులు; డాక్టరు కపుతా యశోదాదేవిగారు—రెడ్డి రాజ్యములు, క్రీ. శ. ౧౦౦౦-౧౫౦౦ మధ్య తెలుగుదేశ చరిత్ర: శ్రీ వడ్లాది రామచంద్రమూర్తిగారు—ఆనందవంశ ప రాజులు, తెలుగు చిల్లర విషయములు.

స్వరాజ్యస్థాపనతో ప్రారంభమైన ఈ నవయుగమున ఆంధ్ర దేశచరిత్రను పరిశోధించి మన జాతీయవ్యక్తిత్వమును నిలబెట్టవలసిన బాధ్యత యంతయు యువయువతీజనములపై నున్నది.

# ౨

# *ఆంధ్రులు-చరిత్ర

'ఆంధ్రులు – చరిత్ర' యనునది ప్రస్తుతము చర్చింపదలపెట్టిన విషయము. మొట్టమొదట నాంధ్రు లెవ్వరో విచారించుట యుక్తము. ఆంధ్రులన ఆంధ్రదేశవాసులు; ఆంధ్రదేశ మన నిప్పుడు తెనుగుభాషను మాటాడు జనులు వసించు దేశము అని సర్వసాధారణముగా మనము అభిప్రాయపడవచ్చును. కాని చరిత్రపరిశోధకులలో నెక్కండ్రు దీనితో నేకీభవింపరు; ఆంధ్రులును తెలుగువారును నొక్కరు గారు; తెనుగువారి కాంధ్రులతో నెట్టి సంబంధమును లేదు. తెలుగుదేశ మాంధ్రుల నివాసస్థానము గాదు; ఆంధ్రు లాడిన భాష తెనుగు కాదు; అది ప్రాకృతము అని వాదించు చరిత్రపరిశోధకు లెందరేనియు గలరు; వీరి వాదము సర్వము సంగీకార్యము గాకపోయినను నందు నిజము గొంత లేకపోలేదు. ఆంధ్రుల యాదిమ నివాస్థానము తెనుగుదేశము గాదు. ఉత్తరపారశీకమునందు అంక్షు నదీతీరమున నాంధ్రులు నివసించుచున్నట్లు కొన్ని పురాణములందు కలదు; వింధ్యప్రాంతదేశమం దుండినట్లు ఐతరేయబ్రాహ్మణము నందు జెప్పియున్నది. గంగాతీరమునం దుండిరని మఱి కొన్ని గ్రంథములందు కానవచ్చుచున్నది. మఱియును ఆంధ్రజాతికి చెందిన ప్రాచీనసాతవాహనవంశజులు దమ శాసనముల నన్నిటిని ప్రాకృత భాషయందు బ్రకటించిరి. అట్లే సాతవాహనవంశజుల నాశ్రయించి గ్రంథరచన జేసిన గుణాఢ్యాదికవులు దమ గ్రంథములను బ్రాకృత భాషయందే విరచించిరి. మఱియు క్రీ. శ. ౭ వ శతాబ్దమునకు

---

* ఇది ౧౯౪౯ డిసెంబరు ౧౨వ తేదీనాడు వాల్తేరు ఆంధ్రవిశ్వవిద్యాలయ యూనియన్ వారు చేసిన ఆంధ్రవారోత్సవసందర్భమున నిచ్చిన యుపన్యాసము.

తెనుగుభాష యుండెనని నిరూపింపదగిన ఆధారము లెవ్వియు లేవు. కావున నాంధ్రుల యాదిమనివాసస్థాన మిప్పటి తెనుగువారు నివసించు దేశము గాదు; వారి భాష తెనుగు కాదని యొప్పుకొనవలసి యున్నది. కాని యాంధ్రులు వేఱు, తెనుగువారు వేఱనుట నిజము గాదు. ఆద్యమున నాంధ్రుల నివాసస్థాన మెద్దియైనను బౌద్ధ మౌర్య యుగముల నుండియు దక్షిణాపథమున గొంచె మించుమించుగ నిప్పటి తెనుగు దేశముననే యుండినట్లు బౌద్ధవాఙ్మయమువల్లను, మౌర్యశాసనములవల్లను, గ్రీకుగ్రంథముల వల్లను విదితమగుచున్నది. మఱియు నాంధ్రపథము, సాతవాహనరాష్ట్రము, సాతవాహనకోట మున్నగు స్థలములును, నాంధ్రికానదియు నిప్పటి తెనుగు దేశము నందే యున్నవి. ఇంతియ కాదు; శాసనములందును, వాఙ్మయమందును క్రైస్తవశక ప్రారంభశతాబ్దముల నుండియు నాంధ్రులను పేరు తెనుగువారికే చెల్లుచున్నది. కావున మొట్టమొదట నాంధ్రు లెచ్చట నివసించుచుండినను బౌద్ధయుగప్రారంభమప్పటికే వారు ఇప్పటి తెనుగు దేశమునకు వచ్చి యచ్చట స్థిరనివాసము లేర్పఱచు కొనిరి. అప్పటినుండియు నది యాంధ్రావనియాయెను.

ఈ సందర్భమున బరామర్శింపదగిన యంశ మొక్కటి కలదు. జాతిచే నాంధ్రు లెవ్వరు? ద్రావిడులని కొందఱుద్ఘోషించియున్నారు; ఆర్యు లని మఱి కొందఱు వాదించుచున్నారు. విషయమును నిష్పక్షపాతముగ విమర్శించిచూచితిమేని వాదములయం దేదియు సత్యము గాదని తెల్లము గాగలదు. మొట్టమొదట మన మొక విషయమును దృక్పథమునం దుంచుకొనవలసియున్నది. ప్రపంచమునం దెచ్చటను స్వచ్ఛమైన జాతి లేదు; అన్నియు మిశ్ర జాతులే. మాటవరుసకు ఆంధ్రజాతి యాద్యమున స్వచ్ఛమైనదని యొప్పుకొందము. నీ కౌత్తరాపథికులు అంఘ్రునదీతీరమునుండి కాక పోయినను గంగాతటము నుండియో, వింధ్యాద్రిసాను దేశముల

నుండియో ఇప్పటి తెనుగుభూమికి వలసవచ్చి స్థిరనివాసము నేర్ప
ఱచుకొనిరని యింతకుపూర్వము చెప్పియున్నాడను. ఆంధ్రులు వలస
వచ్చినప్పుడు తెనుగుదేశము నిర్మానుష్యమైన కాడు కాదు. రామా
యణకాలమప్పటికే గోదావరీతటదేశమునకు జనస్థానమని పేరు వచ్చి
నది. ఇచ్చటి యాదిమజనులు ఖాండులు, కోయు లను నాటవికజనులని
శాస్త్రజ్ఞుల యభిప్రాయము. పిమ్మట దేశమును ద్రావిడు లాక్ర
మించుకొనిరి. తరువాత నాంధ్రు లేతెంచిరి. ఈ మూడుజాతుల
సంయోగమువలన స్వచ్ఛమైన యాంధ్రజాతి మిశ్రజాతిగ మారినది.
ఆంధ్రద్రావిడసంయోగమువలన గొన్ని మార్పులు గలిగినవి. వీని
యందు ముఖ్యముగ స్మరణయుంచుకొనదగినది భాషాత్మకమైనది.
ఆంధ్రులభాష ప్రాకృతమని చెప్పియున్నాను; ద్రావిడుల భాష
యరవము. ఉభయజాతుల కలయికవలన భాషాసాంకర్య మేర్పడి
నది. ప్రాకృతద్రావిడభాషల సంయోగమువలన రెండు నూతనభాష
లేర్పడినవి. తూర్పున తెనుగు, పశ్చిమమున కన్నడము, తూర్పున
ద్రావిడులకంటె నాంధ్రుల సంఖ్య యధికమగుటచే దూర్పునాటి
యాంధ్రుల భాషయందు సంస్కృతప్రాకృతశబ్దజాలము మెండుగ
నిలిచెను; పశ్చిమమున నాంధ్రులకంటె ద్రావిడుల సంఖ్య యధికమగు
టచే బశ్చిమాంధ్రుల పలుకుబడి ద్రావిడపదభూయిష్ఠ మాయెను.
ఇట్లేర్పడిన నూతనభాషలవల్ల నాద్యమున నొక్కటైయుండిన యాంధ్ర
జాతి రెండు పాయలై చీలినది. తూర్పున ఆంధ్రుల సంఖ్య బహుళమగు
టచే దాని కాంధ్రదేశ మనుపేరు రూఢియాయెను; పశ్చిమము గర్ణ
రాజులపేర కర్ణాటకమని ప్రఖ్యాతినందెను. ఆంధ్రకర్ణాటకు లిట్లు
వేర్పడి వేర్వేఱు ప్రభుత్వములక్రింద వెలసినను వారి సంస్కృతి
యొక్కటియే. ఈ కారణముచే దక్షిణాపథమందలి యన్యప్రజలకంటె
నాంధ్రకర్ణాటకుల కొండొరులతో నెక్కుడు సామ్యము కల్గినది;
మఱియు జరిత్రయుగమున గల్గిన పరస్పరసంసర్గము వలన నిది స్థిరమై

నిలిచినది. ఈ సందర్భమున జ్ఞప్తికి దెచ్చుకొనదగినది చాళుక్యజైత్ర యాత్ర. చాళుక్యులు కర్ణాటకులు; క్రీ. శ. 7 వ శతాబ్దపూర్వార్ధమున వీరి ప్రభువు ఇమ్మడి సత్యాశ్రయపులకేశివల్లభుడు పూర్వ సముద్రతీరమందు కృష్ణా గౌతమీ మధ్యస్థి తాంధ్ర దేశమును జయించి యచట దన తమ్ముని కుబ్జవిష్ణుని బ్రతిష్ఠించెను.

చాళుక్యాగమనముతో దెనుగు దేశచరిత్రయం దొక నూతన యుగ మారంభమగుచున్నది. జాతీయజీవనము బహుళముగ మాఱి పోయినది. ఇమ్మడి పులకేశి వల్లభుని విజయమువల్ల తీరాంధ్రమున వేంగీమండలమున నొక నూతన రాజవంశ మేర్పడుటయే కాక, జనసామాన్యము మిశ్రీభూతమాయెను. చాళుక్యులాంధ్రమండలమును జయించి యందు స్థిరనివాసము లేర్పఱచుకొన్నప్పుడు వారు తమతోగూడ తమ స్త్రీజనమును, బరివారమును దోడ్కొని వచ్చిరి. మఱియు దమ యధికారము నిలబెట్టుకొనుటకొఱకు చతురంగబలముల వెంటబెట్టుకొని వచ్చిరి. వీరందఱును గర్ణాటకులే; వీరు యధికారము క్రింద రాజ్యపాలన మొనర్చుటకు వచ్చిన యుద్యోగులును, సకల నియోగిజనులును గర్ణాటకము నుండియే వచ్చిరి. వీరి నాశ్రయించిన బ్రాహ్మణులును, వర్తకము నభివృద్ధి జేసికొనుటకొఱకు వణిజులును, వీరికి గొలువు సేయుటకు శూద్రప్రజయు గర్ణాటకమునుండియే వచ్చి తీరాంధ్రమున స్థిరముగ నిలిచిపోయిరి. ఇట్లు కలిగిన ప్రజాసమ్మిశ్రణమువలన నాచారవ్యవహారములందు కొంత మార్పుకలిగినది. ముఖ్యముగ నీ మార్పు భాషయందు పొడ చూపినది. చాళుక్యరాజ్యస్థాపనమైనదాది రాజభాష కన్నడమాయెను; రాజులే కాక వారి యుద్యోగులును, పరిజనులు, మఱియు దూర్పుతీరమున స్థిరనివాసము లేర్పఱచుకొనియుండిన అన్యకర్ణాటకులును కన్నడముననే భాషించువారు. రాజకీయవ్యవహారములన్నియు దేశభాషయగు తెనుగునందే నడచుచువచ్చినను చాల కాలము

వఱకును చాళుక్యులకు వారి మాతృభాషయగు కన్నడమున్పై నాదరము తగ్గలేదు; ఈ కారణమువల్ల కన్నడ పలుకుబడులు, మాటలు పెక్కు తెనుగున ప్రవేశించినవి; భాషయందలి శబ్దజాల మిట్లు విస్తరించినను దాని పరిశుద్ధత చెడినది. మహమ్మదీయరాజుల కాలమున నరబీపారశీభాషల సంపర్కమువల్లను, నాంగ్లేయ పరిపాలనయందు ఆంగ్లభాషాసంపర్కమువల్లను నెట్టి మార్పు గలిగెనో యంతకుమించిన మార్పు కన్నడభాష పొత్తువలన చాళుక్యయుగమున దెనుగున గన్పట్టినది.

క్రీ. శ. ౧౧ - ౧౨ శతాబ్దములలో ద్రావిడుల కలయికవలన గొంచె మించుమించుగ నిట్టి మార్పే మరల గలిగినది. ప్రథమశక్తివర్మ వేంగిసింహాసనము నెక్కినప్పటినుండియు బూర్వచాళుక్యచోళ రాజకుటుంబములకు వివాహసంబంధము లేర్పడెను; వేంగిరాజులు చోళచక్రవర్తుల కరిగాపులైరి; పూర్వచాళుక్యరాజ్యమునం దరవ వారికి రానురాను పలుకుబడి హెచ్చుచొచ్చెను; రాజరాజనరేంద్రుని నిర్యాణానంతర వేంగిరాజ్యము చోళసామ్రాజ్యమున లయమై ప్రత్యేకతను గోల్పోయినది. రాజరాజనరేంద్రుని పుత్రుడైన కులోత్తుంగచోళదేవు డుభయరాజ్యముల కధిపతియైనను నత డరవలలో గలిసిపోయెను. అతని యవ్వయు, దల్లియు జోళులయింటి యాడబడుచులు; చాళుక్య రక్తముకంటె జోళరక్తమే యతని దేహమున నెక్కువగ బ్రవహించుచుండినది. అతడు పెరిగి పెద్దవాడై విద్యాబుద్ధులు గఱచినది చోళచక్రవర్తియాస్థానముననే; పెండ్లాడినది మేనమామయగు చోళచక్రవర్తి ఇమ్మడి రాజేంద్రదేవుని పుత్రిక యగు మదురాంతకీ దేవినే; కావున నతడు చాళుక్యవంశమునకును, రాజేంద్రదేవు డను జన్మనామమునకు స్వస్తిచెప్పి యరవల గలిసి కులోత్తుంగచోళు డను నామమును ధరించుట సహజమే. ఇతని వంశీకులు సంపూర్ణద్రావిడు లగుటయందు వింత లేదు. కులోత్తుంగుడును,

నతని సంతతివారును దేశపరిపాలన దమ యరవ యుద్యోగస్థుల మూలముననే సాగించిరి. పెక్కండ్రు ఆంధ్రదేశమున స్థిరనివాసము లేర్పఱచుకొనిరి. నేటి యాంధ్రబ్రాహ్మణ్యమున మూడవవంతు ద్రావిడబ్రాహ్మణులు గలరు. వీరితోపాటు అరవకరణ యరవ వెలమ బేరి ముదలియారుపిళ్ల లనేకులు ఆంధ్రదేశమున నివసించుచున్నారు. వీరియం దనేకు లీ చాళుక్యచోళరాజుల కాలముననే యాంధ్రదేశము నకు వచ్చి యచ్చట నెలకొని యాంధ్రులలో గలసిపోయిరి.

ఈ జాతులసమ్మేళనచరిత్ర ఇంకను నెంతయేనియు గలదు; కాని ఆంధ్రజాతికొందఱ నుకొనునట్లు స్వచ్ఛమైనది కాదని నిరూపించుటకు — రెండు ఉదాహరణములును జాలును. వారు కేవల మార్యులును గారు; ద్రావిడులును గారు; ఆంధ్రులు మిశ్రజనులు. అట్లనుటవలన వారియెడ న్యూనత నారోపించుచున్నాఁ నని యెంచ రాదు. జాతిమిశ్రణ న్యూనతను సూచింపదు; ప్రపంచమున వాసి కెక్కి గొప్ప సామ్రాజ్యములను నిర్మించి నాగరికతాభ్యుదయమునకు బ్రధానకారణభూతులైన యవనరోమపారశీకాంగ్లేయాదులు మిశ్ర జనులే. జాతిసమ్మేళనమే వీరి యౌన్నత్యమునకు గారణమని పరి శోధకపండితు లభిప్రాయపడుచున్నారు. ఇది సత్యమని విశ్వసించు చున్నాను.

భారతీయప్రజలలో నాంధ్రులు మొదటి బంతికి జెందినవారు. డంబముకొఱకు చెప్పిన రిత్తమాట కాదు ఇది. వారి ఘనకార్యములే వారి కీ స్థానమును జేకూర్చినవి. ఆంధ్రులు సామ్రాజ్యనిర్మాతలు. భారతదేశచరిత్రయందు సుప్రసిద్ధినందిన సామ్రాజ్యములు రెండు వారిచే సృజింపబడినవి. ఇందు మొదటిది ఆంధ్రశాతవాహన సామ్రా జ్యము. ఐతరేయబ్రాహ్మణకాలమునుండియు నాంధ్రులు భరతఖండ మున నుండినను వారి రాజకీయ స్థితిగతులను దెలియజేయు సాధనము లెవ్వియు లభ్యపడలేదు; మౌర్యయుగప్రారంభమున వారు ముప్పది

దుర్గములచేతను, లక్ష పదాతులచేతను, రెండు వేల గుఱ్ఱములచేతను, వేయి యేనుగులచేతను, సంరక్షితమైన పురగ్రామఘోషమగు విశాల రాజ్యమున కధిపతు లని తెలియవచ్చుచున్నది; కాని యది యేక రాజ్యమో, పెక్కు రాజ్యముల కూడికవలన నేర్పడిన సంయుక్త సంస్థానమో నిశ్చయించుటకు వీలులేదు; కాని యశోకమౌర్యుని యనంతరము సాతవాహనవంశజుల యాధిపత్యముక్రింద నాంధ్రులు స్వతంత్రులైరి; క్రీస్తుజన్మమున కించుకముందు కాణ్వవంశజుల యధికారమును గూలద్రోసి పాటలీపుత్రమును స్వాధీనపఱచుకొని మగధ సామ్రాజ్యమున కధిపతులై భారతావనియందు జాలభాగమును దమ యేలుబడిక్రిందికి దెచ్చుకొనిరి. సాతవాహనసామ్రాజ్యము క్రీ. పూ. ౨౮౦ వ సంవత్సరము నుండి క్రీ. త. ౨౨౦ వఱకును ౪౬౦ సంవత్సరములకాలము వెలసినది. ఇంత దీర్ఘకాలము మఱి యేరాజవంశమును భరతఖండమును పరిపాలించియుండలేదు. ఆంధ్రు లింత దీర్ఘకాలము పృథివీపరిపాలన మొనర్చియున్నను, వారి చరిత్రనుగూర్చికాని, వారి పాలనక్రింద నడచిన విశేషచరిత్రాంశములను గూర్చి కాని మనకు దెలిసిన విషయ మత్యల్పము. మన యౌదాసీన్యమే మన యజ్ఞానమునకు ముఖ్యకారణము. ఆంధ్రుల ముప్పదిదుర్గములును, పురములును నడ పొడ లేక మాయమైపోలేదు; అవి నశించిపోయినను వాని యవశిష్టములు భూగర్భమున డాగియున్నవి. ప్రాచీనస్థలములను గుర్తించి వానిని ద్రవ్విన నివి లభ్యము కాగలవు. వీని నాధారపఱచుకొని యాంధ్రుల పూర్వచరిత్రను పునర్నిర్మాణముసేయుట యసాధ్యకార్యము గాదు.

ఆంధ్రసాతవాహనసామ్రాజ్యమును గూర్చి మనకు దెలిసిన విషయ మల్పమైనను వారి యేలుబడిక్రింద నడచిన కొన్ని ముఖ్యాంశములను స్థూలముగ వివరించుట కవకాశము గలదు. మొదట పేర్కొనదగినది ధర్మోద్ధరణము. శకయవనపహ్లవాదివైదేశికజాతుల

రాకవలన సశ్చిమోత్తరభారతదేశము పరహస్తగతమాయెను. కుల ధర్మములు కూలిపోయెను; హిందూసంఘుబంధములు సడల నారంభించెను; సంస్కృతికే చేటు వాటిల్లెను. వైదేశికులతో ప్రతిఘటించి హిందూస్వాతంత్ర్యమును నిలబెట్టుటకు, హిందూధర్మమును బునరుద్ధరించుటకును దగిన ప్రభు వెవ్వడును ఉత్తరాపథమున లేడాయెను. కావున నా కార్యభారము ఆంధ్రసాతవాహనరాజుల భుజములపై బడెను. గౌతమీపుత్ర శ్రీశాతకర్ణి ధర్మసంరక్షణకు నడుముగట్టి శకయవనాదుల నోడించెను. ఈ విజయమువలన ఆంధ్రసామ్రాజ్యము విస్తరించుటయేకాక, వైదేశికు లనేకులు సనాతనధర్మము సంగీకరించి హిందువులైరి. రెండవది ద్వీపాంతరమున వలసరాష్ట్రసంపాదన సాతవాహనుల యేలుబడిక్రింద ఆంధ్రులకు బూర్వదేశములతో వ్యాపారసంబంధ మేర్పడినది. రానురాను వాణిజ్య మభివృద్ధియగుట వలన రాకపోకలతిశయించినవి. నౌకానిర్మాణమునను, సముద్రయానమునను నాంధ్రులు నేర్పరులగుటవలన ద్వీపాంతరవాణిజ్యము వారిమూలమున నడచుచుండెను. సముద్రప్రయాణము సేయు నాంధ్రవర్తకుల సంరక్షణముకొఱకు సాతవాహనప్రభువు లొక నౌకాదళమును నిర్మించి వారికి సముద్రముపై శత్రుభయమును లేకుండజేసిరి. ఆంధ్రులలో నెల్ల గాళింగులు సుప్రసిద్ధనావికులు, క్రీ. శ. ప్రారంభకాలమున వెలసిన మహాకవి కాళిదాసు గళింగాధిపతి నిట్లు ప్రశంసించియున్నాడు :

"అసౌ మహేన్ద్రాద్రిసమానసారః
పతిర్మహేన్ద్రస్య మహోదధేశ్చ,
యస్య క్షరత్సైన్యగజచ్ఛలేన
యాత్రాసు యాతీవ పురో మహేన్ద్రః."

ఇందువలన కళింగాధిపతి మహేన్ద్రాద్రికిని, మహోదధికిని అధినాథు డని తెల్లమగుచున్నది. సువర్ణద్వీపము మున్నగు పూర్వ

దేశములకు కళింగనగరము రేవునుండియే యోడలు బయలుదేరిపోవు నవి. ద్వీపాంతరసంబంధమువలన గల్గినది వాణిజ్యాభివృద్ధి యొక్క టియే కాదు: వాణిజ్యమూలమున ద్వీపాంతరవాసులతో మైత్రి కుదిరి నది. మాతృదేశముకంటె ద్వీపాంతరములందు జీవనము సుఖతర మును, లాభకరమును నగుటచేత నసంఖ్యాకు లాంధ్రదేశమును విడిచి సముద్రమును దాటిపోయి యవసువర్ణాదిద్వీపములందు స్థిరనివాసము లేర్పఱచుకొనిరి. తమతోగూడ దా మవలంబించుచుండిన బౌద్ధశైవ వైష్ణవమతములను వర్ణాశ్రమధర్మములను గొంపోయి పూర్వసముద్ర ద్వీపములందును స్థిరముగ నెలకొల్పిరి. ఈ కారణమువల్లనే ప్రాచీన చీనాచరిత్రకారులు మలయద్వీపకల్పమును, దత్ప్రాంతద్వీపములను కళింగమని పేర్కొనిరి. మఱియు - నరవ పరిశోధకులకు నచ్చకపోయి నను - శ్రీవిజయసామ్రాజ్యనిర్మాతలైన శైలేంద్రవంశజులు కళింగము నుండి యవద్వీపమునకు వలసపోయిన రాజులే యని కొంద అభిప్రాయపడుచున్నారు. ఇచట స్మరింపదగిన ముఖ్యవిషయ మొకటి కలదు. ఇది శిల్పసామ్యము. పూర్వద్వీపములకు వలసపోయిన ఆంధ్రులు మాతృదేశమున వాడుకయం దుండిన శిల్పసంప్రదాయము లను దమవెంట గొనిపోయిరి. బోరోబదూరున గానవచ్చు నమ రావతీ స్తూపలక్షణములును, ప్రతిమావిధానసామ్యమును జావనీయ శిల్పమున కాంధ్రశిల్పము మేలుబంతి యని రుజువుసేయుచున్నవి.

మూడవది శిల్పనిర్మాణము: ప్రాచీనభారతీయ వాస్తువిద్యా చరిత్రయం దమరావతీస్తూపము ప్రసిద్ధికెక్కినది. వాస్తుదృష్టియం దీ స్తూపము దేశమునందు గానవచ్చు నితరస్తూపములవంటిదే; కాని వాని విశిష్టత శిల్పవైచిత్రివలన గల్గినది. అందు గానవచ్చు చలువ రాతి జిలుగుచెక్కడపు బనియు, గండారపుబొమ్మలును నచ్చెరువు గొలుపుచు వాని సహజరామణీయకతవలన చూపరులహృదయము లను జూఱగొనుచున్నవి. అమరావతీస్తూపమును బోలి యాంధ్ర

శిల్పుల నేర్పును ప్రకటించు వాస్తువిశేషములు నాగార్జునకొండ మున్నగు పెక్కుతావుల గలవు. కాని వీనియం దనేకములింకను భూగర్భముననే స్థాపితమైయున్నవి. వీని నన్నిటిని బయలుపఱచి పరిశోధించి చూచిన ప్రాచీనాంధ్రుల శిల్పవిద్యానైపుణ్యమును, వారి మతసాంఘికస్థితులును దెల్లముకాగలవు.

సాతవాహనరాజులు ప్రాకృతవాఙ్మయమును బోషించిరి. ప్రాకృతగ్రంథకర్తలను జేరదీసి వారికి గ్రాసవాసాదులకు సదుపాయములను గల్పించి గ్రంథరచనకు బురికొల్పిరి. ప్రాకృతవాఙ్మయమునకు వారొనర్చిన మేలును దగురీతిని ప్రశంసించుట కిది యదను గాదు; కాని ప్రపంచకథావాఙ్మయమునం దుత్తమోత్తమమైన దని వాసికెక్కిన గుణాఢ్యుని బృహత్కథను మాత్రము బేర్కొనకతప్పదు. గుణాఢ్యుని గ్రంథమిప్పుడు నామమాత్రావశిష్టమైనను, దాని యుత్కృష్టత సోమదేవుని సంస్కృతీకరణమువల్ల విదితమగుచున్నది. కీర్తికాయులు మహోపాధ్యాయ కళాప్రపూర్ణ బ్ర. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలవారు సోమదేవుని కథాసరిత్సాగరము నాంధ్రీకరించియున్నారు. ఇందువలన సాతవాహన యుగమున నాంధ్రనాగరికత యెట్టిస్థితియం దుండెనో కొంత బోధకాగలదు.

ఆంధ్రులు నిర్మించిన రెండవ సామ్రాజ్యము విజయనగరరాయ సామ్రాజ్యము. హిందూధర్మసంరక్షణ కొఱకీ సామ్రాజ్యము నిర్మింపబడెను. క్రీ. శ. ౧౩ వ శతాబ్దాంతమున మహమ్మదీయులు దక్షిణాపథమున బొడచూపిరి. వారి యాగమముతో దాక్షిణాత్యరాజవంశములకు పోగాల మాసన్నమైనది. అప్పుడు దక్షిణదేశ మంతయు నాల్గు రాజవంశముల యేలుబడిక్రింద నుండినది; కాకతీయు లాంధ్రదేశమందును, పాండ్యులు ద్రావిడదేశమందును, హొయ్సలులు దక్షిణకర్ణాటకమునను, యాదవు లుత్తరకర్ణాటక మహారాష్ట్ర

దేశములను బాలించుచుండిరి. కాని వీరెవ్వరును మహమ్మదీయుల ధాటికి కోర్చి తమ స్వాతంత్ర్యమును గాపాడుకొన జాలకపోయిరి. క్రీ. శ. ౧౨౯౫ - ౧౩౨౬ వ సంవత్సరములమధ్య వీరి యధికారము గూలిపోయినది. అంతట హిమాచలము నుండి రామసేతుపర్యంతము వ్యాప్తమైన యావద్భారతావనియు మహమ్మదీయులకు హస్తగతమైనది. స్వతంత్రహిందూప్రభు వెవ్వడును గానరాకపోయెను. హిందూసంస్కృతికిని, ధర్మమునకును బ్రళయకాలము సమీపించినట్లాయెను.

చరిత్ర పుట్టినప్పటినుండియు నన్యదేశజు లనేకులు తండతండములుగ హిందూదేశమునకు వచ్చి రాష్ట్రములను జయించి రాజ్యములను స్థాపించి పృథ్వీపరిపాలనము గావించిరి; కాని వీరు మహమ్మదీయుల వంటివారు కారు; వీరందఱు కొంతకాలము హిందూదేశమున నివసించిన పిమ్మట హిందూసంస్కృతిని స్వీకరించి హిందూమతధర్మముల నవలంబించి హిందువులై పోయిరి. మహమ్మదీయు లట్లు తమ ప్రత్యేకతను గోలుపోలేదు. దీనికి ప్రధానకారణము వారి మతము. పైగంబరు మహమ్మదు దేవుని కడపటి ప్రవక్తయనియు, నతని మూలముననే దేవుడు మానవజాతికి దన యంతిమ సందేశము నంపెననియు, నీ సందేశము ఖురాన్ షరీఫున నుల్లేఖింపబడె ననియు, నందు వర్ణింపబడిన మతమే సత్యాత్మక మనియు, నన్యమతము లసత్యము లనియు, నసత్యమును నిర్మూలముగావించి సత్యమునే లోకమున బ్రచారములోనికి దెచ్చుట తమ విధియనియు మహమ్మదీయుల దృఢవిశ్వాసము. కావున వీరి కన్యమత ద్వేషము సహజమాయెను. మహమ్మదీయుల యేలుబడియందు అన్యులకు తావు లేదు. బలాత్కారముగ నన్యులను దమ మతమున గలుపుకొనుటయో, యది సాధ్యముగాని పక్షమున వారిని కాలబెట్టి నేలరాచి సర్వనాశము సేయుటయో తప్ప అన్యమార్గములను మహమ్మదీయ

ప్రభువు లెఱుంగరు. కావున దక్షిణభారత దేశము మహమ్మదీయులకు హస్తగతమైనప్పటినుండియు నచటి హిందూప్రజలకు గష్టకాలము సంప్రాప్తమాయెననుట యతిశయోక్తి కాదు. మహమ్మదీయులచే దామ పడిన పాటు నప్పటివారే విపులముగ వర్ణించి యున్నారు "ప్రతాపరుద్రు డను భాను డస్తంగతుడు కాగా లోకమున తురుష్కాంధకారము వ్యాపించినది... దేశము యవనాక్రాంతము కాగా ధనవంతులు విత్తముకొఱకు పలువిధముల పీడింపబడిరి. కొందఱు తురకలను జూడగనే ప్రాణములు వదలిరి; ద్విజులు తమ యజ్ఞకర్మలను వదలుకొనవలసినవారైరి; దేవాలయములు పాడైపోయినవి. చిరకాలమునుండియు మహాపండితభుక్తము లగుచుండిన అగ్రహారములన్నియు అపహరింపబడినవి. పాపాత్ములగు యవనులు బలాత్కారముగ వ్యవసాయకర్మవలన జేకూడు పంటలను హరించుటచేత, దరిద్రులు ధనికులు అను భేదము లేక రైతుల కుటుంబములెల్ల నాశమైపోయినవి. ఆ మహావిపత్కాలమునందు ధనము, భార్య మొదలగువానియందు స్వాయత్తతాభావము పోయినది. కల్లు త్రాగవలయును; ఆవుమాంసము తినవలయును; స్వచ్ఛంద విహారము సేయవలయును; బ్రాహ్మణులను చంపవలయును; దేవాలయముల నిడియగొట్టవలయును; దేవతావిగ్రహములను భగ్నము సేయవలయును. ఇది యవనాధముల వృత్తి. వారి వ్యాపార మిట్లున్న యెడల భూమిపై ప్రాణిలోక మింక మను టెట్లు? ఈ విధముగ రాక్షసులవంటి తురుష్కులవలన పీడింపబడిన త్రిలింగ దేశము కార్చిచ్చుచేబరివృతమైన యడవివలె తపించిపోయినది."

పారతంత్ర్యము ననుభవించువఱకును ఆంధ్రులకు స్వాతంత్ర్యముయొక్క విలువ తెలియకపోయినది; మహమ్మదీయుల విజయములవలన ఆంధ్రులకు దాస్యము సంప్రాప్తమై యాతిబాధలు గల్గినను నందువల్ల లాభము గలుగకపోలేదు. విపత్తును దొలగించు

కొనుటకొఱకు జనులంద ఱేకమైరి ; జాతీయోద్బోధము గలిగినది ; స్వదేశాభిమానము మెండైనది. మహమ్మదీయులను బాఱదోలుట యెట్లు ? నష్టమైపోయిన స్వాతంత్ర్యమును పునఃప్రతిష్ఠ సేయుట యెట్లు ? మ్లేచ్ఛుల దౌర్జన్యముచే నాశమగుచున్న హిందూధర్మమును మరల నెలకొల్పుట యెట్లు ? - అను భావము లెల్లవారి హృదయములను కల వరపెట్ట నారంభించినవి. ఆంధ్రనాయకులెల్ల నొక్కచో సమావిష్టులై దాస్యవిముక్తికి మార్గము నారయ నారంభించిరి. దీనికి ప్రతిఫలముగ జాతీయసమితి యొకటి యేర్పడినది. ఆంధ్రప్రజలును, నాయకులును నేకగ్రీవముగ ముసునూరుప్రోలయనాయకుని దమ కధిపతిగ నెన్ను కొని మహమ్మదీయులతో స్వాతంత్ర్యసమరమును బ్రారంభింప నిశ్చ యించిరి.

భరతఖండప్రజలలో కెల్ల మొట్టమొదట జాతీయోద్యమమును దలపెట్టి స్వాతంత్ర్యసమరమునకు నడుముగట్టినవారు మహారాష్ట్రులని చరిత్రకారులు చర్విత చర్వణముగ వక్కాణించుచున్నారు. ఇది సత్యము కాదని మన ప్రాచీనచరిత్ర రుజువుచేయుచున్నది. శివాజీ జన్మమునకు మూడు శతాబ్దములకు పూర్వమే ముసునూరు ప్రోలయ నాయకుడు ఆంధ్రజాతీయపతాకము నెత్తి స్వాతంత్ర్యసంగ్రామమును బ్రారంభించెను. కావున భరతఖండమున మొదట జాతీయోద్యమ మును దలపెట్టినవా రాంధ్రులు కాని మహారాష్ట్రులు గారు. జాతీయ స్వాతంత్ర్యపునరుద్ధారణకొఱకు పోరాడి తమ రక్తమును గార్చి ప్రాచీనాంధ్రులు మనకు మార్గదర్శకులైరి.

ఆంధ్రనాయకుల యుద్యమము జయప్రదముగ కొనసాగినది. కాకతీయరాజ్యము గూలిపోయిన పదునైదు సంవత్సరములలోపల నాంధ్రులు తురకలను బాఱదోలి మరల దమ స్వాతంత్ర్యమును స్థాపించిరి. తీరాంధ్రమంతయు నాంధ్రులకు వశపడెను. అంతట నాంధ్ర

నాయకసంఘాధిపతియగు ముసునూరు ప్రోలయ దివంగతు డాయెను; నాయకులంద రేకమై యతని స్థానమున నతని సోదరపుత్రుని గాపయ నాయకుని దమ కధిపతిగ నెన్నుకొనిరి. కాపయనాయకు డసాధారణ పురుషుడు; దూరదృష్టి గల రాజ్యతంత్ర మర్మజ్ఞుడు. నష్టమైపోయిన దమ యధికారమును మరల తెలింగాణమున స్థాపించుటకు మహమ్మ దీయులు ప్రయత్నము సల్పకపోరు. అంతవఱ కాంధ్రులచే నిర్జింపబడిన తురకలు సుల్తానుచే నాంధ్ర దేశమున దన యధికారమును సంరక్షించుటకు గాపుంచినస్థానిక దళము లే. హిందువుల తిరుగుబాటును, దన మండలాధికారుల యోటమియు, రాజ్యనష్టమును జెవిసోకిన వెంటనే సుల్తాను ప్రచండసైన్యముతో ఢిల్లీనుండి ఎత్తిరాకమానడు. ఢిల్లీసామ్రాజ్యదళముతో బ్రతిఘటించి పోరాడి తమ స్వాతంత్ర్య మును నిలబెట్టుకొనుట కాంధ్రులకు శక్తి చాలదు. తాత్కాలిక ముగ నాంధ్రనాయకులకు జయము గలిగినమాట వాస్తవమే; కాని సుల్తానుఉపసత్తి వారి కెక్కడిది? అతనికి గల కోశబలసంపదలు వారి కెక్కడివి? కాని యాంధ్రదేశమును దురకలకడనుండి సంపూర్ణముగ స్వాధీనపఱచుకొనుటకును, ఆంధ్రస్వాతంత్ర్యమును స్థిరముగ నిల బెట్టుటకును మార్గము లేకపోలేదు. దాక్షిణాత్యహిందువులంద రేకమై తురకలకు మాఱొడ్డి నిలిచిన వారీదక్షిణదేశమును త్యజించి పోకతప్పదు. అప్పు డొక యాంధ్రులకే కాక దక్షిణభారతీయహిందు వుల కందఱికిని స్వాతంత్ర్యము చేకూఁడగలదు. కాని మిగిలియుండిన దాక్షిణాత్యహిందూరాజులలో నెల్ల గొప్పవాడును, బలవత్తముడును నగు హొయ్సలరాజు మూమ్మడి బల్లాళదేవుని సహాయసానుభూతులు లేక యాకార్యము నెఱవేరదు. కావున కాపయనాయకుడు ద్వార సముద్రమునకు బోయి బల్లాళరాయనితో జర్చించి యొడంబడిక గుదుర్చుకొనెను. దీని ఫలితార్థ మేమన, దాక్షిణాత్యహిందూ సంఘమునకు బల్లాళు డధిపతియై స్వాతంత్ర్య యుద్ధమును సాగింప

నియ్యకొనెను. తెలింగాణము నుండి తురకలను దఱిమి యోరుగంటిని స్వాధీనపఱచుకొనుటకొఱకు కాపయనాయకునికి తోడు సైన్యమంపెను; తరువాత కాపయనాయకునిగూడి ద్రావిడదేశమును మ్లేచ్ఛదాస్యమునుండి తప్పించుట కొప్పుకొనెను. అల్పకాలమందే వారి కడక నెఱవేఱెను; మహమ్మదీయ సైన్యము లోడి పాఱిపోయెను. ఓరుగల్లు కాపయనాయకునికి హస్తగతమైనది. ద్రావిడదేశము గూడ హిందువులకు స్వాధీనపడెను. ద్రావిడదేశమిట్లు దాస్యవిముక్తి నందినను, చోళపాండ్యదేశము లింకను మహమ్మదీయుల యేలుబడిక్రిందికి దెచ్చుకొనుటకు ప్రయత్నము సేయుచుండెను. దాక్షిణాత్య హిందువులకెల్ల నాయకుడై వారిని మహమ్మదీయుల దాస్యమునుండి విడుదలసేయుటకు గంకణముకట్టుకొనియుండిన బల్లాళునికి మధుర సుల్తానుతో పోరు తప్పదాయెను. సంగ్రామమున గాపయనాయకుడు పాల్గొనెనో లేదో తెలియదు. ప్రారంభదశయందు బల్లాళునకే జయము చేకుఱినను, తుదకతడు క్రీ. శ. ౧౩౪౧ వ సం. న తిరుచునాపల్లి యుద్ధమున నిహతుడాయెను. అతని సైన్యము సర్వము రూపుమాసి పోయినది. హొయ్సలవంశ మంతట నంతరించిపోయినది.

హొయ్సలబల్లాళుని మరణమువలన దాక్షిణాత్య హిందూ ప్రపంచ మనాయకము గాలేదు. అతని స్థానమును విజయనగర ప్రభువు లధిష్ఠించిరి. విజయనగర సంస్థాననిర్మాతలు హరిహరబుక్కలను నిద్దఱాంధ్ర సోదరులు. ఆద్యమున వీరు ఓరుగంటిప్రతాపరుద్రుని కొలువున కోశాగారప్రతీహారులై యుండిరి; క్రీ. శ. ౧౩౨౩ సం. న నోరుగల్లు మహమ్మదీయులచే జిక్కినప్పుడు ఆ సోదరు లిద్దఱు నచటినుండి తప్పించుకొనిపోయి కంపిలియందు వీరకంపిలిరాయల నాశ్రయించి యతని కొలువున జేరిరి; క్రీ. శ. ౧౩౨౬ న సం. న ఢిల్లీ సుల్తాను కంపిలిరాయలను జంపి యతని రాష్ట్రమును దన సామ్రాజ్యమున గలుపుకొన్నప్పుడు హరిహరబుక్కలు బందీకృతులై ఢిల్లికి

చెఱఁబోయిరి. సుల్తాను వారిని బలాత్కరించి మహమ్మదీయమతమున గలుపుకొని చెఱనుండి విముక్తులను గావించెను. ఇట్లుండ క్రీ. శ. ౧౩౩౦ వ సంవత్సర ప్రాంతమున నాంధ్రజాతీయసైన్యము లారవీటి సోమదేవుని యాధిపత్యముక్రింద పశ్చిమాంధ్రమును బూర్వకంపిలి రాజ్యముతోఁగూడ స్వాధీనము జేసికొనెను. ఆ విషయము దెలియవచ్చినంతచే ఢిల్లీసుల్తాను హరిహరబుక్కలను గంపిలిరాజ్యమునకు బాలకులనుగ నియమించి సైన్యమిచ్చి హిందూవిప్లవకారు లాక్రమించుకొన్న రాష్ట్రమును మరల స్వాధీనపఱచుకొనుటకొఱ కంపెను. మొదట వారి కపజయము గలిగినను విద్యారణ్యస్వామి ప్రసాదము వలన చివరకు జయము చేకూడెను. హరిహరబుక్క లంతట సుస్థిరులై యచట రాజ్యము సేయఁగడగిరి.

హరిహరబుక్క విద్యారణ్యసమాగము దక్షిణభారతచరిత్ర యందు మఱువరాని విశేషాంశము. మనచరిత్ర నది నూతనమార్గమున ద్రిప్పినది. విద్యారణ్యస్వామి మధ్యయుగహిందూప్రపంచము నుద్ధరింప నవతరించిన మహాపురుషుడు. ఆయనవంటి విశాలహృదయుడైన సన్న్యాసి యాయుగమున మఱియొక్కడు కానరాడు. శాస్త్ర విజ్ఞానమున నాతని మించినవా రెవ్వరు లేరు. అద్వైతవేదాంతమున మొదటి బంతిలోనివాడు; సర్వకళావిశారదుడు; సర్వతంత్రస్వాతంత్రుడు; రాజ్యతంత్రపారంగతుడు. ఈగుణములన్నియు కొంచెమో గొప్పయో యన్యులయందు కానరావచ్చును. కాని యతని విశిష్టత మ్లేచ్ఛదోషాచ్ఛన్నమై నమసిపోవ సంసిద్ధమైయుండిన సనాతనహిందూధర్మమును పునరుద్ధరింపవలయు ననుదృఢసంకల్పము; కాని రాజకీయ స్వాతంత్ర్యము లేక హిందూధర్మమును పునరుద్ధరించుట దుస్సాధ్య మని యత డెఱుఁగును. మఱియు విద్యారణ్యులవారు ఆంధ్రదేశాంతర్గతమైన ములకనాటి వాస్తవ్యుడైన కారణమున నప్పు డాంధ్రదేశమును ముంచుకొనియుండిన జాతీయాభిమాన మతని హృదయాంతరాళమున

నిండుకొనినది. కావున హరిహరబుక్కలను జేరదీసి వారిని మరల హిందూమతమున జేర్చుకొనిన దన యత్నము సఫల మగునని నిశ్చయించెను. అప్రయత్నముగ విద్యారణ్యుల కోర్కె నెఱవేఱినది. హరిహరబుక్కలు స్వామివారి సహాయము నపేక్షించి యాశ్రమమునకు వచ్చిరి. వారికి ఢిల్లీసుల్తానుప్రాపు గల్గినను దమ యధికారమును నిలబెట్టుకొనుట దుస్సాధ్యమాయెను. అప్పుడు మతముచే వారిరువురును మహమ్మదీయులు. హిందూ [illegible]తీయోద్యమముచే నుద్రిక్తమైన [illegible]ణ భారతమున మహమ్మదీయులకు దావులేదు. మఱియు వారు హిందూజనకంటకుడైన ఢిల్లీ సుల్తానుపక్షమున రాష్ట్రపాలనము సేయవచ్చిన మండలాధిపతులు. యుద్ధమున జాతీయ నాయకులచే నిర్జితులై పదభ్రష్టులైనవారు. అప్పటి పరిస్థితులలో దమకు జయముగల్గుట సంశయాస్పదమని వారు తెలిసికొనిరి; మఱియు ఢిల్లీ నుండి తమకు సహాయము రాగలదని యాశించుటకు గూడ తావులేదు.

ఈ విషమావస్థయందు విద్యారణ్యులే తమకు శరణ్యులని యెంచి హరిహరబుక్కలామహాపురుషుని యాశ్రమమునకు వచ్చిరి. ఆయన వారి శాకాభంగము గలిగింపలేదు. మొట్టమొదట ధర్మోపదేశము జేసి వారిచే మహమ్మదీయమతమునకు వీడికోలిప్పించి వారి పితృపైతామహమైన హిందూమతమున జేర్చుకొనిరి. కృష్ణకు దక్షిణమున వ్యాప్తమైన యావద్భారతభూమికిని పంపావిరూపాక్షస్వామి యొడయడనియు, నాదేవుని యాజ్ఞచొప్పున నతని ప్రతినిధులుగ హరిహరబుక్కలు దక్షిణదేశమునంతటిని, స్వాధీనపఱచుకొని పాలింతురనియు ప్రకటించిరి. హరిహరబుక్కలంతట ఢిల్లీసుల్తానును ధిరస్కరించి స్వతంత్రులైరి. క్రీ. శ. ౧౩౩౬ వ సంవత్సరము ఏప్రిలు ౧౮ వ తేదీనాడు రాజ్యాధిపతియగు పంపావిరూపాక్షస్వామి సన్నిధియందు విక్రమాదిత్యుని వజ్రసింహాసనముపై హరిహరరాయలకు పట్టాభిషేకమహోత్సవము నడచెను. ఆ శుభముహూర్తముననే

విజయనగర మను నూతన రాజధానీనగరమునకు శంకుస్థాపన నడచినది. క్రీ. శ. ౧౩౪౨ వ సంవత్సరమున హొయ్సలబల్లాళదేవుడు మధురమహమ్మదీయులచే వధింపబడిన పిమ్మట నతని స్థానమున హరిహరరాయలు సకలదాక్షిణాత్య హిందూప్రజలకును నాయకుడై మహమ్మదీయులతో బ్రతిఘటించి స్వతంత్రసంగ్రామమును బ్రారంభించెను.

ఇది రాయసామ్రాజ్యసంస్థాపనవృత్తాంతము. ఎంత సంగ్రహముగ జెప్పవలయు ననుకొన్నను దీర్ఘమె యైనది. విషయప్రాశస్త్యము దీనికి ప్రధానకారణము. రాయసామ్రాజ్యము భారతదేశమునందావిర్భవించిన ప్రథమ జాతీయోద్యమమునకు బ్రతిఫలముగ నుత్పత్తి యైనది; లయమైపోవుచున్న జాతిమతధర్మములను సంరక్షించుటకు ప్రజానీక మేకమై విశ్వప్రయత్నము గావించి దుర్జయులని విఖ్యాతిగాంచిన మ్లేచ్ఛమహమ్మదీయులకు మాఱొడ్డి మనోరథసిద్ధి బొందెను. ఇది సర్వకాలసర్వావస్థలయందును ఆంధ్రులు విస్మరింప గూడని చరిత్రాంశము, కావున రాయసామ్రాజ్యసంస్థాపనముగూర్చి ఇంతదూరము నొక్కి చెప్పితిని.

రాయసామ్రాజ్యచరిత్ర జనసామాన్యమునకు దెలియకపోయినను విద్యావంతులకెల్ల గరతలామలకమే; కావున దాని నిచ్చట విస్తరించి చెప్పవలసిన యావశ్యకత లేదు: కాని సువ్యక్తములుగాని విషయములను గొన్నిటి నిట బేర్కొనుట యుక్తము.

మొట్టమొదట నెన్నదగినది దక్షిణభారత సంస్కృతి. ఉత్తర హిందూస్థానముకంటె దక్షిణదేశమున నేడు వాడుకయందుండు హిందూమతాచార వ్యవహారములు స్వచ్ఛతరమైనవని పెక్కండ్ర యభిప్రాయము. ఇది వాస్తవము. వేషభాషలయందును, ఆచార వ్యవహారములందును ఉత్తరహిందూస్థాన హిందువులు మహమ్మ

దీయులను బోలియున్నారు. ఈ పోలిక యచటి హిందూమహమ్మ దీయప్రజల సమ్మేళనమువలన గలిగినది. దక్షిణదేశమున నట్టి సమ్మేళనము కలుగలేదు. ఆర్యధర్మమును సంకరముగానీయక విజయనగర చక్రవర్తులు మూడువందల యేండ్లు సంరక్షించిరి. ఈ మూడువందల యేండ్లును ఈ కార్యమును నిర్వహించుట కొఱకు దురకలతో పోరాడ వలసివచ్చెను. ఎడతెగని యుద్ధములు, ప్రజాక్షయము, దేశసంక్షోభ సర్వసామాన్యలక్షణములు. కృష్ణ దాటి రావలయు నని తురకలు, వారిని దాటిరానీయకూడదని విజయనగరచక్రవర్తులు. ప్రధాన రణ రంగము కృష్ణాతుంగభద్రల యంతర్వేది; హిందూమహమ్మదీయుల రక్తముచే దడిసి యెఱ్ఱనైన పుణ్యక్షేత్రము; దక్షిణభారత కురు క్షేత్రము. మహమ్మదీయులతో నిట్లు హోరాహోరిగ బోటి తురకల నరికట్టి హిందూమహమ్మదీయుల కలయిక నడ్డుపెట్టి హిందూ సంస్కృతిని సంకరముగానీయక గాపాడుటయే కాక దానిని పోషించు టకు పలువిధముల బాటుపడిరి. వేదవేదాంగపారంగతులగు పండి తుల కాశ్రయమొసగి శ్రుతిస్మృతిశాస్త్రపురాణాదుల గూఢార్థములను వివరించుటకు నూతనవ్యాఖ్యలు వ్రాయించి యజ్ఞాదివైదికకర్మలను గావించుటకు దగిన సదుపాయములను గల్పించిరి. మొట్టమొదటి నుండి చిట్టచివరవఱకును విజయనగరచక్రవర్తులు వైదికధర్మమును బోషించి వేదమార్గప్రతిష్ఠాపనాచార్య లనుబిరుదును సార్థకము గావించుకొనిరి. మఱియు మహమ్మదీయులు నాశముగావించిన ప్రాచీనదేవాలయములను బాగుచేయించుటయేగాక వేలకొలది నూతనదేవాలయములను గట్టించి వానియందు పూజాపురస్కార ములు నిరభ్యంతరముగ సాగుటకును, బ్రహ్మోత్సవ మాసోత్సవ పక్షో త్సవములు జరుగుటకును దగు నేర్పాటులను గావించిరి. విజయనగర చక్రవర్తులకు దీర్ఘయాత్రలయందును, పుణ్యక్షేత్రసందర్శనమందును గడు శ్రద్ధ. ఏలిన భూమిని మెట్టి చూడవలయు నను నియమము

ననుసరించి ప్రతివర్షము వారు సామ్రాజ్యస్థితిగతుల నరయ బయలు వెడలు వారు; రాయసామ్రాజ్యమున వారు త్రుంకని నదికాని, దర్శింపని పుణ్యక్షేత్రముకాని లేదు; అట్టి సమయముల దానధర్మము లచే నర్థిజనులను సంతృప్తిసేయువారు; కావున మతాచారవిషయ ముల జనసామాన్యమునకు మార్గదర్శకులైరి. మహమ్మదీయులకు దేశమున బ్రవేశము గలుగనీయక వెడలనడచి ధర్మసంకరము గానీక రక్షించిరి. వేదవేదాంగపారంగతుల కాశ్రయ మిచ్చుటయే కాక దేవతాయతనముల నిర్మించి యం దాచంద్రార్కము పూజా పురస్కారములు నడచుటకు సదుపాయములను గావించి పుణ్యతీర్థము లను క్షేత్రములను సేవించి జనసామాన్యమందు భక్తిశ్రద్ధలు గలుగ జేసిరి. ఇది విజయనగరచక్రవర్తులు దాక్షిణాత్యహిందూప్రజలకు గావించిన మహోపకారము. వారి ప్రసాదమువల్లనే నేటివఱకును దక్షిణభారతభూమి స్వచ్ఛమైన హిందూధర్మమున కాకరమై యున్నది.

విజయనగరచక్రవర్తులు ఆంధ్రుల కృతజ్ఞత కెంతయు పాత్రులు. వారి యాంధ్రాభిమాన మపారమైనది. సింహళద్వీప పర్యంతము గల దక్షిణదేశమునం దంతటను ఆంధ్రజాత్యంకురము లను బాదుకొల్పిరి; మైసూరునకు బొండు; ద్రావిడచోళపాండ్య భూములకు బొండు; కొచ్చితిరువాన్కూరురాజ్యములకు బొండు. ఎచటి కేగినను ఆంధ్రుడు లేని చోటు లేదు; తెనుగు వినరాని స్థలములేదు. వీరు నిన్న, నేడు ఉద్యోగము కొఱకు బోయినవారు గారు. చిరకాలమునుండి ఆయాదేశముల నెలకొనియుండు స్థానిక ప్రజలు. వీ రాడుభాష తెనుగే; మనముపలుకు తెనుగు కాదు; మన తెనుగుకంటె స్వచ్ఛతరమైనది. యాసమాట సటుండనిండు. వీరాడునది శాసనముల తెనుగు, ప్రబంధముల తెనుగు, రాయసాచ కపు దెనుగు, రాయలకాలపు దెనుగు భాష. ప్రస్తుతము కిన్నాట

ద్రావిడాది దేశముల గానవచ్చు నాంధ్రులు రాయలయుగమున నచటికి వలసబోయి యచట నెలకొన్న ఆంధ్రుల సంతతివారు. రాయ రాణువ వెంబడి బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రాది యష్టాదశవర్ణ ప్రజలును సామ్రాజ్యసంరక్షణకొఱకును, పృథివీపరిపాలన కొఱకును అచటి కేగి ఆయా దేశప్రజలమధ్య స్థిరముగ నిలిచిపోయిరి. ఇట్లు విజయనగరచక్రవర్తుల కృషికి ఫలముగ నాంధ్రదేశమునకు వెలుపల బృహదాంధ్ర మేర్పడెను. నేడు వీరందఱును కర్ణాటద్రావిడ కేరళ దేశపౌరులుగ బరిగణింపబడుచున్నను ఆంధ్రులే యనియు, మన రక్తములోని రక్తమే యనియు మఱువరాదు.

ఆంధ్రవాఙ్మయమునకు విజయనగరచక్రవర్తు లొనర్చిన సేవ యమూల్యమైనది. మొదటి హరిహరరాయలకాలమునుండి ముమ్మడి శ్రీరంగరాయలవఱకును ఆంధ్రకవుల నాదరింపని రాయలు లేడు. కావున రాజాశ్రయమున నాంధ్రవాఙ్మయము తామరతంపరగ నభివృద్ధినంది బహువిధముల బెరిగినది. రాయల యాస్థాన మాంధ్ర ప్రబంధమునకు జన్మస్థానము. యక్షగానవచన కావ్యములు మధుర తంజాపురనాయకుల ప్రోత్సాహము వలన రూపందినవి. ఆంధ్ర వాఙ్మయచరిత్రకారుల కీవిషయములు పరిచితములే; కావున రాయల యాంధ్రవాఙ్మయ సేవనుగూర్చి విస్తరించి చెప్పవలసిన యవసరము లేదు.

విజయనగరచక్రవర్తులు శిథిలమైన ప్రాచీనదేవాలయములను చక్కజేసిరనియు, వేలకొలది నూతన దేవతాయతనములను నిర్మించిరనియు నింతకుముందు చెప్పియున్నాడను. మఱియు హంపి పెనుగొండ చంద్రగిరి జింజి తంజావూరు మధురలయందు పెక్కు ప్రాసాదములు నిర్మింపబడినవి. కావున రాయల యేలుబడిక్రింద వాస్తునిర్మాణ విద్య చక్కగ బెంపందినది; క్రమక్రమముగ నొక నూతనఫక్కి యేర్పడినది. దీనికి విజయనగరఫక్కి యని పేరు; దేవాలయ

సామాన్యస్వరూపము పూర్వముకంటె భిన్నము గాకపోయినను బృహన్మంటపనిర్మాణమునందును, జిలుగుచెక్కడపు శిల్పమైచిత్రియందును విజయనగర దేవాలయములు తమ ప్రత్యేకతను వెల్లడించుచున్నవి. సౌధనిర్మాణమునందు గూడ నూతనత గలదు. హంపిలోని పద్మ ప్రాసాదరాజ్ఞీమజ్జనగృహాదులయందు మహమ్మదీయరాజమందిరముల పోలికలు కొన్ని కానవచ్చుచున్నవి. కావున విజయనగరసౌధ నిర్మాణఫక్కి హిందూమహమ్మదీయరీతుల సమ్మేళము వలన నేర్పడె నని శిల్పవిమర్శకు లభిప్రాయపడుచున్నారు.

కర్ణాటకసంగీతముకూడ విజయనగరసంస్థానమున బెరిగినదే. నేడు ద్రావిడులు తమ సొమ్మయాచి యని యుద్ఘోషించుచున్నను దానిని బెంపందించినవా రాంధ్రులని ఘంటాపథముగ జెప్పవచ్చును. శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరము దాక్షిణాత్యగాంధర్వవిద్యకు వేదము వంటిది. మన సంగీతవాఙ్మయమంతయు దీనిపై నాధారపడియున్నది. రాయసంస్థానస్థాపనకు బూర్వ మాంధ్రసంగీత మేస్థితియం దుండెనో తెలిసికొనుటకు దగు నాధారములు లేవు; కాని యవ్వేల నాంధ్ర దేశమం దన్నియెడలను నది జనాదరణకు బాత్రమాయెను. రాచకొండయందు సర్వజ్ఞసింగమహీపాలుడును, కొండవీటియందు కుమార గిరి పెదకోమటి వేమారెడ్లును సంగీతశాస్త్ర గ్రంథములు విరచించిరి. విద్యారణ్యస్వాములవా రొక సంగీతగ్రంథమును విరచించిన ఖ్యాతి హ్యాము గలదు. కుమారకంపణయు నతని ప్రధాని సోమప్పయు సంగీత విద్యావిశారదులు. వీరు గ్రంథరచన గావించిన ట్లగపడదు; కాని క్రీ. శ. ౧౫ వ శతాబ్దపూర్వార్ధమున సాళువగోపతిప్పనయు, కల్లరసును విజయనగర రాయల యాస్థానము నలంకరించిరి. అటు పిమ్మట కృష్ణరాయల యాస్థానవిద్వాంసుడు బండారులక్ష్మీనారాయణ తన సంగీతసూర్యోదయమున కర్ణాటక సంగీతవిశేషములను వివరించెను. అచ్యుతదేవరాయలు సుప్రసిద్ధవైణికుడు. వీణమెట్లను

సరిచేసి రాగరాగమునకును వానిని సవరింపవలసిన యావశ్యకత లేకుండ స్థిరపఱచెను. దీని కచ్యుతరాయవీణ యని పేరు. తరువాత నళియరామరాయల కాలమున రామయామాత్యుడు స్వరమేళకళానిధి యను శాస్త్రగ్రంథమును విరచించెను.

అంతవఱకు నరవదేశమున కర్ణాటకసంగీతము ప్రచారమున నుండె ననుటకు సాక్ష్యములేదు. సంగీత గ్రంథకర్తలగు నరవపండితులును గానరారు. అరవదేశమున కర్ణాటకసంగీతము నెలకొనుటకు ప్రధానకారణము తళ్లికోటయుద్ధానంతరము. అటుపిమ్మట రాయ రాజధానియగు విజయనగరము ఖిలపడిపోయెను. రాయ సంస్థానము నాశ్రయించుకొనియుండిన సంగీత విద్వాంసులును గళావంతులును తంజాపురమును జేరి నాయకరాజుల నాశ్రయించిరి. ఆంధ్రు లిట్లు కర్ణాటక సంగీత శాస్త్రమును బెంపందించి యరవవారి కప్పజెప్పిరి. వారదిమొదలు దానిని గాపాడుచువచ్చిరి. ఇందుకు వారికి మన మెంతయు కృతజ్ఞులమైయుండవలయును.

ఇంకను ఆంధ్రులనుగూర్చి చెప్పవలసిన విషయ మెంతయేనియు గలదు. కాని ఇది సమయము గాదు. అట్లనుటవలన ఆంధ్రదేశచరిత్రయంతయు సంపూర్ణముగ మన కెఱుకపడుచున్నదని నా భావము గాదు. మనకు దెలిసినదానికంటె తెలియనివిషయ మెక్కువ. తెలియవచ్చు విషయమునుగూడ చక్కగ గ్రహించుటకు మనకు శక్తి చాలదు; తెలియని విషయము దెలిసికొనుటకును, తెలిసిన విషయమును గ్రహించుటకును పరిశోధన జరుగవలసియున్నది. తెలియని విషయమును దెలిసికొనుట సులభసాధ్యము గాదు. ఏలన మన పూర్వికులు చరిత్రరచన దలపెట్టలేదు; కావున ప్రాచీన చరిత్ర గ్రంథములు మన వాఙ్మయమున లేవు. కాని పూర్వ చరిత్రరచనకు వలసిన సాధనములు మనకు ద్రవ్వితండములుగ గలవు. వీనిని మూడు

తెగలుగ విభజింపవచ్చును. ప్రాచీన అవశిష్టములు :—ఆదియుగము నుండియు మన దేశమున నివసించుచుండిన ప్రజల జాడలు అడపొడ లేక నిశ్శేషముగ మాసిపోలేదు. వారు నివసించుచుండిన పట్ట ణాదులు ఖిలపడిపోయినను వాని యవశిష్టములు భూగర్భమున మరుగుపడియున్నవి. ఇట్టి ప్రాచీనస్థలము లాంధ్రదేశమున నెన్నియో కలవు. ఈ స్థలములనన్నిటిని ఆర్కియాలజీశాస్త్రానుసారముగ ద్రవ్వి యందు లభ్యమైన యవశిష్టములను బరిశీలించి చూచిన మన ప్రాచీనులచరిత్రయు, వారి సంస్కృతి యౌన్నత్యమును మనకు జాలవఱకు విదితము కాగలదు. అమరావతి జగ్గయ్యపేట ఘంటసాల నాగార్జున కొండల యందలి బౌద్ధస్తూపములను ద్రవ్వి బయలుపఱచువఱకును బౌద్ధయుగమందలి యాంధ్రప్రజాజీవనమునుగూర్చి కాని శిల్పౌన్నత్యమును గూర్చి కాని విశేష మెవ్వరికిని దెలియదు. ఈ యవశిష్టములు వెలువడినపిమ్మట మన చరిత్రజ్ఞానము విపులమైనది. ఇట్లే ఆంధ్రదేశమున గానవచ్చు ప్రాచీనస్థలముల నన్నిటిని ద్రవ్వి పరిశీలించిచూచిన మన పూర్వచరిత్ర యింతకంటె జక్కగ విశదము కాగలదు. వీనితో గూడ పేర్కొనదగినవి శాసనములు. ఇవి రాగిరేకుల మీదను, శిలాతలముననుజెక్కబడినవి. ఇందు రాజులను గూర్చియు, వారి ఘన కార్యములను గూర్చియు, వారు దేవబ్రాహ్మణాదుల కొసగిన దానములగూర్చియు జెప్పబడియుండును. ఆంధ్రదేశమున నొండు రెండు శిలాశాసనములైన గానరాని గ్రామములు లేవు. తామ్రశాసనము లెన్నియో గుప్తములైయున్నవి. గవరన్మెంటు శాసనపరిశోధకశాఖ వారు పెక్కు తామ్రశిలాశాసనములకు బ్రతిబింబములను తీయించి ప్రకటించియున్నారు; కాని మన దేశమున గానవచ్చు శాసనములం దొక్కదానినైన విడిచిపెట్టక ప్రతిబింబములను దీయించి ప్రకటించినగాని మన చరిత్ర సంపూర్ణముగ దెలిసికొనుట కవకాశముండదు. ప్రాచీనచరిత్రావశిష్టములను ద్రవ్వి పరిశీలించుట సులభ

కార్యముగాదు. విశేష ధనవ్యయము లేక ఆ పని సాగదు. చరిత్రపరిశోధనయం దాసక్తిగలవారి కందఱికి భూగర్భపరిశోధనకు దొరకొను శక్తిలేదు. గవరన్మెంటు, మ్యూజియములు, విశ్వవిద్యాలయములు మున్నగు సంస్థలకే యది సాధ్యముకాగలదు. శాసనాన్వేషణము గూడ ధనము లేక జరుగదు. దేహప్రయాసకోర్చి పరిశోధకులు శాసనసంగ్రహముకొఱకు దేశముపై ద్రిమ్మరుటకు సిద్ధపడవచ్చును; పయనపు ఖర్చులను భరించుటకు వారికి శక్తి యెక్కడిది? జీవితకాలమంతయు పరిశోధనయందు గడిపి యార్జించిన జ్ఞానమును పుస్తకరూపమున రచించుటకు వలసిన వ్యవధిలేదట! రచించిన గ్రంథములను ముద్రించి ప్రకటించుటకు ధనము లేదట! ఇక వారు గ్రామగ్రామమునకు బోయి శాసనప్రతిబింబముల నెట్లు తీసికొనగలరు?

తరువాత చెప్పదగినది వాఙ్మయము. ముఖ్యముగ మన యాంధ్రవాఙ్మయము. ఆంధ్రభాషకును చరిత్రకును అవినాభావ సంబంధము గలదు. ఆంధ్రవాఙ్మయమును జక్కగ నెఱుగనివాడు మంచి చరిత్రపరిశోధకుడు గాజాలడు. చరిత్రజ్ఞానము లేనివానికి మన కావ్యములును, సందును ముఖ్యముగ మన ప్రబంధములును సంపూర్ణముగ నర్థము కాజాలవు. ఆంధ్రగ్రంథములందు సర్వసామాన్యముగ గానవచ్చు పీఠికలనుగూర్చియు, నాశ్వాసాద్యంతములను గూర్చియు నేను చెప్పుట లేదు. కేవలము భాషా పండితులు తమ కాణయాచి యనుకొను గ్రంథభాగమును గూర్చియే నేను చెప్ప నుద్దేశించినది. మన కవులు వారి కాలమున వాడుకయం దుండిన రాజకీయ సాంఘిక మతాచారవ్యవహారములను దమ కావ్యములందు వర్ణించినారు. వారు చెప్పు కథ రామాయణమైనను అందు వర్ణింపబడిన స్త్రీ పురుషులందరును కవుల కాలమున వాడుక యందుండిన యుడుపులను, భూషణములను ధరించిరి; వారికాలపు ఆచారవ్యవహారముల నవలంబించిరి; అప్పటి ప్రజలవలెనే వర్తించిరి. కావున మన వాఙ్మ

యము చరిత్రరచయితలకు మిక్కిలియు నుపయుక్తమగుచున్నది. ప్రాచీనవాస్తుశైథిల్యశాసనాదిపరిశోధనల వలన మన పూర్వచరిత్రకు అస్థిపంజరము నిర్మింపవచ్చును; వాఙ్మయసంశోధనవల్ల దీనిని రక్త మాంసములతో పూరించి జీవకళలను గలిగింపవచ్చును.

ఈ సందర్భమున పేర్కొనవలసిన చారిత్రక వాఙ్మయము కొంత కలదు. సర్వేయరు జనరలు కర్ణలు కాలిన్ మెకంజీగారు క్రీ. శ. ౧౯ వ శతాబ్ద ప్రారంభదశయందు తమ గుమాస్తాలను దక్షిణదేశమందలి ప్రతిగ్రామమున కంపి యందు గానవచ్చు శాసనముల కన్నిటికిని నకళ్లను వ్రాయించుటయే కాక యచట లభించు తాళపత్రములను గ్రామకవిలెలను, కైఫీయతులను సేకరించెను. ఇవి మెకంజిలిఖితగ్రంథసంచయ మను పేర మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున గలవు. ఆంధ్ర దేశ చరిత్ర రచన కివి యమూల్యములు. వీనిని ముద్రించి ప్రకటించిన చరిత్రపరిశోధకులకు మిక్కిలియు నుపయుక్తముగ నుండును.

ఇట్టి కార్యములు సామాన్యులకు సాధ్యములు గావు. ఆంధ్ర విశ్వవిద్యాలయమువంటి గొప్ప సంస్థలు జేయవలసియున్నది. ఇంత వఱకు నీ విశ్వవిద్యాలయాధిపతులు ఆంధ్రదేశచరిత్రపరిశోధనకు దగిన సౌకర్యము లేవియు గల్గించియుండలేదు; అట్లనుటవలన నీ విశ్వవిద్యాలయమునం దాంధ్రచరిత్రపరిశోధనయే జరుగలేదని నా యభిప్రాయము గాదు. కీర్తికాయులైన శ్రీ కె. అర్. సుబ్రహ్మణ్యాయ్యరుగారు విశ్వవిద్యాలయమువారి పక్షమున ప్రాచీన ఆంధ్రదేశ చరిత్రను కొంతవఱకు శోధించి *Buddhistic Remains in Andhradesa* అను గ్రంథమును రచించిరి. ఇటీవల సుప్రసిద్ధపరిశోధకులు శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు *History of the Reddi Kingdoms* అను గ్రంథమును రచించిరి. ఈ రెండు గ్రంథములును, అందును ముఖ్య

ముగ శ్రీ సోమశేఖరశర్మగారి రెడ్డిరాజ్యములచరిత్ర అమూల్యమైనవి. కాని యన్యవిశ్వవిద్యాలయములలో నడచుచుండు చరిత్రపరిశోధనతో బోల్చి చూచిన నిచటి పరిశోధన ఎంత యల్పమో బోధకాగలదు. కాని కాలము మారుచున్నది; ఆంధ్రాభ్యుదయమున నూతనయుగము ప్రారంభమైనది. ఆంధ్రరాష్ట్రము వచ్చినట్లే. ఆంధ్రవిశ్వవిద్యాలయమున శ్రీకృష్ణగారి వైస్ చాన్ సలరుషిపు యెన్నికతో పూర్వయుగము ముగిసినది. ఇక విజ్ఞానభాస్కరోదయమగునను నమ్మకము గల్గుచున్నది. తథాస్తు.

---

## ౩

# పల్లవచరిత్రమునందు కొన్నిసంశయములు

## ౧

వేంగీదేశము పల్లవసామ్రాజ్యములోనిదనియు, పల్లవులు ప్రథమమున వేంగినుండియే దక్షిణదేశమును సాధించిరనియు కొందఱు పరిశోధకు లభిప్రాయ పడుచున్నారు. వీరభద్రరావుగారు, "శివస్కంద వర్మగాక మఱికొందఱు పల్లవరాజుల పేరులు శాసనములందు గానవచ్చుచున్నవి"1 అని చెప్పుచు వేంగిదేశమునందు రాజ్యము చేసిన జయవర్మ, విజయదేవవర్మలను బేర్కొని యున్నారు. మఱియు, "సాలంకాయన గోత్రు లయిన పల్లవ రాజులలో నొకరు నూతనముగా ననుకూలమగు నగరము నొకదాని నిర్మించి వేంగి యనగా పులియని యర్థ ముండుటచేతను, శత్రువులకు బెబ్బులివలె సమీపింప సాధ్యముకానిదని సూచించుచుండుటచేతను, వేంగీపురమని పేరు పెట్టి యుండును...ఈ వేగిదేశము పల్లవులకాలముననను, చాళుక్యుల కాలముననను దక్షిణమున కాంచీపురము వఱకును, నుత్తరమున మహానదివఱకును వ్యాపించినది."2

ఇందువల్ల మూడువిషయములు తెలియుచున్నవి: (౧) పల్లవులు వేంగిదేశముపై రాజ్యముజేసిరి. (౨) సాలంకాయనులు పల్లవులు. వంశము పల్లవవంశము. గోత్రము సాలంకాయన గోత్రము. (3) పల్లవులకాలమున వేంగిదేశము కంచినుండి మహానదివఱకును వ్యాపించి యుండెను. ఈ మూడు అభిప్రాయములును చరిత్రకారు

---

1. ఆం. క. సం. పూర్వ యు. పుట 218.

2. Ibid, p. 222.

లంగీకరింపదగినవి కావు. ఏలన అవి ఆధారరహితములు. వీనియం దొక్కొక్క దానిని ఈ క్రింద సూక్ష్మముగ జర్చించి వానియందలి నిజమును వెల్లడించుచున్నాను.

(౧) పల్లవులు వేంగిదేశము నేలిరా? యను ప్రశ్నకు లేద నియే సమాధానము చెప్పవలయును. ఈ విషయము పల్లవశాసనము లను పరిశోధించుటచే తేలగలదు. వేంగిదేశము క్రీ. శ. ౬౧౭ సంవ త్సరమున రెండవ పులకేశిచే జయింపబడి తదనంతరము చాళుక్యుల యధీనమున నుండియుండుటచేత క్రీ. శ. ౬౧౭ నకు పిమ్మట పల్లవ శాసనములను మనము శోధింపబనిలేదు. తత్పూర్వపు పల్లవ శాసన ములు అవి వ్రాయబడియుండు భాషచే రెండు తరగతులకు జేరి యున్నవి: ప్రాకృత సంస్కృత శాసనములు. వీని నెంతసూక్ష్మ దృష్టితో వెదకి చూచినను పల్లవ రాజ్యముయొక్క ఉత్తరపు సరి హద్దు కృష్ణను చాటిన ట్లగపడదు. అయితే పల్లవరాజ్యము వేంగి దేశముపై వ్యాపించి యుండవచ్చు నని శంకించుటకు కొంత యాధా రము కలదు. క్రీ. శ. ౫వ శతాబ్దాంతమున నెల్లూరు గుంటూరు మండలములపై రాజ్యము సేయుచున్న (యు. మ. విష్ణుగోపుని కుమారుఁడు) సింహవర్మ వెంగోరాష్ట్రముపై ప్రభుత్వము సేయు చుండిన ట్లగపడుచున్నది. ఇతని మంగదూరుశాసనమున తాను ఆ గ్రామమును బ్రాహ్మణులకు దానము చేసినట్లు చెప్పుకొని యున్నాడు.

"[పల్లవానాన్ధర్మ్మ మహారాజ (జః) శ్రీ సింహవర్మా వేఙ్గో రాష్ట్రే మాఙ్గడూ (దూ) గ్రామే గ్రామేయకాన్స వ్వాధ్యక్ష వలభ శాసనసఞ్చారిణశ్చాజ్ఞాపయతి." 1]

---

1. ఇం. ఆం. v, పు. 155:

పై జెప్పబడిన వేఙ్గోరాష్ట్రము వేంగిరాష్ట్రమా లేక వేరొక దేశమా? పల్లవ వేంగిరాష్ట్రములకు గృష్ణయే హద్దగుటచేత, వేంగి రాజ్యమును పల్లవు లీకాలమున జయించియుందురేమో యను సందేహము కలుగుచున్నది. ఈ కాలమున పల్లవులు మిక్కిలి యున్నత పదవియం దుండిరి. కంచిరాజగు రెండవ సింహవర్మ - మంగడూరు శాసనపు దాతయగు సింహవర్మయొక్క పెద్దతండ్రి - కృష్ణాకావేరుల కును, తూర్పు పశ్చిమ సముద్రములకును మధ్యదేశముల నేలెను. అతనికి గంగరాజులు భృత్యులు. కదంబుల నాత డనేక సమరముల యందు జిదుగగొట్టి పాదాక్రాంతులను జేసికొనెను. ఈ రాజునకు గుడిచేయివంటి వా డాతని తమ్ముడు యువమహారాజు విష్ణుగోపవర్మ. ఈ విష్ణుగోపుని కుమారుడే మంగదూరు శాసనపుదాతయగు సింహవర్మ. కావున, పల్లవు లీకాలమున గృష్ణను దాటి వేంగిని స్వాధీనము చేసికొనియుండినను ఉండవచ్చును.

ఇందు కొక యాక్షేపణకలదు. వేఙ్గోరాష్ట్రము వేంగిరాష్ట్రము కాదు, అన్యము, అని నా మిత్రులు సోమశేఖరశర్మగారు చెప్పుచున్నారు. అట్లనుటకు కారణములు రెండు - మొదటిది: మంగదూరు శాసనమునందు దప్ప పల్లవులకు వేంగిదేశముతో నేలాటి సంబంధమున్న ట్లేశాసనమునను గాన్పింపదు. కావున పల్లవులు వేంగి నేలిరని దృఢముగా చెప్పుటకు ఈ యాధారము చాలదు. ఇది యంగీకరింపదగినదే. రెండవది: ప్రాచీన శాసనములనుబట్టి చూడగా కృష్ణకావలియొడ్డున నున్న దేశవిభాగములకు "విషయము" లని పేర్లుండెనే కాని "రాష్ట్రము"లని పేర్లున్న ట్లగపడవు. పల్లవ రాజ్య విభాగములకు రాష్ట్రము లను పేర్లుండెననుట యంద తెలిసిన దే.—సాతాహనిరాట్టము, కమ్మరాష్ట్రము, ముండకరాష్ట్రము ఇత్యాదులు. కావున వెఙ్గోరాష్ట్రి మనునది కృష్ణకు దక్షిణమున నెచ్చటనో యుండిన పల్లవరాజ్యభాగమున నొకదానికి పేరేగాని,

కృష్ణా గోదావరుల మధ్యనున్న సుప్రసిద్ధమగు వేంగిదేశమున కన్వ యింపదు.

ప్రథమమున శర్మగారివాదము చాల సమంజసముగ నుండిన ట్లగపడుటచే దాని నంగీకరించితిని. అయినను శాసనములను మరల చదువగా నా పూర్వపు సందేహము తిరుగ పొడకట్టినది. వేంగి వేఙ్గో శబ్దములకు విశేషమగు పోలిక గలదు. రెండవ సింహావర్మ కాలమున పల్లవులు వేంగిరాజ్యమును జయించియుందురను నూహాయు కేవల మచింత్యముగాదు. ఇక 'రాష్ట్ర' శబ్దము కృష్ణకావలియొడ్డుననున్న దేశభాగములకు జెల్లదనుమాట నించుక విచారింతము. సాలంకాయన విష్ణుకుండి, చళుక్యవంశజులగు రాజుల శాసనములు దేశ విభాగము లను జెప్పు నప్పుడు "రాష్ట్ర" శబ్దమును దలపెట్టక "విషయ" శబ్దమునే ప్రయోగించియున్నను పల్లవులు తాము జయించిన దేశ మును రాష్ట్రమని బేర్కొనుటయందు వింత యేమియును గాన్పిం పదు. తమ రాజ్యములోని యితర భాగముల కన్నిటికిని రాష్ట్రము లని పేర్లుండ, క్రొత్తగా జయించిన వేంగి దేశమునకు వేఙ్గోరాష్ట్ర మని పేరిడుట సహజమే. ఒకరాజు పరరాష్ట్రమును జయించినప్పుడు, సాధ్యమైనంతవఱకును, స్వరాష్ట్రములందలి యాచార వ్యవహారము లను జయించిన రాజ్యములో వాడుకలోనికి దెచ్చుట యసంభవ మగు విషయము గాదు. ఇందుకొక యుదాహరణమును జూపెదను. చోళరాజ్యవిభాగములకు 'నాడు' లని పేరు. అయినప్పటికిని, బాదామి చళుక్యరాజగు మొదటి విక్రమాదిత్యుడు చోళరాజ్య మును జయించి యచ్చట కొన్ని దానముల నిచ్చియున్నాడు. గద్వాలు తామ్రపట్టిక*యందు "చోళికావిషయంప్రవిశ్య" యని చెప్పియున్నాడు. అరవదేశమున రాజ్యభాగములను రాష్ట్ర

* ఎపి. ఇండి. x పు. 100.

విషయశబ్దములు అరవరాజులచే ప్రయోగింపబడి యుండలేదు. అంతమాత్రముననే విక్రమాదిత్యుడు జయించినది కావేరీతీరమందలి చోళదేశముగాదు, మఱియొక చోళదేశమని చెప్పుటకు వీలగునా? విక్రమాదిత్యుడు చోళరాజ్యమును జయించినప్పుడు దానిని దేశాచారప్రకారము "నా" డని చెప్పక స్వదేశచారప్రకారము "విషయ"మని చెప్పెను. ఇట్లే పల్లవరాజులు చేసియుండినను ఉండ వచ్చును. కావున సింహావర్మ కాలమున వేంగి పల్లవులకు లోబడి యుండెననుట కవకాశము లేకపోలేదు. అయినను వేంగి తరువాత అల్పకాలముననే తిరిగి పారతంత్ర్యవిముక్తిని బడసిన ట్లున్నది. పల్లవ సామ్రాజ్యపు టుత్తరపుటెల్ల యెప్పుడో యొకప్పు డల్పకాలము వఱకు, గృష్ణ నొకవేళ దాటియుండినను, చిరకాల మట్లుండెనని చెప్పుటకుగాని, వేంగి పల్లవసామ్రాజ్యములోని యంతర్భాగమని చెప్పుటకుగాని బొత్తుగ నాధారములు లేవు.

(౨) పల్లవ వంశపు రాజులలో సాలంకాయన గోత్రజులు కొందఱు కలరా? పల్లవుల శాసనములం దన్నిటియందును "భారద్వాయసగోత్రో పలవానాం,"[1] "భారద్వాజసగోత్రస్య...పల్లవానాం ధర్మయువ మహారాజస్య"[2] అని చెప్పబడియున్నది. శాలంకాయనుల శాసనముల బరిశోధించిన "శాలంకాయనో మహారాజ"[3] యని కానవచ్చుచున్నది. భారద్వాజుడుకాని పల్లవుడుగాని, శాలంకాయనుడైన పల్లవుఁడుగాని శాసనములయం దెచ్చటను గానరాడు. "శాలంకాయన" శబ్దము గోత్రసూచకమో లేక అన్వయసూచకమో నిర్ణయించి చెప్పుటకు ఆధారములు లేవు. ఇట్టి స్థితి యందు సాలంకాయన శబ్దము గోత్రసూచకమనియు, సాలంకాయ

1. ఎపి. ఇం. vi, 84.
2. ఇం. అం. v, 50-52.
3. భారతి, సం. ౧, సంచి. ౮, పు. 20.

నులు పల్లవాన్వయులనియు వచించు వాక్యములు సత్యమునకు దూరములు. ఇక్ష్వాకు బృహత్ఫలాయన వంశముల వలె శాలంకాయన వంశము కూడ స్వతంత్రవంశముగ బరిగణింపబడవలసినదే కాని పల్లవవంశమునకు దాని నదికింప బ్రయత్నించుట సత్యమును గప్పిపుచ్చ నుద్యమించుటయే.

(3) పల్లవుల కాలమున వేంగి, మహానది మొదలు కంచి పర్యంతము వ్యాపించియుండెనా? వేంగి స్వతంత్ర రాజ్యమనియు. పల్లవుల యేలుబడికి—ఎప్పుడో యొకప్పుడు స్వల్పకాలపర్యంతము దప్ప—లోబడియుండ లేదనియు ఇంతకుపూర్వమే చెప్పబడియున్నది. చాళుక్యులు స్వాధీనము చేసికొనుటకు పూర్వము వేంగిదక్షిణపుహద్దు కృష్ణను దాట లేదు. చాళుక్యులు వేంగిని జయించిన పిమ్మట దాని యెల్లలను విస్తరింపజేసినది వాస్తవమే కాని, యప్పుడు గూడ, వేంగి దక్షిణపుటెల్ల మన్నేటిని దాటిన ట్లగపడదు. ఇక కంచిమాటను వేరుగ జెప్పవలయునా?

ఈచర్చవల్ల (౧) పల్లవులు వేంగియందు రాజ్యము సేయలేదనియు, (౨) సాలంకాయనులు పల్లవ వంశజులు కారనియు, (3) వేంగిరాజ్యపు దక్షిణపుటెల్ల కంచివఱకెన్నడును వ్యాపింపలేదనియు తెలియుచున్నది. అయితే వీరభద్రరావుగారు సుప్రసిద్ధ పరిశోధకులు. వారిట్లు పొరవడుటకు గారణమేమి? ఇందు కొక్క కారణ మగపడుచున్నది. పల్లవసాలంకాయనబృహత్ఫలాయన వంశీయులశాసనములన్నియు నొక్క లిపియందు వ్రాయబడియున్నవి. పరిశోధకపండితులు దీనికి వేంగిలిపి యని పేరిడిరి, ఇంతేకాక, యీ లిపియందు వ్రాయబడియుండు శాసనములం దనేకములు పల్లవుల వగుటచే, తక్కినవి గూడ పల్లవవంశజుల శాసనములుగనే నమ్మి బృహత్ఫలాయనులను, సాలంకాయలను, కందారపురవరాధీశ్వరులను పల్లవ

వంశజులని ఫ్లీటుగారు వ్రాసిరి. వారు పరిశోధకులలో ప్రథములగుటచే వారియం దిట్టి ప్రమాదజనితములగు లోపములు గన్పించుట సహజము. తరువాతివా రీవిషయమును జర్చింపక వానిని వేదవాక్యముగ నంగీకరించుటయే వింత. ఇట్లు పూర్వపరిశోధకపండితుల వాక్యములను సంపూర్ణముగ విశ్వసించుటచేతనే వీరభద్రరావుగా రిట్టి ప్రమాదమునకు లోనై యుందురని నా నమ్మకము.

౨

ఈ సందర్భమున జర్చింప దగిన విషయము వేరొకటి కలదు. ఇటీవల బుట్టా శేషగిరిరావుగా రొక నవీన విషయమును గనుగొనిరి. అది నిజ మగునేని దక్షిణదేశ చరిత్రనుగూర్చి మనకున్న యభిప్రాయములను మార్చుకొననలసి వచ్చును. "సముద్రగుప్త శాసనము - కళింగదేశచరిత్ర" అను శీర్షిక క్రింద వ్యాసము వ్రాయుచు, అందలి "కౌరాలకమంతరాజ", "కాంచేయక విష్ణుగోప" అను పదములకు నూతనార్థములను జెప్పుచు సముద్రగుప్తుడు కళింగమును దాటి దక్షిణమునకు వెళ్లలేదని సిద్ధాంతీకరించి యున్నారు. ఇంతే కాక, "ఇట్లే కాంచేయక మనునదియు కళింగమందలి గ్రామములచే సమన్వయ మగుచున్నది...అను గ్రామములు అన్నియు పల్లపునాటిలో కనబడుచుండుటచేత నీ కాంచీపుర రాజ్యము పల్లపురాజ్యమే యనదగియున్నది. ఇట్లు కళింగమందు కౌరాలక కాంచేయక రాజ్యము లంతర్భాగములుగా క్రీ. శ. 4 వ శతాబ్దమధ్యమున సముద్రగుప్తుని దాడికి లోనై యుండును."[1]

శేషగిరిరావుగారి వాదములో నెంత సత్యము కలదో కనుగొన వలయును. అలహాబాదు శాసనమున బేర్కొనబడిన "కౌరాళ" మెచ్చటనుండెను? రెండవ పులకేశి అయ్యావొళె శాసనమును బరిశీలించు సందర్భమున అందలి,

1. భారతి సం. ౫. భా. ౧, పు. 780.

"కౌనాళమంబరమివోదిత సాంధ్యరాగం"[1]

అనువాక్యములోని "కౌనాళ" శబ్దమును, అలహాబాదు శాసనములోని 'కౌరాళ' శబ్దము నొక్కటియేయనియు, అదియే యిప్పటి కొల్లేరనియు కీలుహార్నగారు వచించిరి. వీరి వాక్యములను నిరసించుచు దూ్బ్రేగారు తమ ప్రాచీన దక్కను చరిత్రమునం దిట్లు వ్రాసియున్నారు.[2]

"అయ్యావొళెశాసనమును బరిశోధించుచు కునాళమను సరస్సును, అలహాబాదు శాసనమందు జెప్పబడిన కౌరాళరాజ్యమును నొక్కటియే యని కీలుహార్నగారు నుడివిరి. వీరు చెప్పిన యర్థమును వితర్కింపక యందఱును గ్రహించిరి. 'కొల్లేరు సరస్సు గట్టున రాజ్యము సేయుచుండిన' రాజును సముద్రగుప్త జోడించె నని యందఱు నొప్పుకొనుచున్నారు. అయినప్పటికిని కౌరాళమునకు కునాళముతో నైక్యము గల్పించుట కాధారమేమియును నాకు గన్పింపదు. ఈ పేర్ల కొండొంటితో పోలికలేదు. 'కౌరాళ' అను దానిని 'కొరాళ' యని చదువవలయుననియు, కొరాళరాజ్యమని తర్జుమా సేయవలయుననియు అలహాబాదు శాసనములో కొల్లేరు సరస్సు ప్రశంసయే లేదనియు నాతలంపు."

దూ్బ్రేగారి వాదమును తత్క్షణమ గ్రహించి కొందఱు పరిశోధకులు సముద్రగుప్తుని దండయాత్ర కంచి వఱకు వ్యాపించలేదని వాదించుచున్నారు. శేషగిరిరావుగారన్నటో సముద్రగుప్తుడు కళింగమును దాటలే దనుచున్నారుగదా. అలహాబాదు శాసనములలోని 'కౌరాళ'మునకును, అయ్యావొళెశాసనములోని 'కౌనాళ'మునకును సంబంధములేదని గదా వీరి వాదము. చూతము. అయ్యావొళెశాసన

1. ఎపి. ఇండి. vi, 6.

2. ప్రా. ద. చ. 59.

మున 'కౌనాళ' మను మాట లేదందురేమో. దాని ౨౨ వ శ్లోక
మున నిట్లున్నది :

సన్నద్ధ వారణఘటా స్థగితాన్తరాళం
నానాయుధక్షతనరక్షతజాఙ్గరాగం ;
ఆసీ జ్జలం యదవమర్ద్దిత మభ్రగర్భం
కౌనాళ మంబరమివోదితసాంధ్య రాగం.[1]

ఈ పై శ్లోకమున పులకేశిసైన్యములు, కౌనాళజలాశయము
నందలి ద్వీపము నాక్రమించుకొనినట్లు వర్ణింపబడియున్నది. ఇందు
వలన రెండు విషయములు తెలియుచున్నవి : (౧) అయ్యవొళెశాసన
మున కౌనాళ ప్రశంసయున్నది. (౨) కౌనాళము సరస్సు; దాని
యంతర్భాగమున ద్వీపము లున్నవి.

కాబట్టి, కీల్హారన్‌గారు కౌనాళమును జూచుట తోడనే
కౌరాళమును దలచుట సహజము. రకారముగా నకారము మారుట
యొక గొప్ప మార్పుగాదు. అందుచేత అలహాబాదు శాసనములోని
"కౌరాళ" యు, అయ్యవొళెశాసనములోని "కౌనాళ"యును
ఒక్కస్థలమునే సూచించుననుట కవకాశమును లేకపోలేదు. ఇక
కౌరాళ, కౌనాళములు కొల్లేరుతో సమన్వయించుట కవకాశము
గలదేమో చూతము. పులకేశి జయించిన స్థలములను ఉత్తరము
నుండి దక్షిణమునకు క్రమముగా వరుస తప్పక వర్ణించుచు, రవికీర్తి
పిష్ఠపురమునుజెప్పి తరువాత కౌనాళమును, అటుపిమ్మట కాంచీ
పురీశ్వరుడగు పల్లవరాజురాష్ట్రమును జెప్పియున్నాడు. కంచిపల్లవుల
రాజ్యపు టుత్తరపుసరిహద్దు కృష్ణానది. కావున కౌనాళము పిష్ఠ
పురమునకు దక్షిణమునను, కృష్ణకు ఉత్తరమునను ఉండియుండవల
యును. ఈ రెండు ప్రదేశములకును మధ్యనుండు జలాశయ మొక్క

1. ఎపి. ఇం. vi, 6.

టియే. అదియే ఇప్పటి కొల్లేరు సరస్సు. ఈ సరస్సుమధ్య ద్వీపములు కలవు; అందిప్పటికిని శిథిలమైన దుర్గములు కలవు. ఇవి చోళులకాలము వఱకును ప్రాముఖ్యము వహించినట్లు శాసనములు తెల్పుచున్నవి. కావున కౌరాళ, కౌనాళములను కొల్లేరుతో సమన్వయించుట సమంజసమే.

"కాంచేయక విష్ణుగోప" యను వాక్యమునకు అందఱు చెప్పుకొన్నట్లే దక్షిణదేశమందలి సుప్రసిద్ధపట్టణమగు కంచికి రాజగు విష్ణుగోపుడనియే దూబ్రే యర్థము జెప్పుకొనిరి. వారు కుగ్రామ నామములను డిస్ట్రిక్టుమ్యాన్యూల్సు సహాయమున దడవసాహసింపరైరి. అయితే సముద్రగుప్తుడు కృష్ణనుదాటి దక్షిణమునకు పోలేదను తమ వాదము నిల్పుకొనుటకై యొక యుక్తిని బన్నిరి. అది యేదనగా,

"కృష్ణాగోదావరుల మధ్య ప్రదేశములయందు రాజ్యము సేయుచుండిన రాజులందఱు—వారి యందు మిక్కిలిశూరుడు కంచి పల్లవరాజగు విష్ణుగోపుడు—కూడి సముద్రగుప్తుని నెదుర్కొనిరి... వీరిచే పరాజితుడై సముద్రగుప్తుడు ఒరిస్సాలో జయించిన స్థలములను విడిచి, స్వదేశమునకు బోయెను. సముద్రగుప్తుడు మొదట రాజులను బందులుగ జేసిన పిమ్మట విముక్తులను జేసినట్లు చెప్పబడియున్నది. గుప్తుల స్వాధీనమున దక్కను రాజ్యములయం దేదియు లేకపోవుటయే దీనికి దార్కాణము. సముద్రగుప్తుడు మొదట కొందఱు రాజులను జయించి, పిమ్మట బలవత్తరమగు శత్రుసైన్యమెదుర్కొనుటచే, జయించిన స్థలములను త్యజించి, సత్వరము నిజరాష్ట్రమును జేరవలసి యుండెను."[1]

---

1. ద. పూ. చ. 58.

ఇట్లు దూబ్రేగారు సముద్రగుప్తుడు కృష్ణను దాటలేదనగా వారికంటె ప్రతిభాశాలు లగు పండితసత్తములు అతనిని కళింగము నుండియే వెనుకకు మరల్చిరి. శేషగిరిరావుగారు పల్లవరాజ్యమునకు బదులు పల్లపురాజ్యమును సృజించి దానిని కళింగాంతర్గతమును జేసిరిగదా. ఇందలి సత్యాసత్యములను గనుగొనుట యవసరము.

"కాంచేయక విష్ణుగోప" యను వాక్యమున కర్థము జెప్పుకొనునప్పుడు మనమొక విషయమును జ్ఞప్తియందుంచుకొనవలసి యున్నది అలహాబాదు శాసనమున వర్ణింపబడిన స్థలములు కుగ్రామములుగావు కుగ్రామములను సముద్రగుప్తుడు జయించెనని హరిసేనుడు చెప్పెనని తలంచుట న్యాయము కాదు. సముద్రగుప్తుడు లోకోత్తరుడైన వీరుండని లోకమునందు బ్రకటించుటయే యాతని ముఖ్యోద్దేశము. గొప్ప రాజ్యములును, దుస్సాధ్యములగు దుర్గములను సాధించెనని వర్ణించినగాని యట్టి వీరుని శౌర్యము లోకమున గణనకెక్కదు. కావున అలహాబాదు శాసనములోని కాంచీరాజ్యము ఆ కాలమున సుప్రసిద్ధముగ నుండవలయును. సముద్రగుప్తుని కాలమున ద్రావిడదేశమందలి కాంచీపురమును రాజధానిగ జేసికొని పల్లవవంశజు లగు నృపాలురు కృష్ణాకావేరులకును, పూర్వ పశ్చిమ సముద్రములకును మధ్యనున్న దేశము నేలుచుండిరి. ఈ విషయ మనేకములగు శాసనముల వల్ల దెలియుచున్నది. ఇట్టి సుప్రసిద్ధమగు కంచిరాజ్యము వదలి కళింగములోని కుగ్రామమును సముద్రగుప్తుడు గెలిచెనని హరిసేనుడు చెప్పియుండునా యనుట విచారింప దగిన సంగతి. కళింగమున సముద్రగుప్తుని కాలమునగాని, తత్పూర్వముగాని, తదనంతరముగాని కంచిరాజ్య ముండెనని శాసన ప్రమాణమూలమున నిరూపించుట కెవ్వరికైన సాధ్యమగునా? శేషగిరిరావుగారు చూపిన ప్రమాణమునకు వారు దాని నెత్తిపై మోపిన భారము మోయగల శక్తిలేదు.

ఇంకొక విషయము: 'విష్ణుగోప' అను పేరు ద్రావిడదేశము లోని కంచిని రాజధానిగా జేసికొని ప్రభుత్వము సల్పిన పల్లవరాజుల వంశావళి యందే పలుమారు కాన్పించుచున్నది. మఱి యెచ్చటను గానవచ్చుట లేదు. శేషగిరిరావుగారు కళింగనృపాల వంశావళులయందట్టి పేరును గుర్తుపట్టగలిగినగాని అలహాబాదుశాసనము లోని విష్ణుగోపుడు కళింగమున రాజ్యముచేసె నను వాదము నిలువదు. కాబట్టి "కాంచేయక విష్ణుగోప" యనుదానికి 'కంచి నేలు పల్లవరాజగు విష్ణుగోపు' డని కీల్హారన్ గా రర్థమును జెప్పుట తెలివిమాలినందు చేతగాదు. తరువాతి పరిశోధకులు స్వప్రతిభాతి శయము ననుసరించి క్రొత్తమార్గములను ద్రొక్కియున్నారు. ఇందే దియు సత్యాన్వేషణమున కనుకూలించినదిగ దోచదు.

ఇక -దూబ్రేగారు సముద్రగుప్తుడు కృష్ణను దాటలేదనుటను గూర్చి ఇంచుక చర్చింపవలసియున్నది. తమ వాదమును నిలుపు కొనుటకై వారు రెండు ప్రమాణముల నాశ్రయించి యున్నారు: ౧. సముద్రగుప్తుడు మొదట రాజులను బందులనుగ జేసి పిమ్మట వదలిపుచ్చుట, ౨. దక్కనులో నెచ్చటను గుప్తులకు లోబడిన దేశము లేకపోవుటచేతను దక్షిణరాజు లేకీభవించి సముద్రగుప్తుని దారసిల్లి యోడింపగా నతడు గెల్చిన రాజ్యములను విడిచి నిజ రాజ్యమునకు బరుగిడెనని చెప్పుచున్నారు. పై రెండు విషయములును నిజము లేకాని వీనినాధారపఱచుకొని దూబ్రేగారు చేసిన సిద్ధాంతము తప్పు. హిందూరాజులు దిగ్విజయయాత్రలు బయలువెడలినప్పుడు పరరాజుల నోడించి కప్పములను గొనువారేకాని, పరరాజుల రాష్ట్రములను స్వరాష్ట్రములతో గలుపుకొనెడివారుకారు. అది యాచారవిరుద్ధము; శాస్త్రవిరుద్ధము గూడ. హిందూ దండనీతి శాస్త్రమునకు జనకుడగు కౌటిల్యు డిట్లు చెప్పుచున్నాడు:

"హతశత్రుని భూమి ద్రవ్య పుత్ర దారలను కోనరాదు. వాని వంశస్థులను వారివారి యుద్యోగములందు నిలుపవలెను. ఇట్లు గావించినచో దండోపనతులు వీని పుత్రపౌత్రుల ననువర్తింతురు.

"ఉపనతుల జంపియు, బంధించియు వారి భూమిద్రవ్యపుత్ర దారలను కోరునట్టివాని నాశము కొఱకు తక్కిన రాజమండల మంతయు బ్రయత్నించును...స్వభూమ్యాయుక్తులగువాని మంత్రులు సహితము వానిపై విరోధించి శత్రుమండలము నాశ్రయించి వాని రాజ్యమును బ్రాణమును హరింపఁగోరుదురు.

"కావున దండోపనతులగు రాజులు సామముచే వారివారి భూములందు నిలుపబడినవారైనచో రాజును, వాని పుత్రపౌత్రులను ననుసరించి వర్తింతెదరు."*

సముద్రగుప్తుడు నీతిశాస్త్రవిధి ననుసరించి, బందులజేసిన రాజులను విముక్తులను గావించి వారివారి రాజ్యములను వారి కొసెగెనే కాని ఎదిరించిన శత్రుసమ్మేళనపు ధాటి కోర్వక జయించిన రాజ్యములను విడిచి నిజరాష్ట్రమునకు పరుగిడలేదు. సముద్రగుప్తుని నెదుర్కొనుటకై కృష్ణాగోదావరీ మధ్యదేశప్రభువు లందఱు కంచిరాజగు విష్ణుగోపుని యాధిపత్యము క్రింద సమ్మేకట్టిరని దూబ్రేగారు వ్రాసియున్నారుగదా. ఈ వ్రాతకాధారమేమి? దూబ్రేగారివాక్యమే. ఈ వాక్యమున కెక్కువ విలువగలదో, అలహాబాదు శాసనమున కెక్కువ విలువగలదో పాఠకులే గ్రహింపగలరు. ఈ శాసనమున పలక్కడనేలు ఉగ్రసేనుని సముద్రగుప్తుడు జయించినట్లు చెప్పబడి యున్నది. పలక్కడ కృష్ణకు దక్షిణమున నుండినదని శాసనపరిశోధకు లంద రొప్పుకొన్నవిషయమే. కృష్ణ దాటనిది పలక్కడ రాజుతో

* కౌటి. ౭ ప్ర. ౧౬. అధ్యా. వెంకటరంగయ్య వెంకటశాస్త్రిగార్ల తర్జుమా, పుట 324.

సముద్రగుప్తునికి సమర మెట్లు పొసగినది? నాకు జూడ సముద్రగుప్తుని దండయాత్ర ద్రవిడదేశమందలి కాంచీపురము వఱకు వ్యాపించిన దనుటయే నిజముగనున్నది.

పై చర్చలోని సారాంశ మేమనగా: (౧) కౌరాళమే కౌనాళము. దీనిని ఇప్పటి కొల్లేరుతో సమన్వయించుట సమంజసము. (౨) సముద్రగుప్తుని శాసనములోని కాంచీపురము ద్రవిడదేశములోని సుప్రసిద్ధ కాంచీ నగరమే కాని, శేషగిరిరావుగారు తలచినట్లు కళింగదేశములోని కుగ్రామము గాదు. (3) దూబ్రేప్రభృతులు తలచినట్లు సముద్రగుప్తుడు కృష్ణయుత్తరపుటొడ్డున నుండికాని, కళింగమునుండియే కాని వెనుకకు మరల్పబడెననుట కాధారము లేదు. అతఁడు కంచివరకు దండయాత్ర సాగించెననుటకే కొన్నియాధారములు గలవు.*

---

* విభవ సంవత్సర ఆషాఢమాస భారతినుండి పునర్ముద్రితము.

౪

# పల్లవవంశము - వీరకూర్చవర్మ

౧

దర్శి శాసనము[1] ముఖ్యమైనది. అది యింతవఱకు చక్కగా గమనింప బడలేదు. ఇందులకు గారణ మది శాసనశకల మగుటయే. ఆ దాతయొక్క ముత్తాతను బేర్కొని యంతటితో నిలిచిపోయినది. తునుకమైనను అది ముఖ్యమైనదే. ఈ క్రింది వ్యాసమున, దానిలోని కొన్ని యంశములను బరీక్షించి, యది పూర్వ పల్లవ చరిత్రములోని సంశయాస్పదము లగు కొన్ని విషయములలోని సంశయములను దొలగింపగలదని చూపుచున్నాను.

శాసనము యొక్క భాష సంస్కృతమగుటచే నది చాల పురాతనమైనది కాదనుట నిశ్చయము. అది దాతయొక్క ముత్తాత యగు నొక మహారాజ శ్రీవీరకూర్చవర్మను బేర్కొనుచున్నది. ఈ రాజెవ్వరైనదియు నిర్ధారణచేసి చెప్పుటకు వీలులేదు. పల్లవవంశమున నాతని స్థానమునుగూర్చి పండితులు భిన్నాభిప్రాయములను దెలియజేసి యున్నారు.

ఉరువపల్లి[2] శాసనప్రదాతయగు యువమహారాజ విష్ణుగోపుని యొక్కయు, ఆతని యన్నయగు సింహవర్మయొక్కయు తాతయగు వీరవర్మయు, నీ వీరకూర్చుడును నొక్కరే యని డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారు చెప్పుచున్నారు.[3] హొసకోట కృష్ణశాస్త్రిగారును ఒకప్పు డిట్లే యభిప్రాయపడియుండిరి[4] కాని, యిటీవల నీ యభిప్రాయ మును మార్చుకొని, వాస్తవముగ వీరకూర్చుడు మిక్కిలి పురాతను

1. E. I. Vol, P. 369
2. I. A. V. P. 20
3. పల్లవులు
4. S. I. I. II, Part V

డగు పల్లవరాజని చెప్పియున్నారు.[1]. "పల్లవులు" అను గ్రంథము 22 వ పుటలో "దర్శిలోదొరకిన శాసనము వీరకూర్చుడను రాజుండె నని నిర్ధారణసేయుచున్న"దని యొప్పుకొనియున్న జి. జె. దుబ్రేగారు 'దక్కను పురాతనచరిత్ర'యం దాతని బేర్కొననుగూడ లేదు. ఈ పురాతనచరిత్రమునే చదివెడివారికి, వీరకూర్చుడను రాజుండెనని తెలియుట కవకాశము లేదు.

ఈ వీరకూర్చుడెవ్వడు? ఈ ప్రాచీన నామముగల పల్లవరాజులు ఇద్దరు వాయలూరు శిలా స్తంభశాసనమున[2] (దుబ్రేగారి పట్టికలోని ౫, ౧౧ పేర్లు: పల్లవులు, పుట 20) బేర్కొనబడి యున్నారు. వేలూర్పాళెయ శాసనమున[3] నతడు చూత పల్లవుని కుమారు డనియు స్కందశిష్యుని తండ్రి యనియు చెప్పబడియున్నది. అతడు కాశకుడిశాసనము న[4]ందు గూడ బేర్కొనబడి యున్నాడు. అయితే, యివన్నియును మిక్కిలి ప్రాచీనములుగావు. అతని బేర్కొనుశాస నములలో గడుపురాతనమైనది దర్శిశాసనము[5]. ఇది వీరకూర్చవర్మ యొక్క మునిమనుమనిచే నివ్వబడినది. వీని నన్నిటినిబట్టి విచా రింపగా, ఒకానొక కాలమున వీరకూర్చ లేక వీరకూర్చవర్మ యను పేరుగల పల్లవరాజొక్కడుండె నని తేలుచున్నది. అయితే పల్లవ వంశజులగు నితరరాజులతో నతనికిగల సంబంధ మెట్టిదో నిర్ధారణ సేయుటకు వీలుకాదు. ఈ విషయమును గూర్చి చక్కని సాక్ష్య మేమియు దొరకకున్నది. అతడు వాయలూరు, కాశకుడి శాసనము లలో బేర్కొనబడియున్నను, వీనియందలి రాజుల పేర్ల కొండొంటితో సంబంధము లేకపోవుటచేతను, కొన్ని పేర్లు కల్పితము లగుటచేతను, పల్లవవంశవృక్షమునందు ఇతనిస్థల మిది యని నిర్ధారణచేసిచెప్పుటకు

1. E. I. XIX
2. E. I. XIX
3. S. I. I. II, Part V
4. S. I. I. II, P. 348
5. E. I. 1, P. 369

వీలులేకున్నది. వాయలూరు శాసనములోని పల్లవరాజుల పట్టికను జూచినవారి కండ్లకి అందు వచ్చినపేరు మరల వచ్చుటయేకాక నాలుగైదుపేరులు సమూహముగ మరలమరల వచ్చుటయు విదితమగును. ప్రాచీనపల్లవశాసనములలో గాన్పింపని నామములు కొన్ని కాశకుడిశాసనమున గాన్పించుచున్నవి. కావున పై పట్టికలు విశ్వాసార్హములుగావు. నమ్మదగిన ఇతర శాసనముల సాక్ష్యమున్నగాని వానిలోనిపేర్లు వాస్తవచారిత్రక పురుషులపేర్లని యంగీకరింప రాదు.

వేలూరుపాళెపు తామ్రశాసనము నాలుగుతరముల రాజకుటుంబమును బేర్కొనుచున్నది, వీరకూర్చ, స్కన్దశిష్య, కుమారవిష్ణు, బుద్ధవర్మలు. ఇట్టి పట్టికయే వాయలూరు శాసనమున గాన్పించు చున్నది- వీరకూర్చ, స్కన్దవర్మ, కుమారవిష్ణు, బుద్ధవర్మలు. ఇటువంటి జాపితా చెన్దలూరుశాసనమునగూడ గాన్పించుచున్నది. స్కన్దవర్మ కుమారవిష్ణు (౧) బుద్ధవర్మ కుమారవిష్ణు(౨)లు. ఈ శాసనముల నాధారపఱచుకొని

వీరకూర్చ

స్కన్దవర్మ
|
కుమార విష్ణు (౧)

బుద్ధవర్మ

కుమారవిష్ణు (౨)

లను ౫ తరములరాజులును నొకప్పుడు రాజ్యముచేసి రని చెప్పుట యుక్తము. అయితే, వేలూర్పాళెపుశాసనమున వీరకూర్చని కుమారుని పేరు స్కన్దవర్మ యనియుండక స్కన్దశిష్యుడని యున్నది. స్కన్ద

శిష్యు డనుపేరు స్కన్దవర్మ యనుదాని నామాంతరమే యని యంద రొప్పుకొన్న విషయ మగుటచేతను, మాకావిషయమున ఎట్టి యాక్షే పణయు లేకపోవుటచేతను స్కన్దశిష్య స్కన్దవర్మ లనునవి యొక్క పురుషుని పేర్లేయని యంగీకరించుచున్నాము.

౨

ఉరువపల్లి శాసనమునందు బేర్కొనబడిన యువమహారాజ విష్ణుగోప, మహారాజసింహవర్మల యొక్క ముత్తాతయగు వీర వర్మయు, వీరకూర్చుడు నొక్కరేనని డాక్టరు యస్. కృష్ణస్వామి అయ్యంగా రభిప్రాయపడుచున్నారని యిదివఱకే వచించియున్నాము. కొన్ని ముఖ్యము లగు కారణములనుబట్టి విచారింప నది కేవల మంగీకరింపదగని యభిప్రాయముగ దోచుచున్నది. ౧. పల్లవరాజుల శాసనములలో, వీరకూర్చ, వీరవర్మలపేర్లు తారుమారు లేక వెవ్వేరు పురుషుల నామములుగ వర్ణింపబడియున్నవి. వాయలూరు శాసన మున వీరకూర్చునిపేరు రెండుమార్లు (౫. ౧౧) చెప్పబడి యున్నను, వీరవర్మపేరు వేరుగ (౨౩) జెప్పబడి యున్నది కాశకుడిశాసనము వీరకూర్చ వీరసింహు లను నిద్దఱు రాజులను బేర్కొనుచున్నది. వీర వర్మయనుదాని నామాంతరమే వీరసింహ యనునదియని వాదించి నను వీరకూర్చ వీరవర్మలు భిన్నపురుషులే యగుచున్నారు. ౨. పల కడ, దశనపుర, తాంబ్రపలలోనుండి దానశాసనముల నొసంగిన పల్లవరాజు లందఱు వీరవర్మవంశజులే. ఒంగోడు (౧), (౨) శాస నములును, ఉరువపల్లి, మంగదూరు, పీకిర, చూరశాసనములును వీరవర్మనే పేర్కొనుచున్నవిగాని వీరకూర్చుని బేర్కొనకున్నవి. వీరవర్మయొక్క వంశజులందఱును, తమ వంశముయొక్క మూల పురుషునిపేరు వీరవర్మ యనుచున్నారే కాని వీరకూర్చుడని భ్రమపడి నైన చెప్పియుండలేదు. ౩. ప్రాచీన పల్లవరాజుల శాసనములను పరిశీలించి చూచితిమేని, వీరకూర్చ వీరవర్మలు పల్లవచరిత్రలోని

వెవ్వేరుయుగములయందు జీవించియున్న వెవ్వేరు పురుషులని తేల గలదు. ఆ శాసనము లెవ్వియన్న,—

i. హిరహడగల్లి శాసనము.[1] దాత శివస్కందవర్మ. పల్లవుల శాసనములయందు పురాతనమైనవానియం దిది యొక్కటి. "సర్ వాల్టర్ ఎలియటుచే సంపాదితమైన విజయబుద్ధవర్మ రాణి యొక్క అక్షరములు ఈ శాసనపు టక్షరములను బోలియున్నవి" అని డాక్టరు బర్జెసుగారి యభిప్రాయము. ఈ శాసనాక్షరముల పోలికగల యక్షరములు గల మయిదవోలు శాసనము[2] మిగుల ప్రాచీనమైనది.

ii. దర్శిశాసనము.[3] డాక్టరుహల్ట్షుగా రీశాసనాక్షరములు కడుపురాతనములని చెప్పియున్నారు.

iii. విజయస్కందవర్మయొక్క ఒంగోడు ౧. శాసనములోని యక్షరములు హా. కృష్ణశాస్త్రిగారి మతప్రకారము "ఉరువపల్లి, మంగదూరు, పీకిరశాసనాక్షరములను బోలియున్నవి."

iv. ఉరువపల్లి శాసనాక్షరములు స్వచ్ఛమైన కట్టుతలలు గలవి.[4] క్రీ. శ. 446–వ సంవత్సర మీదానశాసనకాలమని మన మెఱిగిన విషయమే. ఈపై నాలుగు శాసనములను, దర్శిశాసన కాలమును నిర్ణయించుటకై శోధింపదొడగితిమి. ఉరువపల్లిశాసనదాత యువమహారాజు విష్ణుగోపుడు. ఓంగోడు (౧) శాసనదాత యితని తండ్రియగు విజయస్కందవర్మ. కావున నీ రెండు శాసనములును క్రీ. శ. ౫–వ శతాబ్దపు పూర్వార్ధమునకు జేరుచున్నవి. హిరహడ గల్లిశాసనము పల్లవచరిత్రపు ప్రారంభయుగమునాటిది. దర్శిశాసన మెప్పటిది? ఈ ప్రశ్నకు, పై నాలుగుశాసనములలోని యక్షరముల నొండొంటితో పోల్చితిమేని, సమాధానము రాగలదు. దర్శిశాసన

1. E. I. I. P. 2 2. E. I. VI, 84 3. E. I. I, 369.
4. దుబ్రాయల్ దక్కను పూర్వచరిత్ర, పుట ౯౭.

మును మొదట హిరహడగల్లి శాసనముతోడను నటుపిమ్మట ఓంగోడు (౧) ఉరువపల్లి శాసనములతోను బోల్చిచూతము. దర్శి శాసనలిపి హిరహడగల్లి లిపికంటె నర్వాచీనమైనదిగను, ఓంగోడు (౧) లిపి కంటె బ్రాచీనమైనదిగను, ఉరువపల్లి లిపికంటె బ్రాచీనతరమైనది గను గన్పించుచున్నది. ఇట్లు శాసనముల యక్షరస్వరూపమును బోల్చిచూడ దర్శి శాసనము, హిరహడగల్లి ఒంగోడు శాసనముల మధ్యకాలమున వేయింపబడినట్లు తెలియుచున్నది.

ఇక, యీ శాసనములలో మచ్చునకై కొన్ని యక్షరముల నొండొంటితో పోల్చి చూతము. ఈ క్రిందనున్న చిత్రము అక్షరము

| అక్షరములు | నాసిక | జూనాగడ | కొండముడి | కొల్లేరు | మైదవోలు | హిరహడగల్లి | దర్శి | ఒంగోడు ౧ | ఉరువపల్లి | ఒంగోడు ౨ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క | | | | | | | | | | |
| గ | | | | | | | | | | |
| జ | | | | | | | | | | |
| ణ | | | | | | | | | | |
| త | | | | | | | | | | |
| బ | | | | | | | | | | |
| ర | | | | | | | | | | |

లను మార్పును సూచించును. హిరహడగళ్ళి శాసనములోని "క" బ్రాహ్మీ శాసనములలోని 'క' వలెనే యున్నది. దర్శి శాసనములోని "క" కును దీనికిని విశేషము భేదము గాన్పింపదు; కాని యక్షరము

యొక్క క్రిందినుండి యెడమవైపునకు దిరిగి యూర్ధ్వముగ బోవుగీటు పొడవుగ నున్నది. ఒంగోడు (౧) శాసనములో నీ యక్షర మింతకంటె చక్కగ తీరియున్నది. ఒంగోడు (౧) శాసనము ఉరువపల్లి శాసనము వలె స్వచ్ఛమైన పెట్టె తలల యక్షరములతో వ్రాయబడిన దని యూహించుటకు కారణ మున్నది. 'క' తలపై నొక పెట్టెయున్నది. అక్షరముయొక్క క్రింది భాగము వర్తులముగాక మూలలు తీరి ద్విభుజముగమారి యున్నది. ఉరువపల్లి "క", ఒంగోడు (౧) 'క' వంటిదే; కాని తలపైని పెట్టెయు క్రింది ద్విభుజము పెద్దవి. ఒంగోడు (౨) 'క' యిప్పటి అరవ 'చ' ను చాలవఱకు పోలియున్నది.

హిరహడగళ్ళి 'గ' ఇప్పటి తెలుగు 'గ'ను చాలవఱకు పోలి యున్నది; దానికి తలకట్టు లేదు; అక్షరము కుడివైపునకు వంగి యున్నది. ఎడమ కాలు కుడిదానికంటె కురుచ. ఎడమ కాలి క్రింది భాగము కొంచెము లోపలికి వంగి గుడికట్ట బోవున ట్లున్నది. దర్శి శాసనములోని 'గ' తెలుగు ౧ ని బోలి యున్నది. అయితే గ యొక్క యెడమకాలు క్రింద కుడివైపునకు గుడి తిరిగియున్నది. ఒంగోడు (౧) (౨) శాసనములోని 'గ' కు గుడిలేదు. ఉరువపల్లి "గ" యం దీగుడి లేదు. దానికాళ్లు సమముగను, విలువంపుగ నొకదానివైపు మరొకటి తిరిగియు నున్నవి. ఇంకను తలకట్టు లేక పోయినను దాని స్థలమున నొక అడ్డగీత యున్నది. దీనికిని మన తెలుగు కన్నడపు 'గ'లకును వ్యత్యాసము విశేషము గాన్పింపదు. దర్శిశాసనపు 'గ' కాలియందలి గుడి ఈ యక్షరపు పూర్వస్వరూప మును జ్ఞప్తికి దెచ్చు చిహ్నము; నూతనమైనమార్పుగాదు. మయిద వోలు శాసనములో[1] దీని కుడికాలు యెడమదానికంటె దీర్ఘమై యెడమ వైపునకు వంగి వర్తులరేఖయై యంత్యమగు చున్నది. ఎడమ కాలు కుడిదానివైపునకు వంగియున్నది. కొండమూడి శాసనమున[2]

1. E. I. vi. 84. 2. E. I. vi. 315.

'గ' మైదవోలు 'గ'వలె నున్నను, దర్శి 'గ'వలె దాని యెడమ కాలికొన లోపలి ప్రక్కకు తిరిగి గుడిగమారి యున్నది. రుద్రదాముని జునాగడ[1] శాసనములోని 'గ'ను సర్వ విధములను బోలియున్నది. కావున నీగుడి క్రొత్తగ దర్శిశాసనకాలమున పుట్టినదికా దనుట స్పష్టము. పురాతనకాలమందు 'గ'కు అట్టి గుడి యుండెను. అదికాల క్రమమున లోపించెను; కావున నీగుడి పురాతన చిహ్నమే.

హిరహడగళ్ళి 'జ' యించుమించుగ ఇంగ్లీషు పెద్ద E వలె నున్నది; కాని మూలలు వర్తులముగ మారినవి. జునాగడశాసనమున అది ఇంగ్లీషు పెద్ద E వలె నున్నది. దర్శి హిరహడగళ్ళి "జ" లకు విశేషము భేదము లేదు. కాని, క్రిందిభుజముయొక్క కొన సూక్ష్మమగు నధోముఖరేఖగ మార్పునందిన ట్లున్నది. ఓంగోడు (౧) 'జ' యొక్క పైభుజము వక్రరేఖగ మారియున్నది. క్రింది భుజమున ఇప్పటి మన 'జ' వలె పొక్కిలి యేర్పడి యున్నది. ఉరువపల్లి 'జ'పైభుజ మొక ఋజురేఖ. క్రిందిభుజమున పొక్కిలి చక్కగ తీరి యున్నది. ఓంగోడు (౨) 'జ'కును యిప్పటి మన 'జ'కును భేదము విశేషము గాన్పింపదు.

హిరహడగళ్ళి శాసనపు 'ణ'మఱి యెచ్చటను గాన్పింపదు. బ్రాహ్మి, పల్లవశాసనముల 'ణ'కును దానికిని జాలభేదము గలదు. దర్శి'ణ'కును, అంత్యయుగపు బ్రాహ్మి 'ణ' కును భేదము లేదు. ఓంగోడు (౧) ఉరుపల్లి శాసనములలోను దాని స్వరూప మట్లేయున్నది. ఓంగోడు (౨) శాసనమున నది చక్కగ తీరి యించుమించుగ నిప్పటి తెలుగు 'ణ' వలె నున్నది.

హిరహడగళ్ళిలోని 'త' తలకట్టు లేని యిప్పటి తెలుగు'గ' వలె నున్నది. తలమీంద కుడివైపున కొరిగిన నిలువుగీ టొకటియున్నది.

1. E. I. viii. 36.

ఇది, ఊషవదాతయొక్క నాసిక శాసనము[1] లోని 'త'ను బోలి యున్నది. హిరహడగళ్ళి దర్శి 'త'లకు సంబంధ మున్నట్లు గాన్పిం పదు. దర్శి 'త' కును అమరావతిప్రాకృత శాసనములలోని 'త' కును భేదము లేదు. ఒంగోడు (౧) శాసనమున నీ యక్షరముయొక్క తోక వంకగీటుగ ముగియక ఋజురేఖగ మారియున్నది. దాని శిరమున పెట్టెయున్నట్లు తలచుట కవకాశము గలదు. ఉరువపల్లి 'త' ఒంగోడు (౧)'త' వంటిదే; కాని తోకకురుచ; పెట్టెపెద్దది. ఒంగోడు (౨) శాసనములో మేకు తలకొక్కెము వలె మారియున్నది.

ప్రాచీనపల్లవశాసనములయందు రెండు విధములగు "బ"లు గాన్పించుచున్నవి. బ్రాహ్మీ 'బ' రూపమున చతురస్రము (Square) హిరహడగళ్ళి 'బ' దీని వికారము. అక్షరముయొక్క క్రింది యెడమమూల, క్రిందికి వంగిన సూక్ష్మసమరేఖయొకటికలదు. పైకుడి మూల వట్రువగమారి యెడమవైపునకు బోయి యక్షరము యొక్క యెడమ భుజముపై తాకక వ్రాలియున్నది. ఒంగోడు (౧), ఉరువ పల్లి 'బ'లు పైదాని వికారములే. దర్శి 'బ' యించుమించుగ నిప్పటి తెలుగు 'ఐ' కారమువలె నున్నది. ఒంగోడు (౨) 'బ' దీని యొక్కవికారము. హిరహడగళ్ళి 'బ' కంటె దర్శి 'బ' యర్వాచీన మైనదని మన మనుకొనరాదు. ఏలన, అది విజయదేవవర్మ యొక్క కొల్లేరు ప్రాకృత శాసనమున[2] గాన్పించుచున్నది. కావున దర్శి "బ" హిరహడగళ్ళి 'బ' యంతటి ప్రాచీనమనుటకు సందేహము లేదు.

'ర' నుగూర్చి విశేషము చిక్కలేదు. హిరహడగళ్ళి శాసన మున ఇది యింగ్లీషు J వలె నున్నది, దర్శియం దక్షర స్వరూపము కొద్దిగ మారుటచే యక్షరము కురుచగను, తోక పొడవుగను గన్పించుచున్నది. ఒంగోడు (౧) శాసనమున నది యింగ్లీషు J వలె

1. E. I. viii. 2. E. I. IX.

నున్నది. కాని తలపై పెట్టెయున్నది. తోకకు వట్రువరూపముపోయి మూల లేర్పడియున్నవి. ఉరువపల్లి 'ర' ఒంగోడు (౧) 'ర' వంటిదే. పెట్టెయును, మూలలును మిక్కిలి చక్కగ తీరియున్నవి. ఒంగోడు (౨) శాసనమున నీయక్షరము రమారమి మన ప్రస్తుతపు తెలుగు 'ర' ను బోలియున్నది.

పై జేయబడిన క, గ, జ, ణ, త, బ, ర, అను నేడక్షరముల పరీక్షవల్ల హిరహడగళ్ళి యక్షరములకంటె దర్శి యక్షరములు తీరి యున్నవనియు, దర్శికంటె ఒంగోడు (౧) ఉరువపల్లి, ఒంగోడు (౨) అక్షరములు చక్కగ తీరియున్నవనియు తెలియుచున్నది. కావున దర్శిశాసనము హిరహడగళ్ళి శాసనముకంటె వెనుకను, ఒంగోడు (౧) ఉరుపల్లి, (౨) శాసనముకంటె ముందరను వ్రాయింపబడి యుండవలయును.

వీరవర్మను బేర్కొను శాసనములలో ప్రాచీనతమమైనది ఒంగోడు (౧) శాసనము. ఇతడు క్రీ. శ. 446 వ సంవత్సరమున జీవించియున్న యువమహారాజు విష్ణుగోపునియొక్క తాత యగుట చేత, క్రీ. శ. 385 మొదలు 410 వఱకు రాజ్యము చేసియుండెనని మన మూహింప వచ్చును. అక్షరముల పోలికలనుబట్టి ఒంగోడు (౧) శాసనముకంటె దర్శిశాసనము ముందటిదని తీర్మానించుకొని యున్నాము. కాబట్టి దర్శిశాసనదాతయొక్క ముత్తాతయగు వీర కూర్చవర్మయు, ఒంగోడు (౧) శాసనదాతయగు విజయస్కన్దవర్మ తండ్రియగు వీరవర్మయు నేకపురుషులుకాజాలరు. వాదమునకై దర్శి ఒంగోడు (౧) శాసనములు సమకాలపువని యొప్పుకొన్నను వీర కూర్చవర్మ వీరవర్మ కంటె రెండు పురుషాంతరములు ముందుండి యుండవలయును, అనగా నతడు ఒంగోడు శాసనమునందు బేర్కొన బడ్డ కుమారవిష్ణుని సమకాలికుడుగ నుండవలయును. అప్పటికిని వీర

కూర్చవర్మయు వీరవర్మయు నొక్కరేయని చెప్పుటకు సాధ్యము గాదు.

దర్శి శాసనము వీరవర్మ తండ్రి యగు స్కన్దవర్మగాని లేక అతని సమకాలికు డగు మఱియొక పల్లవ వంశీయుడుగాని వ్రాయించి యుండవలయును. దర్శిశాసన లేశము, వీరవర్మ సంతతివారు వ్రాయిక ముగ శాసనముల నొసగు స్థలములయం దొక్కటియగు విజయదశన పురమునం దివ్వబడినదిగాని తచ్ఛాసనదాత స్కందవర్మయే యని తోచుచున్నది.

వీరవర్మ, వీరకూర్చవర్మ లొక్కరని చెప్పుటకు వీలుకాదని నిరూపింప బడినది. కావున నీవీరకూర్చవర్మ హిరహడగల్లి శాసన దాత యగు శివస్కన్దవర్మ యొక్క తండ్రిగాని మఱి యన్యుడుగాడు. పురుషాంతరమునకు ౨౫ సంవత్సరముల చొప్పున గణించిన రమా రమి క్రీ. శ. ౨౧౫ సంవత్సర ప్రాంతమున వీరకూర్చుడు జీవించి యుండవచ్చునని తోచుచున్నది.

౩

అయినప్పటికిని తాము పరమప్రమాణములుగ నంగీకరించిన శాసనములయం దాతడు పేర్కొనబడియున్నను, డూబ్రేగారు రచించిన పల్లవవంశవృక్షమున[1] వీరకూర్చుని స్మరింప కున్నారని వచించియున్నాము. అట్లు సేయుటకు గారణ మాయన వచించి యుండ లేదు. వారికిగలిగిన సంకట మిదియని తోచుచున్నది. వీరకూర్చుడు ప్రాచీనపల్లవరా జని చెప్పబడియున్నను, అట్టివాక్యములు సంస్కృత శాసనములయందు మాత్రము గాన్పించుచున్నవి. ప్రాకృతశాసన ములయం దాతని పొడమైన గాన్పింపదు. ఇంతేకాక యతని పేరు

1. Anc. Hist., Deccan, P. 70

దర్శిశాసన లేశమున నున్నది. పల్లవ వంశవృక్షమున దీని నాధార పరచుకొని వీరకూర్చుని నిరికించుట కవకాశము దొరకలేదు. కాబట్టి దర్శిశాసన మాతని కాలికిబంధమైనది. ఆ బంధకమును దొలగించు కొను నుపాయ మరసి, దానిని స్మరింపక చల్లగ జారవిడిచినాడు. మఱియు, సర్కారువారి తరఫున బనిసేయు శాసన పరిశోధకమహాశయులుచేసిన ప్రాకృతసంస్కృత శాసనముల కాలములకు దాదాపు రెండు శతాబ్దములు యెడమున్నదను నపసిద్ధాంతముగూడ నాతని బెడత్రోవకు ద్రిప్పినది.

వెంకయ్యగారు ప్రాకృత శాసనములను "క్రీ. శ. ౪ వ శతాబ్దారంభ కాలమునకు"[1] జేర్చుచున్నారు. ఇట్లనుచున్నారు: "క్రీ. శ. ౨౩౬ వ సంవత్సరమున కడపటి యాంధ్ర రాజగు మూడవ పులుమాయి రాజ్యకాలము సమాప్తినందెను. అందుచేత పల్లవులు ఆ శతాబ్దాంతమున స్వతంత్రులై యుండవచ్చును. ఒకవేళ వారీ కాలమునకు ముందే స్వాతంత్ర్యస్థాపనమును జేసియుండినను నుండ వచ్చును." "ఈ వంశపు సంస్కృతశాసనములు తరువాతి కాలపువి......సంస్కృతశాసనముల నొసగిన రాజు లెప్పుడుండిరో తెలియదు. అయితే స్థూలముగ వారు ౫, ౬ శతాబ్దముల నాటి వారని చెప్పవచ్చును."[2]

ఇది తాత్కాలికపు సిద్ధాంతముగ మొదట బరిగణింపబడినను తరువాతివారి కది వేదవాక్య మాయెను. హా. కృష్ణశాస్త్రి గారు దీనిని స్థిరీకృతమగు సిద్ధాంతముగ నమ్మి తదాధారమున గొన్ని యపసిద్ధాంతములను బయలుపెట్టిరి.[3]

పై సిద్ధాంతము నంగీకరించుటవలన దూబ్రేగారు పల్లవ వంశవృక్షపు బోదెను అనవసరముగ దీర్ఘీకరించవలసినవారైరి.

1. Arch. Rep. 1906-7, 222 2 Ibid. P. 223, 4
3. S. I. I. Vol, II, Part V

వారు త్రొక్కిన మార్గము సమంజసముగ నుండలేదు. పల్లవవంశ వృక్షరచనను ప్రాకృత శాసనములలోని రాజుల పేర్లతో నారంభించిరి. అంతవఱకు బాగుగనే యున్నది. వారికి విష్ణుగోపుని దగుల గట్టిరి. సముద్రగుప్తుని యలహాబాదు శిలాస్తంభశాసనములో[1] కంచి రాజగు నొక విష్ణుగోపుడు పేర్కొనబడి యుండుట వాస్తవమే. అయితే బుద్ధ్యాంకురుని యనంతర మొక విష్ణుగోపుడు రాజ్యము చేసి నట్లు పల్లవశాసనముల వల్ల దెలియవచ్చుటలేదు. వాయలూరు శాసనమున[2] ప్రాచీన పల్లవ రాజులలో విష్ణుగోపుని పేరు చెప్పబడి యున్నది. అయితే ప్రాకృత శాసనములలోని రాజులెవ్వ రాతనికి ముందు రాజ్యముజేసిన ట్లీశాసనము పల్కదు. స్కన్దవర్మ యను పేరుగల రాజు విష్ణుగోపుని కుమారుడనిగాని, తరువాత రాజ్యము జేసిన వాడనిగాని పల్లవశాసనములయం దెచ్చటను లేదు. విష్ణుగోపుని మూలమున ప్రాకృత సంస్కృత శాసనములకు దూ్బ్రేగారు సంబంధమును గల్పింప బ్రయత్నించిరి; ఈ ప్రయత్నము క్రమమైనది గాదు. ఆయన, హిరహడగల్లి శాసనదాతయగు శివస్కందవర్మయు, చెన్దలూరుదానపత్రోక్తమైన రాజవంశమునకు మూలపురుషుడైన స్కన్దవర్మయు భిన్నపురుషు లనుచున్నారు! వాస్తవము విచారింపగా వారొక్కరేయని తెలియగలదు. బ్రిటిషు మ్యూజియం శాసనములోని బుద్ధవర్మ చెన్దలూరు శాసనములోని మొదటి కుమారవిష్ణువుకు సమకాలికుడుగాని ముత్తాతగాడు. ఇది వేలూర్పాళెపు శాసనమునకు[3] సమ్మతమే. అందు కుమారవిష్ణువు పల్లవవంశస్థాపకుడగు వీరకూర్చుని మనుమడని వచింపబడియున్నది.

ఇంతవఱ కెవ్వరిచేతను గమనింపబడనిదియు, అనేకములగు ప్రమాదముల కాస్పదమైనదియు నగు నొక్కవిషయము నీసందర్భమున

1. Fleet: Gupta Inscriptions
2. Dubreuil: 'The Pallavas'
3. S. I. I. Vol. II, Part V.

జెప్పవలసియున్నది. వీరకూర్చుడను పల్లవ కుమారుడు నాగరాజు కుమార్తె నుద్వాహము చేసికొనుటవల్ల పల్లవవంశమునకు రాజ్యలాభము గలిగె ననువిషయ మందఱు పండితు లొప్పుకొన్నదే. తత్పూర్వమున పల్లవు లెట్టిస్థితియం దుండిరో మన మెఱుగము. ఆంధ్రపల్లవవంశముల మధ్యమున నాగజాత్యుద్భవు లగు నాంధ్రభృత్యరాజులు దక్కను దక్షిణహిందూ దేశములపై ప్రభుత్వము చేయుచుండిరి. ఈ యాంధ్రభృత్యరాజులు చూటు (చూడ)కులులు. చూటులకడ నుండియే దక్షిణరాజ్యలక్ష్మి పల్లవులను జేరె ననుట యంద రంగీకరించిన విషయమే. వేలూర్పాళెపు శాసనప్రకార మిది వీరకూర్చుడు నాగకుమారిని బెండ్లాడుటవలననని దెలియుచున్నది. పై శాసనమున వీరకూర్చుని తండ్రిపేరు చూతపల్లవు డని చెప్పబడి యున్నది. ఈచూతపల్లవుడు చారిత్రకపురుషుడని యనేకగ్రంథకర్తల నమ్మకము. ఇది నిజముగాదు. చూతపల్లవుడు చారిత్రకపురుషుడు గాడు; చూటుపల్లవవంశముల సంయోగమును సూచించు కల్పిత మూలపురుషుడు. మన మాతని కల్పితపురుషునిగనే గణింపవలయును. అతనిపేరుగాని, అతనివలెనే కల్పిత పురుషులగు నతని పూర్వికుల పేర్లుగాని ప్రాచీనపల్లవ ప్రాకృత సంస్కృతశాసనముల యందెందును గానరావు. మనము చరిత్రను కల్పనాకథలనుండి వేరుపరుపవలయును. అట్లు చేసినగాని మనకు సత్య మెఱుకపడదు.

ఇక ప్రాకృత సంస్కృత శాసన యుగముల మధ్య మెడ మున్న, నది రెండు శతాబ్దముల దీర్ఘకాలము గాదనియు, రెండు పురుషాంతరముల హ్రస్వకాలమనియు నిరూపించెదము. ఇదివఱకే వీరకూర్చ, వీరవర్మలమైక్యమును స్థాపించుట కానిపనియని చెప్పి

యున్నాము. శాసనములయం దగపడు వీరకూర్చ డొక్కడే. అతడు కడు ప్రాచీనుడు. హిరహడగళ్ళి శాసనదాతయగు శివస్కన్దవర్మ తండ్రి. ఈ మతము నంగీకరించిన, దర్శి శాసనపుదాత పై శివస్కన్ద వర్మయొక్క మనుమ డగును. అట్లగునేని సంస్కృత శాసన యుగము శివస్కన్దవర్మ యొక్క మనుమని కాలమున నారంభ మగును. ఈ రెండు పురుషాంతరములను రెండు శతాబ్దముల వఱకు వ్యాపించి యుండెననుట కేవల మసంభవము.

పై జెప్పిన విషయము శాసనసమ్మతమైనది. వాస్తవమారయ (పల్లవ) ప్రాకృతశాసనములు సంస్కృతయుగారంభమున లిఖింపబడి నట్లు తెలియుచున్నది. ఈ ప్రాకృత శాసనములలో సంస్కృతపద ములు, వాక్యములు, శ్లోకములు గన్పించుచున్నవి. క్రీ. శ. 4-వ శతాబ్దారంభపుదని వెంకయ్యగారిచే జెప్పబడిన హిరహడగళ్ళి శాసమున నొక సంపూర్ణ సంస్కృత వాక్యము గలదు.

"స్వస్తి గో బ్రాహ్మణ లేఖక వాచక శ్రోతృభ్య ఇతి."

బహత్ఫలాయనసగోత్రజు డగు మహారాజు జయవర్మయొక్క కొండమూడి శాసనపు లిపి శివస్కన్దవర్మ యొక్క మయిదవోలు వోలు శాసనపు లిపిని బోలియున్నది. ఈ కొండమూడి శాసనమున 'మహేశ్వర', 'బృహత్ఫలాయన' యను రెండు సంస్కృతపదయు లున్నవి. ఇంతేకాక ముద్రచుట్టును "బృహత్ఫలాయనసగోత్రస్య మహారాజశ్రీ జయవర్మణః" యను వాక్యము స్వచ్ఛమైన సంస్కృత భాషయం దున్నది. చారుదేవిచే నొసంగబడిన బ్రిటిష్ మ్యూజియము శాసనము [1] యొక్క లిపి హిరగడగళ్లి శాసనమును బోలియున్నది.

1. E. VIII, P. 143

అందు సంస్కృతశాసనముల కడపట తరచుగ గాన్పించు శ్లోకము లలో నివి రెండున్నవి.

> "బహుభి ర్వసుధా దత్తా బహుభిశ్చానుపాలితా ;
> యస్యయస్యయదాభూమిః తస్యతస్యతదాఫలమ్.
> స్వదత్తాం పరదత్తాంవా యోహరేతవసున్ధరామ్ ;
> గవాం శతసహస్రస్య హన్తుః పిబతి కిల్బిషమ్."

ఇంకొక ప్రాకృతశాసనమున గూడ నిట్టి సంస్కృత శ్లోకములు, "షష్టిర్వర్ష సహస్రాణి", "బహుభిర్వసుధా దత్తా" యనునవి కన్పట్టుచున్నవి. ఈ శాసనదాత శాలంకాయన గోత్రజుడగు విజయదేవవర్మ. ఈ సందర్భమున హుల్ట్జుగారి వాక్యములు గమనింప దగినవి. "గుహాశాసనములలో బ్రతిద్విత్వమును ఏకాక్షరముతోడనే వ్రాయబడియుండగా, ఈ శాసనములోని యక్షరగుణితము యీవిషయమున, పాలీగ్రంథములను, చారుదేవియొక్క బ్రిటిషు మ్యూజియశాసనమును బోలియున్నది"[1]

పల్లవ, బృహత్ఫలాయన ప్రాకృతశాసనములు, శాసనముల భాష సంస్కృతముగ మార్పుజెందుచున్నకాల మప్పటివి. ప్రాకృత శాసనములలోని సంస్కృతపదవాక్య శ్లోకములు సత్వరము సమీపించుచున్న సంస్కృత యుగ సూచకములు. మొదట రెంటియందును పదములు, వాక్యములు మాత్రమే కన్పడుచున్నవి. తక్కినవాని యందు శ్లోకములు సైతమగపడుచున్నవి. ఈమార్పొక పురుషాంతరము లోపల జరిగినది. సంస్కృతభాష శాసనముల నుండి ప్రాకృతమును నెట్లు నెట్టివేసినదియును మఱియొక యుదాహరణమువలన

1. E. I. IX, P. 57

మనకు బోధపడగలదు. ఆనందగోత్రజు డగు దామోదరశర్మ యను నత డొకశాసనము[1] నిచ్చియున్నాడు. సర్కారువారి శాసన పరిశోధనశాఖాధ్యక్షుడు పై శాసనకాలమును గూర్చి "క్రీ. శ. మూడు నాల్గు శతాబ్దములనాటి ప్రాచీన పల్లవరాజుల ప్రాకృతశాసనముల కాలమునకును, దీనికాలమునకును విస్తారము దూరము లేదు."[2] అని వచించియున్నాడు. శాసనపుభాష సంస్కృతము; అయినప్పటికిని దానియందు కొంతభాగము ప్రాకృతమున వ్రాయబడి యున్నది.

"మూడు తెగల బ్రాహ్మణులు, ప్రతిగ్రహీతలు వారి గోత్రములతో గూడ జేర్కొనబడియున్నారు: ౧౧ కొండిన్నులు (అనగా కౌండిన్యగోత్రజులు), ౫ కస్సవులు (అనగా కాశ్యపగోత్రజులు);... ౧ ఆగస్తి (అనగా అగస్త్యగోత్రోద్భవుడు.) గోత్రముల నామము వలెనే ప్రతిగ్రహీతల పేర్లుగూడ ప్రాకృత రూపమున వ్రాయబడియున్నవి. రుద్దజ్జ (రుద్రార్య), ఖందజ్జ, (స్కన్దార్య), అగ్గిజ్జ (అగ్న్యర్య), సవరజ్జ (శబరార్య), భద్దజ్జ (భద్రార్య) ఇత్యాదులు."[3] ఈ శాసనమునందు శాసన భాషగ నంతరించుచున్న ప్రాకృతముయొక్క కడపటి చిహ్నములను గనుగొనుచున్నారము. రమారమి యొక్క పురుషాంతరములోపల సంస్కృతముననే శాసనములు వ్రాయు నాచారమారంభమాయెను.

ప్రాచీన కదంబ శాసనములను శోధించి చూడగా నీ విషయమే తేలుచున్నది. వీనియందు మిక్కిలి పురాతనమైనది మలవల్లి స్తంభశాసనము.[4] పూర్వము మైసూరు శాసన పరిశోధనశాఖయందు బనిసేయుచున్న డాక్టరు ఎ. వెంకటసుబ్బయ్యగారు ఈ శాసనమును

1. Epi. Rep. 1920-21, Madras
2. Ibid.
3. Madras Epi. Rep. 1920-21.
4. E. C Vol. VIII, Shikarpur Tq. P. 264

జక్కగపరిశోధించి అందు పేర్కొనబడిన స్కన్దవర్మ కాదంబుడు గాడనియు, తత్కారణమున నాతనిపేరు కదంబరాజుల పేర్లలో నుండి తొలగింప వలయు ననియు తీర్మానించి యున్నారు.[1] ఈతని పరిశోధనవలన గలిగిన ఫలమేమన, మలవల్లిశాసనము వేయించిన దాతను మన మెఱుగక పోవుటయే. పై సిద్ధాంతము నాధారము చేసికొని, ఈ శాసనపు దాత మయూరవర్మయని దూబ్రే గారు వాదించుచున్నారు.[2] ఈ వాదమునకు బలము నొసగు నంశములు కొన్ని కలవు. శాసనము ప్రాకృత భాషయందు విరచితమగుటచే, నది ప్రాచీన మనుట నిజము. ఇంతేకాక శాసనలిపి అందే స్తంభము పై నుండు చూటుప్రాకృత శాసనలిపిని బోలియుండుటచేత డాక్టరు రాప్సన్ వంటి పరిశోధకుడు, "బనవాసిరాజ్యము చూటుల కడ నుండి కదంబుల హస్తగతమాయె" నని చెప్పియున్నారు.[3] డాక్టరు రాప్సన్ చెప్పినది సరిగాదని కదంబ కకుస్థవర్మ యొక్క తలగుండ శాసనమువల్ల దెలియుచున్నది. అందు తన ముత్తాతయగు మయూర వర్మ రాజ్యమును పల్లవులకడనుండి పడసి వారికి సామంతుడాయెనని వచించియున్నాడు.[4] కాబట్టి మలవల్లి స్తంభముపై నున్న రెండు శాసనములును డాక్టరు రాప్సన్ గారను కొన్నంత సమీపకాలపువి గావనుట నిక్కము. అది యట్లుండ నిండు.

మయూరవర్మ మలవల్లి ప్రాకృత శాసనపుదాతయనుట సరి కాదు. ఈ శాసనములోని ప్రాకృతశ్లోక మీ యూహతో విరోధించుచున్నది.

---

1. I. A. XLVI, P. 154
2. Anc. Hist. of the Deccan, P. 99
3. The Catalogue of Ind. Coins Intro. P. 54
4. E. I. VIII, P. 24.

ఉక్తంఖందో :—

విస్సకమ్మా బహ్మదెజ్జం నేకదంబేసు ఋథ్మతే;

విససత్తుచాతు వెజ్జం సిద్ధితం నిగమవిదితంచ.

దీనిమీది వెంకటసుబ్బయ్యగారి వ్యాఖ్యాన మీక్రిందిది:— "ఈ శ్లోక మెచట నుండియో కొనివచ్చినది గాన శాసన కాలమునకు పూర్వమే వ్రాయబడియుండవలయును. కావున శాసన కాలమునకు చాలముందే కదంబులు బ్రహ్మదేయములనిచ్చి కీర్తి గడించిరనుటయు సహజము గాదు."[1].

"శాసనకాలమునకు చాలముందే కదంబులు బ్రహ్మదేయముల నిచ్చి కీర్తి గడించి" నట్లయిన కదంబవంశమునకు మూలపురుషుడైన మయూరవర్మ మలవల్లి శాసనము నొసగిన దాత కాజాలడు. దానిదాత మయూరవర్మ యనంతరము రాజ్యాధిపత్యమును వహించిన రాజులలో నొక్కరై యుండవలయును. ఈ శాసనపు కడపటి రెండు వాక్యములును (ఒక్కపదము దప్ప) సంస్కృతమునందున్నవి. "జయతి లోకానాథోనన్దతి, గోబ్రాహ్మణసిద్ధిరస్తు, శ్రీరస్తు." వీనివల్ల పల్లవ బృహత్ఫలాయన ప్రాకృత శాసనములవలెనిదియు శాసనములభాష సంస్కృతమునకు మార్పుచెందుచున్న కాల మప్పటిదని తెలియవచ్చుచున్నది. ఇచ్చటగూడ సంస్కృత యుగ మచిరకాలముననే యారంభ మగుచున్నది. మయూరవర్మ మునిమనుమడగు కకుత్స్థుని శాసనములభాష సంస్కృతము. పేరులేని శకముయొక్క యెనుబదియవ సంవత్సరమున వ్రాయించిన హాల్సి తామ్రశాసనపు భాష సంస్కృతము. ఈ శకము మయూరశర్మ రాజ్యాభిషేక సమయమున నారంభింపబడినదని యనేకుల యూహ. కావున, హాల్సి మలవల్లి శాసనముల కెడము 30 లేక 40 సంవత్సరముల కంటె నెక్కువగ నుండజాలదు.

1. I. A. XLVI, P. 154.

ఈ పై చర్చవల్ల ప్రాకృతసంస్కృతయుగము లొండొంటి వెంట నంటి వచ్చినవని తెలియుచున్నది. సంస్కృతప్రాకృతశాసనముల మధ్యకాలము గడునల్పము. రెండు పురుషాంతరములకంటె నెక్కువ కాదు. ఈ యల్పకాలముననే సంస్కృతము శాసనముల నుండి ప్రాకృతమును త్రోసివేసెను. పేరులేని దర్శిశాసనపు దాత సంస్కృతయుగమున నుండినను, అతని ముత్తాతయగు వీరకూర్చవర్మ ప్రాకృతమునందుండి యుండవచ్చును. ఈ వీరకూర్చవర్మ హిరహడగల్లి శాసనదాతయగు శివస్కన్దవర్మయొక్క తండ్రియనుటకు సంశయము లేదు. అందు వచింపబడిన మహారాజ బప్పసామియే యిత డనుట నిక్కము.

ఓమ్

# నెడుఙ్గరాయ తామ్రపట్టిక

ఈ తామ్రశాసనము సింగరాయకొండ వాస్తవ్యులగు శ్రీమాన్ యోగి శేషభట్టర్ వీరరాఘవాచార్యులగారివల్ల లభ్యపడినది. శాసనము తమకు దొరకిన విధమును ఆచార్యులవారిట్లు తెల్పుచున్నారు:

"౧౯౩౨ సంవత్సరములో సింగరాయకొండలో నేను ఇల్లు కట్టునప్పుడు గోడకాలు త్రవ్వుచుండగా మూఁడుజానల లోతున రెండు మట్టి మూఁకుళ్ళతో భద్రపఱచబడిన ఈ శాసనము దొరకినది. ఆ స్థలము కొండక్రింది ప్రదేశము. బజారుకు షుమారు ఆరు అడుగుల యెత్తుండును. ఈ స్థలమును శ్రీమాన్ అకలంకం రంగభాష్యం అయ్యంగారు తమతండ్రి సపిండీకరణకాలమున నాకు దానముగా నొసగిరి. రంగభాష్యం అయ్యంగారి తండ్రిగారు దానిని కొను కాలములో పాడుపడియేయుండెను. పూర్వము చక్రవర్తుల వారనుదాక్షిణాత్య (కంచి) శ్రీవైష్ణవు లచ్చట కాపురముండిరట. అంతకుపూర్వము సంగతి తెలియదు.

'గాలియాత' గ్రంథకర్త,

శేషభట్టర్ వీరరాఘవాచార్యులు."

భూగర్భమునం దెన్నియేండ్ల నుండియో మఱుగుపడియుండిన యీ రాగిరేకుల శాసనము ఆచార్యులవారి మూలమున నేటికిట్లు బయల్పడినది.

ఈ శాసనమునందు 6½ అంగుళముల నిడివియు, 2½ అంగుళముల వెడల్పును గల రేకులు ఐదు కలవు. ఈ రేకుల డాపలికడల

మూలలు కత్తిరించివట్రువులుగ దీర్చియున్నవి. ప్రతి రేకునకు నెడమకోనయందు, రేకునకు మధ్యభాగమున అంచునకు ⅜ అంగుళముల దూరమున ⅜ అంగుళముల మధ్యపరిమాణముగల బెజ్జమును, ఆ బెజ్జముగుండ దూర్చి, యతికించబడిన ¼ అంగుళము ఘనమును, 2½ అంగుళముల నడిమికొలతయు గల కడియమును గలవు. రేకుల తూకము ౭౦ తులములు. కడియము 5½ తులములు. సామాన్యముగ రాగిశాసనములను గుచ్చెడి కడియములయొక్క అతుకుపై దాపటముచేసియుండు రాజలాంఛనముద్ర యిందు కానరాదు. కడియము అతికించినది యతికించినట్లే యున్నను ముద్ర లేకపోవుటయు, అది యుండవలసిన స్థలమున చిలుము చిట్టెముగట్టియుండుటయు జూడ నది యెచ్చటనో నష్టమైపోయినట్లు తోచుచున్నది.

౫

ఇందలి ఐదు రేకులయందును మొదటి రేకుయొక్క ప్రథమ పార్శ్వమున వ్రాత లేదు; మొదటి రేకుయొక్క ద్వితీయపార్శ్వమునను, దక్కిన రేకుల కిరుపార్శ్వములను పార్శ్వమునకు నాలుగేసి పంక్తుల (మొత్తము ౩౬ పంక్తుల) అక్షరములు చెక్కబడియున్నవి. చిరకాలము భూస్థాపితమై యుండిన కారణమున నచ్చటచ్చట చిలుమువల్ల నొకటిరెండక్షరములు మాసిపోయియున్నను శాసనమంతయు చక్కని స్థితియందుండుటచేత చదువుట కేకష్టమును లేకపోయినది. అక్షరము లన్నియు చక్కగ జెక్కబడి తిన్ననిరూపు గలిగియున్నవి. మొదటి నాలుగు రేకుల యొక్క ద్వితీయపార్శ్వమున రేకుల సంఖ్యను దెల్పెడి యంకెలు గలవు. ఐదవ రేకుపై నట్టి సంఖ్య కానరాదు. అంకెలయం దొక విశేషము గాన్పించుచున్నది. మొదటి రేకుపై ౧-టియు, దాని క్రింద శ్రీ కారమును చెక్కబడియున్నవి. ౧-టవ యంకె యొక్క రూప మిప్పటి యంకెయొక్క రూపము

వలెనే యున్నను రెండవ మూడవసంఖ్యలను దెల్పుటకు ప్రత్యేక చిహ్నముల నుపయోగింపక రెండవదానిచోట నొకటవయంకెను రెండుపర్యాయము లొకదానిక్రింద నొకటిగను, నిట్లే మూడునకు బదులు ఒకటవయంకె పై విధముననే మూడు పర్యాయములును వ్రాయబడి యుండుటయు, నాలుగవరేకుపై నాలుగవయంకెను దెల్పు ప్రత్యేకచిహ్నము గానవచ్చుటచేతను శాసనము లిఖింపబడిన కాలమున ౨, 3 అంకెలను దెల్పుటకు ప్రత్యేకచిహ్నములు లేకయుండెనని తోచుచున్నది.

ఇందలి యక్షరములు ఉరువపల్లి శాసనములోని వానివలె నున్నవి. ఉరువపల్లి శాసనాక్షరములయంత చక్కదనము మిందలి యక్షరములకు లేకున్నను పోడిమి చెడక రూపసౌష్ఠవమును గలిగి పొంకముగ నున్నవి. ఉరువపల్లి శాసనాక్షరములకు గుహాక్షరములని ఫ్లీటు గారు నామకరణము జేసియున్నారు. వీనినే జో'వో' దూ్ర్బేగారు నిక్కమైన పెట్టెతలకట్టక్షరము లనిరి. పెట్టెతలకట్టుల స్వరూపమును దూ్ర్బేగా రీవిధమున వర్ణించియున్నారు:

"'పెట్టెతల యక్షరములను ద్వివిధములుగ విభజించు చున్నాను. అక్షరములతలపై సమభుజచతురస్ర మేర్పడునట్లు నాలుగు చిన్నగీట్లను జెక్కి, వాని మధ్యప్రదేశమును జెక్కక యట్లే నిల్పిన నది సహజమైన పెట్టెతలయక్షర మనబడును.' (ఫ్లీటు: 'గుప్తశాసనములు' పుట ౧౯)

"టక్కు పెట్టెతలయక్షరము లక్లిష్టతరములు. అక్షరముతలపై లేఖకుడు సమభుజచతురస్ర మేర్పడునట్లు గండరించిన నది టక్కు పెట్టెతల యగును." [1]

1. Ancient History of the Deccan, P. 97

ఉరువపల్లి శాసనములోనివి సహజమైన పెట్టెతలయక్షరము లని దూబ్రేగారు సిద్ధాంతీకరించి యున్నారు. ప్రస్తుతము పరిష్కృత మగుచుండు నెడుఙ్గరాయ తామ్రపట్టికయందును నురువపల్లి శాసనము వంటి యక్షరములు గానవచ్చుచుండుటచే నవియు నిక్కపు పెట్టె తల యక్షరము లని చెప్పవలసి యున్నది.

లేఖకుడు ఈశాసనమును జాగ్రతతో జెక్కనను అచ్చటచ్చట ప్రమాదములు గానవచ్చుచున్నవి. రెండవ రేకు కడపటి "వినయస్యా నేక" యను పంక్తిని మూడవ రేకులోని తొలిబంతిగా మరల చెక్కి యున్నాడు. ఐదవ రేకు ప్రథమ పార్శ్వమున మొదటి గీటులో 'సమ్ప్రిదత్తః' యనుటకు బదులు 'సప్ప్రిదత్తః' యనియు, నట్లే యా రేకుయొక్క ద్వితీయపార్శ్వమున కడపటిపంక్తియందు 'తాంబ్ర పట్టికా' యనుటకు 'తాంబ్బ్రపట్టికా' యనియు వ్రాసియున్నాడు. మఱియు మూడవ రేకుయొక్క మొదటి ప్రక్కలోని మూడవ పంక్తి యందు 'విజయయశః' యనుటకుమారు 'విజయయగః' అనియు, నైదవ రేకు రెండవప్రక్క మొదటిబంతిలో 'పాపశ్శారీర' యనుటకు 'పాప శ్గారీర' యనియు వ్రాసియున్నాడు. ఇచ్చట 'శ' యొక్క పొట్టలోని యడ్డగీటును వ్రాయక మఱచుట వలన నది 'గ' యైపోయెను. మఱియు నీశాసనములో 'త' 'భ' 'న' లకు పెక్కుస్థలములయందు భేదము గాన్పింపకున్నది. సందర్భమునుబట్టి యక్షరములను గుర్తింప వలసియున్నది. 'స' 'య' లన్నియు నొక్కతీరున నుండలేదు. అను స్వారము వ్రాయువిధము భిన్నముగ గన్పడుచున్నది. సాధారణ ముగ ప్రాచీన శాసనములలో పెక్కంటియం దనుస్వారము వచ్చు తావుల నుత్తరాక్షరముతలపై జుక్క నిడు నాచారము గానవచ్చు చున్నది. ఇందు కొన్నిస్థలములలో (చూ: 2. మొ. ప్ర. ౨ గీటు, సింహావమ్మర్జ) నీసంప్రదాయానుసార మనుస్వార ముత్తరాక్షరమగు హ' తలపై వ్రాయబడియున్నను, మఱికొన్నిచోట్ల (చూ: 3.

మొ. ౹ ప్ర. ౧ గీటు, సంరజ్ఞన) అనుస్వారసూచకము గు చుక్క పూర్వాక్షరము గు 'స' మీద గానవచ్చుచున్నది. 'ణ' వత్తు రెండు విధముల వ్రాయబడియున్నది. కొన్నితావుల 'ణ' కారమునే మరల నది సంయుక్తమై వచ్చు హల్లుక్రింద వ్రాయుటవల్ల దెల్పబడినను (చూ: ౮ రే. ౧ ప్ర. 3 గీ. కణ్ణస్వామి'), ఇతరత్ర అన్యవిధ ముగ సూచింపబడియున్నది. ఇట్టి స్థలములయందు 'ణ'వత్తు ఇప్పటి 'న'వత్తును బోలియున్నను 'న'వత్తుయొక్క పొట్టయం దైమూలగ గుడినుంచి యెడమవైపునకు వ్రాయబడిన సూక్ష్మరేఖతో గూడి యున్నది (చూ: ౮ రే. ౧ ప్ర. 3 గీ. 'కణస్వామి' ౫ రే. ౨ ప్ర. 3 గీ. 'కృష్ణపక్షే'). ఇట్లే 'మ్' సైతము రెండు తెఱగుల వ్రాయబడి యున్నది. సామాన్యముగ బంక్తికిదిగువ చిన్న 'మ'కారము వ్రాసిన 'మ్' అగును; కాని ౫ రే. ౨ ప్ర. ౮-వ బంతిలోని 'దశ్యామ్' అను చోట నీ వ్యంజన మిప్పటి యర్ధానుస్వారమువలె వ్రాయబడి యున్నది.

## గుణింతము

హల్లులతో గూడివచ్చు అచ్చులలో 'ఇ' 'ఈ' లకు పెక్కు ప్రాచీనశాసనములవలెగాక వానిని సులభముగ గుర్తించుటకై వ్రాతయందు చిన్నభేదము జూపబడియున్నది. ఇప్పటివలె నక్ష రముతలపై గుడినివ్రాసిన 'ఇ'కారమును, ఆగుడితో గిరికజుట్టిన 'ఈ'కారమును నగును. రేఫము వెనుక వచ్చు హల్లు ప్రాచీనశాస నములందుబోలి ద్విత్వమును బొందును. ఇప్పుడు మనము సామాన్య ముగా అనుస్వారము వ్రాయుచోట్ల దానికి బదులు 'మ'కారము ఉత్తరవర్ణముతో సంయుక్తముగ వచ్చును.

## శాసనభాష

ఈ శాసనములోని భాష సంపూర్ణముగ సంస్కృతము. అంతయు వచనమే. సామాన్యముగ శాసనాంతమున గనబడు ఫల

శ్రుతిశ్లోకములుగూడ నిందు గానరావు. తత్కారణమున నిది యసమగ్రమేమో యను శంక కలుగవచ్చును. కాని శాసనాంతమున 'తాంబ్రపట్టికా'యను కడపటిమాటకు వెనుక రెండంగులముల స్థలము ఖాళీగ విడిచియుండుటచేత నిది సమగ్రమనియే తోచుచున్నది.

## శాసనగ్రంథము

విజయపలక్కడ స్థానమునుండి స్కన్దవర్మ మహారాజప్రపౌత్రుడును, వీరవర్మమహారాజ పౌత్రుడును, స్కన్దవర్మమహారాజ పుత్రుడును, బప్పభట్టారక మహారాజ పాదానుధ్యాతుడును, పరమభాగవతుడును, భారద్వాజుడును, పల్లవులయొక్క యువమహారాజును నైన విష్ణుగోపవర్మయొక్క వచనముచేత శ్రీసింహవర్మ మహారాజుయొక్క పండ్రెండవ (ద్వాదశమే) రాజ్యవర్షమున జ్యేష్ఠ మాసకృష్ణపక్ష త్రయోదశినాడు ముండ రాష్ట్రములోని నెడుఙ్గరాయ గ్రామము శారణికగ్రామముగ జేయబడి శారణిక నడిప్పి. లేక నడిపి భోజదొడ్డిస్వామి కణ్ణస్వామి నందిస్వాము లనువారికి సర్వ బాధాపరిహారముగ దత్తము సేయబడెను. ఈ గ్రామము మూడు భాగములుగ విభజింపబడి యందు రెండుపాళ్లు నడిపిభోజకునికిని, మిగిలిన యొకభాగమును మూడుపాళ్లు చేసి వానియందు రెంటిని కణ్ణస్వామికిని, మిగిలినదానిని నందిస్వామికిని సర్వబాధాపరిహారముగను, నాయుక్తక నైయ్యోగిక రాజవల్లభ సఞ్చరన్తపరిహారముగను దానము సేయబడెను.

ఈ శాసనమున బేర్కొనబడిన పల్లవయువమహారాజ విష్ణుగోపవర్మది మఱియొక శాసనము కలదు. దీనికి ఉరువపల్లిశాసనమని చరిత్రకారులు నామకరణముజేసియున్నారు. ఈ తామ్రశాసనమెచ్చట దొరకెనో, యిప్పు డది యెచ్చట నున్నదో తెలియదు.

సర్ వాల్టర్ ఎల్లియటుగారి ప్రాచీన గ్రంథసంచయమం దడగి యున్న దీని ప్రతిబింబమును సంగ్రహించి ఫ్లీటుగారు ఇండియన్ ఆంటిక్వెరి ౫-వ సంపుటము (పుటలు ౫౦-౫౩)లోఁ జక్కగ పరిష్కరించి ప్రకటించియున్నారు. మొత్తముమీద ఉరువపల్లి శాసనపు బ్రశస్తియు, నిందలిప్రశస్తియు నొక్కతీరుననే యున్నను రెంటికి నచ్చటచ్చట నల్పభేదములు గాన్పించుచున్నవి; కాని యవి యంతగ పరిగణింపవలసినవి కావు. ఈప్రశస్తులయం దెన్నబడిన పల్లవరాజ బిరుదావళియం దుక్తమైన యంశములలో గొన్నిటిని గూర్చి యించుకంత వ్రాయవలసియున్నది.

౧. శాసనదాతయగు యువమహారాజ విష్ణుగోపుని తండ్రియగు స్కన్దవర్మమహారాజు "లోకపాలానాం పంచమస్య లోకపాలస్య" యని కీర్తింపబడియున్నాడు. ఈవాక్యము సామాన్యముగ ప్రాచీన పల్లవరాజుల సంస్కృతదానశాసనములయందు గానవచ్చుచున్నది. ఇందువల్ల దెలియవచ్చు విశేషచరిత్రాంశ మేదియు లేదు. కాని శాసనకాలమునాటి మత సంప్రదాయమును గొంత తెల్పుచున్నది. లోకపాలురను గూర్చి ఫ్లీటుగా రిట్లు వ్రాసియున్నారు: "లోకపాలురన దిగధిదేవతలు- తూర్పునకు ఇంద్రుడు, దక్షిణమునకు యముడు, పశ్చిమమునకు వరుణుడు, ఉత్తరమునకు గుబేరుడు. సామాన్యముగ బైబేర్కొనిన నలుగురితో నాగ్నేయమున కగ్నిని, నైరృత్యమునకు నిర్‌ృతి (లేక సూర్యు)ని, వాయవ్యమునకు వాయుదేవుని, ఈశాన్యమున కీశాను (లేక సోము) ని (నధిదేవతలుగజేసి) లోకపాలు రెనమండ్రని చెప్పుదురు" ఇది వాస్తవమే యైనను విష్ణుగోపమహారాజుకాలమున లోకపాలురు నలుగురనియే యప్పటివారి నమ్మకమైనట్లు తోచుచున్నది. కాళిదాసుని కాలమందును దిక్పాలురు నలువురే యని

"ఇయం మహేంద్రప్రభృతీ నధిశ్రియ
శ్చతుర్దిగీశా నవమత్య మానినీ,
అరూపహార్యం మదనస్య నిగ్రహాత్
పినాకపాణిం పతి మాప్తు మిచ్ఛతి"

అను కుమారసంభవ శ్లోకమువల్ల (౫-౫౩) వెల్లడి యగు చున్నది.

౨. విష్ణుగోపమహారాజు 'కలియుగ దోషావసన్న ధర్మోద్ధరణ నిత్యసన్నద్ధు'డనియు, 'ధర్మవిజిగీషు' వనియు స్తోత్రముసేయబడి యున్నాడు. ఈస్తోత్రపాఠములు అన్ని సంస్కృతపల్లవరాజశాసనము లందును గానరావు. రెండవ కుమారవిష్ణువు చెందలూరుతామ్ర శాసనములందును, [1] మొదటి నందివర్మయొక్క ఉదయేందిరము శాసనమునను, [2] యువమహారాజవిష్ణుగోపుని శాసనములందును, నితని పుత్రుడగు సింహవర్మ శాసనములందును గానవచ్చుచున్నవి. బిరుదులు వంశపారంపర్యముగ వచ్చు నాచారము వాడుకయం దుండుటచేతను, వీరి ప్రశస్తు లించుమించుగ నొక్కతీరున గాన వచ్చుటచేతను వీరందఱును నేకకుటుంబమునకు జెందినవా రై యుందు రనునూహ పొడముచున్నది. రెండవ కుమారవిష్ణువు యొక్క చెందలూరు శాసనమున నీ బిరుదులు ప్రథమమున గాన్పిం చుటచేత మొదట వీనిని బడసినవా డారాజే యైయుండునని తోచు చున్నది.

మఱి కలియుగదోషావసన్నమై నశించిపోవుచుండ నీ మహా రాజులు చెడనీక ఉద్ధరించిన ధర్మమెద్ది? ఈ విషయము నెఱుంగుటకు పూర్వ మీరాజు లవలంబించిన మత మెద్దియో కనుగొనుట యవ

1. ఎపి, ఇండి. VIII, పు. ౨౩౩ మొదలు.
2. ఎపి. ఇండి. III, పు. ౧౪౨ మొ.

సరము. వీరి శాసనములన్నియు "జితం భగవతా" యని యారంభ మగుచుండుటచేతను, వీరందఱును "భగవత్పాదానుధ్యాతు"లమని చెప్పుకొనుటనుబట్టియు వీరు భాగవత సంప్రదాయానుసారు లగుట తెల్లము. శివభాగవతులు కొందరుండినట్లు కొన్ని నేపాళదేశశాసన ములవల్ల దెలియుచుండుటచే వీ రొకవేళ శైవులైయుండినను నుండ వచ్చును. వైష్ణవులైనను, శైవులైనను హిందువులే. కావున వీ రుద్ధ రించిన ధర్మము హిందూధర్మ మనుట నిస్సంశయము. ఇక నీ ధర్మ మును నాశనముసేయుచున్న కలియుగదోష మెద్దియో కనుగొనవలసి యున్నది. ప్రాచీనకాలమునందు, అనగా క్రీస్తుశకాదిమ శతాబ్దముల యందు దక్షిణదేశమునందు, ముఖ్యముగా పై బేర్కొనబడిన రాజు లేలిన రాష్ట్రమున, బౌద్ధజైనమతములు ప్రబలి జనసామాన్యము యొక్క యాదరణమునకు బాత్రములై యుండెనని పెక్కు నిదర్శన ముల మూలమున దెలియవచ్చుచున్నది. శంకరాచార్యాది హిందూ మత సంస్కర్త లందఱును స్వమతస్థాపనకు బూర్వము బౌద్ధజైన మతములను దమ గ్రంథములయందు దెగనాడియున్నారు. కావున కలియుగదోషము బౌద్ధజైనధర్మముల రూపము నంది హిందూధర్మ మును బాధింపదొడగెను. వీని యుపద్రవమువలన రూపుమాసి పోనున్న హిందూధర్మమునే ఈ మహారాజు లుద్ధరించినది. తత్కా రణముననే తాము ధర్మమహారాజులమని సగర్వముగ జెప్పికొనిరి. 'ధర్మవిజిగీషో' యను వాక్య మాకాలమున మతఘర్షణ యుండెనని సూచించుచున్నది.

## వంశావళి

ఈ శాసనోక్తదానము నొసగినరాజు పల్లవ వంశజుడు, స్కన్దవర్మ మునిమనుమడు, వీరవర్మ మనుమడు, [illegible]ర్మ పుత్రుడు. ఉరువపల్లిదాన శాసనము నిచ్చినవాడును నీతడే. ఇందలి వంశవృక్ష మిది:–

స్కందవర్మ
.
వీరవర

స్కందవర్మ
|
యు. మ. విష్ణుగోపవర్మ

వీరుగాక మహారాజు సింహవర్మ యొక్క డిందు జేర్కొన బడియున్నాడు. ఈ సింహవర్మ యెవ్వడు, ఇందు జెప్పబడిన పల్లవ వంశమునకు గంచినేలిన పల్లవరాజులతో గల సంబంధ మెట్టిది అను విషయములను నిర్ధారణజేసి చెప్పుటకు దగు నాధార మీ శాసన మున గాని, యురువపల్లి శాసనమున గాని కానరాదు. ఒక్క విషయ మునుమాత్రము నిశ్చయించి చెప్పవచ్చును. శాసనదాతయగు విష్ణు గోపవర్మ యువమహారా జగుటచేతను, దానశాసనము సింహవర్మ మహారాజుయొక్క ద్వాదశ రాజ్యవర్షమున నిల్చియుండుటచేతను, దాన మొసగిన కాలమున సింహవర్మ పల్లవరాజ్యముపై ప్రభుత్వము సల్పుచుండె ననియు, నతనిక్రింద విష్ణుగోపవర్మ యువమహారాజ పదము వహించి రాజ్యమునం దొకకొంత భాగమున కధిపతియై పరి పాలన మొనర్చుచుండె ననియు దృఢముగ బల్కవచ్చును. మఱియు రాజునకు యువమహారాజుతోడి సన్నిహితబాంధవ్యము గలిగి యుండుట సామాన్యమగుటచే నట్టి బాంధవ్య మీ సింహవర్మ విష్ణు గోపవర్మలకుగూడ గలిగియుండవచ్చు ననియు నూహసేయవచ్చును. కాని యా బాంధవ్యస్వరూపమును నిర్ధారించుటకు దగిన యాధార ములు గానరావు. తగిన యాధారములు లేకున్నను పరిశోధకపండి తులు పెక్కు ఊహలను గావించియున్నారు.

ఉరువపల్లిశాసనమును బరిష్కరించు సందర్భమున ఫ్లీటుగా రిట్లు వ్రాసియున్నారు: ''ఇందు విష్ణుగోపవర్మ యువమహారా జని

చెప్పబడియుండుటచేత (దీనియొక్క) కడపటి రెండు పంక్తులయందు రాజ్యపాలన మొనర్చుచుండినట్లు పేర్కొనబడిన సింహవర్మ ప్రాయశః అతని యన్నయైయుండవచ్చును."[1] ఈ యభిప్రాయాను సారము ఉరువపల్లిశాసనమునను, ప్రస్తుతము పరిష్కరింపబడుచున్న నెడుజ్గరాయ శాసనమునను వర్ణింపబడిన పల్లవవంశవృక్ష మిట్లు రూప మందుచున్నది:

స్కందవర్మ

వీరవర్మ

స్కందవర్మ

సింహవర్మ          యు. మ. విష్ణుగోపవర్మ

ఫ్లీటుగారి యభిప్రాయమును పెక్కమంది పరిశోధకపండితు లంగీకరించినను కొందఱి కది నచ్చదాయెను. వీరియందు ముఖ్యులు హూల్ట్జ్షు గారు. ఫ్లీటుగారి సిద్ధాంతమును నిరసించుటకు వీరు చూపిన కారణ మిది, ఉరువపల్లి శాసనమువల్ల సింహవర్మ విష్ణుగోపవర్మలకు గల బాంధవ్య మిట్టిదని తెలియదు. అన్యాధారములవల్ల విష్ణుగోప వర్మకు సింహవర్మ యను సోదరు డుండెనని తలచుటకు వీలుపడదు. మఱి యిందు పేర్కొనబడిన సింహవర్మ యెవ్వడని సుదూరము చింతింప నవసరములేదు. అతడు పికిర మంగళూరు శాసనముల దాతయు, యువమహారాజ విష్ణుగోపవర్మ యొక్క పుత్రుడును నైన సింహవర్మయే. ఈ సింహవర్మ సింహాసనము నధిష్ఠింపకపూర్వమే ఇతని తండ్రియగు విష్ణుగోపవర్మ తానింకను యావరాజ్యపదము

1. Indian Antiquary, V. P 50.

ననుభవించుచుండగనే మృతిచెందెనని తలపవలసిన యక్కర లేదు. సింహవర్మరాజ్యకాలమున నాతడు సజీవుడుగనే యుండవచ్చును. విష్ణుగోపవర్మ తన తండ్రియగు రెండవ స్కందవర్మ యనంతరము రాజ్యకాంక్ష లేకపోవుటచేతనో, లేక యనివార్యమైన యాటంకముల చేతనో పట్టాభిషిక్తుడు కాకపోగా నతని పుత్రుడైన సింహవర్మ స్వయము పితామహుడైన స్కందవర్మ యనంతరము సింహాసనము నధిష్ఠించి యుండవచ్చును. కావున ఉరువపల్లి శాసనమున పేర్కొన బడిన సింహవర్మ విష్ణుగోపవర్మయొక్క పుత్రుడేకాని సోదరుడు కాడు."[1]

హూల్ట్జ్షు గారివలె రావుబహదూరు సి. ఆర్. కృష్ణమాచార్యులవారును ఉరువపల్లి శాసనమున పేర్కొనబడిన సింహవర్మ యువమహారాజ విష్ణుగోపవర్మ యొక్క పుత్రుడే యని యభిప్రాయ పడుచున్నను, హూల్ట్జ్షుగారి వాదమును సంపూర్ణముగ నంగీకరింపక భిన్నసిద్ధాంతము నొకదాని బ్రతిపాదించియున్నారు. యువరాజు, లేక యువమహారాజను బిరుదుతోగూడ పేర్కొనబడినంత మాత్రముననే విష్ణుగోపవర్మ సింహాసనము నధిష్ఠింపలేదని చెప్పుట తగదు. ఈ బిరుదాతడు రాజ్యాభిషిక్తుడాయెననుటకు నిరోధము కాజాలదు. పూర్వచాళుక్యరాజగు మంగి సర్వసామాన్యముగ శాసనము లన్నిటియందును మంగి యువరాజని పేర్కొనబడినను మూర్ధాభిషిక్తుడై సింహాసనము నధిష్ఠించి పెక్కేండ్లు రాజ్యపాలన మొనర్చినట్లు తెలియవచ్చుచున్నది. మంగి యువరాజును బోలి యువమహారాజ విష్ణుగోపవర్మయు సింహాసనముపై గూర్చుండి రాజ్యపరిపాలన మొనర్చి యుండవచ్చును. యువమహారాజ విష్ణుగోపవర్మచే మొదట నీయబడిన యురువపల్లి శాసన మేకారణముచేతనో ఆతని కుమారుడగు సింహవర్మచే దన పదునొకండవ రాజ్యవర్షమున బ్రకటింపబడెను.

---

1. ఎపి. ఇండి. సం. ౮. పుట ౧౫౯ మొ.

ఇందువల్ల పైఁ బేర్కొనిన పరిశోధక పండిత మహాశయు లొండొరుల సిద్ధాంతముల నంగీకరింపక భిన్నాభిప్రాయముల వెలిబుచ్చుచున్నారని తెల్లమగుచున్నది. లభ్యమైన యాధారములవల్ల వ్యక్తములైన యంశములనన్నిటిని సమాలోకనము జేసి చూడగా ఫ్లీటుగారి సిద్ధాంతమే సర్వవిధముల నంగీకార్యమని తోఁచుచున్నది. రాజు యొక్క కొడుకుగాని, కొడుకు లేనిచో దమ్ముడుగాని యౌవ రాజ్యపట్టాభిషిక్తుడగుట సర్వసామాన్యము గావునను, ఉరువపల్లి శాసనమున విష్ణుగోపవర్మయొక్క తండ్రిపేరు స్కందవర్మ యని యుండుటచేతను, రాజ్యమేలు ప్రభువు పేరు సింహవర్మ యని యుండుటవల్లను ఫ్లీటుగారు సింహవర్మ విష్ణుగోపుని యొక్క సోదరుడని చెప్పిరి. ఈ యభిప్రాయము సరికాదని త్రోసిపుచ్చిన హూల్ట్జుగారి సిద్ధాంత మెంత సమంజసమో కనుగొందము. కుమారుడు రాజై రాజ్యము సల్పుచుండగా నతనిక్రింద తండ్రి యువరాజుగ రాష్ట్రములో నొక భాగమున కధికారియై యుండుట నెచ్చటను గానము. విష్ణుగోపవర్మకు రాజ్యకాంక్ష లేకపోవుటచేతనో, కాదేని యతని రాజ్యాభిషేకము ప్రతికూల సందర్భములవలన జరుగకపోవుట చేతనో యాతడు రాజు కాకపోయెనని తలచుట కాధారము లెవ్వి? ఇవియు నూహ లేకదా! ఫ్లీటుగారి యూహాకంటె నిది సమంజసతరమని నాకు దోపదు. మఱియు రావుబహదూరు కృష్ణమాచార్యులవారు చెప్పినట్లు విష్ణుగోపవర్మ రాజ్యానంతరము, మొదట నాతనిచే నీయబడిన దానము, దరువాత పదునొకండు సంవత్సరముల కాతని పుత్రుడగు సింహవర్మచే ప్రకటింపబడె ననుటయు నొప్పదగిన మాట కాదు. ఉరువపల్లి శాసనమునందును, నెడుఙ్గరాయశాసనమునందును "విష్ణుగోపస్య వచనేన ముండరాష్ట్రే...గ్రామేయకాః వ్యక్తవ్యాః" అని యుండుటచేత నీదానముల నొసగిన కాలమున విష్ణుగోపవర్మ సజీవుడై యావరాజ్యాధిపత్య మొనర్చుచునేయుండెనని స్పష్టమగుచున్నది;

కావున శ్రీ కృష్ణమాచార్యులవారు ప్రతిపాదించిన సిద్ధాంతముగూడ 'సింహవర్మ సమస్య' కు దృష్టికరమగు జవాబు నివ్వజాలకున్నది. కృష్ణమాచార్యులవా రీసందర్భమున గమనింపక విడిచిన యంశము లోక కొన్నిటి నిచ్చటఁ బేర్కొనవలసిన యవసరము కొంత కలదు. కొంచె మించుమించు ఈకాలమునకు సంబంధించిన పాశ్చాత్య గంగ రాజుల శాసనములవల్ల బల్లవరాజ చరిత్రను గూర్చిన యంశములు కొన్ని తెలియవచ్చుచున్నవి. ఈ శాసనములయందు ముఖ్యమైనవి- (1) కుడితియం తామ్రశాసనము,[1] (2) చీకట్టూరు తామ్రశాసనము,[2] (3) పెనుగొండ రాగిశాసనము,[3] (4) నల్లాల తామ్రశాసనము,[4] ఈ శాసనములలో వర్ణింపబడిన గంగ రాజుల వంశ మిది.

కొంకణివర్మ
|
మాధవవర్మ
|
ఆయ్య, లేక అర్య, లేక హరివర్మ — సింహవర్మ

(రెండవ) మాధవవర్మ లేక సింహవర్మ — విష్ణుగోపవర్మ

అవినీత

దుర్వినీత

1. MAR 1932 P 124 F 2. Ibid 1924 P 79
3. EP. Ind. XIV. P 331 4. MAR 1921 P. 69

పై వంశవృక్షములోని హరివర్మ పుత్రులగు సింహవర్మ యను నామాంతరముగల రెండవ మాధవవర్మయు, విష్ణుగోపవర్మ హరివర్మ యనుజుడగు కృష్ణవర్మ యొక్క కుమారుడు సింహవర్మయు నొక్క తరమువారు. ఇందువల్ల పాశ్చాత్యగంగవంశమునందు నాల్గవతరము రాజులలోనిద్దరు సింహవర్మలును, నొక్క విష్ణుగోపవర్మయు నుండినట్లు విశదమగుచున్నది. మఱియు నీసింహవర్మ, విష్ణుగోపవర్మ నామములు దక్షిణదేశమును పాలించిన రాజులలో పల్లవులయందే సామాన్య ముగ గానవచ్చుచున్నవి. అందును ముఖ్యముగ విష్ణుగోపనామము పల్లవవంశమునదప్ప మఱియెచ్చటను గానరాదని చెప్పవచ్చును. అగునేని పాశ్చాత్యగంగవంశమున నీ పేర్లు గానవచ్చుటకు గారణ మేమి? రెండవ మాధవవర్మకు సింహవర్మ యను నామము కోరి యిడిన మారుపేరని తోచుచున్నది. పెనుకొండతామ్రశాసనము దీనికి గల వాస్తవకారణమును దెల్పుచున్నది.[1] "శ్రీ పల్లవకులేంద్రేణ సింహవర్మమహారాజేన యథార్హ్వమభిషిక్తస్య గంగరాజస్య ఆయ్య వర్మణః పుత్రేణ ..పల్లవానాం శ్రీ స్కందవర్మ మహారాజేన యథార్హ్వ మభిషిక్తేన గంగానాం మాధవమహాధిరాజేన సింహ వర్మణా బ్రాహ్మణాయ...ప్రదత్తాః"[2] రెండవ మాధవర్మకు సింహ వర్మయను నామాంతరము గలుగుటకు కారణ మిందువల్ల స్పష్ట మగుచున్నది. ఇతని తండ్రియగు ఆయ్య లేక, హరివర్మ పల్లవ రాజగు సింహవర్మకు అనుచరుడైన సామంతరాజు. ఒక రాజు యొక్క అధికారమునకు లొంగి కప్పముకట్టు సామంతరాజులు తమ రాజభక్తినిగాని, పారతంత్ర్యమునుగాని తెల్పుటకై తమ్మేలిన ప్రభువుల పేర్లను తమబిడ్డల కిడుట యాచారము. ఈ యాచార మును జక్కన విక్రమార్క చరిత్రలో (౮-౬౦) సాహసాంకునికడకు

1. EP. Ind. XXIV, P 237. 2. EP. Ind. XIV, P 334.

వచ్చిన శకమహీపతి దూతయొక్క వాక్యము విదితము సేయు చున్నది.

"ప్రియతనూజుల పేళ్లు పెట్టి పెంపొందిరి
మాళవనేపాళ మగధపతులు"

ఈ యాచారము ననుసరించియే గంగరాజగు హరివర్మ తన యేలికయైన సింహవర్మ పేరు దన జ్యేష్ఠకుమారున కిడెను. ద్వితీయ పుత్రునకు విష్ణుగోపుడని నామకరణము జేసినదికూడ నీ కారణము చేత నేయని యూహించెదను. గంగరాజు తన పుత్రులలో జ్యేష్ఠునికి సింహవర్మయనియు, గనిష్ఠునికి విష్ణుగోపవర్మ యనియు పేరుపెట్టు కొనుటను జూడ పల్లవరాజైన సింహవర్మకు గూడ విష్ణుగోపు డను తమ్ముడొక డుండియుండవలయు నను నూహ పొడముచున్నది.

ఈ సందర్భమున పరామర్శింపదగిన విషయ మొక్కటి కలదు. పెనుగొండతామ్రశాసనమువలన సింహవర్మ స్కందవర్మ లను రెండుతరముల పల్లవరాజులు రాజ్యము సేయుచుండినట్లు తెలియుచున్నది. ఈ పేరుగల రాజులు పల్లవవంశమువా రీకాలమున నెవ్వరేనియు గలరేమో విచారించవలసి యున్నది. మొదటి నంది వర్మనాటి యుదయేందిరశాసనమున కంచియందు రాజ్యమొనర్చిన పల్లవరాజకుటుంబ మొకటి వర్ణింపబడియున్నది.[1] అందలి వంశమిది :

స్కందవర్మ
|
సింహవర్మ

స్కందవర్మ
|
నందివర్మ

1. EP. Ind. III, 142

ఈ శాసనములోని ప్రశస్తిని ఉరువపల్లి నెడుఙ్గరాయాది శాసనములతో బోల్చిచూచిన వీని ప్రశస్తులన్నియు నొక్కతీరున నే యున్నవనియు, నొక్క వంశస్థులగు రాజులకే చెందినవనియు దెల్లము కాగలదు. ఉదయేందిరశాసనములోని సింహవర్మ యొక్క తండ్రిపేరు స్కందవర్మ; ఉరువపల్లి నెడుఙ్గరాయ శాసనములోని విష్ణుగోపవర్మ తండ్రిపేరును స్కందవర్మయే. మఱియు విష్ణుగోపవర్మ యౌవరాజ్యము సల్పుచుండగా నొక సింహవర్మ రాజ్యము సల్పు చున్నట్లీశాసనములు దెలుపుచున్నవి. కావున నీ సింహవర్మయు, నుదయేందిరశాసనములోని స్కందవర్మ పుత్రుడగు సింహవర్మయు నొక్కడే; భిన్నపురుషులుగారు. పై జెప్పిన యంశముల నన్నిటిని పర్యాలోచించి చూడగా ఫ్లీటుగారి సిద్ధాంతమే సమంజసమైనదని నాబుద్ధికి దోచుచున్నది.

## శాసనకాలము

అక్షరముల సవ్వడిని జూడగా ఉరుపల్లి శాసనముతోబాటు నెడుఙ్గరాయశాసనమును క్రీ. శ. ౫-వ శతాబ్దమునాటిదని స్థూలముగ జెప్పవచ్చును, పెనుగొండ శాసనమును విమర్శించుచు ఫ్లీటుగారు సింహవర్మ క్రీ. శ. ౪౩౬ మొదలుకొని ౪౬౦ వఱకును రాజ్యము జేసినట్లు చెప్పియున్నారు.[1] 'లోకవిభాగ'మను జైన గ్రంథమున నా గ్రంథము యొక్క రచన శకాబ్దము ౩౮౦-వ సంవత్సరమునకు సరియైన కాంచీపురాధీశ్వరుడగు సింహవర్మ యొక్క ౨౨-వ రాజ్యవర్షమున ముగిసినట్లు వ్రాయబడియున్నది. దీనిబట్టి చూడ సింహవర్మ యొక్క రాజ్యాభిషేకము శకాబ్దము (౩౮౦ - ౨౨ =) ౩౫౮-వ సం.వ. అనగా క్రీ. శ. ౪౩౬ వ సం.న నడిచినట్లు తేలుచున్నది. నెడుఙ్గరాయశాసనము సింహవర్మయొక్క పండ్రెండవ రాజ్యవర్షమున నీయబడెను గావున దానికాలము క్రీ. శ. ౪౪౮-వ సంవత్సరమని చెప్పవలసి యున్నది.

1. J. A. R. S. July 1915

నెడుజ్గరాయ గ్రామమును దానముగొన్న ప్రతిగ్రహీతలుముగ్గురు. వీ రెవ్వరన, (౧) శారణిక నడిపిభోజ దొడ్డిస్వామి, (౨) కణ్ణస్వామి (౩) నందిస్వామి. తామ్రశాసనములలో సర్వసామాన్యముగ బ్రతిగ్రహీతల శాఖా గోత్ర సూత్రములను వర్ణించుట యాచారము. ఇం దట్లుగాక గోత్రసూత్రాదుల ప్రశంస లేక కేవలము ప్రతిగ్రహీతల పేరులు మాత్రము గానవచ్చుచున్నవి. కణ్ణస్వామి నందిస్వాములను గూర్చి ఏమియు దెలియకున్నను దొడ్డిస్వామి యొక్క స్థితి సంగ్రహముగ 'శారణిక', 'నడిపిభోజ' శబ్దములవలన వ్యక్తమగుచున్నది. ఈ రెండు మాటలును రాజ్యతంత్రమున దొడ్డిస్వామి యొక్క పదవిని సూచించుచున్నవి. ఇందు 'శారణిక' పదము 'శరణ' శబ్దము నుండి పుట్టినది. శరణ మనగా రక్షణము. శారణికు డన రక్షణము నొసగువాడు. ఈ శారణికుడు ఎవరి బారినుండి యెవ్వరిని రక్షించుచుండెనో కనుగొనుటకు దగిన సాధనము లింకను లభ్యపడ లేదు. విష్ణుగోపవర్మ నెడుజ్గరాయ గ్రామమును శారణిక గ్రామముగ జేసి దొడ్డిస్వామ్యాదుల కిచ్చుటవలన శారణిక గ్రామాధిపతి శారణికుడనియు, నట్టి గ్రామములు రాజశాసనములవల్ల నేర్పడుచుండిన వనియు ఊహసేయవచ్చును. ఈ శారణిక గ్రామమునకును, నరవశాసనములయందు బేర్కొనబడు 'అజ్ఞినాన్ పుగలిడము'నకును భేదము లేదనియు, శారణికగ్రామమే అజ్ఞినాన్ పుగలిడమనియు ప్రస్తావవశమున రావుబహదూరు సి. ఆర్. కృష్ణమాచార్యులవారు చెప్పియున్నారు. వీరి మాట సరియైన దనియు, శారణిక శబ్దార్థ మందువల్ల చక్కగా తెలియవచ్చుచున్న దనియు తలచెదను. అజ్ఞినాన్ పుగలిడ మనగా నార్తుల కభయస్థానమని యర్థము. ౧౯౨౯-౩౦-వ సంవత్సరపు దక్షిణ ఇండియా శాసనశాఖవారి కార్యక్రమ నివేదికయందు అజ్ఞినాన్ పుగలిడ మిట్లు వివరింప బడియున్నది: "తిరువాంకూరిసంస్థానములోని కొన్ని శాసనములవలన నా దేశపు

రాజులు గుడ్డలు నేయు కొన్ని తెగలవారు నివసించుటకై కొంత భూమిని ఖేటాయించి యందు నివసించువారలు రాజున కచ్చవలసిన పన్నులను వజాయిచ్చి, మఱికొన్ని కట్టడల నేర్పఱచి యట్టిస్థలముల కఞ్జినాన్ పుగలిడము (అనగా నార్తులకు అభయస్థానము) లని పేరిడిరి. ఈ విధముగ దన ప్రజలకు సాయమొనర్చుటచే వీరరామరామ వర్మ 'యఞ్జినాన్ పుగలిడ'మను బిరుదును వడసెను, (T- A. S. IV P, 98). ఉదయమార్తాండవర్మ యను నింకొకరాజు కొల్లం ౨౦౧-వ సంవత్సరమున కన్యాకుమారి ప్రాంతమున జేపలబట్టువారు నివసించుటకై 'ముట్ట' మను నిట్టి గ్రామము నొకదాని నిర్మించి, రావడి, తర్జన, ఇడములనుండి వారిని విముక్తుల గావించెను.''[1] ఇట్లే క్రీ. శ. ౧౩౩౭-వ సం.న వైనుమణ్కొండ శంబువరాయడు ఇప్పటి యుత్తర ఆర్కాడుజిల్లాలోని మిన్నల్ గ్రామమును అఞ్జినాఞ్ పుగలిడ గ్రామముగ జేసి యచ్చట నివసించు కైకోలవారును, గానుల వారును రాజున కచ్చవలసిన పన్నులను తగ్గించెను.[2] ఈ శాసనముల మూలమున 'అఞ్జినాఞ్ పుగలిడ' స్వభావము కొంత యెఱుక పడుచున్నది. ప్రస్తుతశాసనమునను ''అష్టాదశజాతిభిః పరిహారైరుపేతః'' అనియు, ''సర్వైనైయోగికాః రాజవల్లభాః సంచరంతశ్చ తద్గ్రామం తద్దైవ పరిహారైః పరిహరన్తు పరిహారయన్తుచ'' అనియు నుండుటచేత నిదియు, నఞ్జినాఞ్ పుగలిడమును నొక్కటియే యను నూహ దృఢపడుచున్నది.

ఇక నడిపిభోజకు డన నేమోకనుగొనవలసియున్నది. భోజకుడను మాట ప్రాచీన శాసనముల యందు పెక్కింటియందు గానవచ్చుచున్నది. హిరహడగల్లి శాసనమునందు 'గామగామ భోజకే' యని యుండుటవల్ల ప్రతి గ్రామమునకును నొక్క భోజకుడుండె నని

1. MER 1926-27 Part ii Para 54.

2. MER 1933-34 Part ii, Para 22

తెలియుచున్నది. మఱియు సామాన్యముగ నిది యొక గ్రామనామముతో గూడియే వచ్చుచుండుటచేత ఏ గ్రామముతో జేరి భోజక శబ్దము వచ్చునో ఆ గ్రామమున కాత డధికారి యని చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు. ఈ యభిప్రాయము ననుసరించి దొడ్డిస్వామి నడిప్పి, లేక నడిపి యను గ్రామమున కధికారి యని చెప్పవలసి యున్నది.

మఱియు నీ శాసనమున నాయుక్తకులు, నైయ్యోగికులు, రాజవల్లభులు, సంచరంతకులు నను నాలుగు తెగల రాజకీయోద్యోగులు పేర్కొనబడియున్నారు. కౌటిలీ యార్థశాస్త్రమున ఆయుక్తక పురుషు లనునొక తరగతి రాజసేవకులు వర్ణింపబడియున్నారు. వారే ప్రస్తుత శాసనమునందలి ఆయుక్తకులు కావచ్చును. రాజ్యతంత్రమునం దేకార్యము వారు సేయుచుండిరో నిర్ధారించి చెప్పుటకు వీలులేదు. నైయ్యోగికులన రాజకార్యమున నియోగింపబడినవారు. కౌటిలీయమున నియోగి నైయ్యోగిక ప్రస్తావన పెక్కుతావులందు గాన్పించుచున్నది. "సర్వనైయ్యోగికాః" అను ప్రస్తుతశాసనములోని మాటవల్ల నా కాలమున నీ నైయ్యోగికులు పెక్కు తెగలవారుండి రని తెలియుచున్నది. మధ్యయుగమునాటి యాంధ్రకర్ణాట శాసనములయందును, వాఙ్మయములందును నియోగులు డెబ్బదిరెండు తెగలవారుగ విభజింపబడియున్నారు. కౌటిల్యుని కాలము నుండియు నిట్టి విభజన కలదేమో నిశ్చయించి చెప్పుటకు సాధ్యము కాదు. రాజవల్లభు లనగా రాజునకు ప్రియులని యర్థము. వీరును ఆయుక్తకులబోలి రాజకీయోద్యోగులే యైనను వీరిని గురించి విశేషమేమియు తెలియదు. సంచరంతకులను గూర్చి పరిశోధకులయం దభిప్రాయభేదము గానవచ్చుచున్నది. ప్రస్తుత శాసనమునందువలె ఉరువపల్లి శాసనమునందును, 'సంచరంత' లనియే యున్నను, హిర

హడగల్లి శాసనమున 'సంచరంతకు'లని యున్నది.[1] ఫ్లీటుగారీ మాటకు ప్రయాణికులని యర్థము చెప్పియున్నారు.[2] బుహ్లరుగారు వేగులవారని యర్థము నిశ్చయించినారు.[3] కాని వీరు నిశ్చయించిన యర్థము సరిగాదని తోచుచున్నది. పికీర, మంగళూరు శాసనముల యందు[4] సంచరంతల స్థానమున శాసనసంచారణులు పేర్కొనబడి యున్నారు. సంచరంతిలును, శాసనసంచారణులును నొక్కరేయని నే ననుకొనుచున్నాను. పికీర శాసనమును ప్రకటించుచు హుల్ ట్జు గారును, మంగళూరు శాసనమును ప్రకటించుచు ఫ్లీటుగారును నీ మాటకు రాజాజ్ఞావాహకులని యర్థమును నిర్వచించియున్నారు. ఇదియే దీనికి సరియైన యర్థము. ఈ సందర్భమున రాజశాసనములను గూర్చి కౌటిలీయార్థశాస్త్రమున జెప్పబడిన విషయమును జ్ఞప్తి యందుంచుకొనవలసియున్నది.

'రాజాజ్ఞకే శాసనమని పేరు.' 'ప్రజ్ఞాపనము, ఆజ్ఞ, పరిదానము పరిహారము, నిసృష్టి, ప్రావృత్తికము, ప్రతిలేఖనము, సర్వత్రగము, అనియుగూడ శాసనవిషయములు'. 'జాతివిశేషములయెడను, నగర గ్రామ దేశముల యెడను రాజానుగ్రహమును సూచించునది పరి హారలేఖ.'[5] ప్రస్తుతము పరిష్కృతమగుచున్న నెడుజ్జరాయ తామ్ర పట్టిక పరిహారలేఖ యనబడును. "అష్టాదశజాతిభిః పరిహారై రుపేతః" అనియు, సర్వాయుక్తకా......తథైవ పరిహారైః పరిహరన్తు పరి హారయన్తుచ" యనియు శాసించుచుండుటచేత నిది నెడుజ్జరాయ గ్రామమునెడ రాజానుగ్రహమును సూచించుచున్నది. కావున సంచ రంత లన రాజాజ్ఞావాహకులనుట యొప్పును.

---

1. Ep. Ind. I. pp 2-10
2. Indian Antiquary. V. P 53.
3. Ep Ind. I. P 9.
4. Ep. Ind. VIII. P. 143, Indian Antiquary V. P. 154.
5. కౌటిలీయార్థశాస్త్రము (ఆంధ్రీకృతము) పుటలు ౩౭-౮.

## స్థలనిర్దేశము

ఈ శాసనోక్తప్రదేశములు నాలుగు ౧. ముండరాష్ట్ర, ౨. పలక్కడ, 3. నడిపి, లేక నడిప్పి, ర. నెడుఙ్గరాయ గ్రామము.

౧. ముండరాష్ట్రము పెక్కు పల్లవదాన శాసనములయందు బేర్కొనబడియున్నది. ఇది పల్లవరాజ్య విభాగములలో నొకదాని పేరు. ఇటీవల నీ రాష్ట్రమును గుర్తించుటకు పలువురు ప్రయత్నము సల్పిరి. కీ. శే. రావుబహాదూరు వి. వెంకయ్యగారు ముండరాష్ట్రము ఇప్పటి నెల్లూరు జిల్లాలో నిమిడియుండె నని స్థూలముగ సూచించిరి. రావుబహాదూరు సి. ఆర్. కృష్ణమాచార్యులవా రీముండరాష్ట్ర మర్వాచీనకాలపు నెల్లూరుజిల్లా శాసనములయందు గానవచ్చెడి ముండనాడేయనియు (చూ: నెల్లూరు నెం. ౧౯, 3౧, ౬౧, ౭౧, ౭౨, ౧౨౧), నీ నాటిలోని కణకువమైనవిగా జెప్పబడిన గ్రామము లిది యిప్పటి కోవూరు నెల్లూరు తాలూకాలకును, కందుకూరు తాలూకాలోని దక్షిణభాగమునకును సరిపోవునట్లు సూచించుచున్న వనియు దెల్పియున్నారు.[1] శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు ప్రాచీన ముండరాష్ట్రము, లేక ముండనాడు పై జెప్పిన కోవూరు తాలూకాకును, పశ్చిమమున కోవూరు సరిహద్దులలో నుండు ఆత్మకూరు తాలూకాలో గొంతభాగమునకును సరిపోవునని నిశ్చయించియున్నారు.[2] శ్రీముట్లూరు వెంకటరామయ్యగా రీముండరాష్ట్రము నెల్లూరుజిల్లాలోని పెన్నాసువర్ణముఖుల మధ్యప్రదేశమని నిశ్చయించిరి.[3] ఇట్లు ముండరాష్ట్రావధులను గూర్చి పరిశోధకుల యభిప్రాయములు భిన్నములుగ గాన్పించుచున్నవి. ఇంతవఱకు లభ్యమైన సాక్ష్యమును విమర్శించి చూడ, నా రాష్ట్రము యొక్క సరిహద్దు

1. EP. Ind. XXIV P. 30 n 5.
2. Journal of the Madras University 1940. Pp 142-43.
3. Journal of Oriental Research XII Pp 363-4.

లను చక్కగ నిర్ణయించి చెప్పుటకు వీలులేకపోయినను, నది యిప్పటికి నెల్లూరుమండలాంతర్గతమగు కోవూరు తాలూకాకును, నెల్లూరు తాలూకాలోని కొంతభాగమునకును సరిపోవునని దృఢముగ నిశ్చయింపవచ్చును.

౨. పలక్కడ : ఇది యువమహారాజవిష్ణుగోపుని రాజధాని. ఉరువపల్లి శాసనముగూడ నిచ్చటి నుండియే ప్రకటింపబడెను. ప్రాచీనశాసనములలో పెక్కింటియందు పలక్కక, పలాత్కట, పలక్కడ, పద్దుకరయను నామము గల స్థలములు పేర్కొనబడి యున్నవి. ఇవి యన్నియు నొక యూరిపేరేయని చరిత్రకారుల యభిప్రాయము (నాకట్టి నమ్మకము కుదురలేదు). కాని యా యూరెద్దియని నిర్ధారణసేయబూనినప్పు డొక్కొక్క రొక్కొకమార్గమును ద్రొక్కియున్నారు. సోమశేఖరశర్మగారిది యిప్పటి చెంగల్పట్టుజిల్లా పొన్నేరితాలూకాలోని పులికాటను నామాంతరము గల ప్రళయకావేరియే యని చెప్పియున్నారు.[1] వెంకటరామయ్యగారీయభిప్రాయమునే యంగీకరించిరి. కృష్ణమాచార్యులవారిది నెల్లూరిజిల్లా కోవూరితాలూకాలోని పడుగుపాడుగ్రామ మని గుర్తించిరి.[2] నిశ్చయించి చెప్పుటకు తగు సాధనము లింకను దొరకకున్నవి. భావిపరిశోధనవల్ల గాని వాస్తవము బయలువెడలనేరదు;

3. దొడ్డిస్వామియాజమాన్యము క్రింద నుండిన నడిపి, లేక నడిప్పియను గ్రామ మెందుండెనో తెలియదు.

౪. విష్ణుగోపమహారాజు వచనముచేత శారణిక గ్రామముగ జేయబడిన నెడుఙ్గరాయగ్రామమునుండిన స్థానమును దెలిసికొనుటకు సాధ్యము కాకయున్నది. రావుబహదూరు సి. ఆర్. కృష్ణ

1. Journal of Madras University 1940 Pp 152—53.
2. Ep. Ind. XXIV P 301.

మాచార్యులవా రిది శాసనము దొరకినట్టి సింగరాయకొండయే కావచ్చునని తలచుచున్నారు. రెండు గ్రామముల పేర్లకును 'ంగరాయ' సామాన్యము. 'నెడుఙ్గరాయ' యనునది 'నిడుంగు రాయి'కి రూపాంతర మగునేని యది యొకవేళ నెల్లూరుజిల్లా రాపూరుతాలూకాలోని 'నిడుగల్లు' గ్రామము కావచ్చును, కాని నిశ్చయించి చెప్పుటకు సాధ్యము కాదు.

ఈ శాసనమును చదువుటయందు నేను రెండు మూడు స్థలములలో రావుబహదూరు సి. ఆర్. కృష్ణమాచార్యులవారియొక్క సహాయమును బడసితిని. వారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కారములను సమర్పించుచున్నాను.

మొదటి రేకు : రెండవ ప్రక్క

1 [జితమ్భ]గవతా [॥*] విజయశ్రీ పలక్కడస్థానాత్ పరమబ్రహ్మ
2 [ణ్యస్య] స్వబాహు బలార్జ్జితోర్జ్జిత క్షాత్రతపోనిధేః
3 [విహిత] సర్వ్వమర్య్యాదస్య స్థితిస్థితస్యామితాత్మనో
4 మహారాజస్య శ్రీస్కన్దవర్మ్మణః ప్రపౌత్ర స్యార్చ్చితశక్తి

రెండవ రేకు: మొదటి ప్రక్క

5 సిద్ధిసమ్పన్నస్య ప్రతాపోపనతరా[జ]మణ్డలస్య మహా
6 రాజస్య వసుధాతలైకవీరస్య శ్రీ వీరవర్మ్మణః
7 పౌత్రస్య దేవ ద్విజగురు వృ[ద్ధో]పచాయినో వివృద్ధ
8 వి[న]యస్యానేక గోహిరణ్య భూమ్యాది ప్రదానైః ప్రవృద్ధ

రెండవ రేకు : రెండవ ప్రక్క

9 *వినయస్యానేక గోహిరణ్యభూమ్యాది ప్రదానైః ప్రవృద్ధ
10 ధర్మ్మ స[ఞ్చ]యస్య ప్రజ[ా]పాలన [దక్షస]్య లోకపాలానా
11 మ్పఞ్చమస్య లోకపాలస్య సత్యాత్మనో మహాత్మనో
12 మహారాజస్య శ్రీస్కన్దవర్మ్మణః పుత్రస్య భగ[వద్భ]క్తి

మూఁడవ రేకు : మొదటి ప్రక్క

13 సద్భావ సమ్భావిత సర్వ్వకల్యాన [ణ] స్య ప్రజాసంరక్షణప
14 రిపాలనోద్యోగ సతతసత్రవ్రతదీక్షి[త[స్య అనేక
15 సమరసాహసావమర్ద్దలబ్ధ విజయ యగ(శ)ః ప్రకాశ
16 [స్య] కలియుగదోషావసన్న ధర్మ్మోద్ధ[ర]ణ నిత్యసన్న

మూఁడవ రేకు: రెండవ ప్రక్క

17 [ద్ధ]స్య రాజర్షిగుణ సర్వ్వ సన్దోహ విజిగీషో[ర్ద్ధ]ర్మ్మ
18 విజిగీషో భగవత్పా[దా]నుధ్యాతస్య బప్పభట్ట (ట్టా) ర
19 కమహారాజ పాదభక్తస్య పరమ భాగవతస్య
20. భారద్వాజస్య పల్లవానామ్ యువమహారాజ శ్రీవిష్ణుగోపస్య

నాలుగవ రేకు : మొదటి ప్రక్క

21 వచనేన ముణ్డరాష్ట్రే) నెదుఙ్గరాయే గ్రామేయకాః
22 వక్తవ్యాః[॥*]ఏష గ్రామః శారణిక నడిప్పిభోజ
23 దోడ్డిస్వామి కణ్ణస్వామి నన్దిస్వామిభ్యః భాగత్రయం
24 కృత్వా తత్రాపి భా[గత్రయే]నడిపి భోజకస్య భాగ

నాలుగవ రేకు; రెండవ ప్రక్క

25 ద్వయ[క]మ్[।*]కణ్ణస్వామి నన్దిస్వామినో రేకో భాగః[।*]తత్రా
26 [ప్యే]కస్మి న్భాగే భాగద్వయం కణ్ణస్వామినః [।*] ఏకో భాగో

---

* ప్రమాదవశమున లేఖకుఁడీపఙ్క్తిని ఇచట మరలచెక్కెనని తోఁచుచున్నది.

# నెడుజ్గరాయ తామ్రపట్టిక

మొదటి రేకు – రెండవ ప్రక్క



రెండవ రేకు – మొదటి ప్రక్క



రెండవ రేకు – రెండవ ప్రక్క



C—14 A

27 నన్దిస్వామినః[॥*] ఏవం విభజ్య శారణిక [గామం కృత్వా
28 అష్టాదశ* జాతిభిః పరిహా౹రై రుపేతో దేవభోగహాల

ఐదవ రేకు: మొదటి [ప్రక్క

29 వర్జ్యం అస్మదాయుర్బలవర్ధనీయ మస్మాభి స్స(ప్ర)[మ్ప) దత్తః [॥*]
30 తదవగమ్య తస్మిన్విషయే సర్వాయుక్తకాః సర్వైనైయ్యో
31 గికాః రాజవల్లభాః సఞ్చ*ర న్తశ్చ తద్గ్రామం తథైవ
32 పరిహారైః పరిహారన్తు పరిహారయన్తుచ [॥*] యశ్చై దస్మ

ఐదవ రేకు: రెండవ [ప్రక్క

33 చ్ఛాసన మతి[క్రామే త్సపాపశ్శా(శ్శా)రీరదణ్డమర్హతి[॥*]
34 (శ్రీ) సింహవర్మ మహారాజస్య విజయ సంవత్సరే
35 ద్వాదశమే జ్యేష్ఠమాసే కృష్ణపక్షే [త్రయో
36 దశ్యామ్ మయా దత్తా తాం[బ్ర (త్ర) పట్టికా[॥*]

---

* లేఖకుఁడు మొదట 'ః' ను విడిచి తరువాత దానిని పంక్తికి దిగువ 'ద' 'జా'ల మధ్య చెక్కెను.

* 'సఞ్చ' యని చదువవలయును. ఇందు లేఖకుఁడు మొదట 'యఞ్చ' యని [వాసి తరువాత 'య' ను 'స' గ దిద్దినాఁడు.

—

# పృథ్వీమహారాజు యొక్క

## తాణ్డివాడ శాసనము

ఈ తామ్ర శాసనపు రేకులను మూటిని నాకు బ్ర. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారొసగిరి. వీని మొత్తము తూకము ౨౬౪ తులములు. ఒక్కొక రేకును ౬.౨" అం. నిడివి, ౨.౧" అం. ఘనమును గలిగియున్నది. రేకుయొక్క ఎడమకొన దగ్గర, కడియమును దూర్చుటకు జేయబడిన బెజ్జ మొక్కటి కలదు. మొదటి రేకునందు నాలుగు పంక్తులును తక్కిన రేకులయం దొక్కొక దానియందు ఐదేసి పంక్తులును అక్షరములు చెక్కబడియున్నవి. కడియముగాని దానిపై తాపటము సేయబడిన ముద్రికగాని నాచేతికి రాలేదు.

శాసనము అసంపూర్ణము. పూర్వము రామకృష్ణకవిగారియొద్ద శాసనమునకు సంబంధించినవి రేకులు నాలుగొక వలయమున గ్రుచ్చియుండినవట. ఒకప్పుడు మదరాసు శాసనపరిశోధకశాఖవారీతామ్ర పట్టికను గైకొని చదివి తమ ౧౯౧౭-వ సం.పు నివేదన పత్రికయందు దీని విషయమై చర్చించి, కవిగారికి దానిని తిరుగనిచ్చిరట. తరువాత కవిగారు పలుదేశములలో కాపురములు సల్పుచుండుకతమున వారి గ్రంథసామగ్రి యావత్తును స్థలాంతరములకు గొనిపోవబడుచుండెను. ఈ ప్రయాణములసందుకట్టున నాల్గవ రేకును, కడియమును నెచ్చటనో నష్టమైపోయెనట.

శాసన మసంపూర్ణమైనను చరిత్రకు నష్టము కలుగలేదు. ఏలన, నష్టమైన రేకు నాలవది. ఇతరశాసనము లన్నిటియందును సామాన్యముగ నగపడు దానఫలమును దెలియజేయు వ్యాసగీతా

శ్లోకములే అందు చెక్కియుండెను. ఈ విషయమును మూడవ రేకు రెండవ ప్రక్క కడపటి పంక్తి తుదను చెక్కియున్న 'బహుభి ర్వసుధాదత్తా' యను శ్లోకపాదము స్పష్టపఱచుచున్నది.

లిపి:—ఇందలి లిపివిశేషములు నుడువదగిన వేవియు లేవు. మూడవరేకు రెండవ ప్రక్క కడపటి పంక్తి యొక్క మొదటి యక్షరము ఆరవ, ఏడవ శతాబ్దులనాటి 'ల'ను పోలియున్నది. దానిని శాసనపరిశోధక శాఖవారు 'బి' అని చదివిరి. కాని, యది సరికాదు. ఆ కాలపు లిపి ననుసరించి దానిని ల యనియే చదువవలయును. లిపి క్రీ. శ. ఆరు, ఏడు శతాబ్దములలో తెలుగుదేశమున వాడుకయందున్న లిపియే. శాసనములోని యక్షరములు కుబ్జవిష్ణువర్ధనుని తిమ్మాపురము తామ్రశాసనపుటక్షరములను బోలియున్నవి. అక్షరములు చక్కగను లోతుగను చెక్కబడి యుండుటచేత, రేకులు అరిగిపోయిన స్థలములయందు సైతము, సునాయాసముగ చదువుటకు వీలైనది. శాసనమును చెక్కిన శిల్పి తన కార్యమును జాగరూకతతో నిర్వహించినాడని చెప్పుటకు వీలు పడదు. ప్రమాదములు పెక్కు కాన్పించుచున్నవి.

| రేకుసంఖ్య | ప్రక్క | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 2 | 1 | 4 | పాదానుద్ధ్యాతః | పదానుధ్యాతః |
| ,, | ,, | ,, | ప్రిథివీ | పృథివీ |
| ,, | ,, | 5 | గ్రామ మధివస్సత సర్వ్వా | గ్రామ మధివసత స్సర్వ్వా |
| ,, | ,, | ,, | కుటిమ్బినః | కుటుమ్బినః |
| ,, | ,, | ,, | సమజ్ఞాపయ | సమాజ్ఞాపయ |
| ,, | 2 | 1 | శ్రుతిమ్మృతి | శ్రుతిస్మృతి |
| ,, | ,, | ,, | అగ్నష్టోమ | అగ్నిష్టోమ |
| 3 | 1 | 1 | (ఉప)నిషద్యో గవబోధ | (ఉప) నిషద్యో గావబోధ |
| 3 | 2 | 2 | రారాగ్య | రారోగ్య |

ఇంతేకాదు. కొన్నిచోట్ల అక్షరములను వదలివేసినాడు. రేకు ౧. పం ౭. 'ప్రియతనయః' అనుటకు బదులు' ప్రియతనయ' యనియు; రేకు ౩. ప్రక్క ౨. పం ౭లో 'ఆజ్ఞప్తిః' అనుటకు బదులు 'ఆజ్ఞప్తి' అనియు విసర్గను వదలివేసి చెక్కినాడు. మఱియు రేకు 3. ప్రక్క ౨. పం. 3 లో '(ప్ర)వర్ధమాన' యని యుండవలసినచోట '(ప్ర)ర్ధమాన' యని 'వ'ను విడిచి చెక్కినాడు.

భాష:—శాసనగ్రంథము యావత్తును సంస్కృతభాషయందు విరచింపబడియున్నది. రేకు 3. ప్రక్క ౨. పం. ౫ కడపట జెక్కబడిన 'బహుభి ర్వసుధా దత్తా' యన్న వ్యాసగీతాశ్లోకపాదము దప్ప తక్కిన దంతయు వచనము, తప్పులులేవు. కాని రేకు ౨. ప్రక్క ౨. పం. 3 లో 'ప్రరాయమాణ' యని యొక యపశబ్ద మగపడుచున్నది. ఇది వ్యాకరణ విరుద్ధము. ఇట్టి రూపము సిద్ధింప దని పండితుల యభిప్రాయము. దీనిని 'ప్రతాయమాన' యని దిద్ది చదువుకొనవలయును.

శాసనకాలము:—శాసన పరిశోధనశాఖవారు ఈ శాసన కాలము క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దారంభము అని వ్రాసియున్నారు. ఈ కాలనిర్ణయము సరికాదు. అట్లు తలంచుటకు రెండు కారణములు గలవు: (౧) శాసనము నొసగిన దాతయగు పృథివీమహారాజు యొక్క రాజధాని పిష్టపుర మని 'పిష్టపురాత్' అను శాసనారంభ వాక్యమువలన తెలియుచున్నది. పిష్టపురము క్రీ. శ. ౬3౦ సంవత్సరమున చాళుక్యరాజుల వశమాయెను. అదిమొదలు పిష్టపురమును తత్పరిసరములును వారి స్వాధీనమున నుండెను. క్రీ. శ. అష్టమశతాబ్దారంభమున నీప్రాంతములు చాళుక్యుల యేలుబడియం దుండినట్లు శాసనములవల్ల తెలియుచున్నది. కావున ఆకాలమున చాళుక్యుడుకాని స్వతంత్ర ప్రభువొకడు పిష్టపురమునుండి రాజ్యము

జేయుట యసంభవము. ప్రస్తుతపు శాసనము నొసగినదాత చాళుక్యుడు గాడు. చాళుక్య నరపాలునికిగాని మఱి యన్యునికిగాని లొంగినవాడని చెప్పుట కెట్టి యాధారమును గానరాదు. కావున ఈ శాసనము పిష్టపురము చాళుక్యులకు స్వాధీనమగుటకు పూర్వ మొసగబడెనని తలచుట యుక్తము; (౨) లిపి వైఖరిని జూచినను క్రీ. శ. అష్టమ శతాబ్దారంభకాలము నాటిదని తలచుటకు వీలులేదు. ఇందలి యక్షరములు కుబ్జవిష్ణువర్ధనుని తిమ్మాపుర శాసనపుటక్షరములను మిక్కిలి పోలియున్నవి. ఈ కారణములవల్ల శాసనము క్రీస్తుశక సప్తమశతాబ్దమునాటి దనియును, క్రీ. శ. ౬౩౦ సం. ప్రాంతము నాటిది కావలయు ననియును నూహించుచున్నాను.

శాసనగ్రంథము:—రమకాశ్యపసగోత్రజుడును, మహారాజ రణదుర్జయుని కుమారుడగు విక్రమేంద్రుని పుత్రుడునునగు పృథివీమహారాజు పిష్టపురమునుండి నిజవిజయరాజ్య సంవత్సరము ౨౬ నందు కార్తిక శుక్ల పౌర్ణమాస్యనాడు, కొణ్డమఞ్చి గ్రామవాసియు, కామకాయనస గోత్రోద్భవుడును, విష్ణుశర్మ పుత్రుడగు పృథ్వీశర్మ యొక్క కుమారుడును, ఛందోగసబ్రహ్మచారియును నగు భవశర్మకు పాగుణారవిషయములోని తాణ్డివాడ గ్రామమును అగ్రహారీకరించి సర్వబాధా పరిహారము గలదానినిగ జేసి యిచ్చినాడు.

ఈ శాసనోక్తదానము నొసగినరాజే వంశమువాడో తెలియదు. ఇతని గోత్రము పేరు రమకాశ్యపసగోత్రమని ఇందు వచింపబడియున్నది. ఇది యొక యసాధారణగోత్ర నామము. కాని, 'కాశ్యపసగోత్ర' మనుటకు బదులు 'రమకాశ్యపసగోత్ర' మని చెక్కబడెనని శాసనశోధక శాఖవారు వ్రాసినది అంగీకరింపదగినది కాదు. దాతయొక్క తాతతండ్రు లిందు బేర్కొనబడినారు. తాత రణదుర్జయుడు. ఇతడు మహారాజు. ఇత డొనర్చిన ఘనకార్యము

లేవియు శాసనగ్రంథమున వర్ణితములు కాలేదు. 'రణదుర్జయు' డను నది యతని బిరుదనామమేమో యను సందియము గల్గుచున్నది. తండ్రి విక్రమేంద్రుడు. అతనికి మహారాజను బిరుదుగూడ లేదు. గద్దె యెక్కినట్లు తోపదు. దాతయగు పృథ్వీమహారాజు సమస్తసామన్త మండలమును నిజభుజపరాక్రమముచే జయించి కీర్తిని గడించినట్లు వ్రాయబడియున్నది. కావున ఇతడు తన పూర్వులకంటె నధికుడై శత్రునిరోధము లేక స్వతంత్రుడై రాజ్యము సల్పెనని యూహించుట కవకాశము గలుగుచున్నది.

పృథ్వీమహారాజు జనకు డగు విక్రమేంద్రుని పేరు నామసాదృశ్యముచే విష్ణుకుండి వంశపురాజులను స్మరణకు దెచ్చుచున్నది. వేంగి నేలిన రాజవంశములయందు విష్ణుకుండి రాజులలో మాత్రము విక్రమేంద్రనామధారు లగపడుచున్నారు. పిష్టపురము నేలిన రమకాశ్యపసగోత్రజులకును, విష్ణుకుండి ప్రభువులకు నెద్దియేనియు సంబంధ ముండిన నుండవచ్చును. సామంతులు తమ రాజులపేర్లను తమ బిడ్డల కిడునాచారము కలదు. అట్టి యాచారము ననుసరించి పృథ్వీమహారాజు తండ్రియగు విక్రమేంద్రున కాపేరు కలిగెనని తలచితిమేని, రణదుర్జయుడు విష్ణుకుండి రెండవ విక్రమేంద్రునికి సామంతుడై యుండునని యూహింపదగియుండును. ఇతడు తన రాజుపై దిరుగబాటుచేసి స్వతంత్రు డాయెననియు నెంచవలసియుండును.

ఈ యూహలు కేవలము నిరాధారములు గావు. విష్ణుకుండుల చరిత్రమును పరామర్శించి చూచినచో వీనికి కొంత యాధార మగపడుచున్నది.

విష్ణుకుండి ఇంద్రభట్టారకవర్మ కాలమున విష్ణుకుండి రాజ్యము దక్షిణ కళింగములోని పలకి రాష్ట్రపర్యంతము వ్యాపించియుండెను.

ఇతెడు కళింగాధిపతియు, పూర్వగంగ వంశీకుడును నగు ఇంద్రవర్మ చేత యుద్ధమునందు నిహతుడైనట్లు కందరాళపుర పృథ్వీమూలుని గోదావరీ తామ్రశాసనమువల్ల నూహింపదగియున్నది. తరువాత విష్ణుకుండుల యధికారము గోదావరి కుత్తరమున సాగిన చిహ్నము లేవియు గానరావు. రణదుర్జయ, విక్రమేంద్రుల యనంతరము పృథ్వీ మహారాజు స్వామిద్రోహియై స్వాతంత్ర్యము వహించెనని యూహింపవచ్చును. పిష్టపురమున నితడు రాజ్యము సేయుచుండగా నష్టమైన విష్ణుకుండుల దొరతనమును కళింగమున మరల ప్రతిష్ఠించుటకు మూడవ మాధవవర్మ ప్రయత్నము సల్పెనని యాతని యాంధ్ర సాహిత్య పరిషచ్ఛాసనములోని 'ప్రాగ్దిగ్జిగీషయా ప్రస్థితః గోదావరీ మతీతరణ' అను వాక్యమువల్ల నూహింపవచ్చును.

ప్రతిగ్రహీత:— ఈ దానమును ప్రతిగ్రహించినవాడు కొణ్డమణ్చి గ్రామనివాసి యగు భవశర్మయను బ్రాహ్మణుడు. ఇతడు కామకాయనసగోత్రోద్భవుడగు ఛందోగస బ్రహ్మచారి. చక్కగ వేదములు వేదాఙ్గములు శాస్త్రములు పఠించినవాడు; అనేకములు యజ్ఞములను సల్పెను; 'తిసహస్రవిద్య'ను నేర్చెను; ఇరువది గ్రంథములకు వ్యాఖ్యానములను రచించెను.

ఇతని తండ్రియు, తాతయు చక్కని శ్రోత్రియులు. తండ్రి పృథ్వీశర్మ. ఇతడెల్లపుడును యజ్ఞములు సేయుచు, దక్షిణల నిచ్చి ఋత్విక్కులను తృప్తిపఱచుచుండెడి వాడు. మఱియును 'త్రిసహస్ర విద్యాధ్యయన ప్రవచనవ్యాఖ్యాన'ములయందు నేర్పరి. తాతయగు విష్ణుశర్మ శ్రుతిస్మృతులను తుదముట్ట నెఱింగినవాడు; అగ్నిష్టోమాది క్రియల చేత పరిశుద్ధము సేయబడిన యాత్మగల వాడు.

ఈ శాసనములోని ప్రతిగ్రహీతయొక్క వంశవర్ణనవల్ల క్రీ. శ. ౭-వ శతాబ్దమున బ్రాహ్మణు లభ్యసించుచున్న విద్యాదికము

కొంతవఱకు తెలియుచున్నది. వారు వేదములు, వేదాఙ్గములే గాక షడ్దర్శనములు గూడ పఠించుచు శిష్యులను నేర్పుచుండిరి. షడ్దర్శనముల యందలి న్యాయోపనిషద్యోగము లీ శాసనమునందు పేర్కొనబడియున్నవి. ప్రతిగ్రహీతయును, అతని తండ్రియు 'త్రిసహస్రవిద్య' నభ్యసించినట్లు వ్రాసియున్నది. 'త్రిసహస్రవిద్య' ఇదియని గుర్తింప వీలులేదు. పండితులు తలకొక యర్థమును జెప్పిరి. అందేదియు సరియైనదను నమ్మకము వారికే కలుగలేదు. భావిపరిశోధనవల్ల నిది యేదైనదియు దెలియవలసియున్నది. మఱియును అప్పటి బ్రాహ్మణులు యజ్ఞములను తరచుగ చేయుచు వైదికకర్మలయందు కాలమును గడపుచుండువారు.

స్థలనిర్దేశము:—ఈ శాసనమున కొన్ని యూళ్ళును పట్టణములును పేర్కొనబడినవి. అందు ముఖ్యమైనది పిష్టపురము. పిష్టపురము ఇప్పటి తూర్పుగోదావరిజిల్లాలోని పిఠాపురమని యందఱెఱుగుదురు. దాన మొసగబడిన త్వాష్టివాడ గ్రామము పాగుణార విషయమునందు చేరియుండెను. మొదట పాగుణారవిషయ మెచ్చట నుండెనో కనుగొనవలసియున్నది. పూర్వచాళుక్యరాజుల శాసనములయందు కొన్నిటియం దీ పాగుణారవిషయ ప్రస్తావము కలదు. చాళుక్యభీమనృపాలుని శాసనములయం దొకదానియందు పాగుణవర విషయములోని దిగుంబఱ్ఱు గ్రామమును దానము చేసినట్లు వ్రాయబడియున్నది.[1] మఱియు ఐదవవిష్ణువర్ధన మహారాజుశాసనములలో నొకదానియందు పగుణవారవిషయములోని పెర్మజీలి గ్రామము దాన మొసగినట్లు వ్రాయబడి యున్నది.[2] ఈ శాసనములందు వచింపబడిన పగుణవరము, పాగుణారము, పాగుణవరమును ఒక్క గ్రామముయొక్క పేర్లని తలచెదను. ఈ గ్రామ మెచ్చట నుండెనో చెప్పుటకు వీలుగాదు. కాని పగుణార విషయములోనివన్న

1. I. A. XIII, p. 213  2. M. E. R 1913 14 cp 6

గ్రామములలో నెక్కువగ ఇప్పటి ప. గోదావరిజిల్లా నర్సాపురం తాలూకాలో నగపడుచున్నవి. దిగుంబఱ్ఱును ఇప్పుడు దిగుమ ఱ్ఱను చున్నారు. పెర్మజీలికి ఇప్పటి పేరు పెనుమంచిలి. కావున పాగుణార విషయ మిప్పటి నర్సాపురం తాలూకాకును దాని పరిసరములకును సరిపోవును. ఇక, ప్రస్తుతశాసనమునందు బేర్కొనబడిన కొండ మంచి, తాండివాడగ్రామములు నర్సాపురం తాలూకా హద్దులలో గాని తత్ప్రాంతసీమయందు గాని గాన్పించునేమో విచారింపవలసి యున్నది. కోణ్డమణ్చియే ఇప్పటి నర్సాపురం తాలూకాలోని కొండమంచి యనుటకు సందేహింప బనిలేదు. కాని తాణ్డివాడ యెచ్చట నుండెనో చెప్పుటకు సాధ్యముగాదు. తణుకు తాలూకాలో తాడిపఱ్ఱు, తామరాడ అను గ్రామములు రెండగపడుచున్నవి. శాసనోక్తమగు తాణ్డివాడ గ్రామమునకును వీనికిని నేమేనియు సంబంధ ముండిన నుండవచ్చును.

## మూ ల ము :

### మొ ద టి రే క

స్వస్తి[1] [॥*] శ్రీమత్పిష్టపురాత్సకలజగదవనసముద్భూత!

2 చారుచన్ద్రికాసముద్యోతితదిగన్తరస్య మ

హారాజరణదుర్జ్జయస్య సూనో స్సమతి

4 శయితశక్రవిభూతే ర్విక్రమేన్ద్రస్య ప్రియతనయ [:*]

1. 'స్వస్తి' అనుపదము 3-వ పంక్తికి ఎదుట ఎడమవైపున 'మార్జినులో' జెక్కబడియున్నది.

C—16

రెండవ రేకు : మొదటిప్రక్క

1 ప్రవర్ధమానప్రతాపోపనతసమస్తసామన్తమణ్డలనిజ
2 భుజవిజయోదయాధిగతయశోవిశేషభూషణః శ్రీరమ
3 కాశ్యపసగోత్రః పరమబ్రహ్మణ్యో మాతాపితృపా
4 దానుధ్యాతః[1] శ్రీప్రి[2]థివీమహారాజః పాగుణారవిష[3]యే తాణ్డి
5 వాడగ్రామ మధివసత సర్వా[4]సమవేతా న్కుటి[5]మ్బిన స్సమ[6]జ్ఞాప

రెండవ రేకు : రెండవప్రక్క

1 యతి యథా శ్రుతిమ్మృతి [7]పారదృశ్వనః యథావదనుష్ఠి తాగ్న[8]ష్టో
2 మాదిక్రియాపూతాత్మనో విష్ణుశర్మణః పుత్రాయ అసకృదిజ్యా
3 ప్రయోగప్రరాయమాణ [9] ద్రవిణసూచితత్యాక్స[10]
4 దస్యసమృద్ధేః త్రిసహస్రవిద్యాధ్యయనప్రవచనవ్యాఖ్యా[న]
5 శీలినః పృ[11]థివీశర్మణః పుత్రాయ వేదవే[దాఙ్గన్యాయోప]

మూడవ రేకు : మొదటిప్రక్క

1 నిషద్యోగ[12]వబోధనిర్మలీకృతబుద్ధయే వివిధాధ్వరావభృథా
2 మ్భఃపవిత్రీకృతవిగ్రహాయ దేవపితృమనుష్యసమర్చన
3 సమానీతరాత్రిన్దివాయ కొణ్డమఞ్చిగ్రామనివాసినే

1. 'ధ్యాతః' అని చదువవలయును. 2. 'పృథివీ' అని. 3. 'ష' యొక్క కొమ్మును తలకట్టును కలుపు అడ్డగీటు అస్పష్టముగ నున్నది. 4. 'వసత స్సర్వా' అని. 5. 'కుటుమ్బిన' అని. 6. 'స్సమాజ్ఞాప' అని. 7. 'స్మృతి' అని చదువవలయును. 8. 'గ్ని' అని. 9. 'ప్రతీయమాన' అని దిద్దుకొనవలయును 10. 'స'కారము నెత్తిపై 'క' సూక్ష్మముగ చెక్కబడియున్నది. 11. మొదట 'పౌ'ను గుడిదీర్ఘావళ్లతో చెక్కి తరువాత దీర్ఘావడిని వట్రువసుడిగా దిద్దినాడు 12. 'గావబోధ' అని చదువవలయును.

4 త్రిసహస్రవిద్యాయ వింశతివ్యాఖ్యానాయ కామకాయనస

5 గోత్రాయ ఛన్దోగసబ్రహ్మచారిణే అస్మదాయు

మూడవరేకు : రెండవప్రక్క

1 రారాగ్య[1]య[2]శోభివృద్ధయే సర్వకరపరిహారే ణాగ్రహారీ

2 కృత్య గ్రామోయ న్దత్తః [।*] నకైశ్చిదపి

బాధాకరణీయా [।*] ప్ర

3 [వ*]ర్ధమానవిజయరాజ్యసంవత్సరే షట్చత్వారింశే

4 కార్త్తికపౌర్ణమాస్యా న్ధర్మప్రదాన మేతత్ [।*]

ఆజ్ఞప్తి [ః*] శ్రీరామ

5 లస్సురాజః [।*] అత్ర వ్యాసగీతాశ్లోకాః [॥*] బహుభి ర్వ్వ

సుధా దత్తా

1. 'రారోగ్య' అని చదువవలయును. 2. 'య' కొమ్మునకుగూడ తలకట్టిచ్చియున్నది.

౨

# లేములవాడ చాళుక్యులు

## ౧ ఆధారములు

చాళుక్యవంశజులగు రాజులు దక్షిణాపథమున పెక్కు తావుల దొరతనము సల్పిరి. చాళుక్య వంశమున కెల్ల మూలకందప్రాయ మైనది బాదామికోవ. బాదామివంశమునుండియే తక్కిన చాళుక్య రాజకుటుంబము లన్నియు నుప్పతిల్లినవి. వేంగీపూర్వచాళుక్య కుటుంబమును, గల్యాణి పాశ్చాత్యచాళుక్య కుటుంబమును, గుజరాతు చాళుక్యకుటుంబమును సుప్రసిద్ధమైనవి. ఇంతటి ప్రఖ్యాతి నందక పోయినను ఆంధ్ర దేశమున వర్ధిల్లిన రాజకుటుంబములు మఱి రెండు కలవు: (౧) లేములవాడవంశము, (౨) మంచికొండవంశము. ఈ రెండు వంశములును స్వతంత్రములై రాచరికము సలుపక పోయినను, సార్వభౌమత్వము నంది, దక్షిణాపథమున చాల భాగమును పాలించిన సంస్థానములకు దోడ్పడి యనేక మహత్కార్యముల నొనర్చియుండు కారణమున నివియు చిరస్మరణీయములు.

ప్రథమమున లేములవాడచాళుక్యవంశచరిత్రను గనుగొందము. వీరి చరిత్ర కాధారము లిరుదెఱగులవి: ౧. శాసనములు; ౨. వాఙ్మయము. శాసనములు ద్వివిధములు: శిలాశాసనములు, తామ్రపట్టికలు. శాసనసామగ్రి విస్తారము గాదు. ఇంతవఱకు లభ్యమైనవి ఈ వంశమువారి శాసనములు మూడు. వీనియందు రెండు తామ్రపట్టికలు, తక్కినది శిలాశాసనము.

(౧) కొల్లిపఱ తామ్రశాసనము:—గుంటూరు మండలమందలి కొల్లిపఱ యను గ్రామమున దొరకినది. శ్రీ మల్లంపల్లి సోమశేఖర

శర్మగారిచే బరిష్కరింపబడి భారతియందు ప్రకటింపబడినది[1]. ఇందు వరాహముద్రిక తోడి వలయమున గ్రుచ్చబడిన ఐదు రేకులు గలవు; ఈ శాసనము నిచ్చిన రాజు చాళుక్యవంశసంభూతు డగు నరికేసరి. ఇతని వంశవర్ణన కలదు. చాళుక్యవంశమున సత్యాశ్రయుడు పుట్టెను. ఇతని కుమారుడు పృథివీపతి. అతనికి మహారాజును, మహారాజునకు రాజాదిత్యుడును కలిగిరి. రాజాదిత్యుని పుత్రుడు వినయాదిత్యుడు. ఇతనికి శ్రీరాముడు రామవిక్రముడు విశ్వరాట్ యుద్ధమల్లుడు నృపాంకుశుడు అను బిరుద నామములు గలవు. ఇతడు సాగరవేలా వేష్టితమైన సకలధరామండలమున కధిపతియట! తురుష్క, యవన, బర్బర, కాశ్మీర, కాంభోజ, మగధ, మాళవ, కళింగ, గంగ, పల్లవ, పాండ్య, కేరళ ప్రభృతిరాజలోకముచే నర్చ గొనెనట! భువనా్నరాయణుని వరాహలాంఛనముచే భూచక్రమునంతటిని స్వాధీనపఱచు కొనెనట! ఈ వినయాదిత్యుని కుమారుడే ప్రస్తుతశాసనమును వ్రాయించిన యరికేసరిమహారాజు, ఇతని సుగుణసంపత్తియు, బాండిత్యాతిశయమును, విద్యాధిక్యమును విశేషముగ వర్ణింపబడియున్నవి. సమస్తలోకాశ్రయుడు, త్రిభువనమల్లుడు, రాజత్రినేత్రుడు, సాహసరాము డనునవి ఇతని బిరుదనామములు. ఇతడు శ్రీ పర్వతమున కుత్తరద్వారమైన ఏలీశ్వరమున నివసించుచుండిన సద్యోశివాచార్యుని శిష్యుడగు ముగ్ధశివాచార్యునకు 'రాముడు' విషయమున 'ఊరిగె' యను మహాప్రసిద్ధ గ్రామమునకు దక్షిణదిగ్భాగమున నున్నట్టియు, 'తువతోఱు', 'పరివాతుర్ల', 'పుల్చెఱువుల్' 'పోతువోదుపి' గ్రామముల మధ్య నున్నట్టి, 'బెల్మొగ'మని విశ్రుతమైన గ్రామమును విద్యాదానముగ నిచ్చెను.[2] ఈ దానమును బ్రకటించుటకొఱకే ఈ శాసనము వ్రాయబడెను.

1. భారతి. సం. ౯. భా. ౨, పుటలు ౨౯౯ - ౩౧౮

2. Ibid ౩౦౦ - ౩౦౯

(౨) పరభణితామ్రశాసనము:—హైదరాబాదు రాజ్యము లోని పరభణివాస్తవ్యుడగు శ్రీ శం. నా. జోశీగారి కడ నుండెను. ఇది పూనానగరమందలి భారత ఇతిహాస సంశోధకమండలివారిచే ప్రకటిత మగు మహారాష్ట్రత్రైమాసికపత్రిక (భాగ. ౧౩. అంక. 3) యందు మొదట ప్రచురింపబడెను. 'జైన సాహిత్య ఔర్ ఇతిహాస్' అను హిందీగ్రంథమున 'సోమదేవ సూరికా నీతివాక్యామృత్' అను వ్యాసమునకు పరిశిష్టముగ ముద్రింపబడినది.[1] లిపి యప్పటి తెలుగు-కన్నడ లిపి. భాష సంస్కృతము. ఇందు మూడు రేకులపై నేబదియొక పంక్తుల యక్షరములు గలవు. ఈ శాసనము నొసగిన రాజు సూర్యునినుండి యుద్భవమైన చాళుక్యవంశమున బుట్టిన ముమ్మడి యరికేసరి. ఇందు అరికేసరియొక్క వంశప్రశస్తి కలదు. ఆదిత్యభవమగు విశ్రుతచాలుక్యవంశమున యుద్ధమల్లు డను రాజు పుట్టెను, ఇతడు సపాదలక్షదేశము నేలెను; పోదనమున దైలవాపి యందు ఏనుగుల యవగాహోత్సవమును గావించెను. ఇతని పుత్రుడు అరికేసరి సకలింగత్రయవేంగిదేశమును స్వపరాక్రమము వల్ల జయించెను. అతనికి నరసింహ, భద్రదేవు లను పుత్రు లిరువురు కలిగిరి. నరసింహుని కుమారుడు యుద్ధమల్లుడు. అతనికి బద్దిగ డను తనయు డుదయించెను. ఈ బద్దిగడు నీటిలోని మొసలినివలె యుద్ధమున భీమపరాక్రముడైన భీముని జయించెను. బద్దిగని కొడుకు యుద్ధమల్లుడు. ఇతనికి నరసింహు డుదయించెను. నరసింహుని కుమారుడు అరికేసరి. ఇతడు రాష్ట్రకూటకులసంజాతయగు లోకాంబిక యను కన్యకను పెండ్లియాడెను. వీరికి భద్రదేవు డను కుమారుడు పుట్టెను. భద్రదేవుని పుత్రుడు అరికేసరి. ఈ యరికేసరిమహారాజు 'సమధిగతపంచమహాశబ్ద మహాసామన్తాధిపతి సమస్త భువన సంస్తూయమాన. . .సామ్బరాంకుశామ్మనగంధవారణ గన్ధేభవిద్యా

1. జైన సాహిత్య ఔర్ ఇతిహాస్. పుట. ౯౦.

ధర ప్రియగల్ల త్రిభువనమల్లోదాత్తనారాయణ ప్రత్యక్షవాగ్వలి విక్ర మార్జున గుణనిధి గుణార్ణవ సామన్తచూడామణి ప్రముఖానేక... విజయాంకమాలికాలంకృతుడు' ఇతడు శకాబ్దములు ౮౮౮ గతించిన పిమ్మట ప్రవర్తమాన క్షయ సంవత్సర వైశాఖపౌర్ణమాస్యా బుధ వారమునాడు గౌడసంఘమునకు జెందిన యశోదేవముని శిష్యుడును, యశోధరచరిత్ర స్యాద్వాదోపనిషదాదిగ్రంథకర్తయు నగు సోమ దేవసూరి యను జైనవిద్వాంసునకు సబ్బిదేశాంతర్గతమైన రేపాక ద్వాదశ గ్రామామధ్యస్థకుత్తుంవృత్తి నికటుపలుగ్రామమును నిజ రాజధాని యగు లేంబులపాటకమున దన తండ్రియగు బద్దెగని యొక్క 'శుభధామజినాలయ' మను పేరు గల వసతికి ఖండస్ఫుటిత నవసుధాకర్మ బలినివేద్యార్థముగ దాన మొసగెను.[1]

ఈ వంశమునకు సంబంధించిన శిలాశాసన మొక్కటియే లభ్యమైనది. ఇది వీరి రాజధానియైన లేములవాడయందే కలదు. దీనిని హైదరాబాదు నందలి లక్ష్మణరాయ సంశోధకమండలివారు సంపాదించిరి. వారికడ గ్రహించి శ్రీ భావరాజు వేంకటకృష్ణారావు పంతులు ఎం. ఎ., బి. ఎల్. గారు ప్రథమమున నాంధ్రైతిహాసిక సంఘమువారి త్రైమాసికపత్రికయందును, తరువాత ఆంధ్రమున భారతియందును బరిష్కరించి ప్రకటించిరి.[2] లక్ష్మణరాయసంఘము వారు ప్రకటంచిన తెలింగాణశాసనముల సంపుటమునందును నీశాసన గ్రంథము ప్రచురణమైయున్నది.[3] కాని ఇందు శాసనగ్రంథము పెక్కు తావుల యథామాతృకము గాక యపపాఠములతో నిండియున్నది; కాని రావుబహదూరు సి. ఆర్. కృష్ణమాచార్యులవారు మాతృ కను జూచి తప్పులను సవరించుకొని యుండిన తమ ప్రతిని నాకు

1. Ibid.
2. JAHRS VI. P. 16; భారతి. సం. ౧. భాగ ౨. పుటలు. ౩౧౦-౪౦.
3. తెలిం. శాసనములు. ఇ౬ర. పెం. ౨౧.

దయచేసి మెర వ్రాసగిరి. వీరి సవరణల ననుసరించియే ఇచ్చట నీ శాసనగ్రంథమును సంగ్రహముగ దెల్పుచున్నాను:-

పరమండలైక రాముడు చాళుక్యకులతిలకుడు వినయాదిత్యుడను నామాంతరము గల యుద్ధమల్లుడను రాజొక డుండెను. అతడు అనన్యశాస్యమగు సపాదలక్ష దేశమును శాసించెను. పోదనమున తైలపూరమగు కొలనిలో నేనుగులను తానమాడించెను. అసురేంద్రులకైనను సమీపింప శక్యముకాని యా చిత్రకూటమును హరించెను. అతని పుత్రుడు అరికేసరి వేంగీదేశము నఖిలమును బలవంతముగ గ్రహించెను. అతని పుత్రుడు రాజాదిత్యనామాంతరుడగు నరసింహవర్మ్మడు; యుద్ధమల్లు డతనికి బుట్టెను. అటువెనుక బద్దిగడును, మరల యుద్ధమల్లు డను రాజును ప్రభుత్వమొనర్చిరి. తదనంతరము నరసింహదేవుడు రాజాయెను. ఇతడు దుస్సాధతరులగు సప్తమాళవముల రాజులను సమరాంగణమున నోడించి తనకు గప్పమిచ్చువారినిగా జేసికొనెను. తా నొక్కడే, యెదురువచ్చిన గూర్జరరాజసేనను నిర్జించి కాళప్రియమనుచోట శిలాస్తంభమున స్వశౌర్యమును లిఖించెను. ఇతనికి అరికేసరి యనుతనయు డుదయించెను; గోవిందరాజు క్రుద్ధుడుకాగా వెఱచి తన మరుగుజొచ్చిన బిజ్జనికభయ మిచ్చి యాతని నరికేసరి సంరక్షించెను. ఇంద్రరాజుపుత్రికయైన రేవకనిర్మడి నిత డుద్వాహము జేసికొనెను. 'సమధిగత పంచమహాశబ్దమహాసామన్తాధిపతి ... పాంబరాంకుశ నమ్మనగంధవారణం గన్దేభవిద్యాధర నారూఢసర్వజ్ఞ నుదాత్తనారాయణం నొడుదం తెగెల్వొం గుణనిధిగుణార్ణవం శరణాగత వజ్రపంజరం ప్రియగళ్ళం త్రిభువనమల్లసామన్తచూడామణి' యనునవి యరికేసరినృపాలుని బిరుదులు.

బద్దెగభూమిపాలుని తంత్రాధిపాలుడు నాగమార్యుడను నతడు పుట్టెను; అతనికి గుణార్ణవోర్వీపతి యొక్క తంత్రపాలుడు

పెద్దణార్యుడు కుమారుడు కలిగెను. ఈ పెద్దణార్యునిచే నిర్మింపబడిన యాదిత్య గృహమునందలి దేవతావందనమునకు వచ్చిన యభ్యాగత జనసత్రమునకొఱకు అతనిచే నభ్యర్థింపబడినవాడై యరికేసరిక్షితిపతి యుత్తరాయణ సంక్రాంతిదినమున లేంబుళవాటకపట్టణమున కీశాన్య దిశయందు నూఱు నివర్తనల భూమిక్షేత్రమును, అష్టనివర్తనల పానీయ భూమిక్షేత్రమును ఇచ్చెను. దీని కచటి రాజేశ్వరగృహాదిత్యగృహ బద్దెగేశ్వర నగరేశ్వర ప్రభృతి చతుస్థానాధివాసులైన సాక్షిమల్లికార్జున ముక్తలింగివిద్యారాసి వ్యాఖ్యానభట్టారకులు సాక్షులు. చంద్రశ్రేష్ఠి ప్రభృతులు తొమ్మండుగురు శ్రేష్ఠులు సాక్షులు[1].

శాసనముల మూలముననే కాక కర్ణాట సంస్కృతవాఙ్మయములవల్లగూడ వేములవాడచాళుక్య రాజుల చరిత్ర కొంత తెలియుచున్నది. కర్ణాట కవిశ్రేష్ఠుడైన పంపకవి ఇతని కాశ్రితుడు. స్వవిరచిత విక్రమార్జునవిజయమునందు పంప డరికేసరివంశచరిత్రమును గుణగణములను వర్ణించియున్నాడు.

చళుక్యవంశమున దుగ్ధమల్లు డను రాజు నెగడెను (౧-౧౫); అతడు సపాదలక్షక్షితి నేలెను. (౧౬); మఱియు పోదనమున తైల పూరిత దీర్ఘికలయందు నేనూఱేనుగుల నవగాహ మాడించెను (౧౭); అతని కరికేసరి యను పుత్రుడు గలిగెను. ఈ యరికేసరి నిరుపమ[2]ని రాజ్యకాలమున వేంగిమండలమును, త్రికళింగమును జయించెను (౧౮-౨౦).

నిరుపమదేవన రాజ్యదొ
ళరికేసరి వెంగివిషయమం త్రికళింగం

1. తెలింగాణ శాసనములు. ఇతర. నెం. ౨౧
2. పంప. విక్రమార్జున విజయము. ఆశ్వా. ౧౧౫-౪౨

> బెరసొత్తికొండు గర్వదె
> బరెయిసిదం పెసర నఖిల దిగ్భిత్తిగళోళ్.

అరికేసరికి నరసింహ భద్రదేవు లను కుమారు లిరువురు సంభవించిరి (౨౨); నరసింహునియొక్క జ్యేష్ఠపుత్రుడు యుద్ధమల్లుడు; అతని పెద్దకొడుకు బద్దెగడు (౨౭); ఇతనికి 'సోలదగండ'డని బిరుద నామము గలదు; నలువదిరెండు సంగ్రామములయందు విజయ మందెను. భీము డను రాజును నీట మొసలిని పట్టినట్లు పట్టెను. (౨౩, ౨౫-౬).

> బల్వరికెయొ ళరినృపర ప
> డల్వడె తత్తళిదు రణదొ ళావిక్రమమం
> పొల్విన మావర్జిసిదం
> నాల్వత్తెర డఱికె గాళగంగొళొ ళితం.
> వనధిపరీతభూతళదొ ళితనె సోలదగండ నెంబ పెం
> పిన పెసరం నిమిర్చిదుదు మల్లదె విక్రమదిందె నిం దగు
> ర్వేన లిఱి దాంతరం మొసళెయం పిడివంతిరె నీరొళొత్తి భీ
> మనగతి గర్వదిం పిడిదు మెగ్గలి బద్దెగ నన్నినావనో.

బద్దెగనిపుత్రుడు యుద్ధమల్లుడు; ఇతని కుమారుడు నరసింహ దేవుడు (౩౦-౧). ఇతడు లాటుల నోడించెను; ఏడు మాళవములను దగులబెట్టి పాడుకావించెను. విజయారంభపురస్సర విజయగజము లను బట్టుకొని, గూర్జరరాజసైన్యము నెదిర్చి నిర్జించెను; పిడుగువలె పై బడిన నరసింహుని దళమునకు జడిసి యుమ్మలించుచు గుడిచినచో గుడువజాలక, పడుకొనినయెడ బడుకొననేరక, నిలిచినపట్టున నిలువ లేక మహీపాలుడు పాఱిపోయెను; గంగాజలముల నిజతురంగమ మును తానమాడించి, ప్రసిద్ధమైన కాళప్రియమున దన యసిలతను నిజభుజ విజయగర్వమువల్ల స్థాపించెను (౩౩ - ౩౮)

తటిసెందు లాఱరోళ్ త
త్రిటిదేఱం పేటి కేళ్దు మండలమిన్నుం
తిఱునీరిక్కువుదెనిసిద
తటిసలవిన చలదబలద కలినరసింహం.

ఏఱుంమాళముమం పా
ఱేటి తగుళ్దిరుదు నరగ సురిపిదొడె కరిం
కేటిసిదాతన తేజద
బీటల ననుకరిపు వాదు వొగెదురివురిగళ్.

విజయారంభపురస్సర
విజయగజంగళనె పిటిదు ఘూర్జరరాజ
ధ్వజినియ నిటి దోడిసి భుజ
విజయద విజయనుమనిటిసిదం నరసింహం.

సిడిలవొ లెఱగువ నరగన
పదెగగి దుమ్మళదినుండెడెయొ ళణ్ణదెయుం
కెడె దెడెయొళ్ కెడయదెనిం
దెడెయొళ్ నిల్లదెయ మోడిదం మహిపాలం.

గంగావార్ధియొ ళాత్మతు
రంగముమం మిసిసి నెగళ్దె కాళప్రియదోళ్
సంగతగుణ నసిలతెయ న
సుంగొళె భుజవిజయగర్వదిం స్థాపిసిదం.

నరసింహుడు జాకవ్వను పెండ్లియాడెను (౩౯). ఈ దంపతుల కరికేసరి యను సుపుత్రు డుదయించెను (౪౧-౨). ఇతనికి పెక్కు బిరుదనామములు గలవు. అందు ముఖ్యమైనవాని గొన్నిటి నిచట చేర్కొనియెదను: 'ఉదాత్తనారాయణం......ఉదారమహేశ్వరం, కదనత్రినేత్రం, జగదేకమల్లం, పాణ్బరంకుసం, అమ్మనగంధ

వారణం, పడెమెచ్చెగండం, ప్రియగళ్ళం, గుణనిధి, గుణార్ణవం, సామంతచూడామణి' ఇత్యాది (౧౪౮-౧౪౯ మధ్యవచనం). అరికేసరియొక్క సాహసకార్యములు సంస్మరణీయములు. చళుక్యకుల తిలకుడగు విజయాదిత్యునిపై గోవిందరాజు కోపింపగా నాతని అండ జేర్చుకొని రక్షించెను; గొజ్జిగ డను సకలచక్రవర్తి యాజ్ఞపై దప మీాద దండెత్తి వచ్చిన మహాసామంతులను మాఱుమొగమువడ వోడిచి గెల్చెను; అతివర్తియై తన్ను మాఱ్కొన్న చక్రవర్తిని గెడపి తన్ను నమ్మివచ్చిన బద్దెగదేవునికి సామ్రాజ్యము నొసగెను; సమద గజఘటాటోపముతో గూడి నేల యదరునట్లు వచ్చి తాకిన కక్కలుని తమ్ముడగు బప్పువనంకకాఱుని యొక్క మదాంధగంధసింధురముచే నోడించెను.

“చళుక్యకుళతిళకనప్ప విజయాదిత్యంగె గోవిందరాజం ముళిసె తళరదె పెఱగిక్క కాద శరణాగతజళనిధియ పెంపుమం గొజ్జిగనెంబ సకళచక్రవర్తి బెససె దండువంద మహాసామంతరం మరలిక్కిదు గెల్ద సామంతచూడామణియ బీరముమ నతివర్తియాగి మార్కొలెప చక్రవర్తియం కిడిసి తన్న నంబి బంద బద్దెగదేవంగె సకళసామ్రాజ్యవ నొరంతుమాడి నిఱిసి దరికేసరియ తోళ్వలముమం సమదగజఘటాటోపం బెరసు నెలనదిరె వందు తాగిద కక్కలనతమ్మనప్ప బప్పువనంకకాఱ నొందె మదాంధగంధసింధురదొళోడిసిద వైరిగజఘటావిఘటననదటుమం...”[1]

“గొజ్జిగనెంబ సకళచక్రవర్తి ముళిసె తనగె శరణాగతనాద విజయాదిత్యనుంకాద బల్లాళ్తనదోళ్ శరణాగతజళనిధియుం...”[2].

1. పంప. విక్రమార్జునవిజయము. ఆ. ౯. ౫౨, ౫౩ లప మధ్యవచనము.
2. పంప. విక్రమార్జునవిజయము. ఆ. ౧౪; ౩౭ ౩౮ల మధ్యవచనము.

కన్నడమునందేకాక సంస్కృతవాఙ్మయమునందును లేములవాడచాళుక్యుల ప్రశంస కొంత కలదు. సోమదేవసూరి యను జైన పండితవర్యుడు యశస్తిలక మను చంపూకావ్యమును శకాబ్దము 881 గతింపగా వర్తమాన సిద్ధార్థినామసంవత్సరాంతర్గత చైత్రమాస మదనత్రయోదశినాడు పాండ్య సింహల చేరమ ప్రభృతిరాజులను సాధించి కృష్ణరాజదేవుడు మేల్పాటియం దుండగా దత్పాదపద్మోపజీవి చాళుక్యకులసంజాతుడు అరికేసరియొక్క ప్రథమపుత్రుడగు వా(ద్దె)గదేవుడు గంగధారయందు ప్రవర్ధిల్లుచుండినపుడు విరచించితి నని తెల్పుచున్నాడు.

'శకనృపకాలాతీతసంవత్సరశతే ష్వష్ట స్వేకాశీత్యధికేషు (అఙ్కతః 881) సిద్ధార్థసంవత్సరాన్తర్గత చైత్రమాస మదనత్రయోదశ్యాం పాండ్య సింహల చేరమ ప్రభృతీన్మహీపతీ న్ప్రసాధ్య మేల్పాటీ ప్రవర్ధమానరాజ్యప్రభావే శ్రీకృష్ణరాజదేవేసతి తత్పాదపద్మోపజీవినః సమధిగతపఞ్చమహాశబ్ద మహాసామన్తాధిపతే శ్చాలుక్యకులజన్మనః సామన్త చూడామణేః శ్రీమదరికేసరిణః ప్రథమ పుత్రస్య శ్రీమ ద్వా(ద్దె*)గరాజ ప్రవర్ధమాన వసుధారాయాం గఙ్గధారాయాం వినిర్మాపిత మిదం కావ్య మితి'[1].

లేములవాడ చాళుక్యవంశచరిత్రను రచించుటకు గల సాధనము లివియే. వీని యాధారముననే వీరి చరిత్రను రచింపవలసియున్నది.

## 2 వంశానుక్రమణిక - వంశవృక్షము

పూర్వప్రకరణమున వర్ణించిన యాధారములయందు నాల్గింట లేములవాడశాఖయొక్క వంశానుక్రమణికలు గలవు.

1. యశస్తిలక, (కావ్యమాలగ్రంథపరంపర నెం. 70) పుట 419.

ఇందు మొదట పేర్కొనదగినది కొల్లిపఱతామ్రశాసనము. సత్యా
శ్రయుడాది యరికేసరిపర్యంతము గల రాజు లిందు వర్ణింపబడి
యున్నారు. ఇందలి వంశవృక్ష మిది:

చాళుక్యవంశమునందు—

సత్యాశ్రయుడు

పృథివీపతి

మహారాజు

రాజాదిత్యుడు (పృథువిక్రముడు)

|

వినయాదిత్యుడు (యుద్ధమల్లుడు)

|

అరికేసరి.

వినయాదిత్యుని పూర్వికులను బేర్కొనున దీశాసన మొక్క
టియే. ఇతర శాసనములలోగాని, కర్ణాట సంస్కృత గ్రంథములలో
గాని వీరి ప్రస్తావము ఎచ్చటను గానరాదు. శాసనానంతరములం
దేమి కన్నడ సంస్కృత గ్రంథములయం దేమి, లేములవాడ
చాళుక్యవంశము వినయాదిత్యాపరనామధేయు డగు యుద్ధమల్లుని
తోడనే యారంభమగుచున్నది. లేములవాడ శిలాశాసనమున వీరి
వంశవృక్ష మీ క్రిందివిధమున వర్ణింపబడియున్నది:—

(చా ళు క్య కు ల తి ల కు డు)

వినయాదిత్య - యుద్ధమల్లుడు ౧

అరికేసరి - ౧

నరసింహవర్మ – రాజాదిత్యుడు – ౧

యుద్ధమల్లుడు – ౨

బద్దెగడు

యుద్ధమల్లుడు – ౩

నరసింహదేవుడు – ౨

అరికేసరి – ౨

ఈ వంశవృక్షమున జెప్పిన మొదటి ముగ్గురికిని, కడపటి యిద్దరికిని గల యన్యోన్యసంబంధము స్పష్టము సేయబడియున్నది. పై జెప్పినవారికిని, క్రిందివారికిని, పితృపుత్రబాంధవ్యము గలదని శాసనభాషవల్ల తెల్లమగుచున్నది. కాని తక్కినవారి కొండొరులకు గల పరస్పర సంబంధమును నిశ్చయించి చెప్పుటకు వలనుపడదు. 'అతః' 'తతః' 'పశ్చాత్' అను పదములే యొక తరమును దాని వెనుకటితరముతో గూర్చుటకు వాడబడియుండుట చేత మొదటి నరసింహుని యనంతరము రెండవ యుద్ధమల్లుడును, తదనంతరము బద్దెగడును, నతనివెనుక మూడవ యుద్ధమల్లుడును, వానిపిమ్మట రెండవ నరసింహుడును రాజ్యము జేసి రని తెలియుచున్నది ; కాని వారికి గల పరస్పరబాంధవ్యమును నిర్ణయించుటకు వీలుగాదు. పంప కవి తన విక్రమార్జునవిజయపీఠికయందు వర్ణించిన వంశానుక్రమణిక యందును నీ రాజులందఱు నిదేక్రమమున బేర్కొనబడి యున్నారు,




కాని యందు పై వంశవృక్షమున నెన్నబడినట్టి యన్నితరముల యందును పైవారు క్రిందివారి పితృ పుత్ర బాంధవ్యము గలవా రని చెప్పియున్నది. పంపకవి పై వంశవృక్షములో గడపటివాడు ఇమ్మడి యరికేసరినరపాలుని కాశ్రితుడగుటచే నతనిచే దెల్పబడిన బాంధవ్యము వాస్తవమైన దని నమ్మవచ్చును.

ఈ వంశవృక్షము లేములవాడ శాసనోక్తవంశవృక్షముతో నీషద్భేదముతో సరిపోవుచున్నది. మొదటి భేదమేమనగా లేములవాడశాసనములో నాలవ యారవతరముల రాజులకు మూలపురుషునికి బోలి యుద్ధమల్లు డను పేరు గలిగినట్లు చెప్పియుండగా

విక్రమార్జున విజయమునందు వీరి పేర్లు దుగ్ధమల్లు డని యున్నది. కాని యీ భేదము తాళపత్రగ్రంథ లేఖకుల ప్రమాదమువల్ల గలిగిన దని తోచుచున్నది; కావున నిది యంతగ పరిగణింపదగినదిగాదు. మొదటి యరికేసరికి భద్రదేవుడను నొక తమ్ము డుండె నని పంపకవి తెల్పుచున్నాడు.[1] లేములవాడశాసనమున 'భూరామోస్మి న్నరసింహ

1. డాక్టరు ఫ్లీటుగారు ప్రమాదవశమున మొదటి యరికేసరికి నరసింహ భద్రదేవు డను కుమారు డొక్కడే యుండినట్లు వ్రాసిరి. (Bom. Gaz. Vol. I. Part II. P. 380) ఇది తప్పని యెఱిగి శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు విక్రమార్జునవిజయముబడి దీనిని సవరించి 'ఇతనికి నరసింహ, భద్రదేవ నామాంకితులు ఇరువురు తనయులు కలరు' అని వ్రాసిరి (భారతి. సం. ౭ ప్రమోదూత శ్రావణ, పుట ౩౦౨). కాని వీరి సవరణ శ్రీ భావరాజు వేంకటకృష్ణరావుగారికి నచ్చినది కాదు. లేములవాడ శిలాశాసనమును ప్రకటించుచు నైసవరణ నిట్లు నిరసించి యున్నారు. 'ఇందు ఫ్లీటు ఇచ్చిన విక్రమార్జునవిజయోదాహృతవంశకథాసారమునుండియే యీ విషయమును గైకొనుచున్నాను. శ్రీశర్మగారును అద్దానినుండియే తా మిచ్చిన వంశావళిని ఎత్తి వ్రాసిరని ఊహింతును. కాని వా రిచ్చిన వంశక్రమమునందు కొన్ని ప్రమాదకరములయిన తప్పులు దొరలినవి. అవి యెట్లు సంభవించెనో ఊహింపజాలకున్నాను. (భారతి సం. ౮, పుట ౨౫౬) ఈ విషయమును మఱింత విపులీకరించి యాంధ్రేతిహాసికసంశోధక త్రైమాసికపత్రికయం దాంగ్లమున నిట్లు చెప్పియున్నారు:

"Mr. Somasekhara Sarma, also discusses in his editorial notes the genealogy as given by Pampa, but gives it with some variations Dr. Fleet or Mr. Somasekhara Sarma must have made a mistake in understanding the statements of Pampa. Mr Sarma gives two sons to Arikesari I, Narasimha and Bhadradeva, while Dr Fleet read the whole as one name Narasimhabhadra. There is, in my opinion good reason to assume that Dr. Fleet who is a greater scholar of Kanarese than Mr Sarma, correctly rendered the statements of Pampakavi." JAHRS. VI. P. 175.

సోమశేఖరశర్మగారి కన్నడపాండిత్యమును గొంచెపఱుప ప్రయత్నము సల్పుటకు బదులు పంపకవి ఈ సందర్భమున నేమి వ్రాసెనో కనుగొనగదగియుండిన శ్రీ కృష్ణరావు పంతులవా రింత దృఢముగ వ్రాసియుండజాలరు.

వర్మ నృపతిః భూమిం సమాపాదయత్' అను శ్లోకమున నరసింహు డొక్కడే పేర్కొనబడియున్నాడు. వాస్తవముగ నిది యొక భేద మని తలంపరాదు; ఈ శాసనగ్రంథకర్త యనవసరమని స్వవిరచిత ప్రశస్తియందు లేములవాడ చాళుక్యవంశమునుండి యుత్పన్నమైన యుపశాఖలను, దత్సంబంధికుల నామములను వదలివేసిన ట్లున్నది. ఇది నిరాధారమైన యూహకాదు: పంపకవి వాక్యముయొక్క సత్య మును ముమ్మడి యరికేసరినాటి పరభణితామ్రశాసనము రుజువు సేయుచున్నది.

"నరసింహో భద్రదేవః తేజఃకాన్తినిధీ స్వయం,
తస్యాభూతాం సుతౌ సాక్షా త్సూర్యాచంద్రమసావివ."

కాని ఇది యొకయల్పభేదము; పరిగణింపదగినది కాదు. ఇట్టి యల్పభేదము గానవచ్చుచున్నను పంపకవియు లేములవాడశిలా శాసన గ్రంథకర్తయు వర్ణించిన వంశవృక్షము రెండును నొక్కటియే యని యంగీకరించుట యుక్తము.

మఱియు లేములవాడశాసనమునందు—

"దేవీం రేవకనిమ్మడి క్షితిపతే రింద్రస్య పుత్రీ స్సుతాం
పౌలోమీమివ వాసవశ్రియ మివ శ్రీమత్స్మరధ్వంసకః
స్త్రీరత్నం పరిణీయ యేన నితరాం తస్యా స్సపత్నీకృతా
మానాం సప్తసముద్రముద్రితమహీ మ్మానోన్న తే నాధునా.

ఈ క్రింది పంపభారతపద్యము శర్మగారు చెప్పినట్లు మొదటి యరికేసరికి నరసింహభద్రదేవు లను పుత్రు లిరువు రుండి రని స్పష్టముగ దెల్పుచున్నది:

"అరికేసరి గాత్మజ రరినరపశిరోదళన పరిణతో గ్రాసిభయం
కరకర రాయివ్వరోళార్ దొరెయొనె నరసింహభద్రదేవర్ సెగఱ్దర్"

సర్వత్ర బహువచనప్రయోగము [ఆత్మజర్, భయంకరర్, సెగఱ్దర్] వల్లనే కాక 'ఆయివ్వర్', అనగా ఆ యిరువురు అను మాటలు శ్రీ శర్మగారి వివరణమే సరియైన దని తేటతెల్లము గావించుచున్నది.

అను శ్లోకమున నింద్రరాజుపుత్రికయగు రేవకనిర్మడి యను స్త్రీరత్నమును బరిణయమైనట్లు చెప్పియున్నది. పంపకవి యెచ్చటను నీ యంశమును జెప్పలేదు. విక్రమార్జునుని పట్టాభిషేక సందర్భమున-

"ఆగళ్ రాజ్యాభిషేక దనంతరదోళ్ ధర్మనందనం వాయు నందనం దేవకీసందన నశ్వినీసందన రయ్వరు మనేకమంగళాళంకృత శరీర రరికేసరియం కేసరివిష్టరదోళ్ కుళ్ళిరిసి పంచరత్నశిఖావిరాజ మానమప్ప పట్టమనెత్తి యాదవవంశసంభూతెయు మనేక లక్షణో పేతెయుమప్ప సుభద్రెగె మహాదేవియ పట్టమం కట్టిదాగళ్"[1]

అని చెప్పియుండుటచే నరికేసరికి సుభద్ర యను పట్టమహిషి యుండె నను తలంపు కలుగవచ్చును; కాని పంపకవి కృతిపతియగు నరికేసరికి కథానాయకుడగు నర్జునకు నైక్యము గల్పించి చెప్పుటచేతను, నర్జునునికి యాదవవంశభవయగు సుభద్ర భార్య యగుటచేతను, సుభద్రయను శబ్దమునకు మంగళవతి యని సామాన్యమగు నర్థము జెప్పుటకు వీలగుటచేతను అరికేసరియొక్క పట్టమహిషి పేరు సుభద్ర యని నిశ్చయించి చెప్పుటకు వలనుపడదు.

ఇక పరభణితామ్రశాసనములోని వంశవృక్షమును పరిశీలింతము.—

పరభణి తామ్రశాసనమునందు కొల్లిపఱ తామ్రశాసనమున వర్ణింపబడిన ప్రథమయుద్ధమల్లుని పూర్వికుల ప్రస్తావము గానరాదు. వేములవాడ శిలాశాసన విక్రమార్జునీయముల బోలి ఇందును వంశకర్త యుద్ధమల్లుడే; వంశానుక్రమణిక ఇతనితోడనే యారంభమగుచున్నది. కాని ఇందలి వంశవృక్ష మించుక పెద్దది. ఇది సహజమే; దీనియందు మఱి రెండుతరముల చాళుక్యరాజులు జేర్పబడిరి. వేముల

1. పంప, విక్రమార్జున విజయము ౧౪: ౧౭ - ౧౮ ల మధ్యవచనము.

వాడశాసనమును వేయించిన ఇమ్మడియరికేసరియొక్క మనుమడగు ముమ్మడియరికేసరినాటి దగుటచే నిం దిమ్మడి యరికేసరికి బిమ్మటి రాజులను బేర్కొనుట యవసర మాయెను.

(ఆదిత్యభవమైన చాళుక్యవంశము)

యుద్ధమల్లుడు - ౧

అరికేసరి - ౧

నరసింహుడు - ౧ భద్రదేవుడు

యుద్ధమల్లుడు - ౨

బద్దెగడు - ౧

యుద్ధమల్లుడు - ౩

నరసింహుడు - ౨

అరికేసరి - ౨

భద్రదేవుడు -

అరికేసరి - ౩

పరభణిశాసనోక్తవంశానుక్రమణిక విక్రమార్జునీయ లేములివాడశాసనములందలి వంశానుక్రమణికకంటె భిన్నము గాకపోయినను నందు విశేషాంశములు రెండు గానవచ్చుచున్నవి:-

(౧) చాళుక్యుల వంశము:—లేములవాడ చాళుక్యులేమి, యన్యశాఖలవారేమి తమ వంశ మెద్దియో యింతకుపూర్వ మెచ్చటను జెప్పుకొనియుండలేదు. బాదామివంశమువా రగ్నిష్టోమ పౌండరీక వాజపేయాశ్వమేధాది యాగములను జేసియుండుటచేతను, వర్మాంతనామధారు లగుటచేతను, మఱియు క్రీ. శ. ౭ వ శతాబ్ద పూర్వార్ధమున దక్షిణాపథమునకు వచ్చియుండిన చీనాయాత్రికుడగు హ్యుయఞ్‌త్సాంగు, దక్షిణాపథమున కధిపతియై యుండిన చాళుక్యుడు, ఇమ్మడి పులకేశి క్షత్రియు డని చెప్పియుండుటచేతను వీరిని క్షత్రియులని చెప్పవలసియున్నది. వీరివలె చాళుక్యవంశమునందలి యన్యశాఖలవారిని సైతము క్షత్రియు లనుట యొప్పును; కాని క్షత్రియజాతికి సహజమైన సూర్య చంద్రకుటుంబములలో నేకుటుంబమునకు జెందినవారో తెలియదు. క్రీ. శ. ౬౮౦ నుండి ౬౯౬ పర్యంతము రాజ్యమొనర్చిన పాశ్చాత్యచాళుక్య వినయాదిత్యుని సోరభ తామ్రశాసనములో దనది 'హిమకరకర విమలకుల'మని చెప్పుకొని యున్నాడు.[1] దీనిని గాంచి కొంద ఱిది చాళుక్యులు చంద్రవంశజు లని సూచించు చున్న దని చెప్పిరి; కాని ఇది యంగీకరింపదగినది కాదు. 'హిమకరకరవిమలకుల'మని యున్నదేకాని 'హిమకరకుల' మని లేదు. కౌముదివలె స్వచ్ఛమైన కుల మని చెప్పవచ్చును; గాని చంద్రవంశ మనుట చెల్లదు. చాళుక్యుల వంశప్రస్తావము మొట్టమొదట నీ పరభణిశాసనముననే కానవచ్చుచున్నది. అర్వాచీనులగు పూర్వపాశ్చాత్యచాళుక్యరాజులెల్ల దాము చంద్రవంశజుల మని యేకగ్రీవముగ బల్కుచుండగా దీనికి విరుద్ధముగ నీ శాసన మొక్కటి మాత్రము చాళుక్యులది సూర్యవంశమని తెల్పుచున్నది.

'అ స్త్యాదిత్యభవో వంశ శ్చాలుక్య ఇతి విశ్రుతః'

1. EC. VIII. SB.

అను శాసనవాక్యమున కన్యథా యుక్తమైన యర్థ మేదియు గానరాదు. పరస్పరవిరుద్ధమైన ఈ వంశనిర్దేశమునకు సమన్వయ మెట్లో తెలియదు. చాళుక్యుల కింతకుపూర్వము వంశవిషయమై జిజ్ఞాస గలిగినట్లు తోపదు. సూర్యచంద్ర వంశములలో దమ పెద్దయై నదియు వారెఱుగన ట్లున్నది. కావున వంశమును బేర్కొనవలయు నని ఇచ్ఛ కలిగినప్పుడు అప్పటి పౌరాణికాభిప్రాయము ననుసరించి వారు సూర్యవంశజుల మని మొదట జెప్పుకొనియుండవచ్చును. అర్వాచీనులు దీని నే కారణముచేతనో యొప్పుకొనక సూర్యవంశము నకు స్వస్తి చెప్పి చంద్రవంశమువార మని ప్రకటించుకొని తదను గుణముగ నూతనవంశానుక్రమణికలను, గాథలను నిర్మించుకొని యుండవచ్చును.

(౨) మఱియొక యంశము: లేములవాడ శాసనమునందు—

'దేవీం రేవకనిమ్మఁడి...' అని చెప్పియున్నందున నింద్రరాజు కుమారిత రేవకనిర్మడి యను స్త్రీరత్న మిమ్మడి యరికేసరికి సతి యైనట్లు తెలియవచ్చుచున్నది గదా. ఈ ఇంద్రరాజు నానవాలు పట్టుటకు సాధనము లీ శాసనమున గాని, యన్యత్రగాని కాన్పింపవు. పంపకవి తన విక్రమార్జునీయ పీఠికయందొక ఇంద్రరాజు అరికేసరిని బాల్యావస్థయందు తొట్లయందు బోలి నిజభుజముపై నుంచుకొని పెంచినట్లు చెప్పియున్నాడు.

రుంద్రాంభోధిపరీత మ
హీంద్రరదా రిన్నరీనరేంద్రం సాక్షా
దింద్రం తానెనెసలెనెగ
ఱ్దింద్రేంద్రన తోళె తొట్టిలాగిరె బళెదం.[1]

అర్జునుడు అమరావతికిబోయి ఇంద్రుని యర్ధాసనమున గూర్చుండి యోలగమున్న తెఱగు వర్ణించుచు–

1. విక్ర. విజ. ఆ. ౧: ४४.

దనుజానీకద నిం దదొందు నెలెయం ముట్టుత్తె మాదేవని
త్తనిజోగ్రాస్త్రదె దైత్యరెంబ పెసరి ల్లెంబంతుటం మాడి బం
దెనితానుం మహిమాగుణక్కె కణియాగిదొండు పెంపింద మిం
ద్రనొళర్ధాసన మేఱె దొఱ్ఱ హరిగంగక్కం పెఱంగక్కమే.

అని పొగడియున్నాడు. 'హరిగంగక్కంపెఱం గక్కమే' అను వాక్యమువల్ల నర్జునుడు దేవేంద్రుని యర్ధాసనమున గూర్చుండినటు అరికేసరి యింద్రరాజు నర్ధాసనమున గూర్చుండెనేమో యను శంక కలుగుచున్నది; కాని యర్జునునికిని, కృతిపతి యగు నరికేసరికిని నైక్యము గల్పించి పంపకవి చెప్పియుండుట చేతను, నర్జును డింద్రుని యర్ధాసనము నెక్కుట సుప్రసిద్ధైతిహాసిక గాథ యగుటచేతను నీ విషయమును నొక్కి చెప్పుటకు వలనుగాదు. అరికేసరి యింద్రరాజుతో నర్ధాసనమున నాసీనుడగుట చారిత్రకాంశమైనను గాకపోయినను బాల్యమున నతని నింద్రరాజు తన భుజముపై నిడుకొని సాకినది నిశ్చయము. కావున నితని నెత్తి పెంచిన ఇంద్రరాజే ఇతనికి పిల్ల నిచ్చిన ఇంద్రరాజు కావచ్చును. ఇందసమంజస మేమియు లేదు. ఈ యింద్ర రాజెవ్వరో యనామధేయుఁడై యుండిన పంపకవి నిజప్రభువగు నరికేసరి యాతని భుజములే డోలగా బెరిగె నని గొప్పగ జెప్పియుండడు. ఇంద్రరాజు విఖ్యాతు డగుటచేతనే పంపకవి, అంతటి సుప్రసిదుడెత్తుకొని పెంచిన ఘనుడు దన ప్రభు వని ప్రకటించెను. ఈ ఇంద్రరాజు క్రీ. శ. ౯౧౪ నుండి ౯౩౦ వఱకు దక్షిణాపథమునకు సార్వభౌముడై ప్రజాపాలన మొనర్చిన రాష్ట్రకూటవంశజుడగు ముమ్మడి ఇంద్ర రా జని తలచెదను.

పరభరణిశాసనమున నింద్రరాజుమాట కాని, యాతని పుత్రిక యగు రేవకనిర్మడి ప్రస్తావముగాని కానరాదు. అం దిమ్మడియరి

కేసరియొక్క భార్య రాష్ట్రకూటవంశసంజాతయగు లోకాంబిక యని చెప్పియున్నది.

'రాష్ట్రకూటకులే ఖ్యాతే జాతా లోకాంబికా సతీ
వీరశ్రీ రివ వీరస్య తస్యాసీ త్సదతీ ప్రియా.'

ఇంద్రరాజు నిచట పేర్కొనకపోవుట గమనార్హమైన యంశము. ఇతడు లోకాంబికకు జనకుడై యుండిన యీవిషయ మిందు క్తముగాకపోవుట చిత్రము. కాని శాసనగ్రంథకర్త యేకారణము చేతనో యిమ్మడియరికేసరినరపాలుని మామగారిని పేర్కొనక విడిచి యుండవచ్చు ననుకొన్నను నతని భార్యపేరు రేవకనిర్మడి యని చెప్పక లోకాంబిక యని వక్కాణించియున్నాడు. లోకాంబిక యనునది రేవకనిర్మడి యొక్క మారు పేరని తలచుటకు దగినయాధార మేమియు నున్నట్లగపడదు. పరభణిశాసనమున నింద్రరాజు ప్రస్తావము లేకపోవుటచేతను, నిమ్మడి యరికేసరిభార్యపేరు లోకాంబిక యనియుండుటచేతను, రేవకనిర్మడి లోకాంబికకంటె భిన్నమైనవ్యక్తి యని తలచెదను. ఇది యుక్తమేని యిమ్మడియరికేసరి కిరువురు భార్య లుండి రని చెప్పవలసియున్నది.

ఇక యశస్తిలకమందు పేర్కొనబడిన యరికేసరియు, నాతని ప్రథమపుత్రుడగు వాగరాజును ఎవ్వరో విచారింతము. యశస్తిలక రచయితయగు సోమదేవసూరి క్రీ. శ. ౯౬౬ వ సం. నాటి పరభణీ శాసనమును వేయించిన ముమ్మడియరికేసరి కాశ్రితు డని యా శాసనమునందే కలదు. గాని యశస్తిలకమందు పేర్కొనబడిన యరి కేసరియాతడు కాజాలడు. ఏలన నా గ్రంథము పరభణిశాసకాలము నకు ముందే రచియింపబడెనని—

" తేషాం శత స్యావరజః శతస్య
తయా భవ త్పూర్వజఏవ ధీమాన్
శ్రీసోమదేవ స్తపసః శ్రుతస్య
స్థానం యశోధామ గుణోర్జితశ్రీః.

అపిచ యో భగవా నాదర్శ స్సమస్తవిద్యానాం రచయితా యశోధరచరితస్య..."

ఇత్యాది శాసనవాక్యములవలన దెలియును; మఱియు నీ సోమదేవసూరి యశస్తిలకగ్రంథాంతమందు శకాబ్ద ౮౮౧ సిద్ధార్థి సంవత్సరాంతర్గత మధన త్రయోదశినాడు (అనగా క్రీ. శ. ౯౫౯) అరికేసరి ప్రథమ పుత్రుడగు వాగరాజు రాజ్యము సేయుచుండగా వ్రాసి ముగించితి నని చెప్పియున్నాడు. కావున నీ వాగరాజుతండ్రియగు నరికేసరి పరభణి శాసనోక్తదానము నొసగిన యరికేసరికంటె భిన్నుడగుట తెల్లము; అతడు పరభణిశాసనదాతకు తాతయగు నిమ్మడి యరికేసరి యని తోచుచున్నది. 'వాగ'రా జనునది బద్దెగ, లేక వద్దెగ శబ్దమునకు లేఖకప్రమాదజనితమైన భ్రష్టరూపమను నూహ పొడమచున్నది. బద్దెగ శబ్దముయొక్క సంస్కృతరూపము భద్రగ యగుటచేతను, పరభణిశాసనమున నిమ్మడియరికేసరి పుత్రుడును ముమ్మడి యరికేసరి తండ్రియు నగు భద్రదేవు డొకడు పేర్కొనబడి యుండుటచేతను నీ వాగరాజును, భద్రదేవుడును నొక్కరే కావచ్చునను తలంపు కలుగుచున్నది. కాని దీని నిర్ధారించి చెప్పుటకు వీలు లేదు; 'శ్రీమదరికేసరిణః ప్రథమపుత్రస్య' యని సోమదేవసూరి చెప్పుటవలన పరభణిశాసనమున పేర్కొనబడిన ముమ్మడి యరికేసరి తండ్రియగు భద్రదేవుడు భిన్నపురుషుడు కావచ్చును. ఇమ్మడి యరికేసరికి వాగరాజు భద్రదేవులను నిరువురు పుత్రు లుండియుండ వచ్చును. ఇం దసంగత మేమియు లేదు.

పై బేర్కొనిన శాసనములయందును, సంస్కృత కర్ణాట గ్రంథములయందును జెప్పియుండు వంశానుక్రమణికల నన్నిటిని గ్రోడీకరించిన నీ క్రింది వంశవృక్ష మేర్పడుచున్నది :



(యుద్ధమల్లుడు - 3)

నరసింహుడు - 2

ఇంద్రరాజు — భార్య, జాకవ్వ (రాష్ట్రకూటవంశజ)

రేకవనిర్మడి. భార్య అరికేసరి-2 భార్య=లోకాంబిక

|

వాగరాజు — భద్రదేవుడు

|

అరికేసరి

## 3 అంతశ్శాఖాసంబంధము

శాసనముల వలనను, వాఙ్మయము వలనను దెలియవచ్చు చాళుక్య రాజకుటుంబములు పెక్కు కలవు. వేములవాడ శాఖవారికి వీనితో నెద్దియేనియు సంబంధము గలదో విచారింపవలసియున్నది. వేంగి నేలిన పూర్వచాళుక్యుల వలెను, గల్యాణి రాజధానిగ గర్ణాటకమును బాలించిన పాశ్చాత్యచాళుక్యులవలెను దమకు బాదామి చాళుక్యులతోగాని, యన్యశాఖలవారితోగాని సంబంధముండినట్లు వీ రెచ్చటను విస్పష్టముగ జెప్పుకొనియుండలేదు. ఈ విషయమును లభ్యమైన వాఙ్మయశాసనాదిచారిత్ర కాధారములను బరిశీలించి యూహింపవలసియున్నది. పరిశోధకు లీ విషయమునుగూర్చి కొంత కృషి సల్పి కొన్ని సిద్ధాంతములను జేసియున్నారు. ఈ సిచాంతము లన్నియు మొదటి యరికేసరి కొల్లిపఱ శాసనముపై నాధారపడి

యుండుటచేత దాని యోగ్యతను విచారించి యది యెంతవరకు విశ్వాసపాత్రమో కనుగొనవలసియున్నది. ఈ శాసనదాతయగు మొదటి యరికేసరి క్రీ. శ. ౭౮౦ మొదలు ౭౯౩ వఱకును రాజ్య పాలనము గావించిన రాష్ట్రకూటచక్రవర్తియగు నిరుపమదేవునికి సమకాలికు డని విక్రమార్జునవిజయమువలన దెలియవచ్చుచున్నది. కావున కొల్లిపఱశాసనము గూడ నప్పటిది కావలయును; శాస నాక్షరములుగూడ దీనికి బ్రతికూలింపవు. కాని శాసనోక్తచారిత్ర కాంశములను బట్టి యది కల్పనమై యుండునేమో యను సంశ యము గల్గుచున్నది. పంపని విక్రమార్జునవిజయమందును, ఇమ్మడి ముమ్మడి యరికేసరి నరపాలుర శాసనములందును లేములవాడ వంశమునకు మూలపురుషు డనదగిన మొదటి యుద్ధమల్లుడు సపాద లక్షదేశమును పాలించె ననియు, చిత్రకూటదుర్గమును సాధించె ననియు, బోదనపురమున తైలపూర దీర్ఘికయం దేనూఱేనుగుల నవ గాహ మాడించె ననియు జెప్పియున్నది. మఱియు మొదటి యరికేసరి నిరుపమదేవుని యేలుబడియందు త్రికలింగసహితముగ వేంగిని జయించినట్లు చెప్పియున్నది. మొదటి యరికేసరిదగు నీ శాసనమున నీ విజయముల ప్రస్తావనయే లేదు. త్రికళింగసహిత వేంగీరాజ్యమును జయింపక పూర్వ మరికేసరి ఈ తామ్రశాసనమును వ్రాయించి యుండు ననుకొన్నను తన తండ్రి కీర్తిలతకు పాదులగు చారిత్రాత్మక విషయముల నేల బేర్కొనలేదో తెలియదు. 'తురుష్క యవన బర్బర కాశ్మీర కాంభోజ మగధ మాళవ కళింగ గంగ పల్లవ పాణ్డ్య కేరళ ప్రభృతి దేశములను జయించె నని చెప్పిన ప్రశస్తి కర్త సపాద లక్షపై బ్రభుత్వమును జిత్రకూటదుర్గక్రమణమును బేర్కొన కుండుట చిత్రము, ఇంక వంశానుక్రమణిక యపూర్వ మైనది. అన్యచాళుక్య శాసనములలో నెచ్చటను గానరాదు. చూడుడు :




ఈ పట్టికలోని రాజులకు బాదామి చాళుక్య వంశముతో సంబంధమును గలుపుటకు గొందఱు పరిశోధకులు ప్రయత్నములు సల్పిరి. కొల్లిపఱ తామ్రశాసనపరిష్కర్తలు శ్రీ సోమశేఖరశర్మగారు ఇట్లు నుడివియున్నారు :

"మన శాసనమునందలి మొదటి రాజు సత్యాశ్రయుడు. ఇతనికి రణవిక్రమబిరుదము కలదు. బాదామి చాళుక్యవంశములోని మొదటి పులకేశికిని రణవిక్రమ, సత్యాశ్రయనామములు కలవు. ఈ కారణమున ఇరువురు నొక్కరే యగుదు రన్నచో మన శాసనమునంగలి పృథివీపతి మొదటి పులకేశి కుమారుడైన మొదటి కీర్తివర్మ కావలయును. మొదటి కీర్తివర్మశాసనములలో నెచ్చటను అతనికి పృథివీపతి యను రూఢిపే రున్నట్లు తెలియరాదు. ఒకవేళ పృథివీపతి కీర్తివర్మయే యగునేని కుమారుడైన (?) మహారాజు సత్యాశ్రయ రెండవపులకేశి కావలయును. రెండవ పులకేశి యే శాసనములందును నట్టి మహారాజనామమున పేర్కొనబడలేదు. రెండవ పులకేశికి ఆదిత్యవర్మ, చంద్రాదిత్యుడు, విక్రమాదిత్యుడు, జయసింహవర్మ యను నలుగురు తనయులు కలరు. మన శాసనము

నందలి మహారాజును, రెండవ పులకేశియు నొక్కరే యని మనము విశ్వసించినచో మన శాసనమున మహారాజు కొడుకుగ దెలుపబడిన రాజ్యాదిత్యుడు ఆదిత్యవర్మయో, చంద్రాదిత్యుడో కావలయును. చంద్రాదిత్యుని శాసనము లేవియు ఇంతవఱకు గనపడలేదు. కాని యతని భార్యయైన విజయమహాదేవి దానములను దెలుపు రెండు శాసనములు కలవు: ఒకటి సావంతవాడి సంస్థానములోని నేరూరుశాసనము; రెండవది రత్నగిరిమండలములోని కోచ్రేమ్ శాసనము. ఈ శాసనములు దొరకిన స్థలములు ధార్వాడమండలమునకు సమీపస్థములే. ఇక ఆదిత్యవర్మది ఒక్క శాసనముమాత్రమే కలదు. అది కర్నూలు శాసనము. ఇందు శకవర్షము లేదు కాని, శాసనకాలము "ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరే కార్తికపౌర్ణమాస్యాం" అని మాత్రము కలదు. పైతామహీహిరణ్యగర్భమహోత్సవమున ఆదిత్యవర్మ కొంతమంది బ్రాహ్మణులకు చేసిన ముండకల్లు పల్గిఱె గ్రామములకు సంబంధించిన 'ఉంఛమన్న పన్నాసనవృత్తి' దానమును దెలుపుట కీ శాసనము పుట్టినది......చంద్రాదిత్యుడో, ఈ ఆదిత్యవర్మయో మన శాసనమునందలి రాజాదిత్యుడు కాదగును. లక్ష్మేశ్వరమే పులిగెఱె యన్న ఫ్లీటుదొరగారి దిద్దుబాటు నంగీకరించినచో ప్రాంతసన్నిహితత్వము ననుసరించి మన రాజ్యాదిత్యుడు చంద్రాదిత్యుడు అగు ననవచ్చును. పులిగెఱె లక్ష్మేశ్వరము కాదన్నచో ఆదిత్యవర్మ శాసనమున మఱియొక పల్గిఱె (పుల్గిఱె?) కానవచ్చుచున్నందువలనను కర్నూలు మండలముననో, దానికి చేరికగనో ఎచ్చటనో మఱియొక పుల్గిఱె (పులిచెఱువు, పుల్చెఱువు, పుల్చెరువు) ఉండునని భావించుకొని మన శాసనపు రాజాదిత్యుని యీ ఆదిత్యవర్మతో ముడిపెట్టవలసియుండును...కర్నూలుమండలమున నొక పులచెఱువు కలదు......మన శాసనమునందలి ముగ్ధశివాచార్యుల గురువగు సద్యోశివాచార్యులు (?) ఏలీశ్వరము

నివాసముగ చేసికొన్నట్లు చెప్పబడియుండుటవలనగూడ ప్రాయిక ముగ మన శాసనమునందలి అరికేసరి ఏలీశ్వరప్రాంతమువా డనియు నూహింప నవకాశము కలదు......అరికేసరి రాజ్యము కర్నూలు మండలమునగాని, లేక దాని యిరుగుపొరుగుల నిజాం రాజ్యము నందలి మండలములలోగాని వ్యాపించి యుండవలయును. ఇదియే మన మంగీకరించు నెడల శాసనము నందలి రాజాదిత్యుడు బాదామి చాళుక్యవంశజుడైన ఆదిత్యవర్మ యగునేమో యని యనుమానము కలుగుచున్నది. అట్లయిన మన శాసనదాత బాదామి చాళుక్యుల లోని ఆదిత్యవర్మ వంశమునకు చెందినవాడు కావలెను.''[1]

ఇంత విపులముగ చర్చ చేసినను శర్మగారికి అరికేసరికి బాదామి చాళుక్యులతో సంబంధము కలదన్న నమ్మకము గుదుర లేదు. కొల్లిపఱ శాసనోక్త వంశావళి సర్వత్ర సంశయగ్రస్త మగు టయే వీరి యపనమ్మకమునకు ప్రధానకారణము.

''మన శాసనమునందలి వంశావతారక్రమము ననుసరించి చూచినయెడల వంశ మొకవేళ బాదామిచాళుక్యవంశశాఖ యగు నేమో యని తోచును. కాని యీ విషయమును నిర్ధారణగ జెప్పు టకు వీలు కనుపించదు. ఏలయన, తదితరమునకు అన్నియు సందేహ ములుగనే యున్నవి.''[2]

శ్రీ శర్మగారివలెనే శ్రీ ములియం తిమ్మప్పయ్యగారు కొల్లిపఱ వంశావళికి మూలపురుషుడగు సత్యాశ్రయరణవిక్రముడే బాదామి చాళుక్య వంశములోని సత్యాశ్రయ రణవిక్రమాపరనామధేయుడగు మొదటి పులకేశి యని నిశ్చయించినారు. వీరును కొల్లిపఱవంశావళి లోని పృథ్వీపతియు మహారాజును మొదటి కీర్తివర్మయు నతని

1. భారతి. సం. ౭. భా. ౨. పుటలు ౩౦౭-౮.

2. భారతి. సం. ౭. భా. ౨. పుట ౩౦౭.

పుత్రుడగు నిమ్మడి పులకేశియు నగుదు రని గుర్తించిరి. కాని యటు తరువాత వీరు శర్మగారి మార్గమును విడిచి నూతనపంథ నవలంబించిరి.

"సర్వకర్ణాటసంపదకు సారభూతుడగు నా రెండవ పులకేశి సత్యాశ్రయమహారాజునకు నలువురు పుత్రులు. వారియందు మొదటివాడగు చంద్రాదిత్యుడు తండ్రియొక్క బాదామిసింహాసనము నెక్కలేదు. సంస్కృతకవయిత్రులం దసమానకీర్తికి నెలవగు వల్లభమైన విజయభట్టారికతో గూడ నతడు సావంతవాడియందుండెను. బాదామిసింహాసనము నధిష్ఠించిన యతని తమ్ముడు విక్రమాదిత్యుడు చక్రవర్తియాయెను. పెద్దవాడు అన్న యుండగా తమ్ము డేకారణముచే నెట్లు ప్రభువాయె నను విషయమును పరిశీలించి చూత మన్నది మన దారికి రాదు. బహుశః విక్రమాదిత్యుడే రాజ్యరక్షణసమర్థుడై యుండియుండవలె ననుకొందము. మూడవవాడగు ఆదిత్యవర్మ వేంగియందు రాజ్యము సేయుచుండెను. మొదటనే సత్యాశ్రయపులకేశి యొక్క సహోదరుడగు కుబ్జవిష్ణువర్ధనుడు వేంగివిషయమునకు ప్రభువై యుండుటచే నీ యాదిత్యవర్మ అతనికి లోబడి యటుమీద వేంగియందు సామంతుడై యుండవలె నని తోచుచున్నది. నాలవవాడగు జయసింహుడు లాటదేశము నేలుచుండెను. సహోదరులగు నీ నలువురు రాకుమారులలో విక్రమాదిత్యుడు బాదామియం దధిరాజై యుండినది క్రీ. శ. ౬౩౪ నుండి ౬౮౦ వఱకు. [1] చిన్నతమ్ముడైన లాటజయసింహుడు విక్రమాదిత్యుని కంటె యెంతయో చిన్నవాడై యుండవలయు ననుటకు సంశయము లేదు. వానికి శీలాదిత్య,

1. ఇది తప్పు. విక్రమాదిత్యుడు క్రీ. శ. ౬౫౫ సంవత్సరమున సింహాసనము నధిష్ఠించెను. మఱియు నతడు ౨౭ యేండ్లు రాజ్యపాలనము గావించిన ట్లతని శాసనమువలన దెలియుచుండుటచే నతని యేలుబడి క్రీ. శ. ౬౮౨-3 వఱకు సాగె ననుట తెలము.

వినయాదిత్య - యుద్ధమల్లు రను పుత్రు లిద్దరుండిరి. వారియందు రెండవవాడగు వినయాదిత్య - యుద్ధమల్లు డొసగిన భూదత్తిశాసన మొకటి యా లాటప్రాంతమున 'నవసారి' యనుచోట దొరకిన దనియు, నా శాసనకాలము శా. శ. ౬౫౩ (క్రీ. శ. ౭౩౦) అనియు శ్రీ భండార్కరుగారు సూచించియున్నారు....పరభణితామ్రశాసన పంపవిక్రమార్జున విజయములందు రెండింటియందును ఈ (లేముల వాడ) కులమూలపురుషుని పేరు వట్టి యుద్ధమల్లు డనియే కానవచ్చు చున్నను వేములవాడశాసనమునందు వినయాదిత్య - యుద్ధమల్లుడని డా. భండార్కారు చెప్పినట్లే కానవచ్చుచున్నది. అంతమాత్రమే కాదు. పంప డనినట్లు 'ఆత్మవంశశిఖామణి'యైన ఈ యుద్ధమల్లుని కొడుకగు మొదటి అరికేసరియొక్క శాసనమొకటి 'కొల్లిపాఱ' యను చోట దొరకినది. అందుగూడ 'విశ్వ రాడ్వినయాదిత్యో యుద్ధమల్లో నృపాంకుశః' అని యున్నది. వినయాదిత్యు డను బిరుదుతోగూడ ఆ యుద్ధమల్లుడు పిలువబడుచుండె ననుటకు సంశయము లేదు.[1]'' కావున లాటవినయాదిత్య - యుద్ధమల్లుడును కొల్లిపార వినయాదిత్య - యుద్ధమల్లుడును నొక్కరేయని విదితమగుచున్నది.

''కాని, ఈ యభిప్రాయమును కుదిలించి కదలించునట్లగపడు యాక్షేప మింకొకటి తలచూపుచున్నది. వెనుక నూహించిన యభిప్రాయముబడి వినయాదిత్య-యుద్ధమల్లుని తండ్రి లాటజయసింహుడు గావలయును గదా. ఆ కొల్లిపారశాసనమునందు వినయాదిత్య - యుద్ధమల్లుని తండ్రిపేరు 'రాజాదిత్య పృథువిక్రమ' యనియే కానవచ్చుచున్నది. ఈ యాక్షేపము పై దానికంటె సబలముగనే కన్పించుచున్నది.'' కాని చక్కగ విచారించి చూచితిమేని ఇది యంతటి ప్రబలమైనది కాదని విదితము కాగలదు. కొల్లిపారశాసన మందలి వంశమునందు వినయాదిత్య యుద్ధమల్లుని తండ్రిపేరు జయసింహావర్మ

1. నాడోజపంప, పుటలు ౨౩ - ౨౫.

యని కాన్పించ లేదనుటమాత్రము నిజము. అయినను, వినయాదిత్య-యుద్ధమల్లునికి పూర్వీకు లందరిపేర్లను బిరుదులుగనే తోచుచున్నవే కాని యంకితనామములుగ భాసమగుట లేదనియందఱు నొప్పుకొనక పోరు. అట్లగుటచే క్రింద నిరూపించిన శ్రీ భండార్కారుగారి గ్రంథము నందలి వంశచరిత్రలోను కొల్లిపార శాసనములోను తెలియవచ్చు వంశావళిభాగముల నొండొంటి దిగువనిచ్చి యీ యీ చాలు రాజులభిన్నులై యుండవచ్చునేమో పరీక్షింతము.

| శ్రీ ఆర్. భండార్కారుగారిది. | కొల్లిపార శాసనమున గన్పట్టునది |
|---|---|
| ౧. పులికేశి I | ౧ సత్యాశ్రయ-రణవిక్రమ |
| ౨. కీర్తివర్మ I | ౨. పృథ్వీపతి |
| 3. పులికేశి II | 3. మహారాజ |
| ౪. జయసింహవర్మ (లాట) | ౪. రాజాదిత్య-పృథువిక్రమ |

వీనియందు కొల్లిపారశాసనవంశావళిలో గనపడు మొదటి 'సత్యాశ్రయ-రణవిక్రమ' యను పేరును జూడుడు. శ్రీ ఆర్. భండార్కారుగారు చెప్పునట్లగపడు నా మొదటి పులికేశియే ఈ కులమునందు పరంపరను బట్టివచ్చు 'సత్యాశ్రయ' బిరుదునకు మూల పురుషుడగు 'సత్యాశ్రయ-రణవిక్రము' డనుట తప్పుకాదు. ఆ సత్యాశ్రయుని తండ్రి 'రణరాగు' డని (యున్నది.) అందువల్ల తండ్రిసంజ్ఞతోగూడ తన బిరుదును జేర్చికొనిన మొదటి పులికేశిని అట్లే 'సత్యాశ్రయ-రణవిక్రమ' యను అంకితముల్ల శాసనకారుడు నిరూపించియున్నా డని యూహించుచునది సకారణము గనే యున్నది. పై కొల్లిపారశాసనోక్తమైన (సత్యాశ్రయ-రణవిక్రమునికి దరువాత (వచ్చు) ముగ్గురి పేర్లను బిరుదులుగ వ్యక్తమగుట ఈ యభిప్రాయము

నకు ప్రబలమైన యాధారమగుచున్నది. అంతమాత్రమేకాదు. ముందఱి వినయాదిత్య-యుద్ధమల్లునికి 'రామవిక్రమ, రాజాశ్రయ' మొదలగు బిరుదుల నిచ్చి, మొదటి యరికేసరిని 'త్రిభువనమల్ల - రాజత్రినేత్ర సాహసరామః ఇత్యేతైరభిధానై రభిష్టుతః' అని వర్ణించుటను జూడగా ఆ శాసనకారుడు రాజబిరుదములలోనే యెక్కుడు ప్రవీణత గలవాడని సిద్ధమగుచున్నది. ఆకొల్లిపార శాసనము సుమారు క్రీ. శ. ౭౫౦ వ సంవత్సర పరిసరమున దలచూపియుండవచ్చునని ఆ యాంధ్రచారిత్ర పత్రికా లేఖకులు సూచించియున్నారు. ఆ సూచన వల్ల నవసారిశాసనపు వినయాదిత్య యుద్ధమల్లుడును ఆ కొల్లిపర శాసనపు వినయాదిత్య యుద్ధమల్లుడును అభిన్నులే అయియుండవలెననుట మఱింత దృఢమగుచున్నది.[1]"

తిమ్మప్పయ్యగారి సిద్ధాంతము నంగీకరించుటకు వీలులేదు. కొల్లిపాఱశాసనోక్తవంశావళి చరిత్రాత్మకమని వీరు రుజువుపఱుప నవలంబించిన మార్గము వింతయైనది. ఈ వంశావళియందు వినయాదిత్య - యుద్ధమల్లుని పూర్వికుల పేరులు బిరుదు లని నిశ్చయించినారు. కాని యందలి పృథ్వీపతి రాజాదిత్య నామములు తిమ్మప్పయ్యగారు చెప్పినట్లు కేవల బిరుదు లని యెంచుటకు వీలులేదు. పృథివీ మహారాజు, పృథ్వీపతి, రాజాదిత్య యనునవి యంకితనామములుగ ప్రాచీన శాసనములయందు వాడబడియున్నవి. ఒకవేళ తిమ్మప్పయ్యగారనునట్లు బిరుదులే యని యొప్పుకొనినను కొల్లిపఱశాసన వంశావళిలోని రాజులలో నొక సత్యాశ్రయ - రణవిక్రమునిదప్ప తక్కినవారిని బాదామిశాఖవారని నిర్ధారించి చెప్పుటకు వలనుపడదు. తిమ్మప్పయ్యగారి సమన్వయము నొప్పుకొనినచో బాదామి శాఖలోని మొదటి కీర్తివర్మకును, రెండవ పులకేశికిని, నతని పుత్రుడను (లాట) జయసింహునకును వరుసగ పృథివీపతి, మహారాజ,

---

1. నాడోజపంప, పుటలు ౨౫-౨౩.

రాజాదిత్య - పృథువిక్రమ లను బిరుదు లుండిన వని చెప్పఁ
వచ్చును. బాదామి చాళుక్య రాజుల శాసనములును, వారిని
పేర్కొను వారివంశజుల శాసనములును పెక్కు ప్రకటితమై
యున్నవి. ఎచ్చటను మొదటి కీర్తివర్మకు పృథ్వీపతి యను నామాంత
రముగాని, బిరుదుగాని యున్నట్లు సాక్ష్యము లేదు. ఇక 'మహారా'
జనునది యొక బిరుదని చెప్పుటకంటె రాజపదమును సూచించు
నామవాచక మనుట యొప్పును. ఇది భూపాలుర కెల్లరకు సామా
న్యమే. కావున కొల్లిపఱవంశావళిలోని 'మహారాజు' బాదామి
శాఖలోని ఇమ్మడి పులకేశియే యని నిర్ధారించుట కెట్లు వీలగును?
అట్లుచేసిన నిర్ధారణ సమంజసమని యొప్పుకొనుట యెట్లు? బాదామి
శాఖయం దేకాక చాళుక్యకుల మంతటియందును ఇమ్మడిపులకేశి గడు
సుప్రసిద్ధుడు. పూర్వచాళుక్యు లేమి, కళ్యాణిచాళుక్యు లేమి, యన్యు
లేమి తమ వంశచరిత్రయం దితని ప్రస్తావన వచ్చినప్పుడు గడు
గొప్పగ జెప్పుకొనియున్నారు. కొల్లిపాఱశాసనకారు డితనినే
పేర్కొన నుద్దేశించినచో నతని నామమునేనియు దలపెట్టక సర్వ
సామాన్యమైన మహారాజశబ్దమును బ్రయోగించుట చిత్రము గదా.
ఇక (లాట) జయసింహుని విషయము విచారింతము. ఇతని వేమి,
ఇతని సంతతివారివేమి శాసనములు కొన్ని ప్రకటితములై యున్నవి.
ఇందు మొదట పేర్కొనదగినవి త్రిభువనాశ్రయజయాశ్రయ బిరు
దాంకితుడగు నాగవర్ధన మహారాజుయొక్క నిర్పణ తామ్రపటికలు.
ఇతడు లాటజయసింహుని కుమారుడు. ఇం దితడు తన తండ్రి ధరా
శ్రయ జయసింహవర్మ యని చెప్పియున్నాడు[1]. రాజాదిత్యపృథు
విక్రమబిరుద ముండినట్లు చెప్పలేదు. రెండవది - క్రీ. శ. ౬౭౧ వ
సంవత్సరమునాటి శ్రయాశ్రయశీలాదిత్యుని నౌసారితామ్రపట్టికలు.
ఇతడును లాటజయసింహుని పుత్రుడే; మఱియు యువరాజు. నాగ

1. ఇండి. ఆంటి. సం. ౯. పుట ౧౨౩ త.

వర్ధనునివలె నితడును దన తండ్రి ధర్మాశ్రయజయసింహు డని చెప్పి యున్నాడు. రాజాదిత్యపృథువిక్రమ యను బిరుదులమాట యెత్త లేదు.[1]. ఇతనివే క్రీ. శ. ౬౯౨ నాటి సూరతుతామ్రపట్టికలు గలవు. ఇందును రాజాదిత్య - పృథువిక్రమప్రస్తావన గానరాదు. తన తండ్రి పేరు ధర్మాశ్రయజయసింహు డనియే చెప్పియున్నాడు[2]. మూడవది - మంగళరసరాజుయొక్క బల్సార్ తామ్రశాసనము. ఇతనికి వినయాదిత్య - యుద్ధమల్లుడనియు, జయాశ్రయుడనియు బిరుదులు గలవు. ఇతడు తాను మొదటి విక్రమాదిత్యుని తమ్ముడగు ధరాశ్రయ జయసింహవర్మకుమారుడ నని చెప్పుకొని యున్నాడు. క్రీ. శ. ౬౫౧-౨ వ సంవత్సరమున నితడు రాజ్యము సేయుచుండెను[3]. లేములవాడ వంశమునకు మూలపురుషు డని తిమ్మప్పయ్యగారు వాదించునత డితడే. తన తండ్రికి రాజాదిత్యపృథువిక్రమబిరుదు లున్నట్లీతడును జెప్పలేదు. నాల్గవది- పులకేశివల్లభుని నౌసారి తామ్రపట్టిక. ఇతడు మొదటి విక్రమాదిత్యుని తమ్ముడగు జయసింహవర్మకు పుత్రుడు; పై శాసనమున బేర్కొనబడిన జయాశ్రయ మంగళరసరాజునకు దమ్ముడు. ఇతడును తన తండ్రికి ధరాశ్రయబిరుదున్నట్లు చెప్పెనే కాని రాజాదిత్యపృథువిక్రమ బిరుదు లుండినట్లు చెప్పలేదు[4]. లాటచాళుక్యుల శాసనములయం దెచ్చటను గానరాని రాజాదిత్యపృథువిక్రమబిరుదులు లాటచాళుక్యవంశమునకు మూలపురుషుడును, బాదామిచాళుక్యవంశజు డగు నిమ్మడి పులకేశికి గడ

1. ఎపి. ఇండి. సం ౮. పుట ౨౨౯ త.

2. ఇంటర్నేషనల్ కాంగ్రెస్ ఆఫ్ ది ఓరియన్టలిస్ట్సు. (వియన్నా) ౧౮౮౧, ఆర్యన్ సెక్షన్ పుట. ౨౨౫.

3. బాం. బ్రాన్. జే. ఆర్. ఎ. ఎస్. సం. ౧౬. పుట ౫.

4. ఇంటర్నేషనల్ కాంగ్రెస్ ఆఫ్ ది ఓరియన్టలిస్ట్సు (వియన్నా), ౧౮౮౧, ఆర్యన్ సెక్షన్ పు. ౨౩౨ త.

గొట్టు కొడుకును, మొదటి విక్రమాదిత్యుని తమ్ముడును నగు ధరాశ్రయజయసింహుని కుండె నని నమ్ముట యెట్లు? నిరాధారమైన ఈ నమ్మకము నూతగ గొని లేములవాడ చాళుక్యవంశజుడగు వినయాదిత్య - యుద్ధమల్లుని తండ్రియగు రాజాదిత్యపృథువిక్రముడే పై లాటజయసింహు డని యొప్పుకొనుట యెట్లు? విషయమును చక్కగ సమాలోచనము జేసి చూడగా లాటజయసింహునికి లేములవాడ చాళుక్యులతో నెట్టి సంబంధముండినట్లును తోచదు.

ఇక లాటజయసింహుని పుత్రుడగు జయాశ్రయ మంగళరసరాజ వినయాదిత్యయుద్ధమల్లుడును, లేములవాడ చాళుక్యవంశకర్తయగు వినయాదిత్యయుద్ధమల్లుడును నొక్క రగుదు రేమో మాతము. ఇద్దఱికిని వినయాదిత్యయుద్ధమల్లనామములు సామాన్యమగుటచే వా రిద్దరు నొక్క రే యను తలపు కలుగవచ్చును. కాని యిదిసాధ్యము గాదు. ఈ సందర్భమున మొదట చింతింపదగిన విషయ మొకటి కలదు. లాటవినయాదిత్యయుద్ధమల్లుని కది యంకితనామము గాదు, బిరుదు. అతని వాస్తవనామము మంగళరసరాజు; జయాశ్రయుడను మఱియొక బిరుదుగూడ కలదు. ఇక లేములవాడ వినయాదిత్యయుద్ధమల్లునికి మంగళరసరా జను పేరుగాని, జయాశ్రయు డను బిరుదుగాని యున్నట్లెందును జెప్పియుండలేదు. వినయాదిత్యయుద్ధమల్లనామ మిరువురకు నుండుట వారి యైక్యమును సూచింపదా యను ప్రశ్న రావచ్చును. అన్యుల కీ పేరు లేకుండిన దీని యాధారమున వారి కైక్యము గల్పింపవచ్చును. యుద్ధమల్లు డని మొదటి విక్రమాదిత్యుని కుమారుడైన వినయాదిత్యునికి నామాంతరముండినట్లు మిరజ్ యేవూరు శాసనములవల్ల దెలియుచున్నది[1]. అత

1. ఇండి. ఆంటి. సం. ౮. పుట ౧౨.

'తత్సుతో విక్రమాదిత్యో విక్రమాక్రాన్తభూతలః,
తతోఽపి యుద్ధమల్లాఖ్యో యుద్ధే యమసమో నృపః'

డును వినయాదిత్యయుద్ధమల్లుడే యగును. కావున వినయాదిత్యయుద్ధ మల్లనామము లేములవాడచాళుక్యుల మూలపురుషునికిని, లాటజయ సింహుని పుత్రుడగు మంగళరసరాజునకును సామాన్య మగునంత మాత్రమున వారికి వ్యక్త్యైక్యము గల్పించుట సమంజసము గాదు.

మఱియొక విషయము: లేములవాడ చాళుక్య వంశకర్తయగు వినయాదిత్యయుద్ధమల్లుడు క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దతృతీయపాదమున వెలసె నని దృఢముగ జెప్పవచ్చును. ఇతని పుత్రుడగు మొదటి యరికేసరి క్రీ. శ. ౭౮౦-౭౯౧ ల మధ్య రాజ్యముజేసిన రాష్ట్రకూటచక్రవర్తియగు నిరుపమధ్రువకలివల్లభునికి సమకాలీనుడు. ఇతని తండ్రియగు వినయాదిత్యయుద్ధమల్లుడు నిరుపమధ్రువుని తండ్రియగు మొదటి కృష్ణ అకాలవర్షుని కాలముననో, తత్పూర్వము క్రీ. శ. ౭౫౪ నుండి ౭౫౬ వఱకు రాజ్యముజేసిన దంతిదుర్గుని కాలముననో, లేక యిరువురి కాలముననో వెలసియుండవలయును. ధరాశ్రయుని కుమారుడగు వినయాదిత్యయుద్ధమల్లాపరనామ ధేయుడు క్రీ. శ. ౭౩౧-౨ లో రాజ్యము సేయుచుండినందువల్లను, దరువాత నిరువదియైదేండ్ల వెనుక రాష్ట్రకూటులక్రింద సామంతుడై యుండిన లేములవాడ వినయాదిత్యయుద్ధమల్లుడును సమకాలీనులై యుండి రనుట యసంగతము గాదు. సమకాలీను లగుటచే చాళుక్య వంశజులగు వారిరువురికి నైక్యము గల్పించుటయందు వైపరీత్య మేమియు లేదు; కాని దీని కొక యాక్షేపము గలదు. వినయాదిత్య యుద్ధమల్ల బిరుదాంకితుడగు జయాశ్రయమంగళరసరాజురాజ్యము క్రీ. శ. ౭౩౧-౨ తరువాత నచిరకాలముననే ముగిసిపోయినది. పిమ్మట నతని తమ్ముడు పులకేశివల్లభుడు రాజ్యమునకు వచ్చెను. ఈ విషయము క్రీ. శ. ౭౩౯ నాటి ఇతని నౌసారిపట్టికలవల్ల దెల్లమగు చున్నది. ఇందు వరుసగ దన పూర్వికులగు మొదటి కీర్తివర్మ, రెండవ పులకేశి, మొదటి విక్రమాదిత్యుడు, ధరాశ్రయజయసింహుడు,

జయాశ్రయమంగళరసరాజు మున్నగువారిని బేర్కొని తరువాత దన్ను జెప్పుకొనియున్నాడు. ఇతడు బహుశూరుడు. సైంధవ, కచ్చెల్ల, సౌరాష్ట్ర, చావోటక, మౌర్య, గుజ్జరాజులను జయించిన తాజికుల నోడించి దేశమును గాపాడెను. వల్లభనరేంద్రుడు, అనగా నప్పుడు సామ్రాజ్యాధిపతియై యుండిన బాదామిచాళుక్య ఇమ్మడి విక్రమాదిత్యు డితని దేవసేవకు మెచ్చి దక్షిణాపథసాధక, చలుకికులాలంకార, పృథివీవల్లభ, అనివర్తకనివర్తయిత్రి యను బిరుదుల నొసగెను. మఱియు నితడు రాజ్యాధిపతులను బోలి తన యాజ్ఞను విషయపతులు మున్నగువారికి విదితపఱచియున్నాడు. మఱియు నీ శాసనమున జయాశ్రయమంగళరసును జెప్పి యటుపిమ్మట 'తస్య పాదానుధ్యాత'యగు పులకేశి పేర్కొనబడెనని స్మరణయందున్నది. కావున క్రీ. శ. ౭౩౮ న సంవత్సరమునకు పూర్వ మితని యన్నయగు జయాశ్రయమంగళరసరాజ వినయాదిత్యయుద్ధమల్లుడు గతింపగా నితడు తదనంతరము లాటరాజ్యమున కధిపతి యాయె ననుట తెల్లము. కావున క్రీ. శ. ౭౫౪ నకు తరువాత రాష్ట్రకూటుల క్రింద సామంతుడై యుండె ననుట యుక్తముగాదు. ఈ కారణముల చేత దిమ్మప్పయ్యగారు వాదించునట్లు లాటజయసింహవర్మ పుత్రుడగు జయాశ్రయ మంగళరసరాజ వినయాదిత్యయుద్ధమల్లుడును, వేములవాడచాళుక్యుల మూలపురుషుడగు వినయాదిత్యయుద్ధమల్లుడును నేకపురుషులు గారు. వారు భిన్నవ్యక్తు లనుట యొప్పును.

ఈ పై దీర్ఘచర్చవలన తేలిన సారాంశ మేమనగా: కొల్లిపఱ శాసనమందలి వంశావళిని గుర్తించుటకు సాధ్యము గాదు. ఇతర చాళుక్యశాఖలకు దీనితో సంబంధము గానరాదు. ఒకవేళ నిది కల్పనయేని గావచ్చును. బాదామిశాఖతోడను, లాటశాఖతోడను దీనికి సంబంధములను గలుప దలపెట్టి చేసిన సిద్ధాంతములు లభ్యమైన శాసనసాక్ష్యములకు విరుద్ధము లగుటచే నిలువజాలవు. కావున

లభ్యమైన సాక్ష్యమును నిష్పక్షపాతముగ విమర్శించి చూచిన లేములవాడశాఖవారి కన్యశాఖలవారితో గల సంబంధము తెలియ దని చెప్పవలసియున్నది.

## ౪. వినయాదిత్యయుద్ధమల్లుడు

వినయాదిత్య - యుద్ధమల్లుని శాసనము లెవ్వియు నింతవఱకు లభ్యపడలేదు. కాని ఇతని సంతతివారి శాసనములవల్లను, పంపకవి విక్రమార్జునవిజయ పీఠికవల్లను, నితని చరిత్ర కొంతవఱకు దెలియ వచ్చుచున్నది. ఇతని పుత్రుడగు మొదటి యరికేసరిదని చెప్పబడు కొల్లిపఱ తామ్రశాసనమున నితడు విశ్వారా టనియు, రామవిక్రమ నృపాంకుశాది బిరుదాంకితుడనియు, వరాహలాంఛనముచే వశీకృత భూచక్రు డనియు, సాగరవేలా పరివేష్టితసకలధరామండలు డనియు, దురుష్క యవన బర్బర కాశ్మీర కాంభోజ మగధ మాళవ కళింగ గంగ పల్లవ కేరళప్రభృతిరాజలోకముచే నర్చలు గొనెననియు జెప్పియున్నది. ఈ శాసనము కృత్రిమమని ప్రబలమైన సంశయము గలదు. కాని శాసనము కృత్రిమమైనను నందువర్ణింపబడిన యంశ ములు కృత్రిమములు కాక చరిత్రాత్మకములే గావచ్చు నను శాసన విమర్శకులమతము ననుసరించి దీనిని విచారార్హముగాదని త్రోసి పుచ్చక రామర్శించి యం దెంత సత్యము గలదో కనుగొనవలసి యున్నది

వినయాదిత్య యుద్ధమల్లుడు దాక్షిణాత్యుడగు చాళుక్యుడు. ఇతని పుత్రుడగు మొదటి యరికేసరి క్రీ. శ. ౭౮౦ మొదలు ౭౯౧ వఱకు దక్కను సామ్రాజ్యము నేలిన రాష్ట్రకూట చక్రవర్తి. ధ్రువనిరుపమదేవున కితడు సామంతుడును, సమకాలీనుడును నగుటచే నితడు క్రీ. శ. ౮ వ శతాబ్దతృతీయపాదమున నభ్యుదయ మంది యుండవచ్చునని పూర్వప్రకరణమున నిశ్చయించియున్నాడను. ఈ

కాలమున కొల్లిపఱశాసనమున వర్ణింపబడినంతటి గొప్ప చాళుక్య నరపాలు డెవ్వడేనియు నుండెనో విచారింతము. అప్పటి రాష్ట్రకూట శాసనములను బరిశీలించి చూడగా రాష్ట్రకూటసామ్రాజ్యస్థాపకుడైన దంతిదుర్గుడు గతించిన వెనుక ప్రబలుడైన చాళుక్యరాజొకడు సామ్రాజ్యము నాక్రమించుకొని కొంతకాలము రాజ్య మొనర్చినట్లు దెలియవచ్చుచున్నది.

మొదటి కృష్ణరాజుపుత్రుడగు ముమ్మడి గోవిందరాజు దన రాధనపుర, వణిదిందోరి తామ్రపట్టికలయం దీవిషయము నిట్లు ప్రస్తావించియున్నాడు :

పక్షచ్ఛేదభయాశ్రితాఖిల మహాభూభృత్కుల భ్రాజితా
ద్దుర్లంఘై రపరై రనేక విమల భ్రాజిష్ణురత్నాన్వితాత్
య శ్చాలుక్యబలా దనూనవిబుధ వ్రాతాశ్రయో వారిధే
ర్లక్ష్మీం మన్దరవ త్సలీల మచిరా దాకృష్టవాన్ వల్లభః[1].

మొదటి యమోఘవర్ష నృపతుంగుని సంజన తామ్రపట్టిక యందును నీ విషయము జెప్పబడియున్నది.

స్వయంవరీభూత రణాఙ్గణే తత స్స నిర్వ్యపేక్షం శుభతుంగవల్లభః,
చకర్ష చాలుక్యకులశ్రియం బలా ద్విలోలపాలిధ్వజమాలధారిణీం [2].

ఈ రెండు శాసనముల వల్లను దంతిదుర్గుడు కాలగతి నందిన పిమ్మట చాళుక్యులు ప్రబలి సామ్రాజ్యము నాక్రమించుకొని రనియు, వారిని నిర్జించి మొదటి కృష్ణరాజు దానిని మరల స్వాధీనము గావించు కొనెననియు దెలియవచ్చుచున్నది. మఱియు పై బేర్కొనిన ముమ్మడి గోవిందరాజు తన పైఠాను తామ్రపట్టికయం దీ సందర్భమున చాళుక్యులను బ్రస్తావింపక వారి బదులు రాహప్పయను నొకని బేర్కొనియున్నాడు.

1. ఎపి. ఇండి. సం. ౬, పుట ౨౪౩; ఇండి. ఆంటి. సం. ౧౧, పుట ౧౫౬.

2. ఎపి. ఇండి. సం. ౬. పుట ౨౪౩; ఇండి. ఆంటి. సం. ౧౧, పుట ౧౫౬ త.

రాహప్ప మాత్మభుజజాతబలావలేప మాజౌ విజిత్య నిశితాసిలతాప్రహారైః,
పాలిధ్వజావలి శుభా మచిరేణ యో హి రాజాధిరాజపరమేశ్వరతాం తతాన.[1]

అనగా నీ మొదటి కృష్ణరాజు రాహప్పయను నతనిని యుద్ధమున జయించి యతనికడనుండి పాలిధ్వజావలిని, రాజాధిరాజపరమేశ్వరపదమును పొందెనని తాత్పర్యము. రాష్ట్రకూటసామ్రాజ్య స్థాపనకు ముందు దక్షిణాపథమున రాజాధిరాజ పరమేశ్వర పట్టము చాళుక్యుల దగుటచేతను, పాలిధ్వజము చాళుక్యులదే యగుటచేతను, చాళుక్యులను జయించి వారివైన పాలిధ్వజాది సామ్రాజ్యచిహ్నములనుగొన్న విధముననే మొదటి కృష్ణరాజు రాహప్పను జయించి వానినే యతనికడ నుండియు గైకొన్నట్లే చెప్పియుండుటచేతను, రాహప్ప చాళుక్యుడై యుండవలయు నని తోచుచున్నది. ఇతని చరిత్రను గూర్చి యేమియు దెలియరాకున్నను. నితడు సామాన్యుడని తలచుటకు వీలులేదు. చాళుక్యులను జయించి దంతిదుర్గుడు స్వాధీనపఱచుకొనిన సామ్రాజ్యమును మరల వశపఱచుకొని యతని పినతండ్రియైన ప్రథమకృష్ణ నరపాలుని రాజాధిరాజపరమేశ్వరపట్టమును బొందనీయక యడ్డుపెట్టెను. రాష్ట్రకూటరాచరికస్థితి యప్పుడెటుండెనో ప్రథమకృష్ణరాజు తన భండకతామ్రపట్టికయందు సూచించి యున్నాడు.

ఉల్లంఘితమర్యాదే కలిజలధౌ వ్యాకులా నిమజ్జన్తీ
యే నోద్ధృతా ధరిత్రీ శ్రీప్రలయమహావరాహేణ.[2]

ఇందు చెప్పబడిన కలిజలధి చాళుక్యుల ప్రతాపము. అందు మునిగిన ధరిత్రి రాష్ట్రకూటరాజ్యము. దీనిని మునిగిపోనీయక యుద్ధరించినవాడు ప్రలయమహావరాహబిరుదాంకితుడగు ప్రథమకృష్ణ రాజు. కావున రాహప్పనాయకత్వముక్రింద చాళుక్యులు నష్టమై

1. ఎపి. ఇండి. సం. 3. పుట ౧౦౭ త.

2. ఎపి. ఇండి. సం. ౧౪ పుటలు, ౧౨౧_౩౦

పోయిన స్వకులక్రమాగతమైన సామ్రాజ్యమును సాధించి యల్పకాల మేలి రనియు, మరల నా రాహప్పను జయించి రాష్ట్రకూట మొదటి కృష్ణరాజు స్వాధీనపఱచుకొనె ననియు దెల్ల మగుచున్నది.

మఱియు రాష్ట్రకూటసామ్రాజ్యస్థాపకుడైన దంతిదుర్గుడు చాళుక్యులతోడి యుద్ధమున మృతినొందెననుటకు గొంత యవకాశము గలదు. రాష్ట్రకూట ముమ్మడి కృష్ణనరపతియొక్క రామేశ్వరశిలాశాసనమున నిట్లు చెప్పియున్నది:

> తస్మిన్ సాహసతుంగనామ్ని నృపతౌ స్వస్సుందరీప్రార్థితే
> యాతే యూని దివ న్దివాకరసమం వేశ్యేవ లక్ష్మీ స్తతః
> తత్రావాప భుజద్వయేన నిబిడం సాశ్లిష్య రమ్యై ర్గుణైః
> ప్రీత్యా ప్రాణసమం చిరం రమయతి శ్రీకృష్ణరాజాధిపం.[1]

ఇందువలన సాహసతుంగనృపాలుడు, అనగా దంతిదుర్గుడు స్వర్గస్త్రీలచే బ్రార్థితుడై పసితనముననే దివంగతు డాయె నని తెలియుచున్నది. రణనిహతులైన వారి పొందును స్వర్గస్త్రీ లర్థించుట సుప్రసిద్ధమైన విషయము. కావున, రామేశ్వరశిలాశాసనసాక్ష్యము విశ్వసనీయమేని, దంతిదుర్గుడు యౌవనవంతుడై యుండగనే యుద్ధమున మడిసి వీరస్వర్గమును బొందె నని చెప్పవలసియున్నది. అతని మరణానంతరము రాష్ట్రకూటరాజ్యలక్ష్మి చాళుక్యుడగు రాహప్పకు హస్తగతయగుటచేత, దంతిదుర్గుడు చాళుక్యులతోడి పోరుననే మృతినొందె నని తోచుచున్నది.[2]

---

1. సౌ. ఇ౯. ఇ౯. సం. ౯. భా. ౧, సెం. ౬౪.

2. రాష్ట్రకూటవంశపు గుజరాతుశాఖకు జెందిన కరకసువర్ణవర్షుని బరోడా తామ్రపట్టికలందలి (ఇండి. ఆంటి. సం. ౧౨, పుట ౧౫౯)—

> ధర్మాత్మన స్తస్య నృపస్య జజ్ఞే సుతః సుధర్మా ఖలు కృష్ణరాజః,
> యో వంశ మున్మూల్య విమార్గభాజం రాజ్యం స్వయం గోత్రహితాయ చక్రే.

పై చర్చవలన లేములవాడచాళుక్యవంశస్థాపకుడైన వినయాదిత్యయుద్ధమల్లుని కాలమున రాష్ట్రకూటుల యధికారము గూలద్రోయునంతటి శక్తిసామర్థ్యములు గల రాహప్ప యను చాళుక్యవీరు డొక డుండె నని తేలుచున్నది. ఈ రాహప్పయే కొల్లిపఱశాసనములోని వినయాదిత్యయుదమలుడు కాగూడదా యను శంక యొకటి కలుగవచ్చును. రాహప్ప యనునది యతని వాస్తవమైన పేరును, వినయాదిత్య యుద్ధమల్లనామము లతని బిరుదులును గావచ్చును. కొల్లిపఱశాసనమునందు వర్ణింపబడిన వినయాదిత్యయుద్ధమల్లుని విజయము లన్నియు రాహప్పకును జెల్లవచ్చును; కాని యీ సందర్భమున పరామర్శింపదగిన యంశ మొకటి కలదు: ఈ రాహప్ప బాదామి చాళుక్యరాజులలో గడపటివాడైన ద్వితీయ కీర్తివర్మయో, లేక యువరాజు ఇమ్మడి గోవిందవల్లభునిచే బరాభూతుడైన వేంగీశ్వరుడగు విష్ణువర్ధనుడో కావలయునను వాదము. ద్వితీయకీర్తివర్మ రాష్ట్రకూటులను జయించి మరల రాజ్యమును సంపాదించెననిగాని, యతనికి రాహప్పయని మారుపేరుండెననిగాని తలచుట కెట్టి యాధారము లేదు. రాష్ట్రకూటప్రథమ కృష్ణభూపాలుని కుమారుడును, యువరాజును నగు ఇమ్మడి గోవిందరాజు వేంగీ విష్ణువర్ధనుని జయించుట నిశ్చయమే. ఇతడు వేంగీమండలమును జయించిన పిమ్మట కృష్ణామునీసంగమమున విజయస్కంధావారము నుండి యిచ్చిన అలాసు తామ్రశాసనమున "కోశదణ్డాత్మభూమి

---

అను శ్లోకము నాధారపఱచుకొని కొందరీ బరోడ శాసనమునందలివాడు రాహప్పవంశ్యుడేయని వాదించుచున్నారు. (ఇండి. ఆంటి. సం ౧౨, పుట ౧౬౨.) కాని వీరి వాదమంగీకార్యము గాదు. ఏలనగా: లభ్యమైన శాసనసాక్ష్యమునుబట్టి చూడగా రాహప్ప రాష్ట్రకూటు డని చెప్పుట కెట్టి యాధారమును లేదు; చాళుక్యుడనుటయే యెక్కువ సమంజసమని తోచుచున్నది. కావున వంశ్యునికి రాహప్పతో నైక్యము గల్పించుట సరికాదు. వారు భిన్నపురుషులని తలచుటయే యుక్తము.

సమర్పణే నానతే వేంగీశే" యని చెప్పుకొనియున్నాడు.[1] ఇట్లు కోశ దండాత్మభూములను యువరాజగోవిందరాజునకు సమర్పించిన వేంగీశుడు చాళుక్యుడు. కృష్ణరాజుచే నోటువడి పాలిధ్వజావలిని రాజాధిరాజపరమేశ్వరపదమును గోలుపోయిన రాహప్ప ఇతడే యని రాష్ట్రకూటచరిత్రకారులగు డాక్టరు ఆల్టెకా రనుచున్నారు.[2] ఇది యొప్పదగని విషయము. వేంగిచాళుక్యులు తమ శాసనములయందు తాము మహారాజాధిరాజపరమేశ్వరభట్టారకుల మని చెప్పుకొనినను పాలిధ్వజము వీరికుండె ననుట కేయాధారమును లేదు. అది యాద్యమున ఉత్తరాపథచక్రవర్తుల సామ్రాజ్యచిహ్నము. క్రీ. శ. ౭ వ శతాబ్ది తృతీయపాదమున బాదామియందు చాళుక్యప్రథమ విక్రమాదిత్యుడు రాజ్యము సేయుచుండగా నతని కుమారుడైన వినయాదిత్యుడును, మనుమడైన విజయాదిత్యుడును నుత్తరదేశములపై దండెత్తిపోయి సకలోత్తరాధిపతి నొక్కని జయించి యాతని సార్వభౌమపద చిహ్నములైన గంగాయమునలను పాలిధ్వజములను గొని స్వదేశమునకు మగిడి వచ్చిరి.[3] అది మొదలివి బాదామి శాఖవారి సార్వభౌమచిహ్నము లైనవి. బాదామి చాళుక్యులకును, వారిని దొలగద్రోసి వారి సార్వభౌమపదము నొడిచికొనిన రాష్ట్రకూటులకు దప్ప దక్షిణదేశము నేలిన యేవంశపు ప్రభువులకును నీ పాలిధ్వజాది చిహ్నములు లేవు.[4] కావున యువరాజ గోవిందరాజున కోడి తన

---

1. ఎపి. ఇండి. సం. ౬, పుట ౨౧౧.

2. రాష్ట్రకూటులు _ వారికాలము, పుట ౪౩.

3. ఎపి. ఇండి. సం. ౫, పుట ౨౦౦.

4. పూర్వచాళుక్యవంశజుడైన గుణగవిజయాదిత్యుని సాతలూరుతామ్రశాసనమున (భారతి. సం ౧, సం ౧, పుట ౧౦౫) "ద్వారి ప్రతిష్ఠాపిత గంగాయమునా చంద్రాదిత్య పాలికేతన సమధిగతపఞ్చమహాశబ్దశ్రవణవిత్రాసితచతురాశా చక్రో వరాహలాఞ్ఛన వీరమకరధ్వజః" అని యున్నది. ఇందు పేర్కొనబడిన

సర్వస్వము నిచ్చి యతనికి నతుఁడైన వేంగీశుఁడు రాహప్ప కాజాలఁడు. రాజాధిరాజపరమేశ్వరుడును, పాలికేతనుడును నగుటచే రాహప్ప బాదామి చాళుక్యవంశజుఁ డని నిశ్చయముగ జెప్పవచ్చును.

ఇక నీ రాహప్పయు, లేములవాడచాళుక్యుల వంశకర్తయగు వినయాదిత్యయుద్ధమల్లుడును నేకపురుషులగుదురేమో విచారింతము. కొల్లిపఱశాసనములోని వంశావళి మిక్కిలియు సంశయగ్రస్తమగుట చేత దాని నాధారపఱచుకొని వినయాదిత్యయుద్ధమల్లునికి బాదామి చాళుక్యవంశముతో సంబంధము గల్పించుట యుక్తముగాదు. వాదమునకై యతఁడు బాదామిశాఖకు జెందినవాడని యొప్పుకొనినను నతనికిగాని, యతని సంతతి వారికిగాని పాలిధ్వజ ముండెననుట కే యాధారమును లేదు. కావున రాహప్పయు, వినయాదిత్యయుద్ధమల్లుడును సమకాలికులే యైనను వారు భిన్నపురుషు లని చెప్పవలసి యున్నది.

ఇంతదనుక కొల్లిపఱతామ్రపట్టికలయందు వర్ణింపబడిన వినయాదిత్యయుద్ధమల్లుని విజయాదులు సత్యాత్మకము లను దృష్టితో బరికించితిమి. కాని వీని యాథార్థ్యమును రుజువుసేయగల సాధనాంతరము లిప్పటివఱ కెవ్వియు గానరాలేదు. ఇతని సంతతివారి శాసనములలో నితని పరాక్రమాతిశయాదులు ప్రశంసింపబడియున్నను, నితఁడు విశ్వరాటనిగాని, సాగరవేలాపరివేష్టిత సకలధరామండలాధిపతి యనిగాని, తురుష్క యవన బర్బర కాశ్మీర కాంభోజ మగధ మాళవ కళింగ గంగ పల్లవ పాండ్య కేరళ ప్రభృతి ససంభ్రమ సమర్చితపాదపీఠు డని గాని చెప్పియుండలేదు. వానిలోని విషయమును బట్టి చూడగా నితఁడొక చిన్న రాజని తోఁచుచున్నది. ఇతని సంతతి

---

గంగాయమునాపాలిధ్వజాదు లతనికి గులక్రమాగతములు గావు. రాష్ట్రకూట ఇమ్మడి కృష్ణరాజును యుద్ధమున నోడించి యతనికడ గొన్నవి.

వారి శాసనములలో నెల్ల ప్రాచీనతమమైన లేములవాడ శిలాశాసనమున నీ వినయాదిత్యయుద్ధమల్లుడు అనన్యశాస్యమగు సపాదలక్ష దేశమును బాలించె ననియు, బోదనపురమున నూనెచే నిండిన కొలకునం దేనుగులను దాన మాడించెననియు, జిత్రకూట మను దుర్గమును సాధించె ననియు జెప్పియున్నది. పంపకవి తన విక్రమార్జునవిజయ పీఠికయందు చిత్రకూటముమాట యెత్తక తక్కిన యంశములను రెండింటిని బేర్కొనియున్నాడు. పరభణితామ్రశాసనమునందుగూడ చిత్రకూటప్రస్తావము లేదు. విక్రమార్జునవిజయము లేములవాడ శిలాశాసనమునకు సమకాలికకావ్య మైనను చిత్రకూటవిజయమును బ్రస్తావింపకపోవుటకు గారణము దెలియదు; కాని యీ మూడును చరిత్రాంశము లని మనము విశ్వసింపవచ్చును.

మొట్టమొదట పరామర్శింపదగినది సపాదలక్షవిషయము. శాసనములందలి వరుసను బట్టి చూడగా నిదియే వినయాదిత్య యుద్ధమల్లుని ప్రథమశౌరకృత్యమని తోచుచున్నది. సపాదలక్ష దేశ మెచట నుండెనో లేములవాడ పరభణిశాసనములవల్లగాని, పంపని విక్రమార్జున విజయమువల్లగాని తెలియవచ్చుటలేదు. పాల్కురికి సోముని పండితారాధ్యచరిత్రయందు సపాదలక్షప్రస్తావము గలదు:

లక్షింపగ సపాదలక్ష నేపాళ
మీక్షింపగ సపాదలక్ష కేదార
మీక్షింపగ సపాదలక్ష తీర్కార్త్రి
లక్షింపగ సపాదలక్ష కాశ్మీర
మీక్షింపగ సపాదలక్ష కన్నోజ
మీక్షింపగ సపాదలక్ష గొంకణము
లక్షింపగ సపాదలక్ష కళింగ.[1]

1. పండితారాధ్యచరిత్రము, పర్వతప్రకరణము. (ఆం. ప్ర. తి భా.) పుట ४౧౫.

ఈ ద్విపదలయందు 'పాదలక్ష' దేశవైశాల్యమును సూచించు పదముగ ప్రయోగింపబడియున్నది. మఱియు 'సపాదలక్ష' గ్రామములు గలదేశ మొక్కటి కాదనియు, నట్టివి నేపాళకేదారాదులు పెక్కు గలవనియు దెల్లమగుచున్నది. కాని లేములవాడ పరభణి శాసనములందును, పంపని విక్రమార్జునవిజయమందును బేర్కొనబడిన 'సపాదలక్ష' కేవలదేశాంతర్గతగ్రామసంఖ్యను దెల్పు పదము గాదనియు, నది ప్రత్యేక మొకానొక దేశమున కంకితనామమనియు దోచుచున్నది. ఈ దేశమును గూర్చిన ప్రశంస కాదాచిత్కముగ సంస్కృతవాఙ్మయమునందును, నుత్తరహిందూస్థానమందలి మధ్యయుగశాసనములయందును గానవచ్చుచున్నది. ఆధునికగ్రంథములయందును సపాదలక్షదేశ నిర్దేశమును గురించిన చర్చలచట నచట గలవు. 'అశ్మన్తవేశ్మవిహాయ యాహి' యను సోమదేవసూరి యశస్తిలక చంపూవాక్యమునకు వ్యాఖ్యాత 'అశ్మన్తకసపాదలక్ష పర్వతవాసిని' అని యర్థము వ్రాసియున్నాఁడు.[1] మఱియు క్రీ. శ. ౧౧౫౦ నాటి చాళుక్యవంశజుడగు గూర్జరకుమారపాలుని చితోడ్‌గడ శాసనమున[2],—

మహీభృన్నికుంజేషు శాకంభరీశః ప్రియాపుత్రలోకే న శాకంభరీశః,
అపి ప్రాప్తశత్రు ర్భయా త్కంప్రభూతః స్థితౌ యస్య మత్తేభవాజి ప్రభూతః,
సపాదలక్ష మామర్ద్య నమ్రీకృతభయానకః,
స్వయ మాయా న్మహీనాథో గ్రామే శాలిపురాభిధే.
సన్నివేశ్య శిబిరం పృథు తత్ర త్రాసితాసహనభూపతిచక్రం,
చిత్రకూటగిరిపుష్కలశోభాం ద్రష్టు మార నృపతిః కుతుకేన.

భగవాన్‌లాల్ ఇంద్రాజిగారు, కాంగ్రా మొదలు నైనితాలు వఱకు వ్యాపించియుండు సివాలిక్ పర్వతమునకు సంస్కృతమున

1. కావ్యమాల ౭౦, పుట ౧౮౭.
2. ఎపి. ఇండి. సంపు. ౨., పుట ౪౨౧ త.

'సపాదలక్షపర్వత 'మని పే రనియు, సపాదలక్షాధిపతు లని పేరువడసిన శాకంభరీ చాహమానప్రభువుల కా పే రాద్యమున సపాదలక్ష పర్వతప్రాంత నివాసులై యుండిన కారణమున వచ్చెననియు, దరువాత వారు వలసవచ్చి తూర్పురాజపుత్రస్థానమున నుండు శాకంభరీ ప్రాంతమున నివాసము లేర్పఱచుకొని యచట నెలకొనుటచే నా ప్రాంతమునకు సపాదలక్ష దేశ మని పేరు వచ్చె ననియు వ్రాసి యున్నారు.[1] వీరి యభిప్రాయమునే నందోలాల్ డే గారు తమ భూగోళకోశ మను గ్రంథమున నిట్లు సంగ్రహముగ ననువదించి యున్నారు: "సపాదలక్షకు సవాలక్ అపభ్రంశరూపము, సవాలక్ నకు సివాలిక్ అపభ్రంశరూపము, సపాదలక్ష, శాకంభరీ తూర్పు రాజస్థానములోని యిప్పటి సంభర్."[2] సపాదలక్ష (సివాలిక్) పర్వతప్రాంతవాసులగు చాహమానరాజపుత్రు లచటికి వచ్చి నెల కొనుటచే శాకంభరీపరిసరప్రదేశములకు సపాదలక్ష దేశ మని పేరు వచ్చె నను భగవాన్‌లాల్ గారి సిద్ధాంత మెంతవఱకు సత్యమో తెలియదు. కాని శాకంబరీప్రభువులు సపాదలక్షీయు లనియు, వారి యేలుబడిక్రింది దేశము సపాదలక్ష దేశ మని పిలువబడుచుండె ననియు దృఢముగ జెప్పవచ్చును.

తూర్పురాజస్థానమందలి ఇప్పటి సంభార్ ప్రాంతదేశమే మధ్యయుగమునందలి సపాదలక్ష యని నిశ్చయ మైనది గదా. ఇక దాక్షిణాత్యుడగు వినయాదిత్యయుద్ధమల్లు డా దేశముపై నాధిపత్య మెట్లు సంపాదింపగల్గెనో విచారింపవలసియున్నది. ఈ విషయమును నిర్ధారించి చెప్పుటకు దగిన యాధారము లెవ్వియు గానరావు. వినయాదిత్య-యుద్ధమల్లుడు సామాన్యుడైన చిన్న రాజని ఇంతకు ముందే వివరించియున్నాడను. ఇట్టివాడు జిగీషామనీషచే స్వయము

---

1. బాంబే గజటీరు, సం ౧. భా. ౧, పుట ౧౫౭, పు. ౧౫౮ అథోజ్ఞాపిక.
2. భూగోళకోశము, పుట ౧౭౮.

దండెత్తిపోయి నిజబాహుబల పరాక్రమముచే ననన్యశాసితమైన సపాదలక్షదేశము నాక్రమించుకొనె ననుట యంతగ నమ్మదగిన విషయము గాదు. తనకంటె బలవత్తరుడైన యధిపతి నెవ్వనినేనియు గూడి దండువోయి యతని పక్షము: నితడా దేశమును జయించి శాసించె నని తలచుట యుక్తము. ఈ వినయాదిత్యయుద్ధమల్లుని కుమారుడగు మొదటి యరికేసరికాలమునుండియు గడపటివాడగు ముమ్మడి యరికేసరి వఱకును నితని సంతతివా రందఱును రాష్ట్రకూటచక్రవర్తులకు సామంతులై వారి నాశ్రయించియుండిరి. వారి వలెనే ఇతడును రాష్ట్రకూటసామంతుడై యుండియుండవచ్చు నని తలచుటయం దసహజమేమియు లేదు. ఈ యూహ యసమంజసము గాదేని, ఇతని కధిపుడై యుత్తరదేశముపై దండెత్తిపోయిన రాష్ట్రకూటచక్రవర్తి యెవ్వడో కనుగొనవలసియున్నది. వినయాదిత్యయుద్ధమల్లునికి సమకాలికు లని యెన్నదగిన రాష్ట్రకూటచక్రవర్తు లిరువురు గలరు. రాష్ట్రకూట సామ్రాజ్యస్థాపకుడైన దంతిదుర్గుడు మొదటివాడు. ఇతని పిమ్మట సామ్రాజ్యపీఠము నెక్కిన యితని పినతండ్రియైన ప్రథమకృష్ణరాజు రెండవవాడు. వీరిద్దఱిలోను కృష్ణరాజుత్తరాపథముపై దండెత్తిపోయిన ట్లిచ్చటను జెప్పియుండలేదు; కావున నితని గూడి వినయాదిత్యయుద్ధమల్లుడు సపాదలక్షను జయించె నని తలచుటకు వీలులేదు. దంతిదుర్గుడీడులేని జోదు; పేరందిన దళనాయకుడు. ఇతడు యౌవనముననే వీరస్వర్గమును బొందినను, జీవదశయం దుండిన యల్పకాలములోనే చాళుక్యుల యధికారమును గూలద్రోసి వారికడనుండి దక్షిణాపథ సామ్రాజ్యమును నాచికొనెను; అంతట దృప్తినందక దిగ్విజయార్థమై యుత్తరహిందూస్థానముపై దండెత్తి పోయి, పెక్కు దేశములను జయించెను. ఇతని విజయములు యెల్లోరాలోని దశావతార గుహయం దితడు జెక్కించిన శిలాశాసనమున నిట్లు వర్ణింపబడియున్నవి:

"దణ్డేనైవ జిగాయ వల్లభబలం య స్సన్ధుభూపాధిపం
కాఞ్చీశం సకలింగకోసలపతిం శ్రీశైలదేశేశ్వరం,
శేషా న్మాలవ లాట టంక నృపతీ నన్యాంశ్చ నీత్వా వశం
య శ్శ్రీవల్లభతా మవాప చరణం న్యస్య ద్విషాం మస్తకే.[1]

దంతిదుర్గుడు జయించినట్లు పై శ్లోకమున జెప్పబడిన రాజులలో నీ సందర్భమున ముఖ్యముగ గమనింపవలసినవారు ముగ్గురు. మొదటివాడు సంధుభూపాలుడు. 'సంధు' అను పేరు గల దేశ మన్యత్ర యెచటను బేర్కొనబడియుండ లేదు. పొరబాటుచే 'సింధు' అను మాట కిది బదులుగ జెక్కబడిన దని రాష్ట్రకూట చరిత్రకారులగు డాక్టరు ఆల్టెకా రభిప్రాయపడియున్నారు.[2] సింధుదేశమును తాజికు లీ కాలమున నాక్రమించుకొని యుండిరి. అపుడపుడు పశ్చిమసముద్ర తీరదేశములపై నెత్తివచ్చి దేవాలయములను నాశము గావించి గ్రామములను, పట్టణములను దోచుకొని పోవువారు. కావున దంతిదుర్గుడు వారిపై దండెత్తి పోయి జయించి యుండవచ్చును. రెండవ వాడు టంకనృపతి. టంకదేశ మెచ్చట నుండెనో యెవ్వరును గుర్తించ లేదు; ఇది ప్రస్తుత రాజపుత్రస్థానములోని 'టొంకు' కావచ్చును. మూడవవాడు మాలవాధిపతి. ఆ కాలమున మాలవ దేశము గూర్జర ప్రతీహారుల యధికారముక్రింద నుండెను. గూర్జరులు హిమాలయపర్వతములోని పశ్చిమోత్తరకనుమలగుండ హిందూ దేశమున జొచ్చి యచట స్థిరనివాసముల నేర్పఱచుకొనిన యన్యదేశీయు లని కొందఱి యభిప్రాయము. పంజాబున కొంతకాల ముండి తరువాత రాజపుత్రస్థానముగుండ పశ్చిమసముద్రతీరమునందలి సురాష్ట్రము నాక్రమించుకొనిరి. మాళవదేశము నెప్పుడు గూర్జర ప్రతీహారులు జయించి స్వాధీనము జేసికొనిరో తెలియదు. క్రీ. శ.

---

1. ఆర్కి. స. ఆ. వెస్టరన్ ఇండియా. సం. ౫, పుట ౭౭.
2. రాష్ట్రకూటులు – వారికాలము. పుట ౩౫, అధోజ్ఞాపిక. ౧౩.

౭౫౬ లోనో, మరుసటి సంవత్సరముననో మృతినందిన దంతిదుర్గు డా దేశముపై నెత్తిపోవునప్పటికే గూర్జరు లుజ్జయిని యందు రాజ్యము సల్పుచుండినందుచే వా రాప్రాంతము నంతకుముందే స్వాధీనపఱచుకొనిరని తెల్లమగుచున్నది. ప్రతీహారులలో నాల్గవ రాజైన ప్రథమనాగభటుఁడే మాళవమును సాధించి యచట గూర్జ రుల యధికారమును మొదట నెలకొల్పె నని తోఁచుచున్నది. ఇతడు పరాక్రమశాలి. సింధుదేశము నాక్రమించుకొని యచటినుండి నూటిమాటికి పశ్చిమసముద్రతీరదేశములపై దండువెడలుచు మిక్కి- లియు నలజడిపెట్టుచుండిన అరబ్బులను యుద్ధమున నోడించి వారి సంరంభమును జాలవఱకు దగ్గించెను.[1] ఇతని స్థిరరాజధాని రాజపుత్ర స్థానములోని మేడన్తపురమైనను[2] దక్షిణమున నితని యధికారము భృగుకచ్ఛదేశమువఱకు వ్యాపించియుండెను. ఈ నాగభటుని, లేక నాగావలోకుని ప్రవర్ధమాన విజయరాజ్యమునందు విక్రమకాలము ౮౧౩ నకు సరియైన క్రీ. శ. ౭౫౬ న వ్రాయించిన హాన్సోట్ శాసన మున భృగుకచ్ఛాధిపుడును, చాహమానవంశజుడైన భ్రాతృవృద్ధుడు దా నీతనికి సామంతుడ నని చెప్పుకొనియున్నాడు.[3] దంతిదుర్గుడు మాళవదేశముపై నేల యెత్తిపోయెనో తెలియదు. సామ్రాజ్య కాంక్షయే దీనికి ప్రధానకారణమై యుండవచ్చును. కాని దశావ తార దేవాలయశాసనమునుబట్టి చూడగా శత్రుపీడితుడైన రా జెవ్వరో ద న్నాశ్రయింపగా నాతని కాపాడుటకు దంతిదుర్గుఁ డీ దండ యాత్రను సాగించె నని తోఁచుచున్నది.

దేవం.... ....సవరపరికరం భీమసేనానుయాతం
ప్రహ్వై ర్బాపేన్ద్రవృన్దైః పరివృత మభయై రుగ్రసేనో జితారిః

1. ఎపి. ఇండి. సం. ౧౮, పుట. ౧౦౭, ౧౧౦-౧౧.
2. ఎపి. ఇండి. సం. ౧౮, పుట ౯౫
3. ఎపి. ఇండి. సం. ౧౮, పుట ౧౯౭.

వ్యాప ద్యోద్ధర్తు మేకం ప్రసభపరకరి ధ్వంసనంస్కారదక్షో
భీభత్సు ర్దుష్టనాగో జయినమివ పరం శ్రీమహారాజశర్వః,
దత్తా యే నోజ్జయిన్యా మపి నృపతి మహాదానమాశ్చర్యభూతం
న్యాయం సంచిన్త్య దీప్తద్యుతిబహుకనకం రత్నముక్తావతంసం,
మాణిక్యాకీర్ణ మన్యం దివస మవిరత తృప్తదీనార్థిసార్థం
కర్తుం క్రీడా మపూర్వా మపరనృపతిభిః స్వప్నకాలే ప్యనాయ్యామ్,

* * *

య స్యాఖణ్డితవిక్రమస్య కటకే నాక్రమ్య తీరక్షితిం
సౌధేఽస్మిన్ కృతగూర్జరేన్ద్రరచితే రమ్యే....తై స్తస్థుషః,
స్నాన్తీభి....తాజరాగసురభి ప్రోత్కంపిపద్మాకరం
ధారిత్ర్యష్వపిపుష్కరేష్వపి.... ....నాభి శ్చిరం.[1]

పై శాసనశ్లోకములు మూడును సంపూర్ణములుగాక గ్రంథపాతములవలన యఱగొఱలుగ నుండుటచేత వాని యర్థము చక్కగ బోధపడుటలేదు; కాని వానియందలి భావము స్పష్టముగనే తెలియ వచ్చుచున్నది. మొదటి శ్లోకమునందు ఉగ్రమైన సేన గలవాడును, జితారియు, ప్రసభపరకరిధ్వంసనసంస్కారదక్షుడును, బీభత్సుడును, దుష్టనాగుడును నైన శ్రీమహారాజశర్వుడు (దంతిదుర్గుడు) అభయులును, భక్తియుక్తులునునైన రాజేన్ద్రబృందముచే జుట్టబడినవానిని, శ్రేష్ఠమైన పరివారజనులతో గూడినవానిని, భీమసైన్యానుయాతుని, దేవుని, మఱియొక యుధిష్ఠిరుని (జయుని) బోలి యాపదనుండి యుద్ధరించుటకు యేమో చేసె నని (క్రియాపదము మాసిపోయినది) చెప్పియున్నది. రెండవదానియందు ఈ రాజు (దంతిదుర్గుడు) ఉజ్జయినియం దేదో యాశ్చర్యభూతమైన మహాదానము నొకదాని జేసెనని యున్నది. ఈ దానవిషయమైన ప్రస్తావన మొదటి యమోఘవర్షుని సంజన్ తామ్రపట్టికలయందును గలదు.

1. ఆ. స. వె. ఇం. సం. ౫, పుట ౮౭.

హిరణ్యగర్భం రాజన్యై రుజ్జయిన్యాం య దాసితమ్
కం యేన గూర్జరేశాది రాజకమ్.[1]

దీనివలన దంతిదుర్గుడు ఉజ్జయినియందు 'హిరణ్యగర్భ' దానమును జేసె ననియు, నప్పు డతనిచే గూర్జరేశాదిరాజులు ప్రతీహారులుగ సేయబడి రనియు దెలియుచున్నది. మఱియు మూడవశ్లోకమునందు ఇతడు స్వసైన్యముచే (సముద్ర) తీరక్షితి నాక్రమించుకొని యచట గూర్జరేంద్రునిచే నిర్మితమైన సౌధమునం దొక కొలనియందు స్నాన మాడె నని చెప్పియున్నది.

మొదటి శ్లోకమున బేర్కొనబడిన దేవు డెవ్వడో, యతనికి వచ్చిన యాపదయెట్టిదో, దంతిదుర్గు డాతని నుద్ధరించుట కేల పూనుకొనెనో నిర్ధారించుటకు సాధ్యము గాదు. ఈ శ్లోకము నాధారపఱచుకొనియే కాబోలు డాక్టరు ఆల్టెకారుగారు దమ రాష్ట్రకూటుల చరిత్రయం దిట్లు వ్రాసియున్నారు: (చాళుక్య) కీర్తివర్మను మొదటి తడవ యోడించిన పిమ్మట గొంత కాలమునకు, దంతిదుర్గు డుజ్జయినీ పాలకుడైన గూర్జర ప్రతీహారవంశజుడైన దేవరాజుకు సహాయ మొనర్చుటకో, లేక యాతని (దేవరాజు) ప్రతిస్పర్ధి శాఖాంతర దాయాదియగు భీన్మాలు ప్రభువగు సిలూకనిచే నత డందిన పరాజయమువల్ల లాభమునంద దలచియో యుజ్జయిని మీద దండు వెట్టిన ట్లున్నది."[2] దంతిదుర్గుని మాళవదండయాత్రయపు డచట నొక దేవుడు లేక దేవరా జనునతడు రాజ్యము సేయుచుండినది నిశ్చయము. కాని యతడు గూర్జరప్రతీహారవంశజుడనుట సంశయాస్పదము. గూర్జరప్రతీహారవంశమున శాఖాంతరమునకు జెందిన భీన్మాలుప్రభువగు సిలూకనిచే నోడింపబడిన దేవరాజితడే యనుట

1. ఎపి. ఇండి. సం. ౧౮, పుట ౨౪౩.

2. రాష్ట్రకూటులు – వారికాలము, పుటలు, ౩౯ – ౪౦.

యొప్పదగని విషయము. ఆల్టెకారుచే బేర్కొనబడిన దేవరాజు కనోజి గూర్జరప్రతీహారవంశమునకు మూలపురుషు డైన ప్రథమ నాగభటుని యన్నకు రెండవ కుమారుడు. క్రీ. శ. ౭౮౩-౪ ప్రాంతమున అవంతి (ఉజ్జయిని) యందు రాజ్యము సేయు చుండిన వత్సరాజుయొక్క తండ్రి.[1] ప్రథమనాగభటుని విజయ రాజ్యము విక్రమకాలము ౮౧౩ అనగా క్రీ. శ. ౭౫౬ నం దింకను ప్రవర్ధమానముగ సాగుచుండెను. కావున దేవరాజుయొక్క ప్రభు త్వము క్రీ. శ. ౭౫౬-౭౮౩ ల మధ్య నెప్పుడో ప్రారంభమై యుండవలయును. ఇక దంతిదుర్గుడు క్రీ. శ. ౭౫౬ లోనో, యా మరు సటి సంవత్సరముననో మృతి నందెననుట నిశ్చయము. అతని మరణా నంతరము అతని పినతండ్రియైన మొదటి యకాలవర్ష కృష్ణరాజు సామ్రాజ్యపీఠము నధిష్ఠించె నని క్రీ. శ. ౭౫౮ నాటి యతని భారత ఇతిహాససంశోధకమండలిపట్టికలయందు చెప్పియుండుటచే నత డంతకు పూర్వమే కాలగతి నందె ననుటకు సంశయము లేదు.[2] కావున దంతిదుర్గుని మాళవదండయాత్రయు, గూర్జరవిజయమును క్రీ. శ. ౭౫౬ నకు బూర్వమే నడచియుండవలయును. కావున నాగభటుని యన్నకొడుకగు దేవరాజే దశావతారదేవాలయ శాసనమందలి 'దేవుడు' కాజాలడు: కాని ప్రథమనాగభటుడు రాజ్యము సేయు చుండగనే యతని యన్న కొడుకగు దేవరాజు మాళవదేశముపై నేలుచుండి పినతండ్రిపై దిరుగుబాటు చేసియుండవచ్చును; అతనిచే నిర్జితుడై దేవరాజు దంతిదుర్గుని సహాయ మపేక్షింపగా దంతిదుర్గుడు మాళవదేశముపై నెత్తిపోయి యుండవచ్చును అను వాద మొకటి బయలువెడలవచ్చును. ఇం దసంగత మేమియు లేదు. కాని, ఇది కేవలము ఊహయే. దీని నిరూపించుటకు దగిన యాధారము లేదు.

---

1. ఎపి. ఇండి. సం. ౬, పు. ౧౯౫ త.
2. భారత ఇతిహాస సంశోధకమండలి. సం. ౯, పుట ౧౬౫.

అట్టి యాధారము లభించువఱకును నీ దేవరాజును, యెల్లూర దశావ తార దేవాలయశిలాశాసనమున బేర్కొనబడిన 'దేవు'డును భిన్న పురుషు లని తలచుట యుక్తము.

రెండవ శ్లోకమువలన దంతిదుర్గునికి విజయము చేకూడె ననియు, మాళవరాజధానియగు నుజ్జయిని యతనికి హస్తగత మాయె ననియు స్పష్టమగుచున్నది. మొదటి యమోఘవర్షుని సంజన్ పట్టికల నాశ్య్య మంగీకార్యమేని, దంతిదుర్గుని ప్రతిపక్షులలో ప్రము ఖుడు గూర్జరేశ్వరు డనియు, నతని నిర్జించుటవల్లనే మాళవదేశము రాష్ట్రకూటులకు వశమాయె ననియు దోచుచున్నది. మూడవ శ్లోకమువల్ల దంతిదుర్గుడు మాళవమును సాధించిన పిమ్మట దండుతో గదలిపోయి తీరక్షితిని స్వాధీనపఱచుకొనె నని తెలియుచున్నది. తీరక్షితి యన సముద్రతీర దేశము. ఈ తీర దేశము గూర్జరేశుని యాధిపత్యముక్రింద నుండెను. "సాధేఽస్మిన్ కృతగూర్జరేన్ద్రరచితే" యను శాసనవాక్యము రుజువుసేయుచున్నది. మఱియు సౌరాష్ట్రమందలి భృగుకచ్ఛ మప్పుడు గూర్జరప్రతీహారప్రథమనాగ భటుని యధికారముక్రింద నుండుటచేత దానికి పైభాగమందలి తీర దేశమును, మాళవదేశమును గూడ నతని యేలుబడిక్రిందనే యుండె నను తలంపు గలుగుచున్నది.

పై చర్చవలన తేలిన సారాంశ మిది: లేములవాడ చాళుక్య లకు మూలపురుషుడైన వినయాదిత్యయుద్ధమల్లునకు సమకాలికులును, ప్రాయశః అధిపతులును ననదగిన రాష్ట్రకూట చక్రవర్తులగు దంతి దుర్గ ప్రథమకృష్ణులలో రెండవవాడగు ప్రథమకృష్ణు డుత్తరదేశ ముపై దండెత్తిపోలేదు. కావున వినయాదిత్య యుద్ధమల్లు డితనితో గలసి పోయి సపాదలక్షదేశమును జయించి యేలినా డనుట కవ కాశము లేదు. మొదటి వాడైన దంతిదుర్గుడు దేవుడు, లేక దేవరా జనువానిని గాపాడుటకై గూర్జరప్రతీహారవంశజుడైన ప్రథమనాగ

భటుని యుద్ధమున నోడించి యతని యాధిపత్యముక్రింద నుండిన మాళవమును, సౌరాష్ట్రాదితీరదేశము నాక్రమించుకొనియెను. ఈ నాగభటుని స్థిరరాజధాని రాజపుత్రస్థానములోని మేడన్తకపుర మని ప్రతీహారబావుకుని జోధపుర శాసనమువల్ల దెలియుచున్నది.[1] ఈ మేడన్తకపురము అజమీరునకు గించిత్పశ్చిమోత్తరమున నిరువది యైదు మైళ్ళ దూరముననను, శాకంభరికి (సాంభరుకు) బశ్చిమమున నేబదిమైళ్ళ దూరముననను నుండు ఇప్పటి మెర్తాయే యని పరిశోధకులు గుర్తించియున్నారు.[2] అజమీరు, శాకంభరులు రెండును బ్రాచీనసపాద లక్షకు జెందిన స్థలములు. తత్సమీపస్థమైన మేడన్తకపురము గూడ నా సపాదలక్షులోనిదే కావలయును. మేడన్తకపురము నాగభటుని రాజధాని యగుటచేత తత్పరిసరమున నుండిన సపాదలక్షదేశ మతని యేలుబడియందే యుండెనని తోచుచున్నది. క్రీ. శ. ౯౭౩ నాటి తన హర్ష శాసనమున శాకంభరీపాలకుడైన చాహమానవంశజుడగు రెండవ విగ్రహరాజు తనకు ఆరుతరములకు ముందరివాడగు మొదటి గూవకుడు నాగావలోకుని సభయందు వీరప్రతిష్ఠను పొందెనని చెప్పియున్నాడు.

> ఆద్యః శ్రీగూవకాఖ్యః ప్రథితనరపతి శ్చాహమానాన్వయోఽభూత్
> శ్రీమన్నాగావలోకప్రవరనృపసభా లబ్ధవీరప్రతిష్ఠః.[3]

దీనివలన నీ ప్రథమగూవకుడు నాగావలోకుని సామంతుడని తేలుచున్నది. ఇందు పేర్కొనబడిన నాగావలోకుడు క్రీ. శ. ౮౦౦ మొదలు ౮౩౩ వఱకును రాజ్యము చేసిన గూర్జరప్రతీహార ద్వితీయ నాగభటు డని శాసనవిమర్శకు లభిప్రాయపడియున్నారు. మొదటి

---

1. ఎపి. ఇండి. సం. ౧౮, పుట ౮౭ త. 2. డిటో.

3. ఎపి. ఇండి. సం. ౨, పుటలు ౧౨౧, ౧౨౬; ఇండి. ఆంటి. ౧౯౧౧, టలు ౨౩౯_౪౦.

నాగభటుఁడైనను కానవచ్చును. ఇది యెట్లున్నను సపాదలక్షపాలకులైన శాకంభరీచాహమానప్రభువులు గూర్జరప్రతీహారచక్రవర్తులకు సామంతులై యుండిరని నిశ్చయమగుచున్నది. శాసనాద్యాధారమొద్దియు లేకపోయినను, నాగభటుని యధికారముక్రింద నుండిన మాళవసౌరాష్ట్రాదిదేశములను దంతిదుర్గుఁడు జయించియుండుట చేతను, సపాదలక్షముయొక్క దక్షిణపు సరిహద్దునం దుండిన టంక దేశాధీశుని బరాజితుని గావించి యుండుటచేతను, సపాదలక్షాంతర్గతమైన నాగభటుని స్థిరరాజధాని యైన మేడన్తకపురముపై దండెత్తి పోయియుండినను నుండవచ్చును. కావున, లేములవాడచాళుక్యుల శాసనములలోను, పంపని విక్రమార్జునవిజయమునందును జెప్పినట్లు వినయాదిత్యయుద్ధమల్లుఁ డనన్యశాస్యమైన సపాదలక్ష దేశమును పాలించినది దంతిదుర్గుఁడా దేశమును జయించిన పిమ్మటనై యుండ వలయును. వీరుఁడును, సమర్థుఁడును నగుటచే నితని దంతిదుర్గుఁడా దేశమునకు పాలకునిగ నియమించి యుండు నని తోఁచుచున్నది.

వినయాదిత్యయుద్ధమల్లుఁడు సపాదలక్షదేశమున నెంతకాల ముండెనో తెలియదు; అతఁ డొనర్చిన రెండవ ఘనకార్యము పోదనపురమున జరిగినది. ఇది యతని రాజధాని గాఁబోలు. పోదనపుర మిప్పటి హైదరాబాదు రాజ్యములోని నిజామాబాదుజిల్లాయందలి బోధను గ్రామమేకాని యన్యముగాదు.[1] సపాదలక్షను విడిచి

1. "ఇది యొక తాలూకాకు ముఖ్యస్థలమైనను మిక్కిలి చిన్నపట్టణము; నిజామాబాదునకు పదునాల్గుమైళ్ళ దూరమున పశ్చిమమున నున్నది. రెంటికిని మధ్య చక్కని రోడ్డొకటి కలదు. కాని యిందెచట చూచిన ప్రాచీనజైన హిందూశిలా ప్రతిమలు గానవచ్చుచున్నవి. ఉత్తరమునను, తూర్పుదక్షిణదిశలయందును మూఁడు పెద్దకొలకులు గలవు; పట్టణముచుట్టును ఘనమైన గోడలుగల పుట్టకోట యున్నది". హైదరాబాదు అర్కియలాజికల్ సీరీస్, నెం. ౭ పుట ౧. మఱియు శకాబ్దము ౯౭౪ నాటి యాహవమల్ల సోమశ్వరుని శిలాశాసనమున "రాష్ట్రకూటాన్వయచక్రేశ్వరన్ ఇన్ద్రవల్లభం రాజధాని బోదనదోళ్ మాడిసిద ఇన్ద్రనారాయణదేవర

యుత్తరాంధ్ర దేశమందలి బోదనుపురమున కితని యాగమనమునకు దంతిదుర్గుని మరణానంతరము రాష్ట్రకూట సామ్రాజ్యమున సంభవించిన రాజ్యవిడ్డూరమే కారణమని తోచెడిని. దంతిదుర్గుడు చాళుక్యులతోనైన యుద్ధమున క్రీ. శ. ౭౫౬ నందో, లేక, మరుసటి సంవత్సరముననో నిహతుడై యుండవలయు నని ఇంతకుముందు సూచింపబడియున్నది. క్రీ. శ. ౭౫౮ లో నతని పినతండ్రియైన ప్రథమ కృష్ణభూపాలుడు రాజ్యాభిషిక్తుడైన ట్లతని భారతి ఇతిహాస సంశోధక మండలి తామ్రపట్టికలవలన దెలియవచ్చుచున్నను దరువాత యేడేండ్లవఱకును నొక్కటియైన నతని శాసన మెచ్చటను గానరాకపోవుటచే రాజ్యారంభదశయం దితని యధికారము నిర్వక్రముగ సాగలే దని తోచుచున్నది.[1] ఒకప్రక్క రాహప్పయాధిపత్యము క్రింద చాళుక్యులు విజృంభించి సామ్రాజ్యము నాక్రమించుకొనదొడగిరి. మఱియొకప్రక్క మొదటిగుజరాతు [రాష్ట్రకూట వంశ] శాఖకు జెందిన దాయాది ఇమ్మడి కక్కరాజు తానే పరమభట్టారక రాజాధిరాజపరమేశ్వరుడ నని ప్రకటించుకొనెను.[2] పథార్త్రీస్తంభశాసనమునందు కర్ణాటకులను జయించి లాటదేశము నాక్రమించిన పరబలునియొక్క పితామహుడగు జేజ్జని యన్న ఈ యిమ్మడి కరకరాజే నని తలచెదను.[3] పేరు దెలియనిశత్రులు మఱెంద

---

దేవాయతనం" (పైడే. పుట ర.) అని యుండుటచే నిది రాష్ట్రకూటయుగమున ప్రఖ్యాతినందిన స్థలమని తెల్లమగుచున్నది.

1. భార. ఇ. సం. మం. పత్రిక. సం. ౮. పుట. ౧౬౫; ఎపి. ఇండి. సం. ౬. పుటలు ౧౬౦ – ౨.

2. రా. ఏ. సొ. ప. (బొంబాయిశాఖ) సం. ౧౬. పుటలు ౧౦౫ త.

3. ఎపి. ఇండి. సం. ౯, పు. ౨౫౨.

జిత్వా వికటకరిఘటా ప్రభూతరకర్ణాటభటసహస్రాణి
[పృథు]లాటాఖ్యం రాష్ట్రం లబ్ధం యస్యాగ్రజే నాజౌ.

జేజ్జని మనమడైన పరబలుడు క్రీ. శ. ౮౬౧ లో పథారీశిలా స్తంభశాసనమును నిల్పియుండుటచే, జేజ్జనియన్నయు, గుజరాతుశాఖవాడైన ఇమ్మడి కక్కరాజును నొక్కకాలమువా రగుదు రేమో విచారింపవలసియున్నది. పరబలుని తండ్రియైన కక్కరాజు నాగావలోకుని...లవన యను స్థలమున రణమునవోడించి వెనుకకు మరల్చి యతని దేశమును పాడుగావించెనట!

దుర్వారారాతిమత్త ద్విరద...ఘటాటోపసంఘట్టచణ్డే
సంగ్రామే హ్యాప్తయోధే తురగఖురరజశ్ఛన్న దిక్చక్రవాలే,
వల్గత్పాలిధ్వజాలౌ క్షతరుధిరసరిత్ప్రాజ్యసామన్తచక్రే
చక్రే నాగావలోకం ఝటితి...లవనే యఃపరావృత్తమూర్తిమ్,
దుర్వారవైరివరవారణకుంభముక్త ముక్తాఫలప్రకరనిర్మలదన్తమాలా,
నాగావలోకనృపవేశ్మని విప్రకీర్ణే య స్యోద్ధతం ప్రహసతీవ కృపాణపాలీ.

ఇందు పేర్కొనబడిన నాగావలోకుడు గూర్జర ప్రతీహారచక్రవర్తియగు నిమ్మడి నాగభటు డని శాసనవిమర్శకుల యభిప్రాయము. ఇమ్మడి నాగభటుని యేలుబడి క్రీ. శ. ౮౩౩ తో సమాప్తి యగుటచే గక్కరా జతని నోడించి యాతని దేశమును పాడుగావించినది తత్పూర్వమై యుండవలయును. ఈ కక్కరాజునకు నాగావలోకుని జయించుటయేగాక యతని దేశమును పాడుచేయునంతటి బల మెట్లు కలిగెనో తెలియదు. ఈ సందరమున కన్నోజి చరిత్రకారులైన రామ శంకరత్రిపాఠిగారి యభిప్రాయము స్మరణీయము. "అతడు (పరబలుడు) చిరకాలము రాజ్యము జేసె నని తలచితిమేని, యతని తండ్రియగు కక్కరాజు ముమ్మడి గోవిందునికి సమకాలీనుడును, సామంతుడును ననియు, దత్కారణమున నతనికి నాగభటునితోడి యుద్ధమున సాయ మొనర్చె ననియు జెప్పవచ్చును." (హిస్టరీ ఆఫ్ కనౌజ్. పుట ౨౩౧.) త్రిపాఠిగారి యభిప్రాయము సమంజస మని తోచు చున్నది. ఇది యంగీకార్యమేని పరబలుని తండ్రియగు కక్కరాజు ముమ్మడి గోవింద రాజునకు గన్నోజిదండయాత్రయందు దోడ్పడెననెడి యూహ కెడము గలుగు చున్నది. ముమ్మడి గోవిందరాజు కన్నోజిదండయాత్రకాల మాతని శాసనముల సాక్ష్యమువల్ల నిర్ధారింపవచ్చును. క్రీ. శ. ౮౦౨ నాటి మణ్ణెతామ్రపట్టికలలో గూర్జరప్రతీహారులపైని విజయప్రస్తావన కలదు. (ఎపి. కర్ణా. సం. ౯. నెం ౬౧.)

'సర్వక్షేత్ర ముదీక్ష్య యం శరదృతుం పర్జన్యవ ద్గూర్జరో
నష్టః క్వాపి భయాత్ తథాపి సమయం స్వప్నేపి పశ్యన్యథా.'

ఈ శాసనము కృత్రిమ మని కొందఱు. సత్యాత్మక మైనను దీని నిచ్చినది శకము ౭౨౮ న కాదనియు, ౭౩౦ లోనో, ౭౩౧ లోనో యిచ్చియుండవలయు ననియు మఱికొందఱు, (ఎపి. ఇండి. సం ౨౩. పుటలు ౨౯౩-౮.) దానశాసన కాలము శకము ౭౨౮ గే నని యొక్కఁడు (ఎపి. ఇండి. సం. ౨౩. పుట ౨౧౫.) శాసనకాలవిమర్శ కిక్కడ తావు లేదు. కాని శాసనోక్తదానకాలము శకము ౭౨౮ వాస్తవమైనదే. కృత్రిమ మని త్రోసివేయుటకు వీలులేదు. ఇందు విపులముగ వర్ణింపబడిన ముమ్మడి గోవిందరాజు విజయము లన్నియును క్రీ. శ. ౮౦౮-౯ నాటి యతని నేసారి తామ్రశాసనమున సంగ్రహమున సూచింపబడియున్నవి. (సోర్సెస్ ఆఫ్ ది మిడీవల్ హిస్టరీ ఆఫ్ ఇండియా. సం. ౧. పుటలు ౧౫ ౨౬.)

పాణ్డ్యదేశాధిపా న్మత్స్యం వృషభం పల్లవేశ్వరాత్,
చోలా ద్వ్యాఘ్రం గజం గంగా చ్చాపయష్టిం చ కేరళాత్,
ఆంధ్రచాలుక్యమౌర్యేభ్యో వరాహం గూర్జరేశ్వరాత్,
వృషభం పల్లవేశ్వరాత్ (?). కోసలావన్తనాథాభ్యాం
సింహాలాదపి నా.........ఇత్థ మేతా న్యథాఽన్యాని
గరుడాంకం జగత్తుంగాఖ్యావతంసక.........

కావున మజ్ఞాతామ్రశాసనమున జెప్పినట్లు శకము ౭౨౮, అనగా క్రీ. శ. ౮౦౨ నకు ముందే ముమ్మడి గోవిందరాజు గూర్జరయిమ్మడినాగభటుని జయించినా డనుటకు సంశయింప బనిలేదు. పరబలుని తండ్రియైన కక్కరాజును నాగభటు నోడించి యతని దేశమును బాడుగావించినది కూడ యప్పుడే యైయుండవలయును.

ఇక పరబలుని తాతయగు జేజ్జుడును, నతని పేరుతెలియని యన్నయు దత్పూర్వమువారు కావలయును. ధ్రువనిరుపము డుత్తరదేశములపై దండెత్తి పోయినను అత డెచ్చటను పరాజయము నందె నని తలచుట కవకాశము లేదు. ఇమ్మడి గోవిందరాజు రాజ్యముచేసిన యల్పకాలమును నతనికి తమ్ముడైన ధ్రువుని తోడి పోరాటమున సరిపోయినది. మొదటి కృష్ణభూపాలుడు స్వవంశ్యునితో (ఇండి. ఆంటి. సం. ౧౨, పుట ౧౫౯) యుద్ధముచేసి రాజ్యమునుగైకొనినట్లు శాసనములయందు జెప్పియుండుటచేత, కర్ణాటకసైన్యమును జయించి లాటదేశమును స్వాధీనపఱచుకొనిన జేజ్జని యన్నయే యతని ప్రత్యర్థియై యుండవలయును. జేజ్జని కుమారుడగు కరకుడు పై జెప్పినట్లు క్రీ. శ. ౮౦౨ ప్రాంతమున నుండి యుండుటచేత జేజ్జుడును, నతని యన్నయు క్రీ. శ. ౭౫౦ ప్రాంతముల నుండి

రుండిరో? వీరిమధ్య రాష్ట్రకూట సామ్రాజ్యము బంధక్ తామ్రపట్టి కలయందు జెప్పినట్లు కలిజలధియందు ధరిత్రివలె మునిగిపోయెను.[1] సామ్రాజ్యమున నిట్లు విప్లవము జనింపగా దూరమున నుత్తరాపథ మున సామ్రాజ్యభారము వహించుచుండిన రాష్ట్రపాలకులెల్ల నిస్స హాయులై తాము పాలించుచుండిన స్థానములను వదలిపెట్టి స్వదే శమునకు దిరిగి రావలసినవారైరి. వినయాదిత్యయుద్ధమల్లుడును సపాదలక్షకు వీడికోలొసగి నిజస్థానమైన బోదనుపురమునకు వచ్చి చేరెను.

వినయాదిత్యయుద్ధమల్లుని సాహసకార్యములలో నిక మిగిలి యుండునది చిత్రకూటదుర్గగ్రహణము. ఈ చిత్రకూట మెచ్చటిదో నిశ్చయించి చెప్పుటకు వీలులేదు. ఈ పేరిటి సుప్రసిద్ధదుర్గములు రెండు మూడు గలవు. సపాదలక్ష దేశమునం దొక చిత్రకూటదుర్గము గానవచ్చుచున్నది. మహమ్మదీయయుగరాజపుత్రస్థాన చరిత్ర యందు ప్రఖ్యాతి నందిన చితోడ్గడ మిదియే. సపాదలక్షదేశమును వినయాదిత్యయుద్ధమల్లుడు పాలించియుండుటచేత నతడు లగ్గలువట్టిన చిత్రకూట మిదియే కావచ్చు ననునూహ కలుగవచ్చును. కాని శాసనగ్రంథమున నిది కడపట బేర్కొనబడియుండుటచే నిది దక్షిణా పథమునందలి దుర్గమే యని తోచుచున్నది. బుందేలుఖండమున మఱియొక చిత్రకూటదుర్గము కలదు. ఇదియును బలిష్ఠమైన దుర్గమే. తరువాతి రాష్ట్రకూట ప్రభువు లీదుర్గమునకై పలుమారు పోరి

---

యందు రనుటకు శంకింప బనిలేదు. మఱియు నీకాలముననే యాంత్రోలి చారోలి శాసనమువలన రాష్ట్రకూటవంశజుడగు నొక యిమ్మడి కరకరాజు పరమభట్టారక మహారాజాధిరాజ పరమేశ్వరబిరుదులతో లాటదేశము నేలుచుండుటచేతను ఆ పేరు లేని జేజ్జని యన్నయే యిమ్మడి కక్కరాజైయుండవచ్చు నన్న యూహ పొడము చున్నది.

1. ఎపి. ఇండి. సం. ౧౮, పుటలు ౧౨౧–౩౦.

సాధించినట్లు శాసనసాక్ష్యమువల్ల దెలియుచున్నది. వినయాదిత్య యుద్ధమల్లుడు సాధించినది ప్రాయశః ఈ చిత్రకూటమే కావచ్చును. అగునేని యత డీ దుర్గమును ప్రథమకృష్ణరాజుకాలమున జయించి యుండవలయును.

## ౫ మొదటి యరికేసరి

వినయాదిత్యయుద్ధమల్లు డెంతకాలము బ్రదికియుండెనో నిర్ధరించి చెప్పుటకు వీలులేదు. ఇతని యనంతర మితని పుత్త్రు డరికేసరి రాజ్యాభిషిక్తు డాయెను. ఇత డెప్పుడు సింహాసనాధిష్ఠితు డైనదియు, నెంత కాలము రాజ్య మొనర్చినదియు, నెన్నడు గతించినదియు దెలియదు. ఒక సంగతిమాత్రము నిశ్చయముగ జెప్పవచ్చును. క్రీ. శ. ౭౮౦ మొదలు ౭౯౩ పర్యంతము సామ్రాజ్యపాలన మొనర్చిన రాష్ట్రకూట చక్రవర్తి ధ్రువనిరుపమదేవుని కితడు సామంతుడు. ఇతని గూర్చిన చరిత్రాంశ మొక్కటియే శాసనాదులవలన దెలియుచున్నది. లేములవాడ శిలాశాసనమున 'గృహీతాఖిలవేంగిదేశః పాతిస్మ' యనియు, పరభణి తామ్రశాసనమున 'సకలింగత్రయాం వేంగీం యోఽవతి స్మ పరాక్రమాత్' అనియు, విక్రమార్జునవిజయ పీఠికయందు—

"నిరుపమదేవన రాజ్యదొ ళరికేసరి వెంగివిషయమం త్రికళింగం
బెరసా త్తికొండు గర్వదె బరెయిపిదం పెసర నఖిళ దిగ్భిత్తిగళోళ్."

అనియు జెప్పియుండుటచేత నీ యరికేసరి నిరుపమదేవుని రాజ్యమున వెంగిత్రికలింగదేశములను జయించె నని విశదపడుచున్నది. మఱియు విక్రమార్జున విజయములోని 'వెంగివిషయమం త్రికళింగం' అనుదానికి బదులు పరభణితామ్రశాసమున "సకళింగత్రయాం వేంగీం" అనియు, లేములవాడ శిలాశాసనమున 'గృహీతాఖిలవేంగిదేశః' అనియు నుండుటచేత గొందఱు వితండించునట్లు 'త్రికలింగ

మొక యఖండ జనపదము గాదనియు, 'గలింగ' నామాంకిత దేశ త్రయ సమూహ మనియు, మఱియు వెంగియు గలింగత్రయమును జేరి యేకరాజ్యమై యుండెననియు దెల్లమగుచున్నది.

'నిరుపమ దేవన రాజ్యదొళ్' అను పంపని వాక్యమువలన నరికేసరి నిరుపమదేవుని పక్షమున వెంగికళింగత్రయములను జయించె నని ద్యోతకమగుచున్నది. నిరుపముడు వెంగికళింగములపై నరికేసరి యాధిపత్యము క్రింద దండయాత్ర నంపుటకు గారణము లేకపోలేదు. వెంగికళింగముల కధిపతి పూర్వచాళుక్యుఁడు. రాష్ట్రకూటులకును, పూర్వచాళుక్యులకును ప్రథమకృష్ణరాజు కాలమునుండియు వైరము గలదు. ఇమ్మడి గోవిందరాజు యువరాజుగ నుండినపు డతడు వెంగీ మండలమును జయించి వేంగీశ్వరుని సర్వస్వమును గొన్న విషయ మింతకుముందే స్మరింపబడినది. ఈ పూర్వవైరమునకు దోడు రాజ్యమునకై నిరుపమునకును, నతని యన్నయైన ఇమ్మడి గోవింద రాజునకును నైన కలహములో వేంగీశ్వరుడు గోవిందరాజుపక్షము వహించి నిరుపమునితో యుద్ధమొనర్చెను. ఈ యంశము ముమ్మడి గోవిందరాజు పై తాను శాసనములో నిట్లు చెప్పియున్నది:

> శ్రీకాంచీపతి గంగ వేంగికయుతా యే మాలవేశాదయః
> ప్రాజ్యా నానయతి స్మ తాన్ క్షితిభృతో యః ప్రాతిరాజ్యానపి
> మాణిక్యాభరణాని హేమనిచయం యస్య ప్రపద్యోపరి
> స్వం (? యే) న ప్రతితం తథాపి న కృతం చేతోఽన్యథా భ్రాతరం.[1]

కావున ఇమ్మడి గోవిందరాజును రాజ్యభ్రష్టుని గావించి స్వయము సింహాసనము నధిష్ఠించిన పిమ్మట ధ్రువనిరుపముడు వేంగీ శ్వరుని శిక్షించుటకై ప్రథమ అరికేసరినాయకత్వముక్రింద నొక

1. ఎపి. ఇండి. సం 3. పుట ౧౦౩.

గొప్పసైన్యమును వేంగిపై కంపెను. వెంగికళింగముల నప్పుడు పాలించుచుండిన రాజు పూర్వచాళుక్యచతుర్థవిష్ణువర్ధనుడు. రాష్ట్రకూటుల యుపద్రవమునుండి నిజరాజ్యమును గాపాడుట కెత్తెట్టి యేర్పాటులను గావించెనో తెలియదు; కాని యవి యెట్టివైనను విఫలము లాయెననుట నిశ్చయము. వేములవాడ చాళుక్యుల శాసనము లందును, విక్రమార్జునవిజయమునందును మొదటి యరికేసరి వేంగిత్రికళింగములను సాధించె నని స్పష్టముగ జెప్పియుండుటచేత రాష్ట్రకూటదండయాత్ర జయప్రదముగ ముగిసె ననుట తెల్లము; వీని యాథార్థ్యమును క్రీ. శ. ౮౮౬ నాటి జెత్త్వై తామ్రశాసనము రుజువు సేయుచున్నది.

"తస్య పరమభట్టారక మహారాజాధిరాజపరమేశ్వర శ్రీమదకాలవర్షపాదానుధ్యాత పరమభట్టారక రాజాధిరాజపరమేశ్వర ధారావర్ష శ్రీధ్రువరాజదేవస్య మహాదేవీ సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధనవిట్టరసరాజదుహితా పరమేశ్వరీ పరమభట్టారికా శ్రీశీలమహాదేవీ."[1] ఇందువల్ల విష్ణువర్ధనవిట్టరసరాజు అనగా ముమ్మడి విష్ణువర్ధనుని మనుమడైన నాల్మడి విష్ణువర్ధనుని కుమారితయగు శీలమహాదేవి ధ్రువనిరుపమదేవుని మహాదేవి యని తెలియుచున్నది. ధ్రువనిరుపముడు వేములవాడ చాళుక్యాధిపతియగు మొదటి యరికేసరిని నాల్గవ విష్ణువర్ధనుని పాలనయందుండిన వెంగిత్రిగలింగములపై దండుతో బంపుటచేతను, నా యరికేసరి యా రెండు జనపదములను జయించుటచేతను, నాల్మడి విష్ణువర్ధనుడు దన కూతురగు శీలమహాదేవిని ధ్రువనిరుపమున కిచ్చి వివాహము గావించి సంధి చేసికొనెనని తోచుచున్నది.

1. ఎపి. ఇండి. సం. ౨౨ పుటలు. ౯౮-౧౦౫ శాసనగ్రంథపంక్తులు ౩౬-౩౯.

## ౬. బద్దెగ : సోలదగండడు

మొదటి యరికేసరి యెంతవఱకు రాజ్యపరిపాలన మొనర్చెనో తెలియదు. ఇతని తరువాత నతని పెద్దకుమారుడగు మొదటి నరసింహదేవుడును, దరువాత నితని పుత్రుడగు రెండవ యుద్ధమల్లుడును రాజ్యము జేసిరి. వీరిని గుఱించి యేమియు దెలియదు; శాసనములందు గాని, విక్రమార్జునవిజయమునందుగాని వీరి విషయము, విశేషములు గానరాక పోవుటవల్ల వీరుసామాన్యు లని యెంచవలసియున్నది.

రెండవ యుద్ధమల్లుని యనంతర మతని కుమారుడు బద్దెగడు రాజ్యాభిషిక్తు డాయెను. ఇతనికి సోలదగండ డను బిరుదు గలదు. నలువది రెండు సంగ్రామములలో నితడు విజయ మందెనట. ఇతనిచే బరాజితులైన శత్రువులలో ముఖ్యుడు భీముడు. ఇతడు శత్రుదుర్జయుడు; 'మొసళెయం పిడివంతిరె సీరొళొత్తి భీమన నతిగర్వదిం పిడిదె' అని పంపడును, 'భీమం భీమపరాక్రమైకనిలయం తం హేలయైవాగ్రహీ దుగ్రంగ్రాహ మివాన్తరంబుసమరే దోర్విక్రమా ద్బద్దెగః' అని పర్భణిశాసనగ్రంథకర్తయు బ్రశంసించియుండుట వలన బద్దెగ డతనిని కష్టపడి సాధించె నని చెప్పవలసియున్నది.

ఈ భీము డెవ్వడో గుర్తింపవలసియున్నది. మొదట బద్దెగడు వెలసిన కాలము నిశ్చయముగ దెలిసినగాని భీముని యానవాలు పట్టుటకు సాధ్యము గాదు. బద్దెగని శాసనములు లేవు. అతని కాలమును కచ్చితముగ దెలియజేయు నాధారములును గానరావు. కాని యతని పూర్వీకులయొక్కయు, సంతతివారియొక్కయు వృత్తాంతముల మూలమున నితడు మనిన కాల మిదియని యూహించుట కవకాశము గలదు. ఇతని ముత్తాతయగు మొదటి యరికేసరి నిరుపమ దేవ ధ్రువునికి సమకాలికుడని పూర్వప్రకరణమున వ్రాసియున్నాడను. మఱియు ధ్రువుడు క్రీ. శ. ౭౮౦ మొదలు ౭౯౨ వఱకును పృథ్వీపరిపాలన

మొనర్చియుండుటచేతను, మొదటి యరికేసరి సోదరుడైన వీరగృహుడు పై ధ్రువుని కుమారుడగు ముమ్మడి గోవింద చక్రవర్తి కనుగుచెలికాడగుటచేతను[1] మొదటి యరికేసరి క్రీస్తు శకము ఎనిమిదవ శతాబ్దముయొక్క చతుర్థపాదమునందు, అనగా క్రీ. శ. ౭౭౫-౮౦౦ ల మధ్యకాలమున, వర్ధిల్లె నని నిశ్చయింప వచ్చును. బద్దెగ డరికేసరికి నాలవతరము వాడగుటచేత చరిత్ర పరిశోధకుల యంగీకారమును బొందిన పద్ధతిబడి తరమునకు ౨౫ సంవత్సరముల చొప్పున పరిగణించిచూచిన నతడు క్రీ. శ. ౮౫౦ మొదలు ౮౭౫ పర్యంతమును రాజ్యము చేసియుండు నని చెప్పవలసి యున్నది. మఱియొక విధమున లెక్కవేసి చూచినను పై యూహాయే సరియైన దని తేలుచున్నది. బద్దెగని మునిమనుమడు ఇమ్మడియరికేసరి. ఇతడు క్రీ. శ. ౯౩౦-౯౩౬ ల మధ్య రాజ్యము పాలించిన నాల్గవ గోవిందరాజునకు సమకాలికుడు. ఇమ్మడి యరికేసరితండ్రియు, బద్దెగని మనుమడును నైన ఇమ్మడి నరసింహుడు క్రీ. శ. ౯౧౪ నుండి ౯౩౦ వఱకును రాష్ట్రకూట సామ్రాజ్యమును పాలించిన ముమ్మడి ఇంద్రవల్లభుని సామంతుడు. కావున నత డించుమించు క్రీ. శ. ౯౦౫ మొదలు ౯౩౦ వఱకును ప్రభుత్వము సల్పె ననుట యొప్పును. ఇమ్మడి నరసింహుని తండ్రియు, బద్దెగని పుత్రుడును నగు నిమ్మడి యుద్ధమల్లుడు క్రీ. శ. ౮౮౦-౯౦౫ ల మధ్య నుండె నని చెప్పవలసి యున్నది. ఈ లెక్కప్రకారము చూచినను బద్దెగని కాలము క్రీ. శ. ౮౫౫-౮౮౦ అగుచున్నది. పై రెండు పరిగణనలప్రకారము బద్దెగని కాలము క్రీ. శ. ౯వ శతాబ్ద తృతీయపాద మని తేలుచున్నను నతడు కొంచె మించుమించుగ నీ శతాబ్దాంతమువఱకును

---

1. కీ. శే. రావుబహదూరు సి. ఆర్. కె. చార్లుగారి తెలింగాణశాసనములు. రాష్ట్రకూటగోవిందుని శాసనము. (అముద్రితము)

జీవించియుండె నని తలచుట కవకాశము గలదు. క్రీ. శ. ౮౪౮ నుండి ౮౯౨ దాక వేంగిని పాలించిన పూర్వచాళుక్యగుణగ విజయాదిత్యు డొక బద్దెగని కభయ మిచ్చి రక్షించెనని పూర్వచాళుక్య శాసనములవలన దెలియవచ్చుచున్నది.

"అబ్ధా త్సంగ్రామరంగే నిజలసదసినా మంగిరాజో త్తమాంగం
తుంగాద్రేః శృంగ ముర్వ్యా మశనిరివ ముదా పాతయత్కన్నరాజ్యమ్,
నిశ్శంకం సంకిలేన ప్రథితజనపదా ద్దుర్గమా న్నిర్గమయ్య
ద్రాగ్భావం యః ప్రవేశ్యః ప్రభు రభయమనాః ప్రత్యప ద్బద్దెగాఖ్యమ్."[1]

ఈ శ్లోకమునందు పేర్కొనబడిన బద్దెగడు సోలదగండబద్దెగడే యని గవర్నమెంటు శాసనపరిశోధక శాఖవారు తీర్మానించియున్నారు[2]. ఈ వ్యక్తినిర్ణయము సరియైనదే యని చరిత్రపరిశోధకు లంగీకరించియున్నారు. పై జెప్పినరీతిని గుణగవిజయాదిత్యునిచే సోలదగండ డభయప్రదానమును బడసియుండినచో నతడు క్రీ. శ. ౮౮౦ తరువాతగూడ కొంతకాలము జీవించియుండె నని చెప్పవలసియున్నది; ఏలనగా, పై నుదాహరింపబడిన శ్లోకము గుణగునిచే బద్దెగడు పరాజయము నందినది గుణగుని రాజ్యకాలము నందలి చరమదశయందని సూచించుచున్నది. అందు మంగి మొదలగు వారిపై విజయములు పూర్వాపరములను దప్పనీయక కాలక్రమము ననుసరించి వర్ణింపబడినవి. మొదట గుణగుడు మంగి నోడించెను; పిమ్మట కన్నరసంకిలులను; తరువాత బద్దెగని. వీరిలో మంగి నోలంబాధిపతి; కన్నరుడు రాష్ట్రకూటచక్రవర్తి; కృష్ణవల్లభు డనునది ఇతని సరియైన పేరు. రాష్ట్రకూటచక్రవర్తులం దీ పేరింటి వారిలో నితడు రెండవవా డగుటచే నితనిని జరిత్రకారు లిమ్మడి కృష్ణవల్లభు డందురు. సంకిలి హైహయవంశజు డగు చేదిరాజు;

1. Cp. no. 26 of 1937-38, JAHRS. XI. P. 80 F.
2. ARE 1918, part 11, para 5.

ఇమ్మడి కృష్ణవల్లభుని బావమఱది; పూర్వచాళుక్యులతోడి పోరాట మున ఇమ్మడి కృష్ణవల్లభునకు గుడిభుజము. బద్దెగడు రాష్ట్రకూట చక్రవర్తుల కాశ్రితుడగు సామంతుడగుటచే నతని యోటమియు గన్నర గుణగవిజయాదిత్యుల యుద్ధసందర్భముననే గలిగె నని తల చుట యొప్పు. ఇమ్మడి కృష్ణవల్లభుడు తన తండ్రియగు ప్రథమా మోఘవర్ష చక్రవర్తి మరణానంతరము క్రీ. శ. ౮౮౦ లో గద్దె నెక్కెను. తత్పూర్వ మతనికి గణగవిజయాదిత్యునితో ఘర్షణ గలిగె నని తలచుటకు దగిన సాక్ష్య మెద్దియు లేదు. గుణగవిజయాదిత్యుడు క్రీ. శ. ౮౯౨ లో మృతినందియుండుటచేత కన్నరసంకిలిబద్దెగులపై నతని విజయములు తత్పూర్వమే సంప్రాప్తములై యుండవలయును. అనగా పై విజయములు క్రీ. శ. ౮౮౦ - ౮౯౨ ల మధ్య గలిగినవని తేలుచున్నది. కావున బద్దెగడు ౮౮౦ - ౮౯౨ ల మధ్య తన మండ లము నేలుచుండెనని చెప్పవలసియున్నది.

అప్పటి రాజులలో భీమనామధేయు డొక్కడే కానవచ్చు చున్నాడు. అతడు వేంగిరాజ్యాధిపతియైన ప్రథమచాళుక్యభీముడు. ఇతడు క్రీ. శ. ౮౯౨ లో దన పెదతండ్రియైన గణగవిజయాదిత్యు డస్తంగతుడైన పిమ్మట వేంగిసింహాసనము నధిష్ఠించెను. ఇతడు బద్దెగనిచే బట్టువడియుండిన నది యతడు రాజ్యాధిపత్యమును వహించిన తరువాత నై యుండవలయును. ఈ యూహ సమంజస మేని బద్దెగడు క్రీ. శ. ౮౯౨ వ సంవత్సరమునకు తరువాతకూడ కొంతకాలము జీవించియుండె నని యొప్పుకొనకతప్పదు.

బద్దెగనికి ప్రథమచాళుక్యభీమునితో గలహము పొసగుటకు ముఖ్యకారణములు రెండు కానవచ్చుచున్నవి. అతడు రాష్ట్ర కూటుల కాశ్రితుడైన మాండలికప్రభువని పైన నుడివియున్నాడను. రాష్ట్రకూటులకును, పూర్వచాళుక్యులకును తరతరములనుండియు

పెరిగి వచ్చుచుండిన పగవలన గలుగుచుండిన యుద్ధములలో బద్దె గనికోవవారు రెండు రాజ్యముల నడిమి గడిభూముల కధిపతులై యుండిన కారణమువలన రాష్ట్రకూటచక్రవర్తుల పక్షమున పూర్వ చాళుక్యులతో దఱచుగ పోట్లాడవలసి వచ్చెను.

రాష్ట్రకూట ఇమ్మడి కృష్ణవల్లభుడు దన పూర్వుల పద్ధతి ననుసరించి పూర్వచాళుక్యరాజ్యముపై దండయాత్రలు సలుప నారం భించెను. కాని ఇతనికి విజయ మెప్పుడును జేకూర లేదు. మొదట గుణగవిజయాదిత్యునిచే సంపూర్ణపరాభవము నందెను. ఈ సంద ర్భముననే బద్దెగడు పరాజయ మందినదికూడ. గుణగుని మరణా నంతరము దన యభీష్టము నెఱవేర్చుకొననెంచి కృష్ణవల్లభుడు మరల వేంగిపై దండయాత్రల నారంభించెను. ఏలిన ప్రభువువెంట తన సేనతోగూడ బ ్గడును నడువవలసినవాడాయెను. మఱియు బూర్వ చాళుక్యుల దన తొంటి పగను దీర్చుకొనవలయు నను కోర్కె యొకటి యతని బురికొల్పియుండవచ్చును.

బద్దెగడు ప్రథమచాళుక్యభీము నెప్పు డెచ్చట బట్టుకొనెనో నిశ్చయముగ జెప్పుటకు వీలు లేదు. కాని, లభించిన శాసనాదిసాక్ష్య మునుబట్టి వీని నూహించి కనుగొనుటకు గొంత యవకాశము గలదు. "ముసళెయం పిడివంతరె నీరొళొత్తి భీమన నతిగర్వదిం పిడియె" "భీమం భీమపరాక్రమైక నిలయం తం హేలయై వాగ్రహీ దుగ్రం గ్రాహ మివాంతరంబుసమరే" యను విక్రమార్జునవిజయ పర్భణీశాసనవాక్యములు భీముడు బద్దెగనిచే బట్టుపడినది యొక జల యుద్ధమున నని సూచించుచున్నవి. జలయుద్ధ మనగా నీటిమీద చేయు యుద్ధము. ఇట్టియుద్ధము సముద్రముమీద నావికాదళముల మూలమున జరుగుట సామాన్యము. కాని రాష్ట్రకూటరాజులకు గాని, పూర్వచాళుక్యప్రభువులకుగాని నావికాదళము లుండినట్లుకాని,

వారు తన్కాలమున సముద్రముపై యుద్ధ మెప్పుడైన చేసినట్లు కాని తెలుపు సాక్ష్యము గానరాదు. నావలపై నిలిచి నదులమీద చేయు యుద్ధమును, జలమయప్రదేశాంతర్గతదుర్గములపై జేయు యుద్ధమును జలయుద్ధ మనబడును. బద్దెగడు భీముని బట్టుకొనిన దిటువంటి యుద్ధమునసే నై యుండవలయును. ఇమ్మడి కృష్ణవల్లభ ప్రథమ చాళుక్యభీముల మధ్య నడచిన యుద్ధములలో బై జెప్పినట్టి నీటి పోరాట మెచటనేని జరిగియుండుట కవకాశము గలదేమో చూతము.

మనకు నేటివఱ కుపలబ్ధమైన శాసనసామగ్రిని బట్టి చూడగా నిమ్మడికృష్ణవల్లభుడు ప్రథమచాళుక్య భీముని రాజ్యకాలమున వేంగిపై రెండు పర్యాయములు దండెత్తి వచ్చిన ట్లున్నది. మొదటి దండియాత్ర ముదిగొండచాళుక్యప్రభునగు కుసుమాయుధుని యను చరుడగు నల్లమెఱెయకొడుకు వ్రాయించిన కొఱవిశిలాశాసనమున వర్ణింపబడియున్నది.

"శ్రీవిక్రమాదిత్యనృపాగ్రతనయుణ్డయ్యి చాలుక్యభీమునకు శౌచకన్దర్పునకు వేంగీశ్వరునకు రనమర్ద్దాన్వయకులతిలకుణ్డయ్యి కుసుమాయుధుణ్డు గన్నరబల్లహుని కస్త్రప్రాప్తంబయ్యి రనమర్ద కసీ(?)మ దన భుజబలపరాక్రమంబున న్దెచ్చి కణ్ఠియం గట్టి పట్టంబు గట్టి ఖఙ్గసహాయుండై నేల యెల్లం గావంబూని మంచికొణ్డనాణ్డాదిగ వేంగిదేసము విష్ణువర్ధనుతో నర్ధరాజ్యంబు సేయుచున్న కుసుమాయుధు...[1]".

---

1. తెలిం. శాస. ఇతర. నెం. ౧౨. కీ. శే. రావుబహదూరు సి. ఆర్. కె. చార్లుగారు ప్రతిబింబానుసారము సవరించిన శాసనగ్రంథమునుండి సంగ్రహింపబడినది.

ఈదండయాత్ర ప్రథమచాళుక్యభీముని పట్టబంధమునకు ముందు నడచినది. గుణగవిజయాదిత్యుడు కాలగతి నందె నను వార్త చెవి సోకినంతటనె కృష్ణవల్లభుడు వేంగిపై నెత్తివచ్చిన ట్లున్నది. "కన్నర బల్లహుని కస్త్రప్రాప్తంబయ్యె రణమర్దకసీమ"యని యుండుటచే వేంగిరాజ్యమందలి యితరభాగము లతనికి స్వాధీనపడనట్లు తోచుచున్నది. రణమర్దకసీమ కృష్ణాజిల్లాలోని కొండపల్లినుండి హైదరాబాదురాజ్యములోని వరంగలుమండలాంతర్గతమైన కొలనుపర్యంతము వ్యాపించియుండినది. మంచికొండనాడు దీనికి జెందినదే. ఈ రణమర్దకసీమయందు నావికాయుద్ధమును సేయుటకనుకూలమైన నదులుగాని, జలదుర్గములుగాని లేవు. కావున బద్దెగడు ప్రథమచాళుక్య భీముని బట్టుకొనిన 'యంబుసమర' మీదండయాత్రయందు నడచెనని చెప్పుటకు వలనుపడదు.

రెండవ దండయాత్ర —మఱియొక పర్యాయము కృష్ణవల్లభుడు వేంగిపై నెత్తివచ్చినట్లు ప్రథమచాళుక్యభీముని మసులిపట్టణ తామ్రపట్టికలవలన దెలియవచ్చుచున్నది.[1] రాష్ట్రకూటసైన్యములేకాక కర్ణాటలాటాది మిత్రబలముగూడ వేంగిని ధ్వంసము సేయ వచ్చినవి. వీని కధిపతి గుండ దండనాయకుడు. శత్రువులు రాజ్యమునుజొచ్చి వేంగీపురప్రాంతమునకు వచ్చిరి. ఈ దండయాత్ర యందు చాళుక్యభీముడును, నతని పుత్రుడైన ఇఱమర్తిగండడును శత్రులను మార్కొని హోరాహోరిగ బోరిరి.

> "యస్యైష్వాసప్రముక్తై రిషుభి రభిహత ప్రష్ఠపృష్ఠవ్యధావన్
> కర్ణాటా దుర్ధరాటా రుటితపటునటద్ఘోటకా లాటకాశ్చ."

అని చాళుక్యభీముడు తన ప్రతాపాతిశయము నుగ్గడించుకొనినను, రాష్ట్రకూటు లంత సులభముగ విడిచిపోలేదు. రాష్ట్ర

4. Cp 1 of 1913-14.

సంరక్షణభారమంతయు నిజమర్తిగండని భుజములపై బడినది. ఓడి పోయినను రాష్ట్రకూటబలములు తరతరముగ మార్కొనగడగినవి. సందడికయ్యములు పెక్కు నడచినవి. చూడుడు, మచిలీపట్టణతామ్ర శాసన మెట్టిపోరాటమును వర్ణించుచున్నదో.

"మమ ప్రియాత్మజో షోడశవార్షికః, యస్తు

*　　　　　　　　*

నిరవద్యపురరణే కరితురగధను ర్ధరోగ్రవల్లభదణ్డమ్
ఆరుహ్య గజపతి మ్మృగపతిరివహరిణా న్వికీర్య్య విహసన్నఘసత్॥
పెరువంగూర్గ్రామరణే వల్లభదణ్డేన గుణ్డెయాఖ్యం హత్వా
నిర్ఘాట్యచ దాయాదా నవని మశేషాన్నిరాకులా మ్మహ్య మదాత్॥
దత్వాఽర్థిభ్యో ధనం కామ మ్మహ్యంధాత్రీం భయం ద్విషామ్,
నిక్షిప్య దిక్షు సత్కీర్తి న్నాకలోక మగా దసౌ॥
కటాక్షేణాపి నాపశ్య ద్దేవ్య శ్చ పరయోషితః
ఆసు బీభత్సయా నూనం రిరంసు రమరాంగనాః॥

తస్య దీనానాథబన్ధో ర్బన్ధువత్సలస్య ఇజీమర్తిగణ్డాపరనామ్న శ్శుభధామ్నః పారలౌకికం కార్యం కృత్వా..."

పై నుదాహృతశాసనశ్లోకములందు నిరవద్యపుర పెరువంగూరు గ్రామము లనురణక్షేత్రములు రెండు పేర్కొనబడియున్నవి. ఇందు మొదటిదానియందు కరితురగధనుర్ధరసహితమైన వల్లభదళములను మృగరాజు హరిణసమూహమును బోలి చెల్లాచెదరు గావించెనట. రెండవదానియందు లాటులను దాయాదులను వల్లభదండముతో గూడ ధ్వంసముగావించి, వల్లభ దండాధీశుడైన గుండెనను వధించి, నిరాకులమైన రాజ్యమును దన తండ్రి కిచ్చెను; కాని యతడా యుద్ధముననే నిహతుడై వీరస్వర్గము నలంకరించెనట. ఇచట మొదట గమనింపదగిన దీ యుద్ధములు జరిగిన దేశము. నిరవద్యపురము ఇప్పటి నిడదవోలునకు బ్రాచీననామము. ఇది యిప్పటి పశ్చిమ

గోదావరిమండలమునందలి యేలూరునకు బూర్వోత్తరదిగ్భాగమున రమారమి యేబదిమైళ్ళ దూరమున మద్రాసు కలకత్తా యినుప దారిపైనున్నది. పెరువంగూరెచట నుండెనో చెప్పుటకు వీలులేదు. అదియు బశ్చిమగోదావరీమండలాంతర్గతగ్రామమే. రెండు రణ క్షేత్రములును కృష్ణాగోదావరీ నదుల డెల్టాల మధ్యప్రదేశమునం, దనగా వేంగీరాష్ట్రగర్భమున నున్నవి. రాష్ట్రకూటసైన్యములు వేంగి గడిప్రదేశములను దాటి రాష్ట్రమధ్యమునకు జొచ్చుకొని వచ్చినవి.

ఈ దండయాత్రయం దెచ్చటనైన 'అంబుసమరము' జరుగుట కవకాశ ముండెనేమో చూతము. పూర్వచాళుక్యుల ప్రధాననగ రము వేంగి. అది యిప్పటి యేలూరున కేడెనిమిదిమైళ్ళ దూరమున నుండెను. యుద్ధదృష్టి జూచిన నిది యంతటి బలిష్ఠమైన స్థలము గాదు; కాని దండయాత్రాదిఆపత్సమయములయందు వేంగి నేలు రాజులు దమ రాజధానిని వదలి సమీపముననుండు కొల్లేరుసరస్సు మధ్యనుండు జలదుర్గమున తలదాచుకొనెడివారు. కొల్లేటిదుర్గమును సాధింపజాలని శత్రువు వేంగిరాజ్యమును లొంగదీయ సమర్థుడుకాడు; ఈ కారణమువలననే సముద్రగుప్తపుల కేశ్యాదిరాజులకు పూర్వకాల మందు కొల్లేటియం దంబుసమర మవశ్యము కర్తవ్యమాయెను. అట్లే యిమ్మడి కృష్ణవల్లభుని దండయాత్రయందును నడచియుండును. వేంగికి సమీపమునకు ప్రబలమైన రాష్ట్రకూటసైన్య మెత్తివచ్చి నప్పుడు ప్రథమచాళుక్యభీము డాత్మరక్షణకు గొల్లేటిదుర్గమునకు బోవుట సహజము. ఈ దుర్గమునుముట్టడించి స్వాధీనపరచుకొనుట కిమ్మడి కృష్ణభూపాలుడు ప్రయత్నము సల్పుటయు సహజమే. కావున బద్దెగడు మొసలిని నీటియందు పట్టిన ట్లంబుసంగరమున బట్టిన దీ దండయాత్రాసందర్భమున కొల్లేటికోటయందై యుండ వలయును.

## ౭ - ఇమ్మడి నరసింహుడు

సోలదగండబద్దెగని యనంతర మతని కుమారు డిమ్మడియుద్ధ మల్లుడు ప్రభుత్వమునకు వచ్చెను. ఇత డంతటివిఖ్యాతుడు గాడు. ఇతని చరిత్రనుగూర్చి చెప్పదగిన విశేషాంశము లెవ్వియు లేవు.

ఇమ్మడియుద్ధమలుని పిమ్మట నతనిపుత్రు డిమ్మడి నరసింహుడు మండలాధిపత్యమును వహించెను. ఇతడు సుప్రసిద్ధవీరుడు. ఇతని పరాక్రమకృత్యములు పెక్కు విక్రమార్జునవిజయమందును, వేములవాడ శిలాశాసనమునను వర్ణింపబడియున్నవి. ఈ రెండు ఆధారగ్రంథముల యందును జెప్పియుండు నంశములను గ్రోడీకరించి చూచిన నితని ముఖ్యకార్యముల నత్యంతసంగ్రహముగ నిట్లు పేర్కొనవచ్చును; (౧) లాటులనుజయించెను; (౨) సప్తమాళవములను దగ్ధముగావించి వాని ప్రభువుల నోడించి వారియొద్ద కప్పము గొనెను; (౩) గూర్జర పతియగు మహీపాలు నోడించి తఱుమగొట్టి గూర్జరరాజ్యమును జయించెను; (౪) గంగాతీరమున గూర్జరరాజు నోడించి తన గుఱ్ఱములను గంగాజలముల దానమాడించి కాళప్రియమున దన యసిలతను కడిగి, శిలాశాసనముతోడి విజయస్తంభమును స్థాపించెను.

విక్రమార్జున విజయమునందును, లేములవాడశాసనమందును ఇమ్మడి నరసింహుడు పేర్కొనిన శత్రులతోడ నేకాకియై పోరి జయమును బొంది వారికడ కప్పము గొనినట్లు కలదు. ఇది యంతయు సత్యముగాదు. ఇమ్మడి నరసింహుడు స్వతంత్రుడైన రాజు కాడు. రాష్ట్రకూటచక్రవర్తి కాశ్రితుడైన మాండలిక ప్రభువు. సుప్రసిద్ధ కర్ణాటచరిత్రపరిశోధకులగు శ్రీ యమ్. గోవింద పాయిగారు విక్రమార్జునవిజయము ప్ర. ఆ. లోని యిమ్మడి యరికేసరి ప్రశంస యందలి-

"యింద్రాంభోధిపరీతమహీంద్రరదా రిన్న రీనరేంద్రం సాక్షా
దింద్రం తాననె సలెనెగ ళ్దింద్రేంద్రన తోళె తొట్టిలాగిరె బళెదం"[1]

అను కందపద్యము నాధారముజేసికొని యిమ్మడి యరికేసరి రాష్ట్రకూటచక్రవర్తి ముమ్మడి యింద్రవల్లభునికి మేనల్లు డని వ్రాసి యున్నారు. ఈ యభిప్రాయమును దృఢపఱచుటకు దగిన యాధార మింకను లభ్యపడలేదు. కాని యది కేవల మసంగత మని త్రోసి పుచ్చుటకు వీలులేదు. ఏలనగా, 'నింద్రేంద్రనతోళె తొట్టిలాగిరె బళెదం' అను వాక్యమువలన నింద్రు డరికేసరి నెత్తి పెంచినా డని తెల్లమగుచున్నది. మఱియు–

"దేవీం రేవకనిర్మడిక్షితిపతే రింద్రస్య పుత్రీ న్నుతాం
పౌలోమీ మివ వాసవశ్రియ మివ శ్రీమన్మరధ్వంసకః
స్త్రీరత్నం పరిణీయ యేన నితరం తస్యా స్సపత్నీకృతా
నూనాం సప్తసముద్రముద్రితమహీ మ్మానోన్నతే నాధునా".[2]

అను లేములవాడశాసనశ్లోకమువలన నింద్రవల్లభు డితనికి దన కుమారి తెయగు రేవకనిర్మడిదేవి నిచ్చి వివాహముగావించె నని తెలియుచున్నది. మఱియు పర్భణి తామ్రశాసనమందలి—

"రాష్ట్రకూటకులే ఖ్యాతే జాతా లోకాంబికా సతీ
వీరశ్రీ రివ వీరస్య తస్యాసీత్సుదతీ ప్రియా."[3]

అను శ్లోకము ఇతనికి రాష్ట్రకూటుల యాడపడుచు లోకాంబిక యను మఱియొక భార్య యుండెనని తెల్పుచున్నది. పై శాసన శ్లోకములు గోవిందపాయిగారి యభిప్రాయమునకు దోహదమిచ్చు

---

1. విక్ర. ఆ. ౧: ౪౪.
2. తెలంగాణాశాసనములు : ఇతర.
3. జైన్ సాహిత్యఔర్ ఇతిహాస్.

చున్నవి. ఇది సత్యమేని యిమ్మడియరికేసరితల్లియు, నిమ్మడి నరసింహుని భార్యయు నగు జాకవ్వ రాష్ట్రకూటచక్రవర్తి యిమ్మడి యింద్రవల్లభుని సోదరి యగుచున్నది.

మఱియు నిమ్మడి నరసింహుని యుద్ధములన్నియు నతడు దన బావమఱదియు, ప్రభువును నైన ముమ్మడియింద్రవల్లభుని పక్షమున నతని శత్రులతో జేసినవే కాని స్వతంత్రముగ దనకొఱకు జేసినవి కావు. ఇమ్మడినరసింహకృతములని పై జెప్పబడిన సాహసకార్యముల బెక్కింటిని ముమ్మడి యింద్రరాజు చేసినట్లు నాల్గవ గోవిందరాజు క్యాంబేపట్టికలందు చెప్పియున్నది.

"యన్మాద్యద్ద్విపదన్తఘాతవిషమం కాలప్రియప్రాఙ్గణమ్
తీర్ణా యత్తురగైరగాధయమునా సిన్ధుప్రతిస్పర్ధినీ,
యేనేదంహి మహోదయారినగరం నిర్మూల మున్మీలితం
నామ్నాఽద్యాపి జనైః కుశస్థలమితి ఖ్యాతిం పరాం నీయతే"[1]

ఇందువలన ముమ్మడి ఇంద్రవల్లభుని మహోదయవిధ్వంసమును, నిమ్మడినరసింహుని గూర్జరాది విజయములును నొక్క దండయాత్రకు సంబంధించినవే యని తెలియుచున్నది.[2] ఈ దండయాత్రయందలి యంశముల నింతవఱ కెవ్వరును విపులముగ జర్చించి

---

1. ఎం. ఇండి. సం. ౭, నెం. ౬, శ్లో. ౧౯.

2. క్యాంబేపట్టిక ననుసరించి ముమ్మడియింద్రవల్లభుడు —

౧. కాలప్రియప్రాఙ్గణమును దన యుద్ధపు టేనుగుల దంతఘాతములతో విషమము గావించెను.

౨. యమునను దాటెను.

3. శత్రునగరమైన మహోదయమును ధ్వంసము జేసెను.

విక్రమార్జునవిజయప్రకారము యిమ్మడినరసింహుడు

౧. లాటులను జయించెను.

యుండ లేదు. ఈ కారణమువలన విషయము నిచట ఇంచుక విస్త రించి వ్రాయుట యుచిత మని తోచుచున్నది.

౨. ఏడు మాళవములను జయించి మాళవరాజులకడ కప్పము గొనెను.

3. గూర్జర రాజు నోడించి యతని యేనుగుల బట్టుకొనెను. గూర్జరరాజు మహీపాలుఁడు పాఱిపోయెను.

౪. గంగాజలముల దన తురంగమముల దానమాడించెను. కాళప్రియమున దన యసిలతను స్థాపించెను.

వేములవాడశిలాశాసనముబడి యిమ్మడినరసింహుఁడు—

౧. ఏడు మాళవములను జయించి యచటిరాజులచే గప్పము గొనెను.

౨. ఎదురు వచ్చిన గూర్జరరాజసేనను నిర్జించి కాళప్రియమునందు దన శౌర్యమును బ్రకటించు శిలాశాసనమును నిలిపెను.

క్యాంబేపట్టికలకును, విక్రమార్జునవిజయ వేములవాడశిలాసనములకును కాళప్రియకదనము సామాన్యము. క్యాంబేపట్టికలలో నింద్రుడు యమునను దాటిపోయి శత్రునగరమైన మహోదయమును ధ్వంసము జేసిన ట్లున్నది. మహోదయ మేశత్రుని పట్టణమో యందు జెప్పియుండలేదు: కాని యా కాలమున మహోదయము గూర్జర ప్రతీహారులకు రాజధాని యగుటచేత నింద్రుని శత్రువు గూర్జరప్రతీహారరా జని నిశ్చయముగ జెప్పవచ్చును. వేములవాడశాసనమున నిమ్మడి నరసింహుని బ్రతిఘటించుటకు గూర్జరరాజు సైన్యసమేతుడై వచ్చి కాళప్రియముకడ యుద్ధమున పాఱిపోయినట్లు చెప్పియున్నది. ఇతడు మహోదయాధిపతిగాని యన్యుడు గాడు; ఇట్లు నరసింహునిచే యుద్ధమున నోడి పరారియైన గూర్జరరాజు పేరు మహీపాలు డని విక్రమార్జునవిజయమువలన దెలియుచున్నది. కావున క్యాంబేవేములవాడశాసనములందును, విక్రమార్జునవిజయమునందును వర్ణింపబడిన దండయాత్ర యొక్కటియే యని నిశ్చయింపవచ్చును. గూర్జరవిజయమునకు పూర్వము ఇమ్మడి నరసింహుడు సప్త మాళవములను సాధించె నని వేములవాడశాసనమందును, సప్తమాళవములకు పూర్వము లాటదేశమునుగూడ జయించినట్లు విక్రమార్జునవిజయమందును గలదు.

ఈ దండయాత్రకు ప్రధానకారణము రాష్ట్రకూటగూర్జర ప్రతీహారులకు దరతరములుగ బెరిగివచ్చుచుండు వైరమే. గూర్జర ప్రతీహారులు మొదట దక్షిణరాజపుత్రస్థానమునం దుండిరి; క్రీ. శ. 8-వ శతాబ్ద పూర్వార్ధమున ప్రథమనాగభటుని కాలమున వీరు మాళవమును జయించి యచట పాదుకొనిరి. మూలభేదురాష్ట్రకూట సామ్రాజ్యస్థాపకుడగు దంతిదుర్గుడు, దేవరా జనునతడు సహాయము వేడగా మాళవముపై నెత్తిపోయి నాగభటు నోడించి గూర్జరప్రతీ హారులను దన కరిగాపులుగ జేసికొనె నని పూర్వప్రకరణమున వ్రాసియున్నాడను. ఇదియే రాష్ట్రకూట ప్రతీహారరాజుల దీర్ఘ ద్వంద్వయుద్ధమున కంకురార్పణము.

దంతిదుర్గుని మరణానంతరము రాష్ట్రకూటసామ్రాజ్యమున నొక గొప్ప విప్లవము జరిగినది. చాళుక్యులు మరల విజృంభించిరి. వీరి నాయకుడగు రాహప్ప గతించినచాళుక్యులయధికారమును పునరుద్ధరించుటకై తన యావచ్ఛక్తిని వినియోగించి పోరాడదొడ గెను. దంతిదుర్గునికి సంతు లేదు. కావున నతని వెనుక రాజ్యాభి షిక్తుడైన యతని పినతండ్రి మొదటియకాలవర్షకృష్ణవల్లభుడు తన యాధిపత్యమును నిలుపుకొనుటకై యేడెనిమి దేండ్లు రాహప్పతో

---

లాటసప్తమాళవ ప్రస్తావము శ్యాంబేపట్టికలందు గానరాదు. అందుచే వానికి గూర్జరదండయాత్రతో సంబంధము లేదని యెంచగూడదు. అన్నియు గూర్జర దండయాత్రకు సంబంధించినవే. విక్రమార్జునవిజయకర్తయు, వేయులవాడ శ్యాంబేశాసనరచయితలును పై దండయాత్రను వర్ణించినప్పుడు ఎవ్వరికి ముఖ్యము అని తోచిన యంశములను వారూదిచెప్పి తక్కినవానిని విడిచిపెట్టిరి. వీనియందు గాన్పించు భేదముల కిదియే కారణము.

హోరాహోరిగ యుద్ధము సేయవలసివచ్చెను.[1] ఈ యుద్ధమున నీతడు నిమగ్నుడై యుండగా దంతిదుర్గునిచే జయింపబడిన యుత్తర దేశపు రాజులు రాష్ట్రకూటులను నిరాకరించి స్వతంత్రులైరి. కాని యతడు రాష్ట్రకూటుల యధికారము నుత్తరాపథమున నెలకొలుప మరల ప్రయత్నము సేయలేదు.

1. మొదటి యకాలవర్ష కృష్ణవల్లభుని ప్రథమశాసనము బోపఖళుదానశాసనము. దీనినే భారత ఇతిహాససంశోధకమండలిపట్టిక లందురు. ఇది క్రీ. శ. ౭౫౮ అక్టోబరు ౭వ తేది పై గ్రామము దానముసేయబడెనని తెల్పుచున్నది. (భార. ఇతి. సం. పత్రిక, సం. ౮, పుట. ౧౬౫) ఇందు రాహప్పనుగురించిన ప్రస్తావన లేదు. ఇతని రెండవ శాసనము క్రీ. శ. ౭౬౮ నాటి తలెగాఁవ శాసనము. (ఎపి. ఇండి. సం. ౧౩. పుటలు ౨౭౫-౨౮౨.) క్రీ. శ. ౭౫౮-౭౬౮ సంవత్సరములమధ్య ఇతని శాసన మొక్కటియైనను గానరాదు. తలెగాఁవ పట్టికలయందును రాహప్పను గూర్చి యేమియుగానరాదు: కాని యిందు శాసనోక్తదానము మణ్ణనగరమున గంగులపై దండయాత్ర నడపుచు స్కంధావారమునం దియ్యబడిన ట్లుండుటచే (గంగానా ముపరివిజయస్కంధావారే మణ్ణనగరే) అప్పటి కతడు రాహప్పను జయించియుండు నని తోచుచున్నది. వేంగీ విజయానంతర మియ్యబడిన క్రీ. శ. ౭౭౦ నాటి యువరాజ గోవిందుని యలాస్ తామ్రశాసనము (ఎపి. ఇండి., సం. ౬, పుట ౨౧౦) ఈ యభిప్రాయమును దృఢపఱచుచున్నది. రాహప్ప పేరు చెప్పకున్నను క్రీ. శ. ౭౭౨ వ సంవత్సరమునాటి బన్ధక్ పట్టికలందు (ఎపి. ఇండి. సం. ౧౪, పుట ౧౨౧-౩౦)...

"ఉల్లంఘితమర్యాదే కలిజలధౌ వ్యాకులా నిమజ్జన్తీ
యేనోద్ధృతా ధరిత్రీ శ్రీప్రలయమహావరాహేణ"

అనుశ్లోకమున హద్దుమీఱి పొరలివచ్చిన కలిజలధియందు మునిగియుండిన భూమిని శ్రీప్రలయవరాహుడు, అనగా ప్రథమాకాలవర్ష కృష్ణవల్లభు డుద్ధరించినట్లు చెప్పియున్నది. కృష్ణుడు జయించి సామ్రాజ్యమును గొనినది రాహప్పకడనుండి యని క్రీ. శ. ౭౯౫ నాటి ధారావర్షధ్రువుని పింపారిపట్టికలలోని (ఎపి. ఇండి., సం. ౯, పుటలు ౮౧-౮౯)—

ప్రథమాకాలవర్షకృష్ణవల్లభుని యనంతర మతని పుత్రుడు సువర్ణవర్ష ఇమ్మడిగోవిందవల్లభుడు రాజ్యాభిషిక్తు డాయెను. ఇతడు గంగాయమునల మధ్య రాష్ట్రమును పరిపాలించుచుండిన ఇంద్రుడను రాజును నిర్జించినట్లు రామేశ్వరశిలాస్తంభశాసనములోని—

"తస్మా దభూ త్సూను రుదారకీర్తిః ప్రభూతవర్షో భువ మాససాద ;
యత్సేనయాఽహీంద్రమదావమర్దా ద్గఙ్గాపయో యామునవ ద్విభాతి".[1]

అను శ్లోకమువలన దెలియవచ్చుచున్నది. ఇందు పేర్కొనబడిన ఇంద్రుడు కాన్యకుబ్జాధిపతి. ఇంద్రాయుధు డని ఇతని సంపూర్ణ నామధేయము. ఇతడు శకాబ్దము ౭౦౫ (క్రీ. శ. ౭౮౩) ప్రాంతమున కన్యాకుబ్జమును పాలించుచుండినట్లు జినసేనకృత హరివంశమునందు చెప్పియున్నది.[2] ఇమ్మడి గోవిందవల్లభుడు కన్యాకుబ్జముపైనేల దండయాత్ర సాగింపవలసివచ్చెనో తెలియదు. ఒకవేళ రాష్ట్రకూటుల యధికారము నుత్తరాపథమున మరల నెలకొల్పుట కతడు ప్రయత్నము సల్పియుండవచ్చును ; లేక తనతో బ్రతిఘటించి సింహాసనము నాక్రమించుటకు బోరుచుండిన తన తమ్ముడగు ధారావర్షధ్రువునికి ఇంద్రుడు సహాయము సేయగా నింద్రుని రక్షించుటకేనియు గావచ్చును.

ఇమ్మడిగోవిందుని దొలగద్రోసి ధారావర్షధ్రువుడు సింహాసనము నాక్రమించుకొనియెను. ఇతని రాజ్యారంభమున గన్యాకుబ్జ

---

"రాహప్ప మాత్మభుజజాతబలావలేప మాజౌ విజిత్య నిశితాసిలతా ప్రహారైః,
పాలిధ్వజావలిశుభా మచిరేణ యో హి రాజాధిరాజపరమేశ్వరతాం తతాన."

అను శ్లోకమువలన స్పష్టపడుచున్నది. కావున ప్రథమాకాలవర్షుడు క్రీ. శ. ౭౫౮-౬౨ ల మధ్య రాహప్పతోడ ముమ్మరముగ బోరుచుండె నని నిశ్చయముగ జెప్పవచ్చును.

1. SII. IX. i. 68.
2. Pro. Ind. Hist. Congress 1945, 986.

రాజ్యమున నొక విప్లవము జరిగినది. ఇమ్మడి గోవిందుని కాలమున నచట రాజ్య మొనర్చుచుండిన ఇంద్రరాజును బాఱదోలి గూర్జర ప్రతీహార వంశజుడైన ద్వితీయనాగభటుడు కన్యాకుబ్జము నాక్రమించి గంగాయమునాంతర్వేదిని వశపఱచుకొని యుత్తరాపథమున కధిపతి యాయెను. మాళ్ఖేడురాష్ట్రకూటులకును గూర్జరప్రతీహారులకును నంతట ద్వంద్వయుద్ధము ప్రారంభమాయెను. దంతిదుర్గుని కాలమందు వలె నుత్తరాపథమును దమచేతి క్రింద నుంచుకొనవలయు నని రాష్ట్రకూటుల సంకల్పము. దాక్షిణాత్యులను వింధ్యమును దాటి రానీయక వెనుకకు గొట్టవలయునని గూర్జరప్రతీహారుల దృఢనిశ్చయము. ధ్రువయిమ్మడిగోవిందుల కాలమున రాష్ట్రకూటప్రతాపము మహోగ్రముగ ప్రజ్వరిల్లినది. అశేషభారతదేశమును వారి వెలిగొడుగు నీడచే సంఛాదితమగు నను శంక పొడమినది. వారికి మాఱొడ్డి నిలిచిన రాజు లేడు; పరాజయము నందని సేన లేదు. గూర్జరప్రతీహార రాజులు దమ రాజ్యమును జాఱవిడిచి మరుదేశమున తల దాచుకొనిరి. కాని మొదటి యమోఘవర్షచక్రవర్తికాలమున పరిస్థితులు మారిపోయినవి. రాష్ట్రకూటుల శౌర్యము సన్నగిలజొచ్చినది. ఉత్తరాపథముపై వారికి దృష్టి త్రిప్పుట కవకాశము లేకపోయెను. గూర్జరప్రతీహారులు విజృంభించిరి. అమోఘవర్షు డస్తంగతుడుగాక పూర్వమే మిహిరభోజుడు మాళవము నాక్రమించుకొనెను; లాటదేశముపై నెత్తివచ్చి ఖేటకపురమును నశపఱచుకొనెను. కాని తండ్రి యనంతరము మాన్యఖేటసింహాసనము నధిష్ఠించిన ఇమ్మడి కృష్ణవల్లభుడు దళములను గూర్చుకొనిపోయి మిహిరభోజుని దఱుమగొట్టుటయే కాక గంగానదీపర్యంతరముగల శత్రురాష్ట్రమును ద్రొక్కివచ్చెను. అటుతరువాత నల్పకాలములో మిహిరభోజుడు దివంగతుడు కాగా నతని కుమారుడు మహేంద్రపాలుడు రాజ్యాభిషిక్తుడాయెను. ఇతడు తండ్రియంతటి పరాక్రమశాలి గాడు; రాష్ట్ర

కూటులతో దన పూర్వులవలె నితడు పోరాడిన ట్లగపడదు. క్రీ. శ. ౯౦౦ వ సంవత్సరమువఱ కితడు ప్రజాపాలన మొనర్చిన ట్లున్నది. ఇతడు కాలధర్మము నందినపిమ్మట నితని జ్యేష్ఠపుత్రుడగు ద్వితీయ భోజుడు రాజ్యాధిపత్యమును వహించి నాలుగేండ్లకాలము పుడమి నేలెను; కాని యితని యభ్యుదయమును సహింపక నితని యనుజుడు మహీపాలు డితని తొలగద్రోసి క్రీ. శ. ౯౧౪ లో సింహాసనము నాక్రమించుకొనియెను.

మహీపాలుడు శౌర్యవంతుడు. రాష్ట్రకూటులపై గసి తీర్చుకొన నిచ్ఛయు, రాజ్యమును బెంపొందించు కోరికయు నతనిని యుద్ధమునకు బురికొల్పినవి. రాజశేఖరకవియొక్క బాలభారతము లేక ప్రచండపాండవ మను నాటకప్రస్తావనయం దతని విజయము లిట్లు వర్ణింపబడియున్నవి:

"నమితమురలమౌళిః పాకలో మేఖలానామ్
రణకలితకలిఙ్గః కేలితట్కేరలేన్దోః,
అజనిజితకులూతః కున్తలానాం కుఠారః
హఠహృతరమఠశ్రీః శ్రీమహీపాలదేవః".

అనగా మహీపాలదేవుడు మురళులను, మేఖలులను, కళింగులను, కేరళులను, కులూతులను, కున్తలులను, రమఠులను జయించెనని యందలి భావము. ఇందు బేర్కొనబడిన జనపదములందు మురళులు, కేరళులు, కున్తలులును దాక్షిణాత్యులు—కున్తలదేశము రాష్ట్రకూటసామ్రాజ్యమునకు హృదయమువంటిది. బళ్లారి, రాయచూరు, ధార్వాడ, బిజాపుర ఉత్తర కన్నడమండలములు ప్రాచీన కున్తలదేశమునకు జెందినవి. మహీపాలదేవుడు కున్తలులకు కుఠారమువంటివాడు; అనగా రాష్ట్రకూటుల కతడు గర్భశత్రు వనియు, వారి నతడు జయించె ననియు మన మర్థముజేసికొనవలసియున్నది.

మఱియు మహీపాలదేవునిగూర్చి శ్లోకముపై వ్యాఖ్యానమునం దిట్లు వ్రాసియున్నది :

యస్యేమాం పురావిదః ప్రశస్తిగాథా ముదాహరన్తి ;

'యః సంశ్రిత్య ప్రకృతిగహనా మార్యచాణక్యనీతిం
జిత్వా నన్దా న్కుసుమనగరం చన్ద్రగుప్తో జిగాయ;
కర్ణాటత్వం ధ్రువ ముపగతా నద్య తా నేవ హన్తుం
దోర్దర్పాఢ్యః స పున రభవ చ్ఛ్రీమహీపాలదేవః,

ఇతి చణ్డకౌశికే ఆర్యక్షేమీశ్వరః, స ఏవా య మపి మహీపాలదేవ ఇతి తు న నిశ్చయః

ఈ రెండవ శ్లోకముపై వ్యాఖ్యయు గమనింపదగినది :

"గాథా మాహ—య ఇతి : యః చన్ద్రగుప్తః తదాఖ్యః మౌర్యభూపతిః, ప్రకృత్యా స్వభావేన గహనాం దుష్ప్రవేశాం దుర్బోధా మిత్యర్థః, ఆర్యస్య కులీనస్య సద్వంశజాతస్య ఇత్యర్థః... చాణక్యస్య కౌటిల్యస్య నీతిం నయం నీతికౌశల మిత్యర్థః, సంశ్రిత్య అవలంబ్య, నన్దాన్ యోగానన్దప్రభృతీన్ నన్దవంశీయాన్, జిత్వా పరిభూయ, కుసుమనగరం పుష్పపురాఖ్యం పాటలీపుత్రస్థం నన్దనగరం, జిగాయ జితవాన్ అధీనీచకారేత్యర్థ, అద్య ఇదానీం, దోర్దర్పాఢ్యః బాహుబలదర్పితః, సః చన్ద్రగుప్తః, కర్ణాటోఽస్య నివాసః కర్ణాటః...తస్య భావః తత్త్వం, కర్ణాటత్త్వం కర్ణాట దేశాధిపత్య మిత్యర్థః, ఉపగతవాన్ ప్రాప్తవాన్, ఇదానీం కర్ణాటదేశలబ్ధరాజపదాన్ ఇత్యర్థః. తాన్ దేహాన్తరధారణేన పున ర్జాతాన్ పూర్వ నిహతాన్ నన్దాన్ ఇత్యర్థః, నన్దవంశీయాన్ కతిచిత్ రాజ్ఞః ఇతి యావత్, హన్తుమేవ నాశయితు మేవ, ధ్రువం నిశ్చితం, పునః భూయోపి, శ్రీమహీపాలదేవః తదాఖ్యనృపతివిశేషః, అభవత్ ;

నన్దాశ్ఛన్ద్రగు సేన శ్రీమహీపాలాఖ్యయాజా తేన పునర్నిహతా ఇతి ప్రా. క్తనీ ప్రసి    భావః[1]."

పూర్వము కౌటిల్యుని రాజనీతి నాధారపఱచుకొని చంద్రగుప్తమౌర్యుడు పాటలీపుత్రమును పాలించుచుండిన నందవంశజులను జయించెను; ఇప్పుడు ఆ మౌర్యచంద్రగుప్తుడే మహీపాలదేవుడై యవతరించి కర్ణాటదేశరాజులై మరల జన్మమెత్తిన ఆ నందుల నోడించి కర్ణాటాధిపత్యమును బొందెనని పై శాసనము యొక్కయు, వ్యాఖ్య యొక్కయు సారాంశము. ఇందువలన గూర్జరప్రతీహార మహీపాలదేవుడు సమకాలిక కర్ణాటసామ్రాజ్యాధీశ్వరుడైన రాష్ట్రకూటచక్రవర్తి నోడించి కొంత రాష్ట్రమును వశపఱచుకొనె నని తెలియుచున్నది. మహీపాలుని బాఱదోలి యతడాక్రమించుకొనిన దేశమును స్వాధీనపఱచుకొనుట కొఱకును, రాష్ట్రకూటుల ప్రతాపమును మరల గంగా యమునల మధ్యభూమియందు ప్రకటించుట కొఱకును ముమ్మడి ఇంద్రవల్లభుడు దండెత్తెను. ఈ దండయాత్రా సందర్భముననే వేములవాడచాళుక్య ద్వితీయ నరసింహుడు మహీపాలుని దారసిల్లి యోడించినది.

ఈ దండయాత్ర ముమ్మడి ఇంద్రవల్లభుని రాజ్యాభిషేకమున కించుక పూర్వమే ప్రారంభమైనట్లు తోచుచున్నది; ఏలనగా, క్రీ. శ. ౯౧౫ ఫిబ్రవరియం దతడు వ్రాయించిన బుగుమ్రా తామ్రపట్టికలం దతడు మేరువు నున్మూలించె ననియు, గోవర్ధనము నుద్ధరించిన యుపేంద్రుని జయించె ననియు జెప్పియున్నది[2].

---

1. చణ్డకౌశికమ్—కలకత్తాప్రచురణ. పుట ౫౬. వ్యాఖ్యాత జీవానంద విద్యాసాగరుడు.

2. EI. IX pp 24-41 Verse 22.

ఇంద్రుడు నాశమొనర్చిన 'మేరువు' కనోజియై యుండవచ్చు నని డాక్టరు కీల్‌హారనుగారూహించుచున్నారు[1]. అతడున్మూలించిన రాజు మహీపాలుడు గావచ్చు నని యభిప్రాయపడుచున్నారు[2]. కాని, డాక్టరు అల్టెకారుగారు పై యభిప్రాయములతో నేకీభవింపక, "ఇంద్రవల్లభునిచే నిర్జితుడైన యుపేంద్రుడు పరమారప్రభువగు కృష్ణరాజని తోచుచున్నది; ఇతని కుపేంద్రు డను నామాంతరము గలదని యుదయపూరుప్రశస్తివలన దెలియుచున్నది...ఇతడు క్రీ. శ. ౯౦౦-౯౩౫ ల మధ్య రాజ్య మొనర్చెను. పరమారులు మొట్టమొదట గూర్జరప్రతీహారులకు సామంతులుగ నుండిరి; వారిచే బురికొల్పబడి యుపేంద్రు డింద్రవల్లభుని రాజ్యారంభకాలమున నాసికమండలములోని గోవర్ధనముపై నెత్తివచ్చిన ట్లున్నది"[3] అల్టెకారుగారి యభిప్రాయ మంగీకార్యమే. పరమారులుగూడ ప్రతీహారులవలె గూర్జరజాతికి జెందినవారే. వారును బ్రతీహారులతోగూడ మాళవమునకు వచ్చి యచ్చట స్థిరవసతు

---

"కృతగోవర్ధనోద్ధారం హేలోన్మీలితమేరుణా
ఉపేన్ద్రి మిన్ద్రిరాజేన జిత్వా యేన న విస్మితమ్"

ఇందు పేర్కొనబడిన గోవర్ధనమును పారిజాతుడనువాడు ముట్టడించియుండగా నిమ్మడి గోవింద చక్రవర్తి వాని బాఱదోలి దాని నుద్ధరించె నని దౌలతాబాదు పట్టికలందు కలదు (EI. IX no. 26 V. 10).

"తత్సూను రాహవరుచిః ప్రథితో బభూవ శ్రీపారిజాతవిభవాహరణప్రతీతః
గోవర్ధనోద్ధరణలక్షితబాహువీర్యో గోవిందరాజనృపతి ర్హరిణా సమానః"

ఈ గోవర్ధనదుర్గము నాసికజిల్లాయం దున్న దని డాక్టరు అల్టెకారుగారు గుర్తించియున్నారు.

1. EI. VII. App. P. 16 n. 2.
2. EI. VII PA 38 f.
3. రాష్ట్రకూటులు: వారి యుగము. పుటలు. ౧౦౦-౧౦౧.

లేర్పఱచుకొనిరి. డాక్టరు ఆల్టెకారుగారి వ్యక్తినిరూపణము సమంజస మగునేని యింద్రవల్లభుడు గూర్జరప్రతీహారులతో బోరాడుటకు దన రాజ్యాభిషేకమునకు ముందే ప్రారంభించె నని తేలుచున్నది. వేములవాడ చాళుక్యనరసింహుడు జయించిన సప్తమాళవాధిపతు లలో నీ యుపేంద్రు డొక్క డని చెప్పవచ్చును.

మహోదయదండయాత్రయందు జరిగిన యుద్ధాంశములన్నియు విపులముగ దెలియవచ్చుటలేదు; కాని పంపకృతవిక్రమార్జున విజయపీఠికయందును, వేములవాడ శిలాశాసనప్రశస్తియందును అందలి ప్రధానఘట్టములు విశదముగ వర్ణింపబడియున్నవి.

మొదట లాటవిజయము: లాటదేశము పశ్చిమసముద్ర తీరమునం దుండెను. దీనికి నర్మదాతపతుల మధ్య నుండు రాజపిప్లా సంస్థానములలోని కొండలయందు బుట్టి క్యాంబేయఖాతములలోనికి బ్రవహించెడి కీము నది యుత్తరపుటెల్ల. సూరతుఠాణా మండలము లను వేర్పఱచు దమణ్గంగానది దక్షిణపు సరిహద్దు. తూర్పున సహ్యాద్రియును, బశ్చిమమున సముద్రమును మేరలు. మఱియు నీ లాటదేశము సప్తకొంకణములయం దొక్కటి[1]. దీని రాజధాని ఖేట కము. ఇప్పుడు దీనిని గయారా యందురు.

గూర్జరప్రతీహారమిహిరభోజుని బాఱదోలియిమ్మడి కృష్ణవల్ల భుడు లాటదేశము స్వాధీనపఱచుకొనె నని పైన వ్రాసియున్నా డను. ముమ్మడి యింద్రవల్లభుని పక్షమున చాళుక్యయిమ్మడినర సింహు డీ దేశమును మరల జయింపనలసివచ్చినట్లయిన, కృష్ణవల్ల భుడు మరల నీ రాష్ట్రమును గోల్పోయె ననుట నిక్కము. నర సింహు డెవ్వరిని జయించి లాటమును స్వాధీనపఱచుకొనెనో తెలి యదు; కాని గూర్జరప్రతీహార మహీపాలుడు మురళకున్తలకర్ణాట

1. డినాస్టీస్ ఆఫ్ ది కానరీస్ డిస్ట్రిక్ట్సు, పుట ३౧౦.

కేరళ దేశములను జయించియుండుటచేతను, లాటవిజయముతో నారంభమైన చాళుక్యనరసింహుని దండయాత్ర ప్రతీహారమహీపాలుని పరాజయముతోడను, మహోదయవినాశముతోడను ముగియుటచేతను లాటమున నోడిపోయిన ప్రతిపక్షి యాతడే యని విస్పష్ట మగుచున్నది.

లాటవిజయానంతరము మాళవ దండయాత్ర – ఈకాలమున మాళవ మేడు భాగములుగ విభజింపబడియుండెను.[1] ఒక్క రాజు నాధిపత్యముక్రింద నుండక బహునాయకమై యుండెను. చాళుక్య యిమ్మడి నరసింహుడు దుస్సాధతరులగు నేడ్గురు మాళవ నృపులను జయించి వారియొద్ద కప్పము గొనెనని వేములవాడశిలాశాసనమున జెప్పియున్నది. ఈ యేడ్గురు రాజు లెవ్వరో, వారు పాలించుచుండిన ప్రదేశము లెవ్వియో తెలియదు. బగూమ్రా తామ్రశాసనమున నింద్రవల్లభునిచే బరాజితు డాయె నని చెప్పియుండు నుపేంద్రుడును, పరమారవంశజుడును, వాక్పతిరాజముంజుని పితామహుడును నైన యుపేంద్రుడును డాక్టరు ఆల్టెకారుగారు చెప్పిన ట్లొక్కరే యగుదు రేని, చాళుక్యనరసింహుని కోడిన యేడ్గురు మాళవరాజులలో పరమారప్రభువగు నుపేంద్రు డొక్కడనియు, నత డోటమినందినది పర

1. ఇట్లే కొంకణదేశమును కళింగమును ఏడు భాగములుగ విభజింపబడి యుండె నని సప్తకొంకణ సప్తకళింగశబ్దములవలన విదిత మగుచున్నది. మఱియు గళింగమున సప్తమాడియము లను నొక దేశవిభాగ ముండినట్లు 'సప్తమాడియ రాయచంద్రబింబానవాచివరవల్లరులపై జిన్నిపువ్వు'అను శ్రీనాథుని వాక్యము వలన దెలియుచున్నది. కృష్ణరాయలు 'మాడెములు' గాల్చె నని పెద్దన చెప్పు చున్నాడు. 'మాడె, మాడియ'ములు 'మాళియ' శబ్దమునకు రూపాంతరములు 'మాళియ'ము 'మాళవ'ముయొక్క భ్రష్టరూప మని కొందఱి మతము. అగునేని, సప్తమాళవములకును, సప్తమాడియములకును జరిత్ర కలదని గూఢమైన సంబంధ ముండియుండవలయును.

మారుల కునికిపట్టయిన ధారప్రాంతమునం దైదె యుండు ననియు మన మూహింపవచ్చును. మాళవవిజయమును గూర్చి యింతకంటె విశేషించి మనకు దెలియవచ్చు నంశము లెవ్వియు లేవు. కాని యీ యుద్ధమునకు బ్రతిఫలముగ మాళవదేశము సర్వమును రాష్ట్రకూటులకు గైవసమాయె నని దృఢముగ జెప్పనచ్చును.

## కాళప్రియప్రాఙ్గణము

లాటమాళవదేశములు రెండును రాష్ట్రకూటులకు స్వాధీన పడెను; కాని యంతటితో నింద్రవల్లభుడు తృప్తిపొందలేదు. కర్ణాట సామ్రాజ్యముపై నెత్తివచ్చి యందశేషభాగమును గెలిచి స్వాధీన పఱచుకొన్నందులకు గూర్జరప్రతీహారమహీపాలునికి దగిన శాస్తి చేయవలసిన యావశ్యకత యొకటియు, రాష్ట్రకూటపాలిధ్వజమును మరల గంగాయమునాంతర్వేదియందు నెలకొలుపవలయు నను దృఢ సంకల్ప మొకటియు ముందంజవేయ నతని బురికొల్పినవి. కావున నతడు సైన్యములను గదల్చుకొని గూర్జరప్రతీహారసామ్రాజ్యలక్ష్మి కిరవైన మహోదయమువంక నడవవలసిన దని చాళుక్యనరసింహుని కాజ్ఞ యొసగెను.

మహీపాలుడు పొరలివచ్చు సేనాసాగరము నాపుటకు దగు ప్రయత్నము సలుపక ప్రమత్తుడై యుండలేదు. ఆతడును దళము లను గూర్చుకొని రాష్ట్రకూటులను యమునానదిని దాటనీయక దిరుగగొట్టుటకై వచ్చి యీ నదీతటమున విడిసెను. ఇచట కొంత విచారింపవలసియున్నది. బుగూమ్రాపట్టికలలో నింద్రవల్లభుడు కాల ప్రియప్రాంగణమును దన యేనుగుల దంతఘాతముల వలన విషమ తలము గావించి యమునను గుఱ్ఱపుదళములతో దాటె నని చెప్పి యున్నది. మఱియు వేములవాడ శిలాశాసనమున జాళుక్యనర సింహుడు ఎదురువచ్చిన గూర్జరరాజ్యసైన్యముల నోడించి కాళప్రియ

మున దన శౌర్యమును శిలాస్తంభమున బ్రకటించె నని యున్నది. ఈ కాళప్రియ మెచ్చటిది? ఇంతవఱకీ విషయమునుగూర్చి వ్రాసిన పరిశోధకులందఱును కాలప్రియ ముజ్జయినియని నిర్ణయించిరి. దీనికి గారణము కాళప్రియుడు మహాకాళుడే యను వీరి అభిప్రాయము. సుప్రసిద్ధమహాకాళదేవాలయము ఉజ్జయినియం దుండు కారణమున కాలప్రియ ముజ్జయినియే యని వీరు తీర్మానించిరి. డాక్టరు ఆల్టెకారు గారుమాత్రము పూర్వ పరిశోధకుల యభిప్రాయము ననుసరించి కాలప్రియ ముజ్జయినియే యని చెప్పినను నొకవేళ నవి రెండును భిన్నప్రదేశములు కావచ్చు నను శంకను వెలిబుచ్చిరి. ఇట్టి సందేహము వీరికి గలుగుటకు మూడు కారణములను వీరు చూపిరి: (౧) బగూమ్రా శాసనమున నింద్రవల్లభుడు దన మదదంతిదంతఘాతములచే కాలప్రియప్రాంగణమును విషమము గావించి వెంటనే యశ్వదళములతో గూడ నగాధమైన యమునాతరంగిణిని దాటినట్లు చెప్పియుండుట. ఇందువలన గాలప్రియము యమునాతటమున నుండె నను నూహ గలుగుచున్నది. (౨) మాన్ఖేడునుండి కనోజికి బోవు మార్గమునం దుజ్జయిని లేకపోవుట. (3) మఱియు యమునకుదక్షిణపు టొడ్డున కాల్పి యను స్థల ముండుట. 'కాల్పి' యను నది 'కాలప్రియ'కు భ్రష్టరూపము. ఇచ్చట నిప్పటికిని కాలప్రియాలయము గలదు. మఱియు నిది మాన్ఖేడు కన్యాకుబ్జముల మార్గమం దున్నది.

ఆల్టెకారుగారు చూపిన కారణములలో రెండవది యంతటి సత్త కలదిగాదు. ఏలనగా, మహోదయదండయాత్రను నడపిన చాళుక్య ఇమ్మడి నరసింహుడు మొదట సప్తమాళవములను జయించి యటుపిమ్మట కాళప్రియమున దన కీర్తిస్తంభమును స్థాపించినట్లు వేములవాడ శిలాశాసనమునను, విక్రమార్జునవిజయపీఠికయందును జెప్పియుండుటచేత రాష్ట్రకూటసైన్యములు మహోదయమునకు బోవుటకు ముం దుజ్జయినికి బోవుటయం దసంగత మేమియు లేదు.

కాని మహాకాళునకు గాళప్రియు డను నామాంతర ముండె ననుట కాధారము లెవ్వియు గానరావు. కావున కాళప్రియుడు మహాకాలుడు గాజాలడు; కాళప్రియ ముజ్జయిని కాదు. అది యమునా తటమందలి కాల్పియే.[1].

ఇంద్రవల్లభుడు కాలప్రియప్రాంగణమును దన మదదంతిదంతఘాతలచే విషమము జేసెనని చెప్పియుండుటచే నతడు దన యుద్ధపు టేనుగులను డీకొలిపి యాస్థలమును స్వాధీనపఱచుకొనెనని తెలియుచున్నది. దీనికి గారణము వేములవాడశిలాశాసనమునందు విశదపఱచియున్నది. గూర్జరరాజు మహీపాలుడు రాష్ట్రకూటసైన్యముల నడ్డుపెట్ట నెదురునడచివచ్చి కాలప్రియ ప్రాంగణము నాక్రమించుకొనియెను. ప్రాంగణ మనగా ముంగిలి. దేవాలయము ప్రాకార రక్షితమగుటచే దానిని గూర్జరరాజు దన సైన్యమునకు వీడుగావించుకొనియెను. ప్రాచీనకాలమున దేవాలయప్రాకారములు కోటగోడల

1. వేములవాడశిలాశాసనమున జాళుక్యనరసింహుడు దన్నెదిరింపవచ్చిన గూర్జరరాజసైన్యములను జయించి కాలప్రియమున దన కీర్తిస్తంభమును నెలకొల్పె నని చెప్పియున్నను (తెలిం. శా. ఇతర. నెం. ౨౧. శ్లో. ౯) సమకాలికరచనయైన పంపభారతమున నతడు విజయారంభపురస్సరముగ విజయగజములనుబట్టి గూర్జరరాజధ్వజిని నోడించె ననియు, మహీపాలుడు నిలిచిన తావున నిలువక పాఱిపోయె ననియు, గంగావార్థియందు దన తురంగమమును మెఱయించి సుప్రసిద్ధమైన కాళప్రియమున దన భుజగర్వము పెంపున దన యసిలతను స్థాపించె ననియు జెప్పియున్నది, (పంప. విక్ర. విజ. ౧: ౩౬_౩౭.) దీనిని బట్టి చూడగా కాలప్రియమను నది గంగాతీరమున నుండెనాయను సంశయము గల్గుచున్నది. బుగూమ్రాశాసనమున నింద్రవల్లభుడు మహోదయమును (కనోజిని) నాశముజేసినట్లు చెప్పియుండుట చేత రాష్ట్రకూటసైన్యములు గంగానదివఱకు దాడి చేసె నని నిశ్చయముగ జెప్పవచ్చును. వేములవాడశిలాశాసనమునకు, విక్రమార్జునవిజయమునకును భేదమేల కలిగెనో చెప్పుటకు వీలులేదు. దీనికి వాస్తవకారణ మేమైనను కాలప్రియము గంగాతీరమందలిది కాదు.

వలె బలితములుగ గట్టబడెడివి. ఈ కారణమున బ్రాకాగములను దేవాలయపు గోట లని అనెడివారు. కాల ప్రియ ప్రాంగణమునుండి గూర్జరాజును లేవదీయుట కింద్రవల్లభు డా దేవాయతనము నరికట్టి దాని కోటగోడలపై దన యుద్ధపు టేనుగులను బరికొల్పవలసినవా డాయెను. ఇరు పక్షములకు రణము పొసగెను. మహీపాలుడు కర్ణాట కుల నెదిరించి నిలువజాలక పాఱిపోయెను.

అతని వెన్నంటి తఱుముచు చాళుక్య నరసింహుడు కన్యాకుబ్జమువఱకు బోయెను. మహీపాలున కొకచోటనైన నిలిచి రాష్ట్రకూటసైన్యముల నెదుర్కొనుటకు శక్తి చాలదాయెను. కావున నతడు పంపడన్న 'ట్లుమ్మలించుచు, గుడిచినచో గుడవజాలక, పడు కొనినయెడ బడుకొనలేక, నిలిచినపట్టున నిలువలేక' బలాయితు డాయెను. రాష్ట్రకూటసైన్యములు నిరాతంకముగ గన్యాకుబ్జముపై నడచి యా పట్టణమును ధ్వంసముగావించెను. ఈ యంశము మహోదయము నింద్రవల్లభుడు కుశస్థలము గావించె నను బుగూ మ్రాశాసన వాక్యమువలన దెల్లమగుచున్నది.

ఇమ్మడి నరసింహుడు మహోదయదండయాత్రనుండి వెనుదిరిగి వచ్చిన పిమ్మట నేమి చేసెనో, యెంతకాలము జీవించియుండెనో తెలి యదు. ఇతని పుత్రుడగు నిమ్మడి యరికేసరి క్రీ. శ. 930 ప్రాంత మున నిజమండలమున కధిపతి యైనట్లు తెలియుచుండుటచేత నితని పాలన యంతదనుక సాగె నని మన మూహింపవచ్చును. ఇమ్మడి నరసింహుడు వేములవాడచాళుక్యుల యం దెల్ల మేటి జోదు. ముమ్మడి యింద్రవల్లభుని యుద్ధము లన్నియు నితని యాధిపత్యము క్రిందనే నడచెను. లాటమాళవగూర్జర ప్రతీహారుల యోటమి యితని పరాక్రమాతిశయమును, వ్యనిర్వహణకౌశల్యమును వెల్లడిసేయు చున్నది. ఇంతటి సేనాధిపతి మఱి యొకడు భరతఖండమునం దా శతాబ్దమున లేడని చెప్పుట యతిశయోక్తి గాదు.

## ౮ - ఇ మ్మ డి య రి కే స రి

ఇమ్మడియరికేసరికి రాష్ట్రకూటరాజకుటుంబముతో గాఢమైన సంబంధము గలదు. ఇతని తల్లియగు జాకవ్వ ప్రాయశః ముమ్మడి యింద్రవల్లభుని సోదరియై యుండవచ్చు ననియు, దనభుజమునే తొట్లి జేసి యింద్రవల్లభుఁ డితని నెత్తిపెంచెననియు పూర్వప్రకరణమున వ్రాసియున్నాను. మఱియు నా యింద్రవల్లభుడు తన కుమార్తెయగు రేవకనిర్మడి నీతని కుద్వాహము గావించెనని వేములవాడశిలాశాసనమువలన దెలియుచున్నది. రాష్ట్రకూటకులసంజాతయగు లోకాంబిక యను మఱియొక రాజకన్యకనుగూడ నితడు పెండ్లియాడినట్లు పరభణితామ్రశాసనమున గలదు. ఇతనిగూర్చి తెలియవచ్చు చరిత్రాంశములు నాలుగు.

(౧) గోవిందరాజుకోపమునకు బాత్రుడైన చాళుక్యవిజయాదిత్యునికి ఆశ్రయమిచ్చి రక్షించెను. ఈ విజయాదిత్యుడే వేములవాడశిలాశాసనమున బిజ్జడని పేర్కొనబడియున్నాడు. (౨) సకలచక్రవర్తి గొజ్జిగ డొక గొప్ప సేనతో నొక మహాసామంతు నితనిపై కంపగా నిత డాతను నోడించి తఱుమఁగొట్టెను. (౩) బద్దెగదేవుని కిత డాశ్రయ మిచ్చెను; అందులకు గినిసి చక్రవర్తి యెత్తిరాగా నతని గెడపి బద్దెగదేవునికి సామ్రాజ్యమునొసగెను. (౪) కక్కలునితమ్ముడగు బప్పని యంకకాఱు డెత్తిరాగాంవానినోడించి పాఱదోలెను.

వీనియందు కడపటి యంశ మొక్కటి దప్ప దక్కిన వన్నియు రాష్ట్రకూటచరిత్రకు జెందినవి. విషయమును జక్కగ నవగాహనము జేసికొనుటకు రాష్ట్రకూటకుటుంబవృత్తాంతమును గొంత తెలిసికొనవలసియున్నది.

ఇమ్మడికృష్ణుడు చేదిరాజగు కక్కలదేవుని కుమారితను బెండ్లియాడెను. ఈమెయం దాతనికి జగత్తుంగు డను పుత్రుడు గలిగెను. ఇతడు తన మేనమామ కక్కలరాజకుమారుడగు శంకరగణ రణవిగ్రహుని కుమారితలను లక్ష్మీగోవిందాంబలను వివాహమాడెను;

లక్ష్మియందు ముమ్మడి యింద్రుడును, గోవిందాంబయందు బద్దెగ నామాంతరుడగు ముమ్మడియమోఘవర్షుడు నను నిరువురు కుమారులు పుట్టిరి. ముమ్మడి యింద్రవల్లభుడు కొక్కల్లుని మనుమడగు నర్జున అమ్మణదేవుని కుమార్తెను విజాంబ నుద్వాహము జేసికొని యామెవలన నిమ్మడియమోఘవర్ష నాల్మడిగోవిందు లనునిరువురు పుత్రుల బడసెను. మఱియు నితని కుమారితను రేవకనిర్మడిని చాళుక్య అరికేసరి పెండ్లాడెను. ఇంద్రవల్లభుని తమ్ముడగు ముమ్మడి యమోఘవర్షుడు చేదిరాజుకొక్కల్లుని మనుమడగు ముగ్ధతుంగ యువరాజదేవుని కూతురగు కుండకదేవిని వివాహము జేసికొనెను. వీరికి ఖొట్టిగదేవు డను కుమారుడు పుట్టెను; ఖొట్టిగని కంటె బెద్ద వాడు ముమ్మడి కృష్ణు డను పుత్రు డొకడు ముమ్మడియమోఘవర్షు నకు గలడు. ఇతని తల్లి పే రెద్దియో, యామె యేరాజకుటుంబమున నుద్భవించెనో తెలియదు. రాష్ట్రకూటవంశావతరణమును వంశవృక్ష రూపమున నిట్లు లిఖింపవచ్చును.

ఇమ్మడి కృష్ణవల్లభుడు భా. కొక్కలరాజపుత్రిక
|
జగత్తుంగుడు
(భార్యలు చేదిశంకరగణరణవిగ్రహుని కుమారితలు)

(౧) లక్ష్మిదేవి
|
ముమ్మడి
యింద్రుడు
భార్య (చేదిరాజు
కొక్కలుని మనుమడు
అర్జునఅమ్మణదేవుని
కూతురు)
విజాంబ.

(౨) గోవిందాంబ
|
బద్దెగడు లేక ముమ్మడి యమోఘవర్షుడు
భార్య (చేదిరాజు కొక్కలుని మనుమడు ముగ్ధతుంగ యువరాజ దేవుని కూతురు) కుండకదేవి
|
ముమ్మడికృష్ణుడు
ఖొట్టిగడు

విజాంబ (Contd.)

| రేవక నిర్మడి | ఇమ్మడి యమోఘ | నాల్మడి |
| --- | --- | --- |
| భర్త : చాళుక్యయిమ్మడి | వర్షుడు | గోవిందుడు |
| యరికేసరి | | |

క్రీ. శ. ౯౨౮ - ౩౦ సం.న ముమ్మడి యింద్రవల్లభుడు కాల గతి నందెను. అతని యనంతరము మతని జ్యేష్ఠ పుత్రు డిమ్మడి యమోఘవర్షుడు రాజ్యాభిషిక్తు డాయెను; కాని యతని యేలుబడి యొకసంవత్సరము లోపల సమాప్తినందెను. అతని దోలగద్రోసి యతని తమ్ముడు నాల్మడిగోవిందుడు రాజాయెను. ఇతనిని గొజ్జిగ డనియు జనులు పిలిచెడివారు. ఇతడు తన యన్నను హింసించి వధించె నని దూరు కలుగుటవలనను, విషయాసక్తుడగుటవలనను ప్రజ లితనియెడ విముఖులైరి. స్వార్థపరులైన సామంతులు కొంద ఱదియ యదను జేసికొని యతనిపై దిరుగబడిరి. వీరియందు గోవిందుని పినతండ్రియైన బద్దెగడును, నాతని జ్యేష్ఠపుత్రుడగు కృష్ణుడును ముఖ్యులు. కావున వీరు చక్రవర్తికోపమునకు బాత్రులై రాజ్యము నుండి పాఱిపోయి త్రిపురియందు చేదిరాజునాస్థానమున తలదాచు కొనిరి.[1]

మఱియు బూర్వసముద్రమువఱకు గల రాష్ట్రకూటసామ్రాజ్య మున నల్లరులు చెలరేగెను. ముమ్మడి యింద్రరాజుయొక్క

1. ఈ విషయము సుడి తామ్రపట్టికవలన దెలియుచున్నది.

“ తస్యానుజో నిజభుజార్జితసంపదర్థో
భూవల్లభం సముపగమ్య డహాళదేశే
శ్రీబద్దెగం తదను తస్య సుతాం సహైవ
వాక్కన్యయా వ్యవహదుత్తమధీ స్త్రిపుర్యాం.”

(ఎపి. ఇండి. సం. ౩. పుట. ౧౮౦.)

రాజ్యాంతదశయందో, లేక నాల్మడిగోవిందరాజురాజ్యప్రారంభ కాలముననో వేంగిదేశము రాష్ట్రకూటులకు హస్తగతమాయెను. వేగిందేశాధీశ్వరుడైన మొదటియమ్మరాజు క్రీ. శ. ౯౨౮-౯ లో పరమపదించెను; మొదటి యమ్మరాజుపుత్రుడు కంఠికావిజయాదిత్యుడు తండ్రియనంతరము రాజ్యాభిషిక్తుడైనను ఒక పక్షమున కంటె నెక్కువకాలము రాజ్యముసేయజాలకపోయెను. తరువాత గుణగవిజయాదిత్యుని తమ్ముడగు మొదటి యుద్ధమల్లుని పుత్రుడు మొదటి తాళరాజొక నెలదినములు రాజ్యమొనర్చెను. అతని జంపి ద్వితీయవిక్రమాదిత్యుడు పదునొకండు మాసము లేలెను. తరువాత క్రీ. శ. ౯౩౫ వఱకును వేంగియందంతఃకలహములు పెఱిగి యరాజకము ప్రబలెను. ఈ పరిస్థితు లప్పటి పూర్వచాళుక్యుల శాసనములలో జక్కగ వర్ణింపబడియున్నవి.

"పశ్చా దహమహమికయా విక్రమాదిత్యాస్తమయనే రాక్షసా ఇవ ప్రజాబాధనపరా దాయాదరాజపుత్రా రాజ్యాభిలాషిణో యుద్ధమల్ల రాజమార్తండ కంఠికావిజయాదిత్యప్రభృతయో విగ్రహీభూతా ఆసన్. విగ్రహేష్వైవ పంచవర్షాణి గతాని.[1]"

పేర్కొనిన రాజులలో యుద్ధమల్లుడు ముఖ్యుడు. ఇతనికి స్వబలముకంటె మిత్రబల మెక్కుడు. ఇతడు మొదటి యుద్ధమల్లుని మనుమడు. కంఠికావిజయాదిత్యుని పదచ్యుతుని జేసి నెలరోజులు వేంగిసింహాసనము నధిష్ఠించియుండిన ప్రథమతాళరాజపుత్రుడు; రాష్ట్రకూటచక్రవర్తి నాల్మడిగోవిందవల్లభుని కాశ్రితుడు; అతడు దన సహాయార్థ మంపిన దళముల బలిమిచే వేంగిసింహాసనము నాక్రమించుకొని యేడేండ్ల కాలము రాజ్యమొనర్చెను. నామకార్థము మాత్ర మితడు రాజు; అధికారమంతయు రాష్ట్రకూటులచేత

1. ఎపి. ఇండి. సం ౯. పు. ౪౭.

జొక్కెను. ఈవిషయము అమ్మరాజవిజయాదిత్యుని మాంగల్లు తామ్రశాసనమువలన విదితమగుచున్నది.

"సామన్తశబరవల్లభదణ్డాశ్వాణ్యచ భువ మలుంప న్నన్ద్వాః
సప్తాశ న్తరేఽత్ర మల్లరసరాజకృతపట్టబన్ధ మవ త్యబలాః "[1]

ఇందువలన నాల్మడిగోవిందచక్రవర్తి మాన్యఖేట సింహాసనము నధిష్ఠించినవెంటనే రెండవ యుద్ధమల్లునికి గొప్ప సైన్యము నిచ్చి వేంగిమీాది కంపి పూర్వచాళుక్య రాజ్యమునం దతనిని ప్రతిష్ఠించెను. ఇది నాల్మడిగోవింద చక్రవర్తియొక్క యజ్ఞాతఘనకార్యములయం దొక్కటి. ఇట్లు తన యాశ్రితుడు వేంగి నేలుచుండినను, గోవిందుని యధికారము వేంగియందు నిరాఘాటముగ సాగలేదు. మొదటి యమ్మరాజవిష్ణువర్ధనుని ద్వైమాతురుడైన రెండవ చాళుక్యభీముడు నిజదేశమును రాష్ట్రకూట దాస్యమునుండి తప్పించి పిత్ర్యమైన రాజ్యమును స్వాధీనపఱచుకొనుటకొఱకు పోరాడదొడగెను. ఇతని శిక్షించుటకై నాల్మడిగోవిందరా జొక్క గొప్ప సైన్యము నంపెను. రాష్ట్రకూటసామంతులగు ధలిగ, న్వలిది మున్నిజివ రాజమార్తండు లను జయించితి నని చెప్పికొనియున్నాడు.

"య స్తాతబిక్యనాఖ్యం ధ్నలిగం న్వలిది మున్నిజివ రాజమార్తణ్డౌ ఆజౌ

అని కోలవెన్ను శాసనము[2]. ఈవిషయమునే మఱికొంచెము విస్తరించి రెండవ యమ్మరాజు కలుచంబఱ్ఱుతామ్రశాసనమునందు చెప్పియున్నది.

"శ్రీమన్తం రాజమయ్యం ధలిగమురుతరం తాతబిక్కిం ప్రచణ్డం
బిజ్జం సజ్జంచ యుద్ధే బలిన మతితరా మయ్యపం భీమ ముగ్రం

1. Cp. 1. of 1916-17.
2. SII. 1. No. 27.

దణ్డం గోవిందరాజప్రణిహితమధికం చోటపం లోవబిక్కిం
విక్రాన్తం యుద్ధమల్లం ఘటితగజఘటాన్ సన్నిహ త్యైక ఏవ''[1].

ఇట్లు రాష్ట్రకూటసామంతసైన్యమును ద్వితీయ చాళుక్యభీముడే నిర్జించినట్లు పై శాసనములయందు జెప్పియున్నను, సహాయులు లేక యతనికి జయము చేకూడియుండదు. చక్రవర్తికి ప్రతికూలురైన రాష్ట్రకూట సామంతు లతనికి ప్రత్యక్షముగనో, గూఢముగనో తోడ్పడియుండవలయును. ఈసందర్భమున నీక్రింది యంశములు దృష్టియందుంచుకొనదగి యున్నవి. రెండవచాళుక్యభీముడు గోవిందరాజుసైన్యములతో బోరాడుచుండిన కాలముననే తూర్పు తెలింగాణమున బెద్ద అల్లరి యొకటి రేగినది. దీనికి ప్రధాననాయకుడు వేంగికడిదేశమున నుండిన వేములవాడచాళుక్యరాజ్యమున కధిపతియైన యిమ్మడి యరికేసరి. రెండవ చాళుక్యభీమునకును, నిమ్మడి యరికేసరికిని నాల్మడి గోవిందవల్లభుడు సామాన్యశత్రువు. ఇద్దఱును గోవిందుని మీద విజయమందిరి. క్రీ. శ. ౯౩౫ లో గోవిందుడు రాజ్యభ్రష్టు డాయెను; ఆ సంవత్సరముననే ద్వితీయ చాళుక్యభీముడు వేంగిసింహాసనము నధిష్ఠించెను. ఈ యంశములను చక్కగ విచారించిచూడగా గోవిందరాజు సైన్యములతో ద్వితీయచాళుక్యభీముని పోరాటము ప్రత్యేకమైనది కాదనియు దానికిని దూర్పు తెలింగాణవిప్లవమునకును గాఢసంబంధము గల దనియు దోచుచున్నది.

ఇక తూర్పు తెలింగాణవిప్లవమునుగూర్చి విచారింతము. దీనికి గారణము వేములవాడశిలాశాసనమునందును, పంపని విక్రమార్జున విజయమునందును నిట్లు చెప్పియున్నది: చాళుక్యవంశజుడగు బిజ్జడు, లేక విజయాదిత్యు డనునతడు నిజప్రభువగు గోవిందచక్రవర్తియొక్క

1. ఎపి. ఇండి. సం. ౭. పుట. ౧౭౭ తరువాయి.

కోపమునకు పాత్రుడయ్యెనట. ఇమ్మడి యరికేసరి యాతని కాశ్రయ మొసగి రక్షించెనట. అందులకు చక్రవర్తి యతనిపై గలుషించి యుద్ధము ప్రకటించెనట. ఇట్లు చక్రవర్తికోపమునకు పాత్రుడై యరికేసరిచే గాపాడబడిన బిజ్జడు, లేక విజయాదిత్యు డెవ్వడో, యతనిపై చక్రవర్తి కేల కోపముగలిగెనో తెలియదు. పరిశోధకు లితని యాచూకీని నిశ్చయింప నేరక పలుతెరగుల నూహించియున్నారు. కొందఱితడు పూర్వచాళుక్యవంశజుడగు కొల్లభిగండ విజయాదిత్యుడనిరి[1]. ఈ వ్యక్తినిర్ణయ మసంగతము. కొల్లభిగండవిజయాదిత్యుడు క్రీ. శ. ౯౨౧ యందు కళింగముపై దండెత్తిపోయి విరజాపురయుద్ధమున రణశయ్య నలంకరించెను. బిజ్జని యల్లరి నాల్మడి గోవిందవల్లభుని రాజ్యకాలమున, క్రీ. శ. ౯౩౦ తరువాత జరిగినది. కావున గోవిందుని కోపమునకు పాత్రుడైన బిజ్జడు కొల్లభిగండవిజయాదిత్యుడని చెప్పుట సరికాదు. మొదటియమ్మరాజవిష్ణువర్ధనుని పుత్రుడగు బేత, లేక కంఠికావిజయాదిత్యుడే బిజ్జడను తలంపు కొందఱికి గలుగ వచ్చును[2]. కంఠికావిజయాదిత్యుడు తన తండ్రి మరణానంతరము క్రీ. శ. ౯౨౮-౯ లో నొక పక్షకాలము మాత్రమే రాజ్యము సల్పియుండినను, రాజ్యపునస్సంపాదనకై యతడు క్రీ. శ. ౯౩౫ మధ్య వఱకును నిమ్మడి చాళుక్యభీమునితో బెనగులాడుచుండినట్లు సమకాలిక శాసనములవలన దెలియుచున్నది[3]; కాని బేతవిజయాదిత్యు

1. Dynasties of the Kanarese Districts, P, 381.

2. JAPRL. VI. P. 176.

3. ఎపి. ఇండి. సం. ౯. పు ౪౭.

"యుద్ధమల్ల రాజమార్తండ కంఠికావిజయాదిత్య ప్రభృతయో విగ్రహీభూతా ఆసన్. విగ్రహేణైవ పంచ వర్షాణి గతాని. తతః—

యోఽవధీద్రాజమార్తండస్తేషాం యేన రణౌ కృతా,
కంఠికావిజయాదిత్యయుద్ధమల్లా విదేశగా."

డరికేసరిచే సంరక్షింపబడిన బిజ్జడు కాడని శ్రీ భావరాజు వెంకటకృష్ణ రావుగారు వాదించుచున్నారు. "పూర్వచాళుక్యశాసనము లితని బేతవిజయాదిత్యు డనియే పేర్కొనుచున్నవి; కాని బిజ్జడని కాదు. మఱియు నతడు (గుజ్జిగగోవింద)నికి గోపమువచ్చునట్లు ప్రవర్తించి నట్లును గానరాదు. బిజ్జివలె నాతడు గోవిందుని కాశ్రితుడును గాడు. మన ప్రస్తుత (వేములవాడ) శాసనముగాని, పంపని విక్రమార్జున విజయముగాని బిజ్జడు పూర్వచాళుక్యరాజకుమారుడని తెలుపవు. బిజ్జడే వేంగిరాజవంశజుడై యుండిన నా యంశమును నిమ్మడి యరికేసరి సగర్వముగ జెప్పియుండును; ఏలన నది యతని ఘనతను, పరాక్రమమును హెచ్చించి యుండును[1]" ఇట్లు కృష్ణరావుగారు బేత విజయాదిత్యుడు బిజ్జడు గాడని సకారణముగ రుజువు చేసినను నత డెవ్వడో నిరూపింపక విడిచిపెట్టిరి. వేంగిపూర్వచాళుక్య, వేములవాడచాళుక్యవంశములుగాక మఱియొక రాజవంశ మాంధ్రదేశమున రాజ్యము సేయుచుండెను. వీరికి చరిత్రపరిశోధకులు ముదిగొండ చాళుక్యులని నామకరణము జేసియున్నారు. వీరి తామ్రశాసన మొకటి వెలువడియున్నది. దీనికాలమును స్పష్టముగ నిర్ణయించుటకు దగు నాధారము లందు గానరాకున్నను, నక్షరస్వరూపమును బట్టి తత్సంపాదకుడగు రెవరెండు సి. బెండలుగారది క్రీ. శ. ౧౧ వ శతాబ్దము (క్రీ. శ. ౧౦౦౦—౧౧౦౦)నకు జెందినదని నిశ్చయించి యున్నారు. అందలి చాళుక్యవంశానుక్రమణిక యిట్లు వర్ణింపబడి యున్నది[2]

వీరిని తఱుమగొట్టియే క్రీ. శ. ౯౩౭లో నిమ్మడి చాళుక్యభీముడు రాజ్యాభిషిక్తుడైనది.

1. JAHRS. VI. P. 176.

2. Ind. Ant. XXXII. PP. 281-84.




| నిజ్జియరాజు భార్య అచిదేవి | మలబొదురాజు | లోభచటిక |
|---|---|---|

నాల్గవ కుసుమాయుధుడు

ఈ వంశమున గడపటివాఁడైన నాల్గవ కుసుమాయుధుడు క్రీ. శ. ౧౦౫౦ ప్రాంతమున నుండెనని తలచిన తరమునకు నిరువదియైదేండ్లచొప్పున పరిగణించిన నీ వంశపు రాజుల కాలము నిట్లుజ్జాయించి చెప్పవచ్చును :

| | | |
|---|---|---|
| (1) | కొక్కి-రాజు | ౮౭౫—౯౦౦ |
| (2) | మొదటికుసుమాయుధుడు | ౯౦౦—౯౨౫ |
| (3) | బిజయిత | ౯౨౫—౯౫౦ |
| (4) | రెండవకుసుమాయుధుడు | ౯౫౦—౯౭౫ |
| (5) | విజయాదిత్యుడు | ౯౭౫—౧౦౦౦ |
| (6) | మూడవ కుసుమాయుధుడు | ౧౦౦౦—౧౦౨౫ |

(7) విజ్జియరాజు ౧౦౨౫—౧౦౫౦

(8) నాల్గవ కుసుమాయుధుడు ౧౦౫౦—౧౦౭౫

ఈ యుజ్జాయింపుకాలానుక్రమణిక ననుసరించి రాష్ట్రకూట నాల్మడి గోవిందరాజుకాలమున (క్రీ. శ. ౯౩౦ - ౯౩౬) ముదిగొండ చాళుక్య బిజయితుడు రాజ్యము సేయుచుండినట్లు తేలుచున్నది. ఈ యంచన సరియైనదే యని నిరూపించుటకు గొంత శాసనసాక్ష్యము గలదు. బిజయితుని తండ్రి మొదటికుసుమాయుధుడు పై కాలానుక్రమణికప్రకారము ౯౦౦ - ౯౨౫ ల మధ్య రాజ్య మొనర్చియుండవలయును. క్రీ. శ. ౮౯౨ - ౯౨౧ ల నడుమ వేంగీదేశమును బరిపాలించిన మొదటి చాళుక్యభీముని సామంతు డొక కుసుమాయుధుడు గలడు. ఇతడు దన్నేలిన ప్రభువునకు బాసటయై నిలిచి రాష్ట్రకూటబలముల నోడించి యతని నిజరాజ్యమునందు సుప్రతిష్ఠితుని గావించెనని కొలవిశిలాశాసనమునందు చెప్పియున్నది.[1] కావున ముదిగొండచాళుక్యప్రథమకుసుమాయుధుడు మొదటి చాళుక్యభీమునికి సమకాలికు డనుటకు మనము సంశయ మందవలసినది లేదు. ఇతని కుమారుడగు బిజయితుడే యిమ్మడి యరికేసరిచే రక్షింపబడిన చాళుక్యబిజ్జ - విజయాదిత్యుడు. ఇతడు పాలించుచుండినది రణమర్దకసీమ. కృష్ణాజిల్లాలోని కొండపల్లి మొదలుకొని వరంగలుజిల్లాయందలి కొలవిపర్యంతము గల భూమి యితని పాలనక్రింద నుండినది. మంచికొండసీమ యతని రాజ్యమునకు జెందినదే. ఇతని రాష్ట్రమున కుత్తరపుసరిహద్దు వేములవాడ చాళుక్యరాజ్యము. రాష్ట్రకూటనాల్మడి గోవిందరాజు రాజ్యము తూర్పున సముద్రముపర్యంతము వ్యాపించియుండినందున ద్వితీయయుద్ధమల్ల అరికేసరులవలె నీ ముదిగొండ బిజయితుడుగూడ రాష్ట్రకూటసామంతుడని నిశ్చయించి చెప్పవచ్చును.

1. తెలిం. శాస. ఇతర. సెం. ౧౨.

నాల్గవ గోవిందరాజునకు బిజ్జనిమీద నేల కోపము గలిగెనో నిశ్చయముగ మనకు దెలియదు. కాని యూహ సేయవచ్చును. బిజ్జని వంశమువారు పూర్వచాళుక్యరాజుల కాశ్రితులైన సామంతులు; అతని తండ్రియగు మొదటి కుసుమాయుధుడు ప్రథమచాళుక్య భీము నికి సామంతు డనియు, వేంగిదేశముపై నెత్తివచ్చిన ఇమ్మడికృష్ణ వల్లభుని నిగ్రహించి తన రాజును రాజ్యమున సుప్రతిష్ఠితుని గావించె ననియు బూర్వప్రకరణమున దెల్పియున్నాడను. నిజరాజ్యస్వాతంత్ర్య స్థాపనకై రాష్ట్రకూటులతో బోర సమకట్టిన ద్వితీయ చాళుక్య భీమునకు బిజ్జడు ప్రత్యక్షముగనో, రహస్యముగనో సహాయము జేసి యుండవచ్చును. అందులకు గినిసి నాల్గవ గోవిందచక్రవర్తి యతని ంచుటకు బ్రయత్నింపగా నతడు దన పొరుగున నుండు వేముల వా ప్రభువును, దనవలెనే చాళుక్యవంశసంభూతుడును నగు నిమ్మడి యరికేసరిసాయము నపేక్షించెను. అరికేసరి నాల్మడి గోవిందరాజునకు బావమరదియైనను నతనియెడ విముఖుడై యతని శత్రుల కేల తోడ్పడెనో చెప్పుటకు వీలుగాదు; కారణ మెద్దియైనను నీతడు చక్ర వర్తిని బ్రతిఘటించి యతని పతనమునకు గారకుడాయెను. వేముల వాడ శిలాశాసనమందును, విక్రమార్జునవిజయమందును నరికేసరి నాల్మడి గోవిందరాజు నత్యంతసులభముగ నోడించి రాజ్యపదభ్రష్టుని గావించె నని చెప్పియున్నది. ఇది కేవల మతిశయోక్తి. నాల్మడి గోవిందచక్రవర్తి- యతని శత్రువులును, వారి వాక్యములే వేద వాక్యము లని విశ్వసించి యతనిచరిత్రను రచియించు నాధునికపరి శోధకులును చెప్పునట్లు- దుశ్చరిత్రుడును, దుర్బలుడును గాడు. కర్ణాటకమునందలి సామంతు లందఱును నతనియందు విశ్వాసమును గోలుపోలేదు. పాశ్చాత్యగంగరాజగు రాజమల్లుడును, కదంబబిజ్జడు మొదలగు పెక్కండ్రతనిపక్షమునసే యుండిరి. గోవిందుని బ్రతి ఘటించిన సామంతులలో ప్రముఖులు తెలింగాణ వేంగిదేశములను

పాలించుచుండిన చాళుక్యప్రభువులే. ఇమ్మడి యరికేసరి, బిజ్జడు, ద్వితీయచాళుక్య భీముడును విప్లవకారులయం దగ్రేసరులు. నాల్మడి గోవిందరాజు వీరి నడచుటకు రెండుమూడుపర్యాయములు ప్రయత్నము జేసెను.

(౧) తన సామంతుడైన పూర్వచాళుక్య ద్వితీయయుద్ధమల్లునికి బాసటగ రాజమయ్య మొదలగు దండనాయకుల యాధిపత్యము క్రింద నొక గొప్ప సైన్యమును వేంగిపై కంపెను. ఈ సైన్యము నొక మహాభీకర సంగ్రామమున ద్వితీయచాళుక్యభీము డోడించె నని కలుచంబఱ్ఱుతామ్రశాసనమువలన దెలియవచ్చుచున్నది.[1]

(౨) ఇమ్మడి యరికేసరి చాళుక్యబిజ్జని కాశ్రయ మిచ్చినందులకు గినిసి యాతని శిక్షించుట కొక సైన్యము నంపెను. వేములవాడ శిలాశాసనమునం దిట్లున్నది :

"సామన్తాన్దణ్ణముఖ్యాన్నిజ భుజపరిఘాప్రస్ఫురత్ఖడ్గధారా
నీరాంభోరాశిమగ్నాం స్తురగ కరిఘటా పత్తి సంపత్తియుక్తాన్
కృత్వా పశ్చా (?) య్యేన మార్యం స్వజనపరిజనైః సన్నిహత్యాఽఽజిరంగే
కృద్ధే గోవిందరాజే శరణముపగతో రక్షితో యేన బిజ్జః." [2]

ఈ యంశము పంపని విక్రమార్జునవిజయమందును సూచింపబడియున్నది.

"చళుక్యకుళతిళకనప్ప విజయాదిత్యంగె గోవిందరాజం ముళియె తళరదె పెఱగిక్కె కాదశరణాగతజలనిధియ పెంపుమం, గొజ్జిగనెంబ సకళచక్రవ ర్తియ బెససె దండువంద మహాసామంతరం మరలిఱిదుగెల్ద సామంత చూడామణియ బీరముమం", "గొజ్జిగనెంబ సకలచక్రవర్తి ముళియె తనగ శరణాగతనాద విజయాదిత్యనకాద బల్లాళ్తనదొళ్ శరణాగతజలనిధియుం."[3]

---

1. ఎపి. ఇండి. సం. ౪, పుట ౧౪౪ తరువాయి.

2. తెలిం. శాస. ఇతర నెం. ౨౧.

3. విక్ర వి. ౯_౫౨_౫౩ల మధ్య వచనము, ౧౪: ౩౪_౩౭ల మధ్యవచనము.

(3) ఇట్లు గోవిందరాజు పంపిన సామంతబలము నోడించి నను నతనితోటి పోరంతట ముగియలేదు. మరల గోవిందరాజెత్తి రాగలడు; అతని నెదుర్కొనుటకు దగు ప్రయత్నము జేయవలసి యుండెను; కావున నతడు తన దృష్టిని త్రిపురివైపునకు ద్రిప్పెను. బద్దెగని పక్ష మవలంబించిన నతనితోగూడ చేదిబలము దనకు సహాయము రాగలదు. అతని మామగారగు యువరాజదేవు డతని రాష్ట్రకూటసామ్రాజ్యమున బ్రతిష్ఠించుటకు దన యావచ్ఛక్తిని వినియోగించును—అని చింతించి గోవిందుని రాజ్యభ్రష్టునిగావించి, యతని స్థానమున బద్దెగని స్థాపించుట తనకు శ్రేయస్కరమని నిశ్చయించి బయలువెడలి వేములవాడకు రమ్మని యాహ్వానించెను బద్దెగడు వెంటనే త్రిపురినుండి తరలివచ్చి వేములవాడ జేరెను. తరువాత యుద్ధము ప్రారంభమైనది. ఈ పోరాటమునుగూర్చి మన కేమియు దెలియదు; కాని తుద కరికేసరి విజయము నందె ననియు, నాల్మడి గోవిందుని యేలుబడి యంతటితో సమాప్తినంది బద్దెగని పాలన యారంభమాయె ననియు, ననతివర్తియాగి మార్మలెవ చక్రవర్తియం కిడిసి తన్న నంబి వంద బద్దెగదేవంగె సకళ సామ్రాజ్యమనోరంతుమాడి నిఱిసిదరికేసరియ తోళ్వలముమం' అను పంపకవి వాక్యమువలన దెలియుచున్నది.[1] ఈ యుద్ధమున నిమ్మడి యరికేసరి నాల్మడి గోవిందరాజును జంపె నని కొందఱు పరిశోధకు లభిప్రాయపడుచున్నారు.[2] ఈ యభిప్రాయము సరియైనదని యంగీకరించు

1. విక్ర వి. ౯: ౫౨-౫౩ ల మధ్య వచనము.

2. శ్రీభావరాజు వి. కృష్ణరావుపంతులుగారు ఇట్లనుచున్నారు. "రాష్ట్రకూట రాజగు గొజ్జిగడు దనయధికారమున కెదురుదిరిగిన సామంతరాజులను శిక్షించుటకై గొప్ప దండుతో గూడ స్వయముగ వారిపై నెత్తిపోయెను: కాని యటుపిమ్మట నడచిన యుద్ధములో నత డోడి నిహతుడాయెను." (J. A. H. R. S. VI. P. 184.) ఇది 'చక్రవర్తియం కిడిసి' అను పంపకవిమాటలపై నాధారపడి

టకు వీలు లేదు. ఏలనగా, సమకాలిక చోళశాసనములవలన నాల్మడి గోవిందరాజు దన పరాజయానంతరము తనకు పిల్లనిచ్చిన మామ గారగు చోళరాజు పరాంతకుని రాజ్యమున గనీసము క్రీ. శ. ౯౩౭ వఱకు నివసించుచుండినట్లు తెలియవచ్చుచున్నది.[1]

ఇమ్మడియరికేసరి ఘనకార్యములలో వివరింపవలసిన దింకొక్కటి మిగిలియున్నది ; కక్కలుని తమ్ముడైన బప్పువనియంక కాఱునిపై నితని విజయము. కక్కలుని యానవాలుపట్టుటయందు పరిశోధకులు భిన్నాభిప్రాయములను వెలిబుచ్చియున్నారు. డాక్టరు బార్నెటు, ఇతడు కక్కడను నామాంతరముగల కడపటి రాష్ట్రకూటచక్రవర్తియగు ద్వితీయకక్కలుడు గావచ్చు ననిరి.[2] ఈ వ్యక్తి నిర్ణయమునే శ్రీ భావరాజు వి. కృష్ణరావుపంతులుగా రంగీకరించిరి. మఱియు నితని తమ్ముడగు బప్పువడే యొక సైన్యముతోగూడ నిమ్మడియరికేసరిపై యుద్ధమునకువచ్చి యతనిచే నిర్జితుడై యతనికి లొంగెనని వ్రాసియున్నారు.[3] డాక్టరు బార్నెటుగారి వ్యక్తినిర్ణయము సరియైనది కాదని ఆచార్య కె. ఎ. నీలకంఠశాస్త్రిలవారు త్రోసిపుచ్చిరి. వీ రిట్లు చెప్పుచున్నారు: "ఇచట పేర్కొనబడిన కక్కలుడు తరువాత చాల కాలమునకు రాజ్యమునకు వచ్చినట్టి యాపేరిటి కడపటి రాష్ట్రకూటరాజు కాజాలడు. అత డప్రకటిత మైన శిలాహారతామ్రశాసనమున ముమ్మడి యమోఘవర్షునిచే బరాభూతుడైనట్లు చెప్పియుండు ఆపేరిటి మనుజుడై యుండవలయును. బప్పువడు గోవిందుని పక్షము నవలంబించి నిజగజదళములతో నతని

యున్నది. 'కిడిపి' యనగా 'చెఱచు' అని యర్థము. ౨కి 'చంపి' యను నర్థ ముండునటు తోచదు.

1. ఏ. ఎస్. రామనాథయ్యరు. ఎపి. ఇండి. సం. ౨౬. పుటలు ౨౩౦_౨౩౨.

2. ఎపి. ఇండి. సం. ౧౩, పుట. ౩౨౯.

3. JAHRS. VI. P. 184.

నెదుర్కొని యుద్ధముజేసి యోటమి నందియుండవలయును''[1] ఈ రెండు వ్యక్తినిర్ణయములలో నాచార్య నీలకంఠశాస్త్రులవారిదే సమంజసముగను, సంగీకార్యముగను నున్నది. కాని డాక్టరు బార్నెట్టుగారి కక్కలునికిగాని, యాచార్యనీలకంఠశాస్త్రిలవారి కక్కలునికిగాని బప్పువ డను తమ్ము డుండె ననుట కెట్టి యాధారమును గానరాదు. మఱియు శ్రీ భావరాజు వి. కృష్ణరావుపంతులుగారును, నాచార్య నీలకంఠశాస్త్రిలవారును బప్పువడే స్వయముగ నిమ్మడి యరికేసరితో బోట్లాడి యోడిపోయినట్లు వ్రాసియున్నారు; కాని వీరి యభిప్రాయముతో పంపకవి వాక్య మించుక విరోధించుచున్నది. "కక్కలన తమ్మనప్ప బప్పువనంకకాఱన నొందు మదాంధగంధసింధురద నోడిసిద వైరిగజఘటావిఘటన నదటుమం"[2] అను వాక్యము వలన నిమ్మడి యరికేసరి నెదిరించినవాడు బప్పువని యంకకాడుగాని బప్పువడుకాడని స్పష్టమగుచున్నది. అంకయుద్ధమున నొకనికై మఱియొకనితో యుద్ధముసేయు ప్రతినిధి యంకకా డనబడుచున్నాడు[3]. ప్రతినిధి పొందిన జయాపజయములు నియోజకునివే యైనను నాధారగ్రంథాదులం దుండు విషయము నుండునట్లే చెప్పుట మంచిది.

ఇమ్మడి యరికేసరినిగూర్చి మనకు దెలియవచ్చెడు విశేషాంశము లింకేమియు గానరావు. ఇతని కొలువున (సోలదగండ) బద్దెగని తంత్రపాలుడైన నాగమార్యుని పుత్రుడు పెద్దణార్యుడను బ్రాహ్మణుడు తంత్రపాలుడుగ నుండెను. తంత్ర ... బు డనగా సేనాధిపతి. దీనివలన వేములవాడ చాళుక్యుల యేలుబడిక్రింద పెద్దణార్యుని కుటుంబమువారు కులక్రమాగతులుగ, సేనాధిపతులుగ నుండిరని

1. Journal of the Madras University XV, No. 2, P. 124.
2. విక్ర. వి. ౯ : ౫౨-౫౩ ల మధ్య వచనము.
3. మా. భారతి సం. ౨౪. పుటలు ౪౯౩-౬.

తెలుచున్నది.[1] పెద్దణార్యునిచే ప్రార్థింపబడి ఇమ్మడి యరికేసరి యతనిచే నిర్మితమైన యాదిత్యగృహమునకు వచ్చు నభ్యాగతజనుల సత్రముకొఱకు భూదానమొసగెను. ఈ దానమును బ్రకటించుటకొఱకే వేములవాడ శిలాశాసన ముల్లేఖింపబడినది. ఈ పెద్దణార్యుడుగాక ఇమ్మడి యరికేసరియనుచరులలో మఱియొకని పేరీశాసనమువలన దెలియవచ్చుచున్నది. ఇతని పేరు గుణకశర్మయని డాక్టరు మారేమండ రామారావుగారు పఠించిరి. శ్రీకృష్ణరావుపంతులుగారు 'గుణకరశేన'యని చదివిరి. ఆచార్య నీలకంఠశాస్త్రిలవారు కృష్ణరావుగారి పాఠమునే యంగీకరించిరి. శాసనప్రతిబింబములను దెప్పించుకొని వానిని జక్కగ పరిశీలించి 'గుంణాకుశేన' యనునది సరియైన పాఠ మని కీ. శే. రావుబహదూరు సి. ఆర్. కృష్ణమాచార్యులవారు నిర్ణయించిరి. ఇతడు ఇమ్మడియరికేసరి యొక్క మహాసాంధివిగ్రహికుడు. గుణాంకుశుని వేములవాడశాసనమునందు పేర్కొనుటకు గారణము లేకపోలేదు. సాంధివిగ్రహులు మంత్రులనియు, నన్యరాజులతో సంధిగాని, యుద్ధముగాని వీరి మూలముననే జరిగెడిదనియు జరిత్రపరిశోధకు లభిప్రాయపడుచున్నారు. కాని లభ్యమైన సాక్ష్యమును బట్టి చూడగా వీరి వృత్తిధర్మమునకు సంధివిగ్రహములతో నెట్టిసంబంధ ముండినట్లు గానరాదు. వీరు శాసనములయందు సర్వ

---

1. ఆచార్య నీలకంఠశాస్త్రిలవారీ బద్దెగడు వేములవాడ చాళుక్యబద్దెగడు గాడనియు, ముమ్మడి యమోఘవర్ష బద్దెగడు గావలయుననియు నభిప్రాయపడుచున్నారు. పెద్దణార్యుని తండ్రియైన నాగమార్యుడు బద్దెగని సత్రపాలు డని వ్రాసిరి. ఇది డాక్టరు మారేమండ రామారావు, శ్రీ భావరాజు వి. కృష్ణరావు పంతులుగారల యపపాఠము నాధారముజేసికొని వ్రాసినది. శాసనప్రతిబింబమున (చూ, ఆంధ్రేతిహాస పరిశోధన పత్రిక. సం. ౬. పుట ౧౮౯ ఎదుట)—

౨౫. "శ్రీమా న్సధి బ్బద్దిగభూమిభర్తు స్త[ం]

౨౬. త్రాధిపాలోఽ జని నాగమార్యః" అనియే యున్నది.

సామాన్యముగ శాసనగ్రంథరచయితలుగనే పేర్కొనబడియున్నారు. సాంధివిగ్రహిపదముల కిచట సాద్గుణ్యముతో నెట్టి సంబంధ ముండు నట్లు తోచదు. వీని కిచట వాక్యరచనయందు శబ్దములను గూర్చుట, సమస్తపదములను విడదీయుట యని యర్థము జేసికొనుట యుక్తము[1]. కావున గుణాంకుశుడు వేములవాడశాసనగ్రంథమును రచియించుట చేత నత డందు పేర్కొనబడియెను.

"సంధివిగ్రహచింతాఽస్య పదవిద్యా స్వభూ త్పరం
ధూతయాతవ్యపక్షస్య క్వ సంధానం క్వ విగ్రహః"

ఈ శ్లోకముపై గన్నడవ్యాఖ్య: "భరతరాజనిగె సంధియ చింతెయూ విగ్రహద చింతెయూ ముఖ్యవాగి వ్యాకరణశాస్త్రగళ ల్లిద్దదు. సంధియూ యుద్ధవూ ఇరలిల్లవెం దర్థవు. శత్రుపక్షవన్ను నాశమాడిద వనిగె సంధి యెల్లి? యుద్ధవెల్లి?"

## ౯- వాగరాజు, భద్రదేవుడు, ముమ్మడియరికేసరి

ఇమ్మడి యరికేసరి యనంతరము మఱి రెండు తరముల చాళుక్యరాజులు వేములవాడయందు రాజ్యమొనర్చినట్లు తెలియ వచ్చుచున్నది. ఇతని జ్యేష్ఠపుత్రుడైన వాగరా జితని మరణానంత రము రాజ్యమునకు వచ్చి క్రీ. శ. ౯౫౯ వ సంవత్సరప్రాంతమున పాలించుచుండెను. ఇతడు రాష్ట్రకూట ముమ్మడి కృష్ణభూపాలుని కాశ్రితుడు. ఇతని యాస్థానమున సోమదేవసూరియను జైనపండితు డుండెను. సోమదేవసూరి గొప్ప విద్వాంసుడు. జినధర్మప్రవర్తకుడు[2]. వాగరాజునకు భద్రదేవు డను తమ్ము డొక డుండెను. ఇత డిమ్మడి యరికేసరికి రాష్ట్రకూటకులజాతయైన లోకాంబికయందు జనన మందెను. భద్రదేవుడు రాజ్యముజేసిన ట్లగపడదు. ఇతని కుమారుడు

1. cf. జినసేనకృతపూర్వపురాణము. త్రింశ తమ పర్వము, ౧౧
2. యశస్తిలక. (కావ్యమాల. నెం. ౭౦) పుట ౪౧౯.

ముమ్మడి యరికేసరి. వాగరాజునకు బిడ్డలు లేకపోవుటచేతనో, మఱి యే కారణముచేతనో యతని తరువాత నతని తమ్ముని కుమారుడైన ముమ్మడి యరికేసరి గద్దెనెక్కెను. ఇతడును దన పెదతండ్రివలె రాష్ట్రకూట ముమ్మడి కృష్ణభూపాలుని కాశ్రితుడు; క్రీ. శ. ౯౬౯ వ సంవత్సరమున నితడు లేంబులవాటక (వేములవాడ) నామధేయ నిజరాజధానియందు రాజ్యముసేయుచుండెను. ముమ్మడి యరికేసరి 'పామ్బరాంకుశ శౌమ్మనగంధవారణ గద్దేభ విద్యాధర ప్రియగల్ల త్రిభువనమ ల్లోదాత్తనారాయణ ప్రత్యక్షవాద్వలి విక్రమార్జున గుణనిధి గుణార్ణవ సామన్తచూడామ' ణ్యాది పెక్కు బిరుదములు గలవాడు[1]. ఈ బిరుదులన్నియు నితనికి కులాక్రమాగతముగ వచ్చినవి. ఇమ్మడి యరికేసరికి గూడ నీ బిరుదు లుండినట్లు, 'పాంబరాంకుశ నమ్మన గంధవారణం గద్దేభ విద్యాధర నారూఢ సర్వజ్ఞ నుదాత్తనారాయణం నొడుత్తిగెల్వాం గుణనిధి గుణార్ణవం శరణాగతవజ్రపంజరం ప్రియగళ్ళం త్రిభువనమల్ల సామన్తచూడామణి' యను వేములవాడ శిలాశాసనములోని యంకమాలికవలన దెలియుచున్నది[2]. ముమ్మడి యరికేసరి చేసిన ఘనకార్యము లెవ్వియు గానరావు. క్రీ. శ. ౯౭౩ వ సంవత్సరమున చాళుక్యవంశజుడైన రెండవ తైలపదేవుడు రాష్ట్రకూట సామ్రాజ్యమును గూలద్రోసి యుత్సన్నమైపోయిన పాశ్చాత్యచాళుక్యసామ్రాజ్యమును పునఃప్రతిష్ఠ యొనర్చెను. రాష్ట్రకూటుల ప్రభుత్వముతో గూడ వేములవాడచాళుక్యుల యేలుబడియు నంతరించినది. తరువాత నీ వంశమువారు చరిత్రనుండి సంపూర్ణముగ నదృశ్యులైపోయిరి.

ముమ్మడి యరికేసరి తన పెదతండ్రిని బోలి జైన విద్వాంసుడగు సోమదేవసూరి కాశ్రయమిచ్చెను. ఇతడు తన తండ్రియగు బద్దెగనిచే

1. పర్భణిశాసనము. జైన సాహిత్య ఔర్ ఇతిహాస్, పుట ౮౫.

2. తెలిం. శాస. ఇతర. నెం. ౨౧.

నిర్మింపబడిన శుభధామజినాలయాఖ్యవసతియొక్క ఖండస్ఫుటిత నవసుధాకర్మబలినివేద్యార్థము పై సోమదేవసూరికి సబ్బిసహస్రాన్తర్గత రేపాకదశగ్రామమధ్యమందలి కుత్తుంవృత్తి పలుకటునామగ్రామమును దానముజేసెను. సోమదేవసూరిగాక పెద్దనభట్టను కవియొకడు గూడ ముమ్మడి యరికేసరియొద్ద నుండెను. ఇతడే పర్భణి శాసన గ్రంథకర్త[1].

## ౧౦ - మతవాస్తువాఙ్మయములు

(౧) మతము :— వేములవాడ చాళుక్యరాజులు మతాభిమానముగల ప్రభువులైనను వారవలంబించిన మత మిట్టిదని నిశ్చయించి చెప్పుటకు వలనుపడదు. రాజధర్మము ననుసరించి రాష్ట్రమున బ్రచారమం దుండిన సర్వసమయములను బక్షపాతము లేక సమానదృష్టిని జూచుట వారి విధి. కావున రాజులొసర్చిన దానాదులను బట్టియు, కవి పండిత సమ్మానమునుబట్టియు వారనుసరించిన మతమును నిశ్చయముగ గనుగొనుటకు సాధ్యపడదు. ఇంతవఱకు లభించిన శాసనాదిసాక్ష్యమును బట్టి చూడగా వేములవాడ చాళుక్యులకాలమున శైవజైనమతములు ప్రబలియుండినట్లు తెలియవచ్చుచున్నది. వీనితోపాటు సౌరమతముగూడ ప్రచారమున నుండెను. దేవాలయములతోగూడ శైవసన్యాసుల మఠము లుండెడివి. కొల్లిపఱ తామ్రశాసనమున శ్రీశైలమున కుత్తరద్వారమైన ఏలేశ్వరమున నొక కాలాముఖమఠ ముండినట్లు చెప్పియున్నది. సద్యోశివాచార్య ముగ్ధశివాచార్యు లను శైవసన్యాసులు - గురుశిష్యు - లిచట నివసించుచుండిరట.[2] మఱియు వేములవాడ శిలాశాసనమున నచటి దేవాలయములందునివసించు సాక్షిమల్లికార్జున ముక్తిలింగి విద్యారాశి

1. జైన్ సాహిత్య ఔర్ ఇతిహాస్. పుట ౧౫.

2. భారతి. సం. ౭. భా. ౨. పుటలు ౩౧౫-౬.

వ్యాఖ్యాని భట్టారకుడు పేర్కొనబడియున్నాడు; ఇతడు అచటి దేవాలయములకు స్థానాధిపతి. ఇతడా శాసనమున నిట్లు ప్రశంసింప బడియున్నాడు :

"నిష్ప్రపైకాగ్రణీ స్సూరి స్థానాధిష్ఠాయకస్స్వయం
ధాతవీయాన్వయే జాతః పండితశ్చ మునీశ్వరః."[1]

ఈ మఠములు కేవలము సన్న్యాసుల యునికిపట్టుమాత్రము గావు. అవి విద్యాస్థానములు. కొల్లిపఱ శాసనోక్తదానము విద్యాదాన మని యందు కలదు: "అయం శ్రీమ దరికేసరిణో ధర్మః; విద్యాదానమిదం దత్తమ్[2]" విద్యాదాన మనగా విద్య యొసగుటకు వలయు సదుపాయములను గల్పించుటకై చేసిన దానము. ప్రతి కాలాముఖమఠమునను నొక ధర్మ విద్యాశాల యుండెడిది. ఆ కాలమున ప్రసిద్ధి కెక్కిన విద్యల నన్నిటిని అచటికి విద్యాభ్యాసముకొఱకు వచ్చువారికి, వేతనములను బుచ్చుకొనక యుచితముగ గరపెడివారు. విద్యార్థులకు గొఱతవడనీయక యన్నపానీయాదు లొసగుట కచట నన్న సత్రములు గలవు. నివసించుటకు దగు వసతిగృహాము లుండెడివి. వేదశాస్త్రాగమపురాణేతిహాసకావ్యనాటకాది సకలవిషయములను బోధించుట కచట సమర్థులైన విద్వాంసు లుండువారు. వీరు తమ తమ యభిమాన విద్యలయందు సంపూర్ణ పాండిత్యమును గలిగి తమ శిక్షక్రింద నుండు విద్యార్థుల కాయా శాస్త్రాదులను జక్కగా నేర్పుచు సమయము వచ్చినప్పుడు శాస్త్రవాదములయందు పాల్గొని తమ వ్యక్తిత్వమును నిలబెట్టుకొనుటకు దగిన శక్తిసామర్థ్యములు గలిగియుండిరి. విద్యాస్థానములందు నిరంతరము సరస్వతిసేవ యందే కాలము గడుపుటకీ యుపాధ్యాయుల కప్పటి వదాన్యులు

1. తెలిం. శాస. ఇతర. నెం. ౨౧.

2. భారతి. సం. ౭. భా. ౨. పుట ౩౧౬.

సదుపాయములను గల్పించువారు. వేతనమునకు బదులు వీరికి భూవృత్తుల నొసంగి, నివసించుట కనుకూలములైన గృహారామము లను నిర్మించి యిచ్చువారు. సంఘాభివృద్ధికై ప్రభుత్వము నిర్వహింప వలసిన ప్రధానబాధ్యతలు కొన్ని ఈ మతసంస్థలపై బడెను. కావున నవి యిహపరములు రెంటికిని మార్గదర్శు లాయెను.

హిందూధర్మమునకు దేవాలయము లెట్లో జినసమయమునకు బసతు లట్లు. దేవాలయములవలె వాని ప్రధానకృత్యము మతప్రచా రమే యైనను నవియు సంఘాభివృద్ధి కావశ్యకములగు ప్రాపంచిక విష యములయెడ నౌదాసీన్యము వహించియుండలేదు. జైనసన్న్యాసు లును దమ శిష్యకోటికి విద్యాబుద్ధులు గరపుచు లోకసంగ్రహము నకు దోడ్పడుచువచ్చిరి. వేములవాడ చాళుక్యులకాలమున శైవము వలె జైనమతముగూడ నభివృద్ధి నందినది. సామాన్యజనులే కాక రాజులును, సామంతులును దరచుగ జైనదీక్షను స్వీకరించుచుండిరి. హిందువులవలె జైనులును బ్రహ్మక్షత్రియాదివర్ణ విభేదమును బాటించుచుండుటచే నప్పుడు జనులు సులభముగ నొక మతమును విసర్జించి మఱియొక దానిని స్వీకరించుట కవకాశ ముండెడిది. మతము మారినను గులము చెడకుండు కారణమున సంఘము విచ్ఛి న్నము గాక యథాపూర్వము నిలిచియుండెను.

వాస్తునిర్మాణము :— వేములవాడ చాళుక్య రాజులనాటి ప్రాసాదమందిరాదికట్టడము లేవియు గానరావు. శాసనములనుబట్టి వీరు కొన్ని దేవాలయాదులను నిర్మించిన ట్లూహించుట కవకాశము గలదు. వేములవాడ శిలాశాసనమున రాజేశ్వరాదిత్యగృహ బద్దె గేశ్వరాలయములు పేర్కొనబడియున్నవి. రాజేశ్వర బద్దెగలను వారు నిర్మించుటవలననో, వారి జ్ఞాపకార్థము కట్టబడుటవలననో వీని కా పేరులు వచ్చియుండవలయును. వేములవాడ చాళుక్యులలో మొదటి నరసింహునికి రాజాదిత్యు డను నామాంతరము గలదు.

సోలదగండ బద్దెగడు సుప్రసిద్ధుడు. వీరిచేగాని, వీరి పేరగాని పై దేవాలయములు నిర్మింపబడియుండవచ్చును. మఱియు బద్దెగభూమిపాలుని తంత్రపాలుడైన నాగమార్యుని కుమారుడు ఒద్దన మఱియొకయాదిత్యగృహమును నిర్మించెను[1]. ఇట్లే పర్భణిశాసనమున ముమ్మడి యరికేసరితండ్రియగు రెండవబద్దెగనియొక్క శుభధామజినాలయమొకటి పేర్కొనబడియున్నది. ఈ దేవాలయములును, జినాలయములును నింకను నిలిచియున్నవో, లేక నామమాత్రావశిష్టము లైనవో తెలియదు. ఇవి యేస్థితియం దుండినను, వేములవాడ చాళుక్యరాజులును, వారి యనుచరులును వాస్తునిర్మాణమునం దాసక్తి గలిగి పెక్కు కట్టడములను గట్టించువారని తెల్లమగుచున్నది.

వాఙ్మయపోషణ :— వేములవాడ చాళుక్యులు రాజ్యము సల్పినది తెలుగుదేశము. వారు కర్ణాటక వాఙ్మయమును పోషించిరి. కన్నడకవులయం దగ్రగణ్యుడైన పంపకవి యిమ్మడి యరికేసరి యాస్థానమున వెలసెను. ఇతడు రెండు మహాకావ్యములను రచించెను. ఇతని యాదిపురాణమును, విక్రమార్జునవిజయమును నెఱుగని యక్షరాస్యుడైన కర్ణాటకు డెవ్వడు నుండడు. పంపకవి కమ్మనాటిలోని వేంగిపఱ్రుగ్రామవాస్తవ్యుడైన యాంధ్రజైనబ్రాహ్మణుడు. ఇతడు తాను రచించిన రెండు కబ్బములలో విక్రమార్జునవిజయమున మహాభారతకథను వర్ణించి దన స్వామియగు నిమ్మడియరికేసరినరపాలుని కంకిత మిచ్చెను. ఇతడు రచియించిన రెండవగ్రంథ మాదిపురాణము. ఇది జైనమతగ్రంథము. జైనతీర్థంకరుల చరిత్ర మిందు వర్ణింపబడియున్నది. ఆంధ్రదేశమున వెలసిన కన్నడ కవి పంప డొక్కడే కాడు. శాంతిపురాణ, భువనైకరామాభ్యుదయాది కావ్యములను విరచించిన పొన్నడును నీ తరగతికి జెందినవాడే.

1. తెలిం. శాస. ఇతర. ౨౨.

ఇప్పటి యుత్తర ఆర్కాటుమండలములోని వాణియంబాడి యీతని జన్మదేశమైనను, ఇతడు కావ్యరచన మొనర్చి కీర్తిగడించిన దాంధ్ర దేశమునందే. ఇతడు వయస్సుచే పంపనికంటె నించుక పెద్దవా డైనను సమకాలికుడే. పంపని జన్మస్థానమగు కమ్మనాటియందే యితని కవితామతల్లి పుష్పించినది. ఆకాలమున వేంగిమండలాంత ర్గతమైన కమ్మనాటిలోని పుంగనూరుగ్రామమున నొక్క జైన బ్రాహ్మణకుటుంబ ముండెను. ఆ కుటుంబమునకు జెందిన నాగమయ్య యను భూమిదేవునికి మల్లపపున్నమయ్య లను పుత్రు లిరువురు కలి గిరి. అప్పటి బ్రాహ్మణు లనేకులవలె వీరును శస్త్రోపజీవులు. ఈ బ్రాహ్మణకుటుంబమును పొన్న డాశ్రయించి నాగమయ్యపుత్రుల ప్రోత్సాహముచే శాంతిపురాణమును రచించెను. మఱియు నితని కవి త్వమునకు మెచ్చి యితనికి రాష్ట్రకూటముమ్మడికృష్ణచక్రవర్తి 'యుభయకవిచక్రవర్తి' యను బిరు దొసగెనట. ముమ్మడికృష్ణ చక్రవర్తికే ఇతడు తన భువనైకరామాభ్యుదయము నంకితము జేసిన ట్లున్నది. మల్లపయ్యపుత్రికయగు నత్తిమబ్బె చాళుక్యచక్ర వర్తియగు తైలపదేవుని మహామంత్రియగు దల్లపుని పుత్రుడగు నాగ దేవుని బెండ్లియాడెను. ఈమె దానచింతామణి యని ప్రఖ్యాతి నందినది. ఈమెకుమారుడు పడెవాలుతైలపుడు. అత్తిమబ్బెకు తండ్రికి వలె కన్నడభాషయం దభిమానము మెండు. ఈమె గదాయుద్ధాజిత నాథపురాణకృతికర్తయగు రన్నమహాకవికి బోషకురాలు. ఇట్లు కన్నడకవిరత్నత్రయ మనబఱగు పంప పొన్న రన్న కవులకు ముగ్గురికి నాంధ్రదేశముతో గాఢమైన సంబంధ ముండె నని తెల్లమగుచున్నది. మొదటివా డాంధ్రబ్రాహ్మణుడు ; తక్కినవారి కిరువురికిని పుంగనూరు ద్విజోత్తముడగు నాగమయ్యపుత్రులును, పౌత్రియు బోషకులు.

ఇచట విచారింపదగిన ముఖ్యాంశ మొకటి కలదు. ఆంధ్రుల కీ యుగమున గన్నడభాషపై నీ యభిమాన మేల కలిగినది? స్వభాష

యగు తెనుగు వదలి పంపడు కన్నడమున నేల గ్రంథరచనకు గడ గెను? మల్లపపొన్నమయ్యలును, నత్తిమబ్బెయును కన్నడ కవుల నేల యాదరించిరి? క్రీ. శ. ౧౧ వ శతాబ్దము వఱకును తెనుగున గావ్యరచన ప్రారంభముకాలేదు. తత్పూర్వ మాంధ్రులు సంస్కృత ప్రాకృతాదిభాషల యందే గ్రంథరచన సాగించెడివారు. దీనికి గారణము వారాడు భాష గ్రంథరచనకు దగిన స్థితియం దుండక పోవుటయే. క్రీ. శ. ౭ వ శతాబ్దమునకు బూర్వము మనమాడు నాంధ్రభాష ప్రచారమున నుండెనని చెప్పుటకు దగిన సాక్ష్యము లేదు. క్రీ. శ. ౬౦౦-౬౩౦ ల మధ్య కంచిరాజ్యమును పరిపాలించు చుండిన మొదటి మహేంద్రవిక్రముని బిరుదావళియం దంధ్రభాష మొదట పొడకట్టుచున్నది. అతనికి సమకాలికులైన రేనాటి తెలుగు చోళరాజులయొక్క శాసనములు సంపూర్ణముగ నంధ్రభాషయందే వ్రాయబడియున్నవి. అట్లే క్రీ. శ. ౭ వ శతాబ్దద్వితీయపాదప్రారంభ మున వేంగిదేశమును జయించిన పూర్వచాళుక్యుల శాసనములు కొన్ని సంపూర్ణముగ తెనుగునందే విరచింపబడియున్నవి. కాని ఈ శాసనములన్నియు వచనశాసనములు. పద్య మెందును గానరాదు. వీని నాధారపఱచుకొని యప్పుడు తెనుగువారు నిజభాషయందు కవనము సెప్ప నేర్చియుండిరో, లేదో నిశ్చయించుటకు వీలులేదు.

చాళుక్యుల రాకతో నాంధ్రదేశచరిత్రయందొక నూతన యుగము ప్రారంభ మగుచున్నది; జాతీయజీవనము బహుళముగ మాఱిపోయినది. ఇమ్మడిపులకేశివల్లభుని విజయములమూలమున తీరాంధ్రమున వేంగిమండలమున నూతనరాజవంశ మొకటి నెలకొని నది. ఇదియే పూర్వచాళుక్యవంశము; ఇమ్మడి పులకేశివల్లభుని తమ్ముడగు కుబ్జవిష్ణు డీ వంశమునకు మూలపురుషుడు. ఇతనిసంతతి వారు పెక్కుశతాబ్దములపర్యంతము తీరాంధ్రభూమిని పాలించిరి. ఈ మార్పు కేవలము రాజకీయము గాదు. నూతనరాజ్యస్థాపనతో నది

యాగ లేదు. చాళుక్యులు కర్ణాటకులు; ఆంధ్రదేశమునకు లాతివారు, ఆంధ్రమండలమును జయించి యందువారు స్థిరనివాసము లేర్పఱచు కొనినపుడు వారు తమతోగూడ దమస్త్రీలను, పరివారమును దోడ్కొనివచ్చిరి. మఱియు దమయధికారమును నిలబెట్టుకొనుటకు చతురంగబలములను దోడ్కొనివచ్చిరి. వీరందఱును కర్ణాటకులే; వీరి యధికారముక్రింద రాజ్యపాలనము గావించుటకు వచ్చిన యుద్యోగులును, సకలనియోగవర్గమును గర్ణాటకమునుండియే వచ్చిరి. వీరితోపాటు వర్తకముకొఱకు వైశ్యులును, శూద్రప్రజయు కర్ణాటకమునుండియే వచ్చి తీరాంధ్రమున నెలవు లేర్పఱచుకొని స్థిరముగ నిలిచిపోయిరి. తీరాంధ్రమున పూర్వచాళుక్యరాజ్యము సంస్థాపనమైనపిమ్మట కర్ణాటాంధ్రదేశముల మధ్య రాకపోకలు హెచ్చి రెండుదేశముల ప్రజలకును దృఢసంబంధ మేర్పడినది. దీని యొక్క ప్రథమఫలము ప్రజాసమ్మిశ్రణము. ప్రజాసమ్మిశ్రణమువలన జనుల యాచార వ్యవహారములయందు కొంత మార్పు కలిగినది; ఈ మార్పు ముఖ్యముగ భాషయందు పొడచూపినది. చాళుక్యులును, వారి యనుచరులును కన్నడభాషనాడువారు. రాజభాష యగుటచే నది ప్రసిద్ధి కెక్కినది. రాజకీయవ్యవహారములన్నియు దేశభాషయగు తెనుగునందే నడపుచు వచ్చినను పూర్వచాళుక్యరాజులకు చాల కాలమువఱకు మాతృభాషయగు కన్నడముపై నాదరము తగ్గలేదు. కన్నడపదములు, పలుకుబడులు పెక్కు తెనుగున బ్రవేశించినవి. ఇందుమూలమున భాషయందలి శబ్దజాలము విస్తరించినను పరిశుద్ధత చెడినది. తురకరాజులకాలమున నరబీపారసీభాషలయొక్క సంపర్కమువలనను, నాంగ్లేయపరిపాలనయందు ఆంగ్లభాషాసంపర్కమువలనను నెట్టి మార్పు కలిగెనో చాళుక్యయుగమునందు కన్నడభాష పొత్తువలన నంతకుమించిన మార్పు తెనుగున గనుపట్టినది. అప్పుడు శాసనములుదప్ప లిఖితవాఙ్మయ మెద్దియు లేకపోవుటచేత గ్రంథ

రచనయం దభిరుచి గల విద్యావంతు లందఱును సంస్కృతమందో, లేక రాజభాషయగు కన్నడమునందో గ్రంథములను రచియించెడి వారు. ఈ కారణము వలననే పంపాదియాంధ్రజైనకవులు దమ గ్రంథములను కన్నడమున వ్రాసిరి; ఆంధ్రజైనబ్రాహ్మణసామంత ప్రభువులైన మల్లపయ్య పొన్నమయ్యాదులు కన్నడ కవుల కాశ్రయ మొసగి వారిని కర్ణాటకమున గావ్యరచనకు బురికొల్పిరి. కాని తెనుగు దేశమున కన్నడభాష కిట్టి గౌరవము చాలకాలము జరుగ లేదు. రాజకీయకారణములవలన నాంధ్ర దేశమున గన్నడభాషకు బ్రచారము క్రమక్రమముగ తగ్గ నారంభించినది. బాదామిచాళుక్యుల దొరతనము సాగినంతకాలమును పూర్వచాళుక్యులకును, గర్ణాటకుల కును మైత్రి యవిచ్ఛిన్నముగ నడచినది. కాని, క్రీ. శ. ౮ వ శతాబ్ద మధ్యమున రాష్ట్రకూటులు విజృంభించి బాదామిచాళుక్యుల యధి కారమును గూలద్రోసి కర్ణాటకసింహాసనము నాక్రమించినదాదిగ పూర్వచాళుక్యులకు వారితో వైరము పొసగి దినదినప్రవర్ధమానముగ వృద్ధిజెందెను. తదారభ్య కర్ణాటాంధ్ర దేశములకు యుద్ధములు నిరంతర మతితీవ్రముగ నడువసాగెను. ఈ వైరాతిశయమువలన పూర్వచాళుక్యులు దాము కర్ణాటకులగుటను విస్మరించి తమప్రజలతో నేకీభవించి వారివలె దామును నాంధ్రుల మని యెంచసాగిరి. ఈ యభిప్రాయము వీరి మానససీమలో తేకెత్తినప్పటినుండియు దెనుగు భాషయం దభిమానము హెచ్చి దాని బలు దెఱగుల నభివృద్ధిసేయ గడగిరి. కన్నడమునందువలె నాంధ్రమునను కావ్యనిర్మాణము సేయుట యుక్త మని నిశ్చయించి కవుల నాదరించి కవన మల్లుటకు బురికొల్పిరి. ఈ యంశమునే నన్నెచోడదేవుడు దన కుమారసంభవ పీఠికయం దిట్లు తెల్పియున్నాడు:

> "మును మార్గకవిత లోకంబున వెలయగ దేశికవిత బుట్టించి తెనుం
> గు నిలిపి రంధ్రవిషయంబున జన జాళుక్యరాజు మొదలగు బలువుర్."

ఇందువలన దేశికవిత బుట్టించి యంధ్రవిషయంబున దెనుగును చాళుక్యులు నిల్పి రనియు వారికి బూర్వము దెనుగున కవిత్వము లే దనియు, దెల్లమగుచున్నది. దేశికవిత్వము బుట్టించి తెనుగు నంధ్ర విషయమున నిలిపిన చాళుక్యరా జెవ్వడో, యత డావంశమున నేశాఖకు జెందినవాడో తెలియదు. కాని తెనుగుదేశముతో బూర్వ చాళుక్యరాజులకే గాఢతమమైన సంబంధ ముండిన కారణమునను, తెనుగుపద్యరచన ప్రప్రథమమున పూర్వచాళుక్యవంశజుడగు గుణగ విజయాదిత్యుని శాసనములయందే పొడకట్టుచుండుటవలనను నన్నె చోడకవి చెప్పిన విధమున దేశిని కవిత్వమును బుట్టించి తెనుంగు నంధ్రవిషయమున నిలిపిన చాళుక్యరాజు గుణగవిజయాదిత్యుని పూర్వికులగు పూర్వచాళుక్యులలో నొక్కడుగ నుండునని తలచుట యుక్తము.

ఇట్లారంభమైన తెనుగుకవిత్వమునకు కన్నడ కావ్యములు మేలుబంతు లైనవి. తెనుగుకవులకు గన్నడకవులు మార్గదర్శకులైరి. ఆంధ్రకావ్యములలో నాదికావ్య మనదగు నన్నెచోడుని కుమార సంభవమును ప్రాచీనకర్ణాటక కావ్యములతో బోల్చి చూచిన నీ విషయము తెల్లము కాగలదు. నన్నయభట్టు భారతమునకు గూడ కర్ణాటకకావ్యముల సోకు తప్పదాయె. ఇంకొక విశేషము. ఆంధ్ర వాగనుశాసనుడు పూర్వచాళుక్యరాజుల కులక్రమాగతపురోహితు డగుటచే నతని పెద్దలు కుబ్జవిష్ణువుతోగూడ వేంగికి వచ్చి యచట స్థిరనివాసము లేర్పఱచుకొని వేంగినే మాతృదేశముగ స్వీకరించిన కర్ణాటబ్రాహ్మణులు కావలయును. నన్నయభట్టునకు సహాధ్యాయు డును, భారతరచనయందు పాకశాసనికి నారాయణునివలె దోడుపడిన నారాయణభట్టు కర్ణాటకచక్రవర్తియగు నాహవమల్లసోమేశ్వరుని ప్రధానియును, వాణసవంశజుడును నగు కర్ణాటకబ్రాహ్మణుడు.

కావున నన్నయకృతాంధ్రభారతమున కర్ణాటకావ్యపు బోకడలు గానవచ్చుట వింత కాదు.

కుమారసంభవము మొదలగు కావ్యములందు గానవచ్చు కన్నడపదములు, పలుకుబడులు, కవిసమయములు, వర్ణనాదికములు క్రమక్రమముగ సన్నగిలి తుదకు మాసిపోయినవి; కాని కొన్ని యంశములందు తెనుగు కావ్యములపై గన్నడముద్ర స్థిరమై నిలిచినది. దీనికి దార్కాణగ రెండు విషయములను దెల్పుచున్నాడను:

(౧) ఆంధ్రకావ్యములన్నియు—నిర్వచనోత్తరరామాయణాది యల్పిష్ఠసంఖ్యాకములుదప్ప-జంపువులే. సంస్కృతమునను చంపూకావ్యములు గలవు; కాని వాని సంఖ్య యల్పము. అన్నియు నర్వాచీనములు. కేవలపద్యకావ్యములకు గల ప్రఖ్యాతి వానికి లేదు. తెనుగున పద్యకావ్యములు నేతిబీరకాయలు. వానినిబద్యకావ్యము లనుట తప్పు. ఇట్లు మన కావ్యములన్నియు జంపూకావ్యము లగుటకు గారణ మాదియుగమున మన కావ్యనిర్మాతలు కర్ణాటకకావ్యసరణి ననుసరించుటయే. షట్పదికవిత్వ మారంభమగు వఱకును గర్ణాటక కావ్యము లన్నియు జంపువులే. కర్ణాటకమునుండి వచ్చిన చాళుక్య రాజుల ప్రోత్సాహమున దెనుగున కావ్యనిర్మాణమునకు గడగిన తెనుగుకవులు కర్ణాటకఫక్కి ననుసరింపక తప్పినది కాదు. వారు వేసిన పునాదులపై నిర్మాణమైన తెనుగువాఙ్మయ సౌధము భిన్న స్వరూపము నెట్లు పొందగలదు!

(౨) తెనుగుకన్నడఛందస్సు లొక్కతీరైనవి. వానికి గల భేద మత్యల్పము. కన్నడకవులు 'ప్రాస' ను మాత్రము బాటించిరి; తెనుగువారు 'ప్రాస' తోగూడ 'యతి' ని జేర్చిరి. ఇదియే వీనికి గల ప్రధానభేదము. తెనుగుకన్నడభాషలయందలి పద్యములు, దేశీగీతములు, వృత్తము లని, రెండు తరగతులుగ విభజింపబడు చున్నవి.

అక్కర సీస గీత ద్విపద తరువోజ రగడమున్నగునవి మొదటితరగతికి జెందినవి. సీసగీతములును ద్విపదలును గన్నడకావ్యములందు గాన రావు; షట్పది తెనుగున లేదు; కాని లక్షణగ్రంథముల కెక్కని తెనుగు పాటలు షట్పదివంటివి చాల గలవు. ఉత్పలమాల చంపక మాల మత్తేభవిక్రీడితము మొదలైన వృత్తములు రెండవతరగతికి జేరినవి. సర్వసామాన్యముగ నన్నియాంధ్రకర్ణాటకావ్యములందును గానవచ్చు కందపద్య మీ తరగతిలోనిదే.

తెనుగుకన్నడఛందస్సు లొక్కతీరుగ నుండుటకు గారణ మేమి? చక్కగ నాలోచించి చూడగా దీని కన్యోన్యాశ్రయమే కారణ మని తోచుచున్నది. ఈ యభిప్రాయమును గొంద అంగీక రింపరు. తెనుగు కన్నడ ఛందస్సు లొక్కరీతిగ నుండినను నవి యొండొంటితో సంబంధము లేక స్వతంత్రముగనే యేర్పడెననియు, వానికి గల పోలిక లవి యొక్క కుటుంబమునకు జెందిన భాష లగుటచేతను, రెంటి ఛందస్సులును సంస్కృతఛందోగ్రంథములపై నాధారపడి యుండుటచేతను గలిగిన వనియు వీరు చెప్పుదురు. కాని యదియొప్పుకొనదగినది కాదు. ఉపలబ్ధమైన సాక్ష్యమును బట్టి చూడగా తెనుగుఛందస్సునకు గొంచె మించు మించుగ గర్ణాట ఛందస్సు మాతృకవలె గానవచ్చుచున్నది. కన్నడమున కవిత్వము తెనుగునకంటె గొన్ని శతాబ్దములకు ముందే పుట్టినది; తెనుగున గవిత్వమారంభ మగునప్పటికే కన్నడమున ఛందస్సు సంపూర్ణముగ వికసించి పెక్కు లక్షణగ్రంథములు బయలువెడలినవి. కర్ణాటకము నుండి వచ్చిన చాళుక్యరాజుల ప్రోత్సాహముమూలముననే తెనుగున కవిత్వము మొలకయెత్తినది. కావున నర్వాచీనకాలమున నేర్పడిన తెనుగు ఛందస్సు తత్పూర్వము కొన్ని శతాబ్దములకు ముందు రూపొందిన కర్ణాటఛందస్సునకు బ్రతిబింబమువలె నుండినదానికి గారణము తెనుగువారు కర్ణాటకులకడనుండి తమ ఛందస్సును

గ్రహించుటయే. ఈ క్రిందియంశము లీ యభిప్రాయమును బలపఱచుచున్నవి. ప్రాచీనకన్నడకావ్యములందు అక్కరలనునొక తరగతి దేశిగీతములు గానవచ్చుచున్నవి. ఇవి రాష్ట్రకూట చక్రవర్తుల సామంతుడగు నిమ్మడియుద్ధమల్లుని బెజవాడశాసనమునను, నన్నయ భారతమునను గానవచ్చుచున్నవి. నన్నయ్యకు వాణసవంశజుడు కర్ణాటనారాయణభట్టు సహాయుడు గదా. గుణగవిజయాదిత్య ప్రథమ చాళుక్యభీముల కాలమందలి పద్యశాసనములలో కేవల తెనుగుగీతలనదగు సీస గీత తరువోజలే కానవచ్చుచున్నవి. అక్కరలుగాని, వృత్తములుగాని లేవు; కాని గుణగవిజయాదిత్యుని సాతలూరు తామ్రశాసనమున కర్ణాటకఛందస్సంప్రదాయము ననుసరించి ప్రాసయుక్తమైన సంస్కృతచంపకమాలావృత్తమొకటి యగపడుచున్నది.

"అరినృపవాజివారణపదాతిమహాభ్రవిరామమారుతః
పరికరసుస్థితాసిభరుచిప్రవినాశనభానుసన్నిభః
గురుతరదీనభాగవతమానవమానితకల్పపాదపః
వరకరిగల్లభూమిపభుజాపి రిహాజిభువి ప్రహాసతే."

శాసనముల సాక్ష్యమును బట్టి చూడగా మొట్టమొదట తెనుగున బద్యములు కేవలము తెనుగుదేశమున బ్రచారమునం దుండిన సీసగీతతరువోజ లను దేశిఛందములందు రచియింపబడుచుండె ననియు దరువాత కన్నడఛందస్సు బడి యక్కరలును, వృత్తములును వ్రాయుట వాడుకలోనికి వచ్చె ననియు దెల్లమగుచున్నది. తెనుగు వృత్తరచన సంస్కృతప్రాకృతవృత్తముల చొప్పున గాక కన్నడ ఛందస్సంప్రదాయము ననుసరించియే ప్రారంభమాయె ననుటకు బై నుదాహరింపబడిన సాతలూరి తామ్రశాసనములోని చంపక మాలా వృత్తము సాక్షి. ఏలన, ద్వితీయాక్షరప్రాస మాంధ్రకర్ణాటకపద్య కవిత్వమునకు సామాన్యలక్షణమే యైనను నాంధ్రకవులు ప్రాసతోబాటు పాటించు మఱియొక ప్రధాననియమమగు 'యతి' యిందు

కానరాదు. తెనుగుకవిత్వమునం దాదినుండియు యతిప్రాసలు గానవచ్చుచున్నవి. గుణగవిజయాదిత్యుని కాలమునకు బూర్వమే 'యతి ప్రాస' నియమములు స్థిరముగ నేర్పడినవి. కావున, గుణగవిజయాదిత్యుని సాతలూరుతామ్రశాసనములోని చంపకమాలయందు ప్రాస మాత్రము గానవచ్చుటయు, 'యతి' లేకపోవుటయు జూడగా నాద్యమున దెనుగుకవులు కర్ణాటఛందస్సంప్రదాయము ననుసరించి వృత్తరచనకు గడగి రని తోచుచున్నది; కాని తెనుగువారియందు 'యతి' లేని కవిత్వము వినుతికెక్కదాయెను. కావున వారు కాలక్రమమున 'ప్రాస' తోపాటు 'యతి' నిగూడ చేర్చి వృత్తములను రచింపగడగిరి.

చాళుక్యరాజ్యస్థాపన యాంధ్రకవితకు గారణభూత మైనది. అనగా నాంధ్రకర్ణాటకసంయోగము వలన దెనుగున కవిత్వము పుట్టినది. ఇది యాంధ్రవాఙ్మయచరిత్రకారు లందఱు విస్మరింపదగని విషయము. ఈ కారణమువలననే ఆంధ్రకావ్యస్వరూపమునను, ఛందస్సునను కన్నడపు బోలికలు గానవచ్చుట.

# చాళుక్యు లెవ్వరు?

'చాళుక్యు లెవ్వరు?' అనునది వారివిషయమై యడుగదగిన ప్రథమప్రశ్న. వారి శాసనములలో తమ యుత్పత్తిని గూర్చి వారు కొంత చెప్పుకొనియున్నారు. చంద్రవంశక్షత్రియ జాతికి జెందిన పాండవుల సంతతివారనియు, మొదట యయోధ్యలో కొంతకాలము రాజ్య మొనర్చిన పిమ్మట దక్షిణాపథమునకు వచ్చి యచట సార్ధసప్త లక్ష పరిమితమైన సామ్రాజ్యమును నెలకొలిపి ప్రభుత్వము నెఱపి రనియు కొన్నియెడల గలదు. వసిష్ఠుని యగ్నికుండమున నుద్భవించిన పురుషులలో నొక్కఁడైన చులుకని సంతతివారని మఱికొన్ని యెడల గలదు. ఆధునిక చరిత్రపరిశోధకు లీ గాధలను విశ్వసింపరు. కాని వారు చాళుక్యుల యుత్పత్తినిగూర్చి భిన్నాభిప్రాయములను వెలిబుచ్చి యున్నారు. కొందఱు వీరిని పారశీక దేశమునుండి హిందూదేశమునకు వలసవచ్చి యచ్చట హిందువులతో గలసిపోయిన విజాతీయు లనిరి. కొందఱు వీరు ఉత్తర దేశమునుండి దక్షిణభారతమునకు రాజ్య కాంక్షచే వలసవచ్చిన క్షత్రియజాతివారని యభిప్రాయపడిరి; మఱి కొందఱు వీరు విదేశమునుండికాని యుత్తరదేశమునుండికాని వలస వచ్చినవారు కారనియు దక్షిణదేశ వాస్తవ్యులే యనియు జన్మతః వారుశూద్రులేకాని క్షత్రియులు కారనియు, రాజ్యాభివృద్ధినంది ప్రసిద్ధులైనపిమ్మట ఈవంశమువారు తాము చంద్రవంశ క్షత్రియు లనియు పాండవులసంతతి వారనియు గాధలు కల్పించుకొని రని వాదిం తురు. ఈ యంశమును తర్కించి తీర్మానించుట కిది సమయము గాదు. చాళుక్యులు క్షత్రియకులసంభూతులగు దాక్షిణాత్యులను నభి ప్రాయము బహుళముగ నాధునిక చరిత్రపరిశోధకుల సమ్మతి నంది యున్నది. ప్రస్తుతము వీరిమార్గము ననుసరించుటయే యుక్తము.

వీరు ప్రప్రథమమున నాంధ్రదేశాంతర్గతమైన కడపమండల మందలి జమ్ములమడక ప్రాంతమున పొడచూపినను, వీరిచరిత్ర యంతయు కర్ణాటకదేశము తోడనే లగ్నమై యున్నది. పైగా బాదామిచాళుక్యరాజవంశముతో నారంభమగుచున్నది. బాదామి రాజవంశము వీరికులవృక్షమునకు బోదెవంటిది. చాళుక్యు లెందు గానవచ్చినను ఈరాజవంశమునుండి యుత్పన్నమైనవారే; బాదామి చాళుక్యవృక్షమునుండి దశదిశలకు వ్యాపించిన శాఖలే కావున నీ వంశ కథనము దక్షిణభారతచరిత్రలో నత్యంతము ప్రధానమైనది.

బాదామి చాళుక్యరాజకుటుంబమునకు మూలపురుషుడు జయ సింహుడు ఇతఁ డెక్కడివాఁడో యతని పుట్టుపూర్వోత్తర మెట్టిదో తెలియరాదు. ఇతని మనుమడు మొదటి పులకేశివల్లభుడు. ఇతడు క్రీ. శ. 445 లో ఇప్పటి విజాపురమండలములోని బాదామిదుర్గ మును జయించి కైవసముగావించుకొని వీరి సామ్రాజ్యమునకు అస్తి భారము వేసెను. ఇతని పుత్రులైన ప్రథమకీర్తివర్మమంగళేశ్వరులు తత్పరిసరప్రాంతముల రాజ్యముసల్పుచుండిన నలమౌర్యకదంబకట చ్చురులను జయించి స్వరాజ్యమును విస్తరింపజేసిరి. మొదటికీర్తివర్మ పుత్రుడైన ద్వితీయపులకేశి చాళుక్యజాతికి మకుటాయమానుడైన రాజు. అత డద్వితీయశూరుడు; సాటిలేని సైన్యాధిపతి; దిగ్విజేత. అతనికాలమున చాళుక్యరాజ్యము సార్థసప్తలక్షవైశాల్యము గలదియై, సకలదక్షిణాపథసామ్రాజ్యమై పరిణామ మందినది. ఇతని మూలముననే చాళుక్యవంశము నానాదేశములకు ప్రాకినది. ఇతడు క్రీ. శ. ౧౯వ శతాబ్దమునం దైరోపాఖండమున మొదటి నెపోలియను చక్రవర్తివలె తాను జయించిన దేశముల సింహాసనములపై దన సోదరులను పుత్రులను గూర్చుండబెట్టి నూతనచాళుక్యరాజ్యము లను స్థాపించెను. అందు ముఖ్యమైన వానిని పేర్కొనెదను. (౧) వేంగి కళింగభూములను క్రీ. శ. 614 లో జయించి వానిమీద దనయనుజు

లలో జ్యేష్ఠుఁడైన కుబ్జవిష్ణువర్ధనుని రాజుగ నియమించెను. ఇతఁడును నితని సంతతివారును పూర్వసముద్రతీరాంధ్రదేశముపై క్రీ. శ. ౧౦౭౦ వఱకు ఇంచుమించు నాల్గువందల సంవత్సరముల కాలమవిచ్ఛిన్నముగ ప్రభుత్వముజేసిరి; ఇమ్మడిపులకేశి చిన్నతమ్ముఁడైన ధరాశ్రయ జయసింహవల్లభుఁడు నాసికమండలమునకు ప్రభువాయెను; ఇతని యనంతరము ఇతని కుమారుఁడు త్రిభువనాశ్రయ నాగవర్ధనుడును ఇచట రాజ్యము సల్పిరి. మఱియు జయసింహుని మనుమఁడును బుద్ధరాజు కుమారుడునైన చాళుక్యజయవర్మరాజు ఇమ్మడి పులకేశి కడపటిదినములలో లాట దేశాధిపతియై యుండెను. ఇతని కుటుంబమునకు బాదామి రాజకుటుంబమునకు గల సంబంధ మెట్టిదో తెలియదు. లాటచాళుక్యులకంటె గుజరాతుచాళుక్యులు చరిత్రయందు మిక్కిలి ప్రసిద్ధినందిరి. గుజరాతు చాళుక్యవంశమునకు మూలపురుషుడు ఇమ్మడిపులకేశి కడపటి పుత్రుఁడైన ధరాశ్రయ జయసింహవల్లభుడు. ఇతడెప్పుడు గుజరాతు కధిపతియాయెనో నిశ్చయించి చెప్పుటకు వలనుపడదు. ఇతని వంశీకులిచ్చట దాదాపు క్రీ. శ. 750 వఱకు రాచరికము నెఱపిరి. వీరిలోనెల్ల క్రీ. శ. 740 లో రాజ్యము సేయుచుండిన అవనిజనాశ్రయ పులకేశి ప్రఖ్యాతుఁడు. ఇతడు దొడ్డసేనాధిపతి. అప్పుడు సింధుప్రాంతము నాక్రమించి పాలించుచుండిన తాజికులనబడు అరబీమహమ్మదీయులు దండెత్తి రాగా వారినెదిర్చి యుద్ధమున నోడించి పారదోలెను.

క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దము మధ్య బాదామిచాళుక్య సామ్రాజ్యము విచ్ఛిన్నమై వారి స్థానమున రాష్ట్రకూటుల యేలుబడి ప్రారంభమైనది. ఎనిమిదవ శతాబ్ద మధ్యనుండి పదియవ శతాబ్దమువఱకును దక్షిణభారతమున రాష్ట్రకూట యుగము సాగినది. సార్వభౌమాధిపత్యము పరహస్తగతమైనను చాళుక్యవంశము నామమాత్రావశిష్టము గాలేదు. దేశమునందచటనచట వారు చిన్న

చిన్న రాజ్యములను స్వతంత్రులుగనో సామంతులుగనో పాలించు చుండిరి. రాష్ట్రకూటయుగమున వర్ధిల్లిన చాళుక్యరాజవంశములలో నీ క్రిందివి ముఖ్యమైనవి.

1. పూర్వచాళుక్యులు[1]. వీరు కుబ్జవిష్ణువుయొక్క సంతతివారు. బాదామిచాళుక్యవంశము పతనమైనపిమ్మటగూడ వీరు ముందరివలె తీరాంధ్రదేశమున స్వతంత్రులై రాజ్యము సేయుచుండిరి. రాష్ట్రకూటచక్రవర్తులు పూర్వచాళుక్యులను జయించి లోబఱచుకొనవలయునని ప్రయత్నముజేసిరి కాని వారి మనోరథము సిద్ధింపదాయె.

2. ముదిగొండచాళుక్యవంశము ఈ వంశప్రభువులు ఇప్పటి యోరంగలు కంభంమెట్టు మండలాంతర్గతమైన మంచికొండ విషయము నేలుచుండిరి. వీరి రాజ్యము పూర్వచాళుక్య రాష్ట్రకూట సామ్రాజ్యముల మధ్యనుండు గడిదేశమగుటచేత, వీ రొకప్పుడు పూర్వచాళుక్యులకును మఱియొకప్పుడు రాష్ట్రకూటులకును సామంతులై కొల్చుచుండిరి.

3. వేములవాడచాళుక్యులు. ప్రస్తుత కరీంనగర మండలాంతరగతమైన వేములవాడ గ్రామమును రాజధానిగ జేసికొని రాజ్యము సేయుట వలన వీరి కీ పేరు కల్గినది. తాము బాదామి చాళుక్య రాజైన పులకేశిభూపాలుని సంతతివారమని తమ శాసనములలో వీరు చెప్పుకొనిరి; కాని వీరిచరిత్రయంతయు రాష్ట్రకూట యుగమునందే సాగినది. ఈ వంశమునకు మూలపురుషుడైన వినయాదిత్యయుద్ధమల్లుడు రాష్ట్రకూట దంతిదుర్గచక్రవర్తికి సమకాలికుడు; కడపటివాడైన మూడవ అరికేసరి రాష్ట్రకూట ముమ్మడికృష్ణ భూమీశ్వరుని సామంతుడు. వేములవాడ చాళుక్య వంశజులలో ననేకులు

1. పూర్వచాళుక్యులనుగూర్చి ఇంతకుముందే చెప్పియున్నాను. మరల నా విషయము నిచ్చట తడవ బనిలేదు.

శూరులై పెక్కురణరంగములలో నిజపరాక్రమమును ప్రకటించి పేరు
ప్రఖ్యాతులు బడసినను వారెన్నడును రాజ్యస్వాతంత్ర్యము బొందలేదు.

4. కళ్యాణి చాళుక్యులు. ఇప్పటి మైసూరు రాష్ట్రములోని
కల్యాణినగరము వీరికి కులక్రమాగతమైన రాజధాని యగుటవలన
ఆధునిక చరిత్రకారులు వీరిని కల్యాణి చాళుక్యులని పేర్కొందురు.
వీరును తాము బాదామి చాళుక్యరాజుల సంతతి వారమని చెప్పు
కొనిరి. ఈ వంశమువారు అఖండవైభవముతో దాదాపు రెండు
వందల యేండ్లకాలము ప్రజాపాలన మొనర్చిరి. రాజ్యవిస్తారము
నందేమి పరాక్రమాధిక్యమువలన నేమి కీర్తి ప్రఖ్యాతులయందేమి
బాదామివారి నధఃకరించిరి. ఈ రాజవంశమునకు మూల
పురుషుడు ఇమ్మడి తైలపదేవుఁడు. ఇతఁడు క్రీ. శ. ౧౦ వ శతాబ్ద
చరమపాదమున రాష్ట్రకూట సామ్రాజ్యము నాక్రమించుకొని నామ
మాత్రావశిష్టమై యుండిన తమ అధిరాజ్యమును పునరుజ్జీవింప
జేసెను. ఈ వంశములో గడపటి ప్రభువైన నాల్గవ సోమేశ్వరుఁడు
౧౨ వ శతాబ్దాంతమున వెలసెను. ఇతనితో కల్యాణిచాళుక్యచక్ర
వర్తుల యేలుబడి సమాప్తమాయెను.

పై బేర్కొనిన నాలుగు చాళుక్యవంశములును దక్కను పీఠ
భూమి యందు వర్ధిల్లినవి. ఇవిగాక మఱి మూడు వంశములు పశ్చిమ
భారతదేశమున ముఖ్యముగ గుజరాతు దేశమున క్రీ. శ. ౧౪ వ
శతాబ్దము ప్రథమ దశకము వఱకును ఒకదాని పిమ్మట మఱియొకటి
రాచరికము వహించెను. ఈ మూడు వంశములలో లాటగుజరాతు
శాఖల నింతకు పూర్వమె పేర్కొని యున్నాను. వీరిలో నిక మిగిలి
యుండునది యన్హిల్ వాడను రాజధానిగ జేసికొని ప్రజాపాలన మొన
ర్చిన చాళుక్య వంశము. వీరిలో కడపటి ప్రభువైన కర్ణదేవుని డిల్లీ
తురుష్క సురత్రాణుడైన అల్లావుద్దీన్ ఖిల్జీ దేశము నుండి పాఱ
దోలి గుజరాతు రాష్ట్రమును డిల్లీ సామ్రాజ్యమున గలుపుకొనెను.
మఱియు మధ్యయుగమున విజయనగరసామ్రాజ్యమును పాలించిన

నాలుగు రాజవంశములలో సాళువ ఆరవీటివంశములవారు తాము చాళుక్యులమని చెప్పుకొనియున్నారు. సాళువవారు క్రీ. శ. ౧౪౮౫ మొదలు ౧౫౦౩ వఱకును, ఆరవీటివారు క్రీ. శ. ౧౫౭౦ మొదలు ౧౬౫౦ పర్యంతము ప్రభుత్వ మొనర్చినట్లు వారి శాసనముల మూలమున తెలియుచున్నది.

ఇంతవఱకు చాళుక్యుల పుట్టుపూర్వోత్తరములను సంగ్రహముగ వివరించినాడను. ఇక వీరి రాజ్యకాలమున నడచినముఖ్య చరిత్రాంశములను ఇంచుక ప్రస్తావించి, వారి యేలుబడిక్రింద దక్షిణ భారతీయ సంస్కృతి యెట్లు పెంపందెనో యొక్కింత చెప్పి నా వ్యాసమును ముగించుచున్నాను.

మొదట బేర్కొన దగినది యుత్తరదక్షిణరాజ్యముల ప్రతిస్పర్ధ. రాజకీయదృష్టిని జూచిన దక్షిణాపథము, దక్కను దక్షిణ హిందూస్థానము లను రెండు ప్రత్యేకభూభాగములుగ విభక్తములై యుండెడిది. ఈ భాగములందు పాలించుచుండిన రాజవంశములు సామ్రాజ్యాధిపత్యముకొఱకు నిరంతర మొండొరులతో గలహించుచు యుద్ధము సల్పుచుండువారు యావద్దక్షిణభారతమును దమ యేలుబడి క్రిందికి దెచ్చుకొన వలయునని యొకప్పు డుత్తర రాజ్యములవారును మఱియొకప్పుడు దక్షిణరాజ్యములవారును తీవ్రముగ ప్రయత్నములను సల్పువారు. ఈ కారణమున ఉత్తరదక్షిణముల మధ్య యుద్ధము సామాన్యమై వైరము పెంపొందుచు వచ్చినది. ఈ యుద్ధములకు సామాన్య రణరంగము కృష్ణా ప్రాంతదేశము బాదామి చాళుక్యయుగమున ఈ పోరు ప్రారంభమైనది. ఆనాడు తమిళనాడు సర్వమును, దక్షిణాంధ్రమున గొంతభాగమును, కాంచీపురవరాధీశ్వరులైన పల్లవరాజుల యాధిపత్యము క్రింద నుండినది. ఇమ్మడి పులకేశి నాయకత్వము క్రింద బాదామి చాళుక్యులు విజృంభించి పల్లవులనధఃకరించి ద్రావిడరాజ్యములపై దమయాధిపత్యమును

నెలకొల్ప ప్రయత్నము సల్పిరి. తొలుత విజయము చేకూరినను తరువాత పరాజయమందిరి. యుద్ధమున పులకేశి నిహతుడాయెను; కాని యాతని సంతతివారు సమకాలికులైన పల్లవప్రభువులతో దక్షిణాపథాధిపత్యము కొఱకు పోరాటమును సాగించుచుండిరి. క్రీ. శకము ఎనిమిదవ శతాబ్దమధ్యమున బాదామివారి రాజ్య ముత్సన్నమై పోయెను. వారి స్థానము నాక్రమించుకొన్న రాష్ట్రకూట చక్రవర్తులును తాము చాళుక్యులకు రాజకీయమైన వారసుల మని భావించి వారివలెనే పల్లవులతో పోరాటమును సాగించిరి. క్రీ. శ. ౯ వ శతాబ్దాంతమున పల్లవరాజ్యము రూపుమాసి పోయెను; వారి స్థానమున విజయాలయుని సంతతివారైన చోళులు ద్రావిడదేశమున కధిపతులైరి. వీరు మొదట రాష్ట్రకూటులతోడను తరువాత దక్కను సామ్రాజ్యపీఠము నధిష్ఠించిన కల్యాణిచాళుక్యులతోడను, దక్కను దేశములను దమ యేలుబడి క్రిందికి దెచ్చుకొనుటకొఱకు, ఘోరముగ పోరుసల్పిరి. ఇట్లు బాదామిచాళుక్యులనాడు ప్రారంభమైన దక్కనుదాక్షిణాత్య రాజ్యముల అంతర్యుద్ధము శతాబ్దముల పొడుగున సాగుచు దక్షిణాపథమును ఒక గొప్ప యుద్ధరంగముగ మార్చివేసినది. దేశప్రజలకు యుద్ధమే ముఖ్య వృత్తి యాయెను.

రెండవది మతవిషయము. చాళుక్యుల యభ్యుదయము వైదిక ధర్మపునరుద్ధారణతో లగ్నమై యున్నది. వారు చరిత్రరంగమున పొడసూపినప్పుడు బౌద్ధ జైన ధర్మము లుచ్చస్థితియం దుండినవి. సనాతన ఆర్యధర్మము జనాదరమును గోల్పోయి కొఱప్రాణముతో చావసిద్ధమై యుండినది. కాని క్రీ. శ. ౫, ౬ శతాబ్దము లందు దక్షిణ భారత రాజకుటుంబముల ప్రాపున నది కొల్కొని పునరుజ్జీవన మందినది. ఈ రాజకుటుంబములలో నీ సందర్భమున ముఖ్యముగా రెండు పేర్కొన దగినవి. దక్షిణాంధ్రద్రావిడదేశములను పాలించుచుండిన పల్లవ వంశము మొదటిది. పల్లవులు బ్రాహ్మణులు; భారద్వాజులు మహాభారత వీరులైన ద్రోణాశ్వత్థామల సంతతివారు, వైదిక ధర్మ

పరాయణులు, అగ్నిష్టోమాశ్వమేధాది యజ్ఞములను జేసినవారు, జన్మతః బ్రాహ్మణులే యైనను క్షత్రియవృత్తి నవలంబించుటచే బ్రహ్మక్షత్రియు లన బఱగిరి. వీరు శైవసమయమునందు గాఢమైన యభిమానము గలిగి దానిని జక్కగ పోషించిరి. వీరు నందికేతనులు, కలియుగదోషావసన్నధర్మోద్ధరణనిత్యసన్నద్ధుల మని శాసనములందు బ్రకటించు కొనిరి. దక్కనుదేశమును పాలించిన చాళుక్యకుటుంబము రెండవది. వీరు మానవ్యస గోత్రజులైన చంద్రవంశ క్షత్రియులు, భగవన్నారాయణ వరప్రసాదిత వరాహలాంఛనులు పరమబ్రహ్మణ్యులు పౌండరీకవాజపేయాశ్వమేధావభృతస్నాన పవిత్రీకృతగాత్రులు వీరి శాసనములు తరచుగ లీలావరాహ స్తోత్రముతో ప్రారంభ మగు చున్నవి. హరి యెట్లు లీలావరాహమై సముద్రమున బ్రుంగి యుండిన భూమిని దంష్ట్రాగ్రమున లేవనెత్తెనో యట్లే వరాహలాంఛను లగు వీరు బౌద్ధ జైన చార్వాకాది పాషండ సమయము లందు నిమగ్న మైన సనాతన ఆర్యధర్మము నుద్ధరింప గలరని యిందలి గూఢార్థము. వరాహధ్వజము చాళుక్యవంశముల కన్నిటికిని సామాన్య మైనది. అట్లే సనాతనధర్మ పోషణయు. వీరి కడనుండి వరాహధ్వజమును ధర్మప్రవర్తనమును తరువాతి కాలమున దక్షిణాపథమున రాజ్యము జేసిన కాకతీయులకును విజయనగరచక్రవర్తులకును సంక్రమించినది. వీరు ఆద్యమున వైష్ణవులు; తరువాత కాదాచిత్కముగ కొందఱు జైనధర్మమును పోషించిరి; కడపట వీరు శైవులైరి; రానురాను శైవము ముదిరి వీరశైవ మైనది. పాశుపత కాలాముఖ కాపాలికాది శైవసమయములు విజృంభించి యారాధ్య లింగాయత మతముల యుత్పత్తికి కారణభూతములైనవి. వీని కన్నిటికి శివభక్తి సామాన్యము. వీని రాయిడిచే బౌద్ధజైనాది మతము లంతరించి పోయినవి.

మూడవది కళాభివృద్ధి: వీరి కాలమున లలిత కళ లభివృద్ధి నందినవి. వాస్తుశిల్పచిత్రలేఖనసంగీతములు ముఖ్యముగ బేర్కొన

దగినవి. వీరి యభ్యుదయముతో దక్షిణభారత వాస్తుచరిత్ర యందొక నూతన యుగము ప్రారంభమైనది. మన ప్రాచీన వాస్తునిర్మాణ మంతయు దేవాలయాది మతసంబంధమైన కట్టడములందె లగ్నమై యున్నది. మతముతో సంబంధములేని గృహప్రాసాదాది నానా విధములైన వాస్తునిర్మాణములు గూడ త్రవ్వితండములుగ నుండి నట్లు ప్రాచీనగ్రంథములవల్ల దెలియ వచ్చుచున్నను అవి యెన్నడో నామమాత్రావశిష్టములై పోయినవి. కావున వాస్తుచరిత్రకారులు, నశింపక మిగిలియుండు దేవాలయాది మతసంబంధ కట్టడముల నాధారపఱచుకొనియే భారతీయ వాస్తుపరిణామ విశేషములను వివ రింపవలసి వచ్చినది. పశ్చిమ చాళుక్యులు వాస్తునిర్మాణమున పని గొని కొండల యందు గుహాలయములను మలిపించిరి; ఇట్టికా పాషాణాదులతో నద్భుతములైన దేవతాయతనములను నిర్మించిరి. బాదామిగుహాలును, పట్టడకలు మున్నగు స్థలములందును నేటికినినిలిచి యుండు దేవాలయములును బాదామిచాళుక్యవాస్తునిర్మాణ శక్తికి దృష్టాంతములు. దేవాలయ నిర్మాణము కల్యాణి చాళుక్యులనాడు మఱియు విశేషముగ బెంపందెను. కల్యాణీవారును వారి సామంతు లును నిర్మించిన దేవాలయములు కర్ణాటమునను తెలింగాణమునను పెక్కుతావులందు కలవు. వీరి యనంతరము అటు కర్ణాటమును పాలించిన హొయ్సల యాదవవంశజులును ఇటు తెలింగాణమున కాకతీయులును వారిమార్గము ననుసరించియే దేవాలయములను నిర్మిం చిరి. చాళుక్య దేవాలయనిర్మాణపద్ధతియందు తత్పూర్వమున లేని నవ్యవైఖరి గానవచ్చుచున్నది. తలవిన్యాసమున నది నక్షత్ర రూప మును బోలియుండును; చెక్కడపుపని దాని విశేషలక్షణము. అప్పటి కాసెయోజుల ప్రజ్ఞ అద్భుతమైనది. వారి కరస్పర్శచే నెంతటి కర్కశ పాషాణమును మైనమువలె మెత్తనై వారేరూపమును చింతించిన యారూపమును దాల్చెడిది. ఈ నవ్యవైఖరికి చాళుక్యవైఖరి యని కళాభిజ్ఞులు పేరిడిరి. చాళుక్యుల సామ్రాజ్యము నమసిపోయినను వారు పోషించుచువచ్చిన వాస్తునిర్మాణాదికళలు తరువాతికాలమున

తామరతంపరగ నభివృద్ధినందినవి. కర్ణాటక మండలి హోయ్సళేశ్వరాలయమును తెలింగాణములోని రామప్పగుడియు దీనికి దృష్టాంతములు. శిల్పము వాస్తునిర్మాణమున కానుషంగికము. దేవతాప్రతిమలు సేయుట దేవాలయములపై మన యితిహాసపురాణాదులలోని గాథలను ప్రతిమారూపమున గండరించుట కాసెకార్మికుని ప్రధాన వృత్తి. కాదాచిత్కముగ వీరగలు మాస్తికలుల గండరించుట కతడు నియుక్తు డయ్యెడివాడు. చాళుక్య శిల్పులు గండరించిన శిల్పఖండములు ఉత్తమతరగతికి చెందినవి. అవి యింకను చక్కగ పరిశీలింపబడ లేదు. ఈనాటి చిత్రలేఖనమును గొనియాడ దగినదే. బాదామి గుహాలయములోని చిత్రములను శిల్పవిద్యావిశారదులు ప్రశంసించి యున్నారు. అజంటాలోని కొన్ని గుహాలు చాళుక్యయుగమునకు జెందిన వని చరిత్రకారుల యభిప్రాయము. దేవాలయకుడ్యములందును కప్పు లోపలితలముననను ప్రతిమలు వ్రాయునాచార మనాదినుండియు వాడుక యందున్నది. కళ్యాణి చాళుక్యకాకతీయ దేవాలయము లందు కొన్ని యెడల చిత్తరువులు గానవచ్చుచున్నవి. కాని యివి మాసిపోవుట వలన కళాదృష్టియందు వానికి విలువకట్టుటకు వీలు కాకున్నది. చాళుక్యుల యేలుబడి క్రింద దేశమున చిత్రలేఖనమె ట్లభివృద్ధినందెనో కనుగొనవలయు నన్న అభిలషితార్థచింతామణి మున్నగు నప్పటిశాస్త్రగ్రంథములను దిలకించిన తెల్లము కాగలదు. సంగీతశాస్త్రముపై పెక్కు గ్రంథము లప్పుడు వెలువడినవి. సర్వజ్ఞసోమేశ్వరుడు ఇమ్మడి జగదేకమల్లచక్రవర్తి మొదలయిన రాజన్యులు సంగీతవిద్యావిశారదులు. వారు వ్రాసిన గ్రంథములు తరువాతి వారికి మార్గదర్శకము లాయెను. శార్ఙ్గదేవుడు జాయసేనాపతి మున్నగువారు తాము రచించిన సంగీతశాస్త్రగ్రంథములు చాళుక్య యుగ గ్రంథకర్తల ననుసరించి వ్రాసినవే. వీనినిబట్టి యప్పుడు సంగీత మెట్లభివృద్ధి నందెనో కనుగొనవచ్చును.

నాల్గవది వాఙ్మయము. చాళుక్యచక్రవర్తులు సంస్కృతభాష నాదరించి సాహిత్యమును చక్కగ పోషించిరి. భారవి, రవికీర్తి,

బిల్హణుడు మొదలయిన మహాకవులును పూజ్యపాద విజ్ఞానేశ్వరాది శాస్త్రగ్రంథకర్తలును నీ వంశపురాజుల మన్ననను పొంది గీర్వాణ వాణిని సేవించినవారలే. సర్వజ్ఞసోమేశ్వర జగదేకమల్లులను ఇంతకు ముందే ప్రశంసించి యున్నాను. రాజుల మాట యటుండనిచ్చి వీరి శుద్ధాంతకాంతాజనము గూడ సంస్కృతభాషాజ్ఞానము గలవారై గ్రంథములను రచించియున్నారు. ఇమ్మడిపులకేశిచక్రవర్తికోడలు చంద్రాదిత్యుని నారీమణి విజయభట్టారిక వీరియందు అగ్రగణ్యురాలు. ఇట్లు రాజులును రాణులును సంస్కృతవిద్యావిశారదులై గ్రంథ రచన గావించియు సంస్కృతభాషాభిజ్ఞులైన కవులను పండితులను శాస్త్రజ్ఞులను పోషించియుండ నాభాషా సాహిత్య మభివృద్ధి నందుట సహజమే కదా.

సంస్కృతముకంటె నధికముగ దేశభాష లభివృద్ధి జెందినవి. చాళుక్యయుగము కన్నడమున కామని వంటిది. కన్నడభాషయం దప్పుడు వెలువడినన్ని కావ్యములు మఱి యెన్నడును వెలువడలేదు. ఆ కాలమున రాజులుగాని వారి నాశ్రయించియుండిన సామంత ప్రభువులుగాని యన్యులుగాని నెలకొల్పిన శాసనములలో నూటికి యఱువది పద్యశాసనములు. వీనిలో నొక్కొక శాసనమును నొక ఖండ కావ్యమనుట యతిశయోక్తికాదు. మొదటి చాళుక్యవిక్రమా దిత్యుని మాతామహుడైన పశ్చిమగాంగ దుర్వినీతమహారాజు కన్నడ మున వడ్డకథయనుపేర బృహత్కథను కన్నడీకరించెను. రత్నత్రయ ములో నగ్రగణ్యుడును, ఆదిపురాణవిక్రమార్జునవిజయ కృతికర్తయు నగు పంపమహాకవి వేములవాడచాళుక్యరాజుల కాశ్రితుఁడు. ఇతని విక్రమార్జునవిజయము ఇమ్మడి యరికేసరి భూపాలుని కంకిత మీయ బడెను. పంపకవికంటె ఇంచుక వయసున పెద్దవాడును శాంతిపురాణ గ్రంథకర్తయు నైన పొన్నమహాకవి రత్నత్రయమునందు మఱి యొకడు. పంపనివలెనే ఇతడును వేంగిదేశములోని కమ్మనాటి వాస్త

వ్యుడు. పొన్నకవికి రాష్ట్రకూట ముమ్మడి కృష్ణభూపతి 'కవిచక్రవర్తి' యను బిరుదము నొసంగి గౌరవించెను. రాష్ట్రకూట కృష్ణభూపతికి సమకాలికుఁడును ప్రతిపక్షియు నగు వేంగిపాలకుఁడు అమ్మరాజ విజయాదిత్యుని తామ్రశాసనగ్రంథములు కొన్ని కవిచక్రవర్తి విరచితములు గలవు. ఇతఁడు శాంతిపురాణకర్తయైన కవిచక్రవర్తి పొన్నడని నా యభిప్రాయము. రత్నత్రయములో మూడవవాఁడైన రన్నడు ప్రథమ కల్యాణి చాళుక్యచక్రవర్తియైన ఇమ్మడి తైలపుని యొక్కయు నతని యనంతర మతని పుత్రుఁడైన సత్యాశ్రయసత్తిగని యొక్కయు నాస్థానమున వెలసెను. రన్నమహాకవి తా విరచించిన గదాయుద్ధమను కబ్బమును సత్తిగనికి అంకిత మిచ్చెను. ఇట్లు కర్ణాట కవులలో నగ్రగణ్యులైన మువ్వురు కవిరత్నములు చాళుక్యుల యాశ్రయమున వర్ధిల్లిరి. వీరు మాత్రమే కాక మఱియెందరో కవిశ్రేష్ఠులు వారి యౌదార్యమువలన గ్రాసవాసముల కొఱకు శ్రమపడక కర్ణాట సారస్వతసేవయందె తమయావజ్జీవమును గడపి యుత్తమకావ్యముల నెన్నింటినో రచియించిరి.

కర్ణాటభాషవలెనె యాంధ్రము గూడ చాళుక్యుల యాశ్రయముననె బెంపందినది. తెనుగున కవిత్వము గుణగాంక విజయాదిత్యుని కాలమున పొడసూపినది. యుద్ధమల్లునికాలమున బాల్యదశ యందుండెను; యౌవన దశయందు రాజరాజనరేంద్రుడు ఆంధ్ర భాషాయోషను జేపట్టెను. నన్నయభట్టునారాయణభట్టులను విద్వత్కవివరేణ్యులను గౌరవించి వారిచే వ్యాసమహాభారతముయొక్క మొదటి మూడుపర్వములను తెనుగున పద్యకావ్యముగ వ్రాయించెను. రాజరాజనరేంద్రుని కుమారుఁడైన రాజేంద్రుఁడు అరవదేశమున కేగి చోళసింహాసనమునాక్రమించుకొని యరవలలో గలసిపోయెను. అంతటితో చాళుక్య సామ్రాజ్యము తెనుగుదేశమం దస్తమించినది.

౮

# జినవల్లభుని గంగాధరం శిలాశాసనము

ఈ శాసనము ఆంధ్రప్రదేశములోని కరీంనగరు జిల్లాకు చెందిన గంగాధరమను గ్రామము సరిహద్దులయందుండు బొమ్మల గుట్టయను కొండశిఖరమున నొక గండశిలమీద జెక్కబడియున్నది. ఇటీవల దీని యునికిని గనిపట్టి ఆంధ్రప్రదేశ ఆర్కియాలజీ డిపార్ట్ మెంటు శాసనశాఖవారు దీని ప్రతిబింబమును దీయించిరి. సదరు డిపార్టుమెంటు డైరెక్టరుగారైన శ్రీ మహమ్మదు అబ్దుల్ వహీద్ ఖానుగారి అనుమతితో దీని నిచ్చట ప్రకటించుచున్నాడను.

ఈ శాసనమున 14 అడుగుల 5 అంగుళముల కొలతగల పంక్తులు పదియు, 4 అడుగుల కొలతగల పంక్తి యొకటియు మొత్తము పదునొకండు పంక్తుల వ్రాత కలదు. అక్షరముల పరిమాణము ½ అంగుళములు మొదలుకొని గుణింతము ననుసరించి తగ్గుచు హెచ్చుచునున్నది. అక్షరములు లోతుగ జెక్కబడి యున్నవి; శైథిల్యము లరుదు. అచట నచట ఒండు రెండు అక్షరములు రాయి పేడెత్తుటవలన రూపుమాసిపోయినను వానిని ఊహించి కనుగొనుట కష్టముగాదు.

లిపి :—ఇందలి లిపి క్రీ. శ. తొమ్మిది పది శతాబ్దులలో దెలింగాణమున వాడుకయందుండిన తెలుగు కన్నడ లిపి, అక్షరములించుక పెద్దవైనను రెండవ యరికేసరి వేములవాడ శాసనాక్షరములను మిక్కిలియు బోలియున్నవి.

భాష :—ఈ శాసనమునందు సంస్కృత కర్ణాటాంధ్రభాషలు మూడును వాడబడినవి. ఇది గద్య పద్యాత్మకము. "ఓం నమః

C—33

సిద్ధేభ్యః" అను సంస్కృతవాక్యముతో ప్రారంభ మగుచున్నది. తరువాత నొక దీర్ఘ కన్నడ గద్య, పిమ్మట మూడు సంస్కృత వృత్తములు (రెండు శార్దూలవిక్రీడితములును, నొక్క పృథ్వియు), అటు వెనుక కన్నడ వృత్తము లారు (చంపకమాలలు నాలుగు, మత్తేభ విక్రీడిత మొకటి, తరళ మొకటి), పిమ్మట తెలుగుపద్యములు (కందములు) మూడు, కడపట చిన్న కన్నడ వచన మొకటియుగలవు.

గుణింతము :— ఇకార ఎకార హ్రస్వ దీర్ఘరూపములకు భేదము గాన్పింపదు. సందర్భమునుబట్టి వాని భేదమును గనుగొన వలసియున్నది. కాని కొన్ని యెడల ఇకారముయొక్క దీర్ఘరూపము, లోనికి సుడిగొనిన యక్షరముయొక్క గుడివలన సూచింపబడినది. ప్రాచీన శాసనములందువలె నిందును రేఫముతో గూడిన హల్లు ద్విత్వ మగుచున్నది. కాని 7—వ పంక్తిలోని 'విక్రమార్జున విజయుక్కె' అనుచోట మాత్రమట్లు కాక ఇప్పటివలె ద్విత్వము కాక యున్నది. ప్రాయికముగ నాయావర్గాక్షరములకు సంబంధించిన యనునాసికము సందర్భోచితముగ నుపయోగింపబడినను పెక్కుచోట్ల వర్గానునాసిక స్థానమున పూర్ణానుస్వారము వాడబడినది. ద్విత్వణకారములందు ణ వత్తునకు బదులు న వత్తు వ్రాయబడి యున్నది. 'మ'కార 'వ'కారములు రెండు విధములుగ గన్పట్టుచున్నవి. సామాన్యముగ నవి కొంచె మించుమించు యిప్పటి 'మ' 'వ'లకు చేర్పగుచున్నను రేఫయుక్తమైనపుడు కొన్ని యెడల గొలుసు వ్రాతలో ర కు 'మ' 'వ' వత్తు లిచ్చినట్లగపడుచున్నవి. (ర్మ. ర్వ.)

శిల్పి ఈ శాసనమును జాగరూకతతో జెక్కినను అచట నచట తప్పులు దొరలినవి. తెలుగు పద్యములలో నివి యధికముగ గన్పట్టుచున్నవి. దీనికి గారణము శిల్పికి తెలుగుతో పరిచయము లేకపోవుట యేయని తోచుచున్నది.

శాసనవిషయము :—ఇది కర్ణాటక కవిరత్నత్రయమం దాద్యుడైన పంపని తమ్ముడగు జినవల్లభుని ప్రశస్తి. ఇందు అతని వంశక్రమమును, గుణసంపత్తియు, వైదుష్యమును, వదాన్యతయును, మతాభినివేశమును, ఘనకార్యములును వర్ణింపబడినవి.

వెంగినాటి సప్తగ్రామములలోని వంగిపఱ్ఱు కమ్మె బ్రాహ్మణుడును, జమదగ్ని పంచార్షేయ శ్రీవత్సగోత్రుడును, గుండికఱ్ఱులోని నిడుగొండ వాస్తవ్యుడైన అభిమానచంద్రుని మనుమడును, భీమపయ్యయొక్క బెళ్వోలములోని యణ్ణిగెరె జోస్యుడైన సింఘుని మనుమడును, వబ్బణబ్బె కొమారుడును, కొండకుంద దేశిగగణపుస్తకగెమార్గ పణ్ణరంగవల్లికి సంబంధించిన జయంగొండ సిద్ధాంతదేవుని శిష్యుడునునైన జినవల్లభుడు, సబ్బినాటి నట్టనడుమ నుండు ధర్మపురమున కుత్తరమున నుండు వృషభగిరియను నానాది సంసిద్ధతీర్థముయొక్క దక్షిణ దిశా భాగమునందున్న సిద్ధశిలమీద తమకులదైవములగు నాద్యన్త జినుల బింబములను, చక్రేశ్వరిని, యితర జినప్రతిమలను, త్రిభువనతిలకమను జినాలయమును, కవితా గుణార్ణవమను చెఱువును, మదనవిలాసమను వనమును నిర్మించెను.

జినవల్లభుడు భీముని కుమారుడు, పంపార్యుని యనుజుడు. ఇతడు సకల కళాప్రవీణుడు, భవ్య రత్నాకరుడు, గుణపక్షపాతి. చతుర కవిత్వ రచనయందు సుప్రసిద్ధుడు. పెక్కువిధముల కావ్యములు విరచించుటయందును, కవిత్వ తత్త్వము నెఱిగి తగినట్లు వివరించుటయందును, సత్పురుషులకు విద్య నేర్పుటయందును, శ్రావ్యముగ సంగీతము పాడుటయందును, రాగయుక్తముగ చదువుట యందును నితని శక్తి సామర్థ్యము లిలలో సాటిలేనివి; కావున నీ జినవల్లభు డొక్కడే వాగ్దేవికి శ్రేష్ఠుడైన వల్లభుడు.

జినవల్లభుడు జిన భవనములను నిర్మించుటయం దాసక్తి కలవాడు. ద్విజుల కావాస స్థానమైన యున్నత పర్వత శృంగముపై జిన

బింబములను జెక్కించి జినవల్లభునికి దాని నొక చైత్యాలయముగ గావించెను. వృషభేశ్వరునితో గూడిన యీ కొండ (భరతఖండ) దక్షిణార్థపు వృషభాద్రియై కవితాగుణార్ణవుని (పంపని) కీర్తి మూర్తిని బోలి యుదావహము కానగును. జినవల్లభుడు జినపూజా పరాయణుడు. జినమునుల నర్చించి వారికి వలసిన యాహారాదులను సమర్పించువాడు. వృషభాద్రియందు జినునకు క్షీరాభిషేకమును జేయించువాడు. యాత్రార్థ మచ్చటికి కరుగుదెంచిన భవ్య జనులకు సన్మానము జేయువాడు.

చలుక్య వంశాధిపతియైన అరికేసరి నృపశ్రేష్ఠుడు విక్రమార్జున విజయమునకు మెచ్చి ధర్మపురమును పంపనికి దన కీర్తి శాసనముగ నిచ్చెను. అందు బేర్కొనిన పంపని బిరుదమును ప్రసిద్ధమైన జినధర్మమును వృషభాద్రియె ప్రకటించుచున్నది. ధర్మముయొక్క యశస్సు హెచ్చునట్లు హరిగడు (అరికేసరి) మెచ్చి పంపని కిచ్చిన బ్రాహ్మణావసథమైన అగ్రహారము సుప్రసిద్ధమైన కలాప గ్రామమునకు సదృశమైనది. తామ్ర శాసనము వ్రాయబడినదా? ప్రసిద్ధుడైన యరికేసరి ధర్మపురము నిచ్చెనా? సుప్రసిద్ధుడైన పంపడు దానిని వడసెనా? యను పిచ్చిప్రశ్న లడుగువారు వృషభ పర్వతమునకు బోయి యందు ఉన్నత శిలాతలమున జెక్కియుండు శాసనాక్షరములను చదివి తమ సంశయమును బోగొట్టుకొనవచ్చును.

లేఖకుడు :—జినవల్లభుని ధర్మకార్య సంతతిని, గుణావళిని మెఱియమ్మయను నతడు వృషభగిరి యందలి సిద్ధశిలపై టంకోత్కీర్ణము గావించెను.

ఈ శాసన విషయమును చర్చించునపుడు మొట్టమొదట విమర్శింపదగిన దిందలి వంశక్రమము. ఇందు జినవల్లభుడు తాను పంపని తమ్ముడనని పెక్కుపర్యాయములు చెప్పుకొనియున్నాడు. ఆ పంప డెవ్వడనగా సుప్రసిద్ధమైన విక్రమార్జునవిజయమును రచించి దానికి

పారితోషికముగ చలుక్యవంశపతియైన యరికేసరి నృపాలుడు మెచ్చి యిచ్చిన ధర్మపురము నగ్రహారముగ బడసినవాడు. కవితా గుణార్ణవ బిరుదాంకితుడు. కావున విక్రమార్జునవిజయకర్తయైన పంపడు జినవల్లభుని యన్న యని తెలియుచున్నది. కాని వీరు వివరించిన వంశానుక్రమణిక లొక్కతీరున నుండక వ్యత్యస్తముగ గన్పట్టుచున్నవి. జినవల్లభుడు గంగాధర శాసనములో దన వంశక్రమము నిట్లు చెప్పియున్నాడు. వెంగిసప్తగ్రామములలో చేరిన గుండికఱులోని నిడుంగొండ వాస్తవ్యుడును, జమదగ్ని పంచార్షేయ శ్రీవత్సగోత్రుడైన యభిమానచంద్రుని మనుమడు భీమపయ్యయొక్కబెళ్వొలమండలి యణ్ణిగెఱె జోస్యుడైన సింఘుని మనుమడు. భీముని కిని వబ్బణబ్బెకును బుట్టిన పుత్రుడు. పంపని తమ్ముడు. తన పూర్వికుల వృత్తాంతమును విక్రమార్జునవిజయమందు పంప డిట్లు తెల్పియున్నాడు. వెంగిమండలములోని వెంగిపఱువునకు జేరిన వసంతకొట్టూరు నిడుగుంది విక్రమపురములో నగ్రగణ్యుడైన బ్రాహ్మణుడు మాధవసోమయాజి. అతని పుత్రుడు అభిమానచంద్రుడు. అభిమానచంద్రుని కుమారుడు కుమరయ్య; కుమరయ్య సుతు డభిమాన దేవరాయడు. ఇతడు మతములలో నెల్ల జైనమతమే శ్రేష్ఠతమమైనదని నిశ్చయించి వైదికధర్మమును విసర్జించి జినేంద్ర ధర్మమును స్వీకరించెను. ఇతని తనయుడే పంపడు. తండ్రివలె పంపడును జైనమతము ననుసరించెను. తాను కొండకున్దాన్వయమునకు జెందినవాడననియు, తన గురువు దేవేంద్రముని యనియు నతడు చెప్పుకొనియున్నాడు. అతని బిరుదులు పెక్కుగలవు. అందు 'కవితా గుణార్ణవ' యనునది ముఖ్యమైనది. విక్రమార్జున విజయములోని యాశ్వాసాంత గద్యములు పదునాల్గింటియందును 'కవితా గుణార్ణవ విరచితమప్ప' యనియే కలదు. పై వివరించిన వంశవృక్షముల నీ క్రింది విధముగ విరచింపవచ్చును :—

గంగాధర శాసనము :




విక్రమార్జున విజయము :




ఈ వంశావళులు రెండును నొకతీరుగ నుండక వ్యత్యస్తముగ నున్నవి. గంగాధర శాసనమున వంశావళి అభిమానచంద్రునితో నారంభమగుచున్నది; విక్రమార్జునవిజయమునం దభిమాన చంద్రుని తండ్రియగు మాధవసోమయాజితో ప్రారంభించుచున్నది. ఇది పరిగణింపదగిన భేదము కాదు. జినవల్లభుడు అభిమానచంద్రుని తన వంశమునకు మూలపురుషుడని చెప్పగా, పంపడు మఱియొక తరము వెనుకకు బోయి యభిమానచంద్రుని తండ్రియైన మాధవ సోమయాజి వంశమునకు మూలపురుషుడని చెప్పెను. జినవల్లభుడు

అభిమానచంద్రుని తరువాత భీముని పేర్కొని తానభిమాన చంద్రుని మనుమడననియు భీముని పుత్రుడననియు వచించినాడు. పంపడు, అభిమాన చంద్రుని కొడుకైన కుమరయ్యాను నతని కుమారుడును దనతండ్రియునగు నభిమాన దేవరాయని బేర్కొనినాడు. జినవల్లభుడు కుమరయ్యాను బేర్కొనలేదు. మీదుమిక్కిలి తాను అభిమాన చంద్రుని మనుమడననియు, దమ యయ్యా పేరు భీముడనియు దెల్పియున్నాడు. మనుమడన సంతతివాడని యర్థము చేసికొనవచ్చును. అప్రసిద్ధుడగుటచేత కుమరయ్యాను బేర్కొనలేదని యెంచినను తండ్రి నామము భిన్నమగుట యెట్లు? గంగాధర శాసనమున జెప్పినట్లు పంపడును జినవల్లభుడు అన్నదమ్ములే యైనచో వారియం దొక్కడు తన తండ్రి యభిమాన దేవరాయ డనియు మఱియొక్కడు భీముడనియు జెప్పుకొనుట యెట్లు తటస్థించినది? అభిమాన దేవరాయ డనునది భీముని నామాంతరమా? వాస్తవము నరసిచూడగా పంపని తండ్రిపేరు అభిమాన దేవరాయడు గాదు. ఇది ప్రమాద జనితము. విక్రమార్జున విజయమును బరిష్కరించి ప్రకటించిన పండిత ప్రకాండులు తాళపత్రప్రతులు గొన్నిటియందు గానవచ్చు నపపాఠమును గ్రహించుటవలన గలిగినది. విక్రమార్జున విజయ చతుర్దశాశ్వాసములోని

> ఆకొమరయ్యం గవని తలాకాశవ్యాప్తకీర్తి నిజగుణమణిర
> త్నాకర నజ్ఞాతమో నీకర నభిమానదేవరాయం తనయం ॥

అను పద్యముయొక్క చతుర్థ పాదము కొన్ని తాళపత్ర ప్రతులయందు 'తమో! నికరం భీమనామధేయం తనయం' అనియు 'తమో! నీకపరం భీమనామధేయం తనయం' అనియు పాఠాంతరములు గానవచ్చుచున్నవి.[1] పాఠాంతరములోని భీమనామమే పంపని తండ్రి

1. విక్రమార్జున విజయము. 14, Fn.

యొక్క నిజమైన పేరని గంగాధర శాసనము రుజువు సేయుచున్నది; కావున యభిమానదేవరాయనామము ప్రమాద జనితమగుటచే విసర్జనీయము. జినవల్లభుడు తాను వబ్బణబ్బె కుమారుడననియు జోయిస సింఘుని మనుమడననియు పంపని తమ్ముడననియు జెప్పుకొని యున్నాడు గదా. పంప డెచ్చటను వీరిమాట యెత్తుకొననైన లేదు. దీనికి గారణ మేమి? పంపడును జినవల్లభుడును సహోదరులు గారేమో. వబ్బణబ్బె పంపనికి సవతితల్లి యగునేమొ. తత్కారణ మున నతడు వబ్బణబ్బెనుగాని యామె తండ్రియైన జోయిససింఘుని కుమారుడైన జినవల్లభునిగాని పేర్కొనియుండక పోవచ్చును.

ప్రస్తుత శాసనము పంపని కులగోత్రాదులను గూర్చియు నతని యొక్కయు నతని పూర్వులయొక్కయు నివాసస్థానములనుగూర్చియు గొన్ని నూతనాంశములను దెల్పుచున్నది. విక్రమార్జునవిజయ మందు పంపడు తనది శ్రీవత్సగోత్రమని మాత్రము సూచించి యున్నాడు. ప్రస్తుత శాసనమందు జినవల్లభుడు తాను వంగిపఱ్ఱ కమ్మబ్రాహ్మణుడననియు, జమదగ్ని పంచార్షేయ శ్రీవత్స గోత్ర జుడ ననియు దెల్పియున్నాడు. వంగిపఱ్ఱయన్నది యొకగ్రామము. దీని విషయము క్రింద వివరింపబడును. వంగిపఱ్ఱ కమ్మ బ్రాహ్మణు డనగా నాగ్రామమునకు జెందిన కమ్మనాటి బ్రాహ్మణుడని యర్థము. ఆంధ్రదేశమునం దీ తెగవా రుండినట్లు ప్రాచీన శాసనమువల్ల దెలియుచున్నది. మైసూరు ప్రాంతమున నిప్పుడును గమ్మె బ్రాహ్మణు లున్నారు. కర్ణాటక బ్రాహ్మణులలో నెనిమిది శాఖా భేదములు గలవు. ఆ యెనిమిదింట గమ్మె బ్రాహ్మణశాఖ యొక్కటి; వీరు స్మార్తులు. వేంగిదేశమునందు కమ్మనాటినుండి వీరు మైసూరు ప్రాంతమునకు బోయిన ట్లొక ఐతిహ్యము గలదు.

పంపడు తన వంశమునకు మూలపురుషుఁడైన మాధవ సోమ యాజి వెంగిమండలములోని వంగిపఱుతో జేరిన వసంతకొట్టూరు నిడుగుంది విక్రమపురము లోనగు నగ్రహారములందు ప్రముఖుడని తెల్పియున్నాడు. జినవల్లభుడు తాను బెంగినాటి సప్తగ్రామములలోని వంగిపఱ్ఱు కమ్మబ్రాహ్మణుడననియు, దన తాత యభిమాన చంద్రుడు గుండికఱ్ఱ నిడుంగొండ వాస్తవ్యుడనియు, దన మఱియొక తాత(మాతామహుడు) బెళ్వోలములోని యణ్ణిగెఱె యందు జోస్యు డనియు, దాను సబ్బినాటి నట్టనడుమనుండు ధర్మపురమున కుత్తర దిగ్భాగమందుండు వృషభాద్రికి దక్షిణపు దిక్కునుండు సిద్ధశిలపై జినప్రతిమలు జెక్కించి బసదిని గట్టించి చెఱువు ద్రవ్వించితి ననియు, మఱియు జాళుక్య రాజైన యరికేసరి దనయన్నయైన కవితాగుణా ర్ణవ బిరుదాంకితుడగు పంపనికి ధర్మపురము నగ్రహారముగ నిచ్చె ననియు, నది కళాపగ్రామమును బోలినదనియు జెప్పియున్నాడు. ఇందు పేర్కొనిన దేశవిభాగములు నాలుగు: బెంగినాడు, గుండికఱ్ఱ, సబ్బినాడు, బెళ్వోలము. పర్వతములు రెండు: వృషభాద్రి, సిద్ధశిల. గ్రామములు అయిదు: వంగిపఱ్ఱు, నిడుంగొండ, ధర్మపురము, అణ్ణి గెఱె, కళాపగ్రామము.

స్థలనిర్దేశము:—పై జెప్పిన దేశవిభాగాదుల యునికి పట్టులను కనుగొందము.

దేశవిభాగములు:—మొదట బెంగినాటినిగూర్చి జినవల్లభుని బెంగినాడే పంపని వెంగిమండలము. వెంగియను పేరు ఆద్యము కృష్ణా గోదావరీ మధ్యస్థతీరాంధ్ర దేశమునకు వర్తిలుచుండినది. చాళుక్యులు క్రీ. శ. 7 వ శతాబ్దపూర్వార్ధమున తీరాంధ్ర భూమిని సమస్తమును జయించినప్పటినుండియు వారి రాజ్యాభివృద్ధి ననుసరించి దాని వైశాల్యముకూడ వైపుల్యమునంది వారి యేలుబడిక్రిందటి రాష్ట్రమున కంతటికిని పేరై చెల్లుచు వచ్చెను. తత్కారణమున

కృష్ణానదికి దక్షిణమందుండు తీరాంధ్రముగూడ వెంగిమండలాంతర్గతముగ బరిగణింపబడుచుండినది. కావున పంప జినవల్లభులకు సమకాలికుడైన పొన్నడు కృష్ణకు దక్షిణపార్శ్వముననుండు కమ్మనాటిని వెంగివిషయమునకు మకుటాయమానమైనదని ప్రశంసించియున్నాడు.

కం॥ వేంగివిషయం త్రిభువనంగళొ శగ్గ శద విషయ ముపమాతీతం
సంగత సమస్త మత్యుత్తుంగఫలద్రుమ మమూల్యవస్తునిధానం ॥
ఆ ధరణీ వధూతిళక మాధరణీలలనాముఖాబ్జమం
తాధరణీరమైకనవయౌవన మాధరణీ ప్రియా కటా
క్షాధర విభ్రమ భ్రమణ మగ్గళదగ్గద కమ్మెనాడు వి
ద్యాధరలోకమే నదఱ పోల్వగ బక్కు మె సోలదిర్కుమే.[1]

గుండికఱ్ఱ:—ఇది గుండికరకు నామాంతరము. గుండికర యనగా గుండి (గుండ్లకమ్మ) నదీతీరదేశము. గుండినది కర్నూలు మండలములోని తూర్పుకనుమలయం దుద్భవించి గుంటూరిమండలములోని ఒంగోలు తాలూకాగుండ పూర్వవాహినియై ప్రవహించి సదరు తాలూకాలోని కనుపర్తిగ్రామము చెంత బంగాళాఖాతముతో సంగమించుచున్నది. క్రీ. శ. 9, 10, 12, శతాబ్దుల నాటి తీరాంధ్ర శాసనములలో నీ గుండికర ప్రస్తావము కలదు. క్రీ. శ. 9, 10 శతాబ్దులలో ప్రచారమందుండిన 'తెలుగు – కన్నడ' లిపిలో వ్రాయబడియుండు కర్నూలు మండల సంగమేశ్వర శాసనములం దొక్కదానియందు సదరు గ్రామమందలి సంగమేశ్వరాలయము (రాతిరథము)ను గుండికఱ్ఱి దోయూరి యాచార్యుల కొడుకు నడిపి యోవాజు కట్టినటున్నది.[2] శకాబ్దము 1069 నాటి గుంటూరు మండల మందలి కొణిదెన శాసనమందు 'గుండికఱ రాచకొడుకులు దేసట్లు నూకనాయకులు'ను బేర్కొనబడియున్నారు. శకాబ్దము

1. శాంతి పురాణం. 1—42—3.

2. AR. AP. 703 of 65. ఇది ఇంకను ప్రకటితము గాలేదు.

1072 నాటి మరియొకశాసనమునం దప్పుడు కొణిదెనయందు రాజ్యము సేయుచుండిన త్రిభువనమల్లిదేవుడను రాజు 'కమ్మనాండును, గుండికఱ్ఱు ముట్టవాడియుం జేకొని' నట్లు చెప్పియున్నది.[1] ఈ శాసనముల వలన గుండికఱ లేక గుండికఱ్ఱ యనునది గుంటూరు మండలమందు గుండినదీ తీరమున నుండు రాష్ట్రవిభాగమునకు పేరై యుండినట్లు తెలియుచున్నది.

సబ్బినాడు :— తెలింగాణ ప్రాచీనశాసనములు గొన్నింట సబ్బినాడును, నందలి గ్రామములు గొన్నియు బేర్కొనబడి యున్నవి. శకాబ్దము 888 నాటి పర్భణి తామ్రశాసనము నందు లేంబులవాటిక (వేములవాడ) రాజధానిగ దత్ప్రాంత దేశమును బాలించుచుండిన చాళుక్య ముమ్మడి యరికేసరి మహారాజు సబ్బిసాయిరాంతర్గతమైన రేపాక 12 లోని కుత్తంవృత్తి వనికటుపలు అను గ్రామమును సుప్రసిద్ధ జైనమతాచార్యుడైన సోమదేవసూరికి దానము జేసినట్లు జెప్పియున్నది. చెప్పిన రేపాకయందే ముమ్మడి అరికేసరి యొక్క శిలాశాసన మొక్కటి కూడ గలదు.[3] శకాబ్దము 1092 నాటి కాకతిరుద్రదేవుని కరీంనగర శాసనమున సబ్బినాడును నందలి నగరూరును బేర్కొనబడినవి.[4] ఈ నగరూరే యిప్పటి నగనూరు. మడికిసింగనకృత పద్మపురాణోత్తరఖండ పీఠికలో దత్కృతిపతి యగు ముప్ప భూపాలుడు గౌతమీ దక్షిణ తటంబున సబ్బినాటి రాష్ట్రమున రామగిరి పట్టణము రాజధానిగ రాజ్యము సేయుచుండె ననియు, నతని దండనాయకుడైన వెలిగందల కేసన రామగిరియందు విష్ణ్వాలయము గట్టించి ధర్మపురియం దన్నసత్రము నెలకొల్పెననియు

---

1. S.I.I. VI. Nos. 639 and 640.
2. The Chalukyas of Vemulavada, PP. 93 and 97.
3. AR. AP. No. 192 of 1966. ఇది ఇంకను ప్రకటింపబడలేదు.
4. H. A. S 13, Ins. No. 56.

జెప్పియున్నది.[1] పై జెప్పిన రేపాక, నగరూరు (నగనూరు), రామగిరి, ధర్మపురి మున్నగు గ్రామములన్నియు నిప్పటి కరీంనగర జిల్లా యందు కానవచ్చుచున్నవి. కావున పూర్వమీ కరీంనగర జిల్లాకు సబ్బినా డనుపేరు చెల్లుచుండెనని నిశ్చయముగ జెప్పవచ్చును.

బెళ్వోలము :— బెళ్వోల మనునది బెళె+పొల అను మాటల కూడిక వలన నేర్పడినదనియు, 'ధాన్యము పుష్కలముగ నుత్పత్తి యగు దేశ'మని దాని యర్థమనియు, నది పూర్వము మూడువందలు గ్రామములు గల రాష్ట్రమనియు నిప్పటి ధార్వాడజిల్లా నవల్గుండ తాలూకాలోని యణ్ణిగెఱె యను పట్టణము దాని రాజధాని యనియు ఫ్లీట్‌గారు నిర్ధారించి యున్నారు.[2]

పర్వతములు :—వృషభాద్రి: వృషభాచలము, వృషభపర్వతము వృషభగిరి, వృషభమహీధ్ర మనియు దీని నామాంతరములు. ఈ వృషభాద్రి యెచ్చట నున్నదో నిశ్చయించి చెప్పుటకు వలను గాకున్నది. శాసనమునం దిది (భరతఖండపు) దక్షిణార్ధము నందలి సుప్రసిద్ధమైన ప్రాచీన తీర్థస్థానమనియు, సబ్బినాటి నట్టనడుమ నుండు ధర్మపురమున కుత్తర దిగ్భాగమున నున్నదనియు జెప్పియున్నది. మొట్ట మొదట ధర్మపుర మెచ్చటనున్నదో తెలిసికొనినగాని దీని యునికిని స్థలమును గుర్తించుటకు వీలుగాదు. సబ్బినాటికి సరిపోవు కరీంనగర జిల్లాలో ధర్మపురి యొకటి కలదు. ఇది కరీంనగరు కుత్తర మున నలువదిమైళ్ల దూరమున గోదావరీ దక్షిణ తటమునం దున్నది. ఇప్పుడును నిది బ్రాహ్మణ బాహుళ్యము గల స్థలము, యాత్రా స్థానము. ధర్మపురి నివాసుడైన శ్రీ లక్ష్మీనరసింహస్వామిని సేవిం

---

1. పద్మ. ఉత్తర. 1:

2. The Gazetteer of the Bombay Presidency, Vol II, Part I, PP—305, n. 1, and 676.

చుట కొరకు యాత్రికులు పరిసర ప్రదేశముల నుండి యిచటికి మూగుచుందురు. శాసనమున పేర్కొనియున్న ధర్మపురము, విక్రమార్జునవిజయ రచనకు మెచ్చి యరికేసరి పంపని కగ్రహారీక రించి యిచ్చిన ధర్మపురమును ఇదియె కానగును. అగునేని యనాదిసంసిద్ధతీర్థమైన వృషభాద్రి యీ ధర్మపురమున కుత్తర దిగ్భాగమున గోదావరి యుత్తర తటమున నిప్పటి యదిలాబాదు జిల్లా యందలి కొండలలోనిదై యుండవలయును. కాని యిందుల కొక యాక్షేపము గలదు. మన శాసనము, ధర్మపురము సబ్బినాటి నట్టనడుమ నున్నట్లు చెప్పియున్నది కదా. పై చెప్పిన గోదావరి తటము నందలి ధర్మపురి ధర్మపురమే యైనయెడల సబ్బినాడు దీని నావరించి యుండవలయును. కాని ధర్మపురి కావల గోదావరినది యుత్తర పార్శ్వమున సబ్బినాడు వ్యాప్తమై యుండెనని చెప్పుటకు తగినంత శాసనాద్యాధార మెద్దియు నింత దనుక బయలు పడలేదు. కావున గోదావరీ దక్షిణ తటమందలి ధర్మపురియె శాసనోక్త ధర్మ పురమని చెప్పుటకు జంకవలసియున్నది. ఈ ధర్మపురి యొక్కటియే కాక ధర్మారనామ గ్రామములు కొన్ని కరీంనగరు జిల్లా యందు కానవచ్చు చున్నవి. ధర్మార మనునది యిప్పటి నానుడిలో ధర్మ పురమునకు రూపాంతరము. ధర్మపురము ధర్మపురమై ధర్మవరమై ధర్మారమైనది. ఒక ధర్మారము వేములవాడకు పదిమైళ్లు పశ్చిమ మున సిరిశిలకు బదునైదు మైళ్ళ దూరమున పశ్చిమోత్తర దిశలో నున్నది. మరియొకటి మంథెనకు బదిమైళ్ళు దక్షిణముననను, నింకొకటి యోరుగంటికి పశ్చిమమున నిరువది మైళ్ళ దూరముననను గలవు. ఇవి యన్నియు సబ్బినాటి లోనివే. కావున ప్రస్తుత శాసనోక్త ధర్మపురి యిందేదియైనను గావచ్చును. భావి పరిశోధన వలన నిజము వెలు వడవలసి యున్నది.

సిద్ధశిల :—వృషభాద్రివలె కాక సిద్ధశిలను గుర్తించుట సులభము. శాసనమునం దిది వృషభాద్రికి దక్షిణ దిశాభాగమునం దున్నట్లు చెప్పియున్నది. ఇది కరీంనగరుకు పశ్చిమమున పదమూడు మైళ్ళ దూరమున కరీంనగర - కామారెడ్డి రోడ్డునకు ఉత్తరపు వైపు మూడు మైళ్ళ దూరమున నుండు గంగాధర గ్రామములోని బొమ్మలగుట్ట యగుట నిశ్చయము.[1] శాసనమునందు వివరించినట్లు ఈ కొండకొమ్ము పైనుండు పెద్ద నిలువుబండ మీద ప్రస్తుత శాసనముల్లేఖింపబడి యుండుటయు దాని పైభాగమున నాద్యంత జినబింబములును జక్రేశ్వరియును మఱికొన్ని దేవతా ప్రతిమలును జెక్కియుండుటయు నీ విషయమును రుజువు సేయుచున్నవి. కాని యచట జినవల్లభుడు కట్టిన 'త్రిభువనతిలక'మను బసదిగాని 'మదనవిలాస' మను వనముగాని కానరావు. బొమ్మలగుట్ట నానుకొని దాని కుత్తరపు తట్టొక చెఱువు కలదు. ఇదియే జినవల్లభుడు తన యన్న పేరట

1. ఈ గ్రామముయొక్క యునికిపట్టును గుర్తింపజాలక పరిశోధకులు చిక్కుపడుచున్నారు. సర్ ఆర్. జి. భండార్కరుగారి యభిప్రాయము ననుసరించి శ్రీ కె. కె. హాందికీగారు "యశస్తిలక అండ్ ఇండియన్ కల్చర్" అను గ్రంథములో (PP.4) నిదియొక కుగ్రామ మనియు నిది ధార్వాడ ప్రాంతమునం దెచ్చటనో యుండవలయుననియు ధార్వాడకు సమీపస్థమైన రాయచూరి జిల్లాలోని గంగావతి గావచ్చుననియు వ్రాసియున్నారు. ఇటీవలి చరిత్రపరిశోధనతో బరిచయ ముండిన వీరిట్లు వ్రాసియుండరు. వేములవాడ చాళుక్యులు కర్ణాటమున నే రాజ్యము జేయుచుండిరను భ్రమవలన వీరు తమ దృష్టిని కర్ణాటకమునకు వెలుపట సారింపజాలరైరి. ఇమ్మడి యరికేసరి కుమారుడైన వాగదేవుడు గంగధార నుండి రాజ్యము సేయుచుండినట్లు సోమదేవసూరి తన యశస్తిలకమందు చెప్పియున్నాడు. 'గంగధార' యను పేరు సరియైనది కాదు. గంగాధరమనియే సరియైనపేరు. ఇది జైనుల కాటపట్టయి యుండెనని యచట గానవచ్చు జైన సమయావశిష్టముల వలన దెలియుచున్నది. దాని మత ప్రాశస్త్యము వలన జైనమతాభినివిష్టుడైన వాగరాజు కులక్రమాగత రాజధానియైన వేములవాడను విడిచి గంగాధర గ్రామమున నివసించు చున్నట్లున్నది.

గట్టించిన కవితాగుణార్ణవమను చెఱువై యుండవచ్చును జినవల్లభుడు సదరుబసదిని, వనమును, సిద్ధశిలయొద్దకాక తత్సమీపస్థమైన గంగాధర గ్రామము చెంత నిర్మించి యుండెనేమో. గంగాధర గ్రామము చుట్టును పొలములలో గానవచ్చు జైన తీర్థంకరుల విగ్రహములను జూడ నది యొకప్పుడు జైనుల కాటపట్టై యుండెనని తోచుచున్నది.

గ్రామములు :— శాసన మందు పేర్కొని యుండు గ్రామములైదింటిలో నణ్డిగెఱె ధర్మపురముల యునికిపట్టులు పైన చర్చింపబడి యున్నవి. వాని గూర్చి యిచట మరల వివరించుట యనవసరము. మిగిలియుండు మూడింటిలో నొక్కటియైన వంగిపఱ యిప్పటి గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోని వంగీపురమని పరిశోధకులు నిర్ధారించి యున్నారు. పంపడు తన పూర్వులలో నాద్యుడైన మాధవ సోమయాజికి నివాసస్థానమని చెప్పిన వెంగిపఱు విదియే. వెంగిపఱు వనునది వ్రాయసకాండ్ర పొరపాటు వలన నేర్పడిన భ్రష్టరూపము. ఆ యూరికి సరియైన పేరు వంగిపఱ యని ప్రస్తుత శాసనమువలన విదితమగుచున్నది. వంగిపఱ వేంగినాటి సప్తగ్రామములలో నొక్కటి యని జినవల్లభుడు తెలుపుచున్నాడు. ఈ సప్త గ్రామవర్గమునకు జెందిన దక్కినయాఱు గ్రామము లెవ్వియో తెలియవు. త్రిలోచన పల్లవుడను రాజు సప్తర్షుల పేర సప్తాగ్రహారములను నిర్మించి బ్రాహ్మణులకు దానము జేసినట్లు గుంటూరు మండల ప్రాచీన శాసనములలో నొక యైతిహ్యము గానవచ్చుచున్నది. వెంగినాటి సప్త గ్రామము లా పల్లవరాజు నిర్మించిన సప్తాగ్రహారము లగునేమో. పంపడు వంగిపఱుతో చేరినవని చెప్పిన వసంత కొట్టూరు నిడుగుంది విక్రమపురాగ్రహారములు ప్రాయశః ఈ సప్త గ్రామములలో జేరినవి కావచ్చును.

నిడుంగొండ :—మీద జెప్పిన వసంత కొట్టూరాది గ్రామము లలో నొక నిడుగుంది తప్ప తక్కిన వెచ్చట నున్నవో చెప్పుటకు వీలుకాదు. నిడుగుంది యను పేరు సరికాదు. దాని నిజమైన పేరు నిడుంగొండ యనియు నది గుండికఱ సీమలోని గ్రామమనియు మన శాసనము దెల్లము సేయుచున్నది.

కలాపగ్రామము :—ఇక కలాపగ్రామమును గూర్చి యొక మాట. దీని యునికిపట్టును గుర్తించుటకు వీలుగాకున్నది. కాని పురాణములలో దీని ప్రస్తావము గలదు. ఉదా : భాగవత పురాణ మందు ఇక్ష్వాకువంశజుడగు మనుడను రాజు కల్యంతమున నష్టమై పోయిన సూర్యవంశమును బునః ప్రతిష్ఠ చేయగలవాడని చెప్పి యున్నది.

'యోఽసా వాస్తే యోగసిద్ధః కలాపగ్రామ మాశ్రితః।
కలే రంతే సూర్యవంశం నష్టం భావయితా పునః' ॥[1]

ఇట్టి సందర్భముందే పురాణములు మరి కొన్నిటియందును నీ కలాపగ్రామ ప్రస్తావము గలదు.

మీద చేసిన రాష్ట్ర విభాగాది వివరణ వలన పంప జినవల్లభులపూర్వులు మొట్ట మొదట తీరాంధ్రమందలి వెంగిమండలాంతర్గత కమ్మనాడు గండికఱసీమలలో నివసించుచుండి రనియు గాలక్రమమున వా రా ప్రాంతమును విడిచి తెలింగాణపు బశ్చిమోత్తర భాగముననుండు సబ్బినాటికి బోయి యచట స్థిరనివాసము లేర్పఱచుకొని యందే నెలకొనిరనియు దెల్లమగుచున్నది. వారు ఎప్పు డేకారణమున దమ యాదిమ నివాసస్థానమును విసర్జించి సబ్బినాటికి బోయిరో నిశ్చయించి చెప్పుటకు తగిన సాక్ష్యము లేదు. కాని యది పంపని తండ్రియైన భీముని కాలముననే జరిగి యుండవచ్చునని యూహిం

1. భాగవత. 9—12—6.

చుట కవకాశము గలదు. పంపడు విక్రమార్జునవిజయమునందు తన తండ్రియైన భీముడు మతము లన్నిటిలో జైనమత ముత్తమమైనదని గ్రహించి యామతమును స్వీకరించినట్లు చెప్పియున్నాడు.[1] మతము మార్పే భీముని యన్యదేశగమనమునకు దారితీసిన ట్లున్నది. వెంగి దేశమం దప్పుడు జైనమతము లేకపోలేదు. కాని జైనుల సంఖ్య యల్పాల్పము. జైనసమయము జనాదరణ లేక హీన స్థితియం దుండినది. దేశపాలకులైన పూర్వ చాళుక్యరాజులును వారి నాశ్రయించి యుండిన సామంతులును దొరలును వైదికాభిమానముగల శైవులు. వారి యాదరాభిమానముల వలన వైదిక శైవ ధర్మములు రెండును ప్రబలి సర్వజనసమాదరణీయములై వర్ధిలు చుండినవి. వేదబాహ్యమైన జైన మతానుయాయులు జనసామాన్యముచే పాషండులని గర్హింప బడుచుండిరి. వైదిక శైవ మతములకును జైనమతమునకును బరస్పర వైరము సహజమై మతకలహముల కాస్కార మగుచుండెను. ఇట్టి పరిస్థితులలో ననాది కాలమునుండి తన పెద్ద లనుష్ఠించుచు వచ్చిన వైదిక ధర్మమును విసర్జించి జైనమతమును స్వీకరించినందువలన భీమునికి దన వారిలో దావు లేకపోయియుండవలయును. స్వజనముచే బహిష్కృతుడై స్వస్థానమున నిలువ నీడలేక పోవుటచే మనికి దుర్భరమగుటచేత నతడు దేశత్యాగము జేసి తన నూతన మతమును నిరాటంకముగ ననుష్ఠించుట కనుకూలమైన చోటికి బోవ సమకట్టియుండును. సబ్బిదేశ మతని దృష్టి నాకర్షించినది. వేములవాడ రాజధానిగా నా ప్రాంత భూములను బాలించుచుండిన చాళుక్యులు జైన మతాభినివిష్టులు. వారు జైన విద్వాంసులను గవులను జేరదీసి యాశ్రయ మిచ్చుచుండిరి. వారి యాశ్రయమున జైనమత మభివృద్ధిజెంది సర్వజన సమాదరణ నందియుండినది.

1. విక్రమార్జునవిజయం 14—48.

కావున సబ్బినాటియందు దన నూతన మతమును నిరవధికముగ నాచరింప వచ్చుననియు దన కచట రాజాశ్రయము లభించి జీవనము నిరుపాధిగ సాగగల దనియు దలచి వేములవాడను జేరెను. అందే యతనికి అణ్ణిగెఱె జోయిస సింఘునితో పరిచయము గలిగి యతని పుత్రికయైన వబ్బణబ్బెను బెండ్లాడియుండవలయును.

అరికేసరి :—చాళుక్యవంశప్రభువైన యరికేసరి విక్రమార్జున విజయమునకు మెచ్చి పంపనికి ధర్మపురము నగ్రహారముగ నిచ్చెనని యీ శాసనమందు చెప్పియున్నది కదా. ఈ చళుక్య ప్రభు వెవ్వడు? బాదామి చాళుక్య రాజవంశ ముత్సన్నమైపోయిన పిమ్మట నా వంశమునకు జెందిన యొక శాఖవారు రాష్ట్రకూటుల యాధిపత్యము నంగీకరించి వారికి సామంతులై యిప్పటి కరీంనగరుజిల్లాలోని వేముల వాడను రాజధానిగ జేసికొని తత్ప్రాంతభూములను క్రీ. శ. 8 వ శతాబ్దోత్తరార్ధమునుండి 10 వ శతాబ్ద మధ్యమువఱకు పాలించు చుండిరి. వీరిని చరిత్రకారులు వేములవాడచాళుక్య లందురు. ఈ వంశమునకు జెందినవాడే విక్రమార్జునవిజయ కృతిపతియైన యరి కేసరి. పంప డీ చాళుక్య రాజవంశ చరిత్రను విక్రమార్జునవిజయ పీఠికయందు సంగ్రహముగ వర్ణించియున్నాడు.

చళుక్యవంశమున యుద్ధమల్లుడను రాజు కలడు. అతడు సపాద లక్ష భూమిని పాలించుచుండెను. అతని పుత్రు డరికేసరి. నిరుపమ దేవునికాలమునం దీతడు వెంగి కళింగములను సాధించెను. ఇతనికి నరసింహభద్రదేవులను పుత్రు లిరువురు పుట్టిరి. వీరిలో నరసింహునికి దుగ్ధమల్లుడను కొడుకు పుట్టెను. ఇతని కుమారుడు బద్దెగడు; నలు వది రెండురణక్షేత్రములలో మగటిమినిచూపి 'సోలదగండ' డను బిరుదునందిన శూరమానిసి; నీటియందు ప్రవేశించి మొసలిని పట్టిన ట్లితడు భీముని పట్టెను. బద్దెగనికొడుకు దుగ్ధమల్లుడు. ఇతని కుమారు

నైన నరసింహుడు లాళమును, ఏడుమాళవములను జయించెను. ఘూర్జర రాజైన మహీపాలుని యుద్ధమున నోడించి యతని గజములను బట్టుకొనెను; గంగాపర్యంతము దాడిపోయి, యందు దన తురంగములను నీరు ద్రావించెను. కాళప్రియరణమున గెల్చుకొని నిజ పరాక్రమమును బ్రకటించెను. నరసింహుడు సుప్రసిద్ధ రాష్ట్రకూట చక్రవర్తియైన ఇంద్రవల్లభుని సోదరిని జాకవ్వను బెండ్లాడెను. ఈ దంపతులకు బుట్టిన సుపుత్రుడే విక్రమార్జునవిజయ కృతిపతియైన యరికేసరి.[1] ఈ నామధేయముగల యీ వంశపురాజులలో నితడు రెండవ వాడగుటచే నితనిని చరిత్రకారు లిమ్మడి యరికేసరి యనుచున్నారు.

పై వివరించిన చళుక్య వంశావళి యీ యిమ్మడి యరికేసరి యొక్క వేములవాడ శిలా శాసనమందును వర్ణింపబడియున్నది. అందీ యిమ్మడి యరికేసరి రాష్ట్రకూట చక్రవర్తి ఇంద్రవల్లభుని కుమారితను రేవకనిమ్మడిని, లోకాంబికయను రాష్ట్రకూట వంశజ యగు మఱియొక రాజపుత్రికను వివాహము జేసికొనెననియు, నాల్గవ గోవిందచక్రవర్తియొక్క కోపమునకు గురియైనబిజ్జని కాశ్రయమిచ్చి రక్షించినందులకు గ్రుద్ధుడై గోవిందచక్రవర్తి తన పై కెత్తి రాగా నాహవమున నాతని గూలద్రోసి యతని స్థానమున బద్దెగదేవుని రాష్ట్రకూట సింహాసనముపై బ్రతిష్ఠించెననియు జెప్పియున్నది[2].

ధర్మపుర దాన శాసనము :—విక్రమార్జునవిజయమును గూర్చి యీ శాసనమునందు క్రొత్త యేమియును గానరాదు. అది యంతయు బంపని కృతియందే కలదు. విక్రమార్జునవిజయమందు విస్పష్టము గాక యుండు విషయమొక్కటి మాత్ర మిందువలన విదితమగుచున్నది. తన కరికేసరి యిచ్చిన ధర్మపురమును పంపడు 'శాసన

---

1. విక్రమార్జునవిజయము 1—15—51.

2. The Chalukyas of Vemulavada PP. 30—31.

దగ్రహార' మని, శాసనబద్ధమైన యగ్రహారమని తెల్పియున్నాడు. కాని శాసనరూపమెట్టిదో వివరించి యుండ లేదు. సంశయగ్రస్తులగు పృచ్ఛకులకు సమాధానము చెప్పు వ్యాజమున జినవల్లభు డీ శాసన మెందు కలదో తెలిపియున్నాడు. 'తామ్రశాసనము లిఖింపబడెనా? అరికేసరి ధర్మపురము నిచ్చెనా? బంపడు దానిని గ్రహించెనా? యని మాటిమాటికి యున్మాదముతో పలువుర నడుగవలదు. పోయి చూడుడు, సుందర వృషభ పర్వతోన్నత శిలా తలమున జెక్కియుండు నక్షరములను, అని. ఇందువలన ధర్మపుర దాన శాసనము శిలా శాసన మనియు, నది వృషభపర్వతము మీద చెక్కబడి యున్నదనియు దెల్లమగుచున్నది. వృషభపర్వతము యొక్క యునికి పట్టు తెలియవచ్చినప్పు డీ శాసనమును నందు తప్పక కాననగును.

ప్రాచీనతమ కందపద్యములు:—ఈ శాసనమునకు ఆంధ్రసారస్వత చరిత్రయందు ప్రత్యేక స్థానము గలదు. ఇది ప్రాచీనతమాంధ్ర పద్య శాసనములో నొకటి. ఆంధ్రభాషయందు కావ్యరచన క్రీ. శ. 11 వ శతాబ్ద మధ్యభాగమున నన్నయభట్టారక కృతాంధ్ర మహాభారతముతో ప్రారంభమైనను దత్పూర్వము రెండు శతాబ్దముల నుండియు ఆంధ్రులు గవిత చెప్ప నేర్చియుండిరని శాసనముల మూలమున దెలియుచున్నది. గుణగవిజయాదిత్యుని నాటి యద్దంకి, కందుకూరు శాసనములును, మొదటి చాళుక్య భీమునికాలపు ధర్మవర శాసనమును, రెండవ యుద్ధమల్లుని బెజవాడ శాసనమును బద్యాత్మకములు. వీనిలో మొదటి దానియందు తరువోజయు, రెండు మూడులందు సీసమును, కడపటి దానియందు మధ్యాక్కరలును వాడబడినవి. ప్రస్తుత శాసనమునందు మూడు కందపద్యములు గలవని మీద చెప్పియున్నాను. ఇవియే తెలుగుభాషలోని ప్రాచీనతమ కందపద్యములు. అప్పటి వ్రాత పద్ధతి ననుసరించి యీ పద్యము లిట్లు లిఖింపబడి యున్నవి.

కన్దం॥ జినభవనంబు లె_త్తించుట, జినపూజ ల్సేయుచున్కి_ జినమునులకు న
_త్తిన యన్నదానం బీవుటం, జినవల్లభు బోలంగలరె జినధర్మపరుల్ ॥
దినకరు సరి వెల్గుదు మని, జినవల్లభు నెట్టు నెత్తు జితకవిననను
మనుజు ల్గలరె ధాత్రిం, వినితిచ్చుదు ననియవృ_త్త విబుధ కవీంద్రుల్ ॥
ఒక్కొక్కొ_ గుణంబు కల్గుదు, రొక్క_ణ్ణిం గా కొక్క_ లక్క_ లే వెవ్వరికిం
లెక్కిం_ప నొక్క_ లక్క_కు. మిక్కి_లి గుణపక్షపాతి గుణ మణి గణంబుల్ ॥

వీని నిట్లు చదువవలయును.

జినభవనము లె_త్తించుట. జిన పూజ ల్సేయుచున్కి_ జినమునులకు న
_త్తిన యన్నదాన మీవుట, జినవల్లభు బోల గలరె జినధర్మపరుల్ ॥
దినకరు సరివెల్గుదుమని, జినవల్లభు నొట్టు నెత్తు జితకవిననమున్
మనుజు ల్గలరే ధాత్రిఀ, వినుతిచ్చుదునని యవృ_త్త విబుధ కవీంద్రుల్ ॥
ఒక్కొక్క_ గుణము కల్గుదు, రొక్క_టఀగా కొక్క_లక్క_ లే వెవ్వరికిఀ
లెక్కిం_ప నొక్క_ లక్క_కు, మిక్కి_లి గుణపక్షపాతి గుణమణి గణముల్ ॥

ఈ మూడు కందపద్యములలోను మొదటి రెండును దెనుగు కవితాసంప్రదాయానుసారము యతి ప్రాసలతో కూడియున్నవి. మూడవ పద్యమునందు ప్రాసముగలదుగాని యతిలేదు. ఇందు శాసన రచయిత యేలనో కన్నడకవిత్వ సంప్రదాయము ననుసరించినాడు.

శాసన గ్రంథక_ర్త :—శాసన గ్రంథక_ర్త తనపేరు చెప్పలేదు. కాని యితడు చక్క_ని కవిత్వము జెప్పగల నేర్పరియె. ఇందలి మూడు భాషలలోను గల పద్యములు మనోజ్ఞముగ నున్నవి. ఒకవేళ జినవల్లభుఁడె శాసన గ్రంథమును రచించెనేమొ! అతడు విద్వాంసు డనియు గలాకోవిదుడనియు బహుకావ్యరచనాసమర్థు డనియు కవిత్వ తత్వ విశారదు డనియు శాసనమందు చెప్పియున్నది.

గీతం గాతు మనేక భేదసుభగం కావ్యాని సోచ్చావచం
వాచా వాచయితుం ప్రియాణి వదితుం సాధ్యాపక_ర్తుం సతాం

భోగా న్సేవితు మంగనా రమయితుం పూజాం విధాతుం జినే
జానీతే జినవల్లభః పర మిదం పంపాభిధానానుజః ॥
చదుర మయ్మెయ సత్కవిత్వద సన్న పంపన తమ్మనొ
వ్వఴదె పొగత్తెయ బాజిస ల్బరెయ ల్కవిత్వద తత్వదో
ళ్పుదిదు నేపఴదె పేఱలువ్విఴ గపూర్వఴ మాగిరె బల్లొన
ప్పుదరి నొవ్వఴనె వాగ్వధూ వర వల్లభం జినవల్లభం ॥

కావున జినవల్లభుడె ఈ శాసన గ్రంథమును రచించి యుండ వచ్చునని తోచుచున్నది.

శాసన కాలము :—శాసనకాల మిందు చెప్పలేదు., కాని యిందలి లిపి స్వరూపమునుబట్టి యిది క్రీ. శ. 10 వ శతాబ్ద మధ్య కాలమప్పటిది కావచ్చునని యీ వ్యాసారంభమందు చెప్పియున్నాడను. ఇది పంపని తమ్ముడగు జినవల్లభుని ప్రశస్తియగుటయు నిందు పంప కృతవిక్రమార్జునవిజయ ప్రస్తావముండుటయు పైని వివరించిన కాలనిర్ణయము సంగతమైనదని సూచించుచున్నవి. పంపడు శ. 824 దుందుభి వర్షము (క్రీ. శ. 902) న బుట్టెననియు, నాదిపురాణమును శ. 863 ప్లవ (క్రీ. శ. 941) సంవత్సరమున రచించెననియు నందు చెప్పియున్నది.[1] ఆదిపురాణమును పంపడు విక్రమార్జునవిజయము నందు పేర్కొనియున్నాడు.[2] కావున క్రీ. శ. 941 వ సంవత్సరమునం దాదిపురాణమును విరచించిన పిమ్మట పంపడు విక్రమార్జునవిజయము వ్రాసెనని చెప్పుట యొప్పగును. విక్రమార్జునవిజయమును ప్రస్తుత శాసనము ప్రశంసించుచుండుటవలన ఇది విక్రమార్జునవిజయ రచనానంతరము క్రీ. శ. 945 ప్రాంతమున నెలకొల్పబడియుండును.

ఈ వ్యాసరచనయందు ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు పూర్వము ప్రధాన కర్ణాటభాషోపాధ్యాయులై యుండిన ఆచార్య

1. కర్ణాట కవి చరితె సం. 1. పు. 31.

2. విక్రమార్జునవిజయం. 14—59.

డి. కె. భీమసేనరావుగారి సాయమును బడసినాడను. శాసన గ్రంథ
మును నాతో గూడ చదివి యందలి విషయమును జక్కగ వివరించి
నందులకు వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములను సమర్పించు
చున్నాడను.

## శా స న పా ఠ ము

1. * ఓం నమః సిద్ధేభ్యః [।*] స్వస్తి సమస్త సకళ కళా
ళాప ప్రవీణం భవ్యరత్నాకరగుణ పక్షపాతి బెంగినాడ సప్తగ్రామగ
ళొళగణ వంగిపఱ్ఱి కమ్మె బ్రాహ్మణం జమదగ్ని పంచార్షేయం
శ్రీవత్సగోత్రం గుణ్డికఱ్ఱ నిడుంగొణ్డె యభిమాన చన్ద్రన మమర్గం
భీమపయ్యన బెళ్వొలదణ్నిగె తెఱెయ జోయిస సింఘన మమర్గ [౦*]

2. వబ్బణబ్బెయ మగం కొణ్డ కున్దెయ దేసిగ గణద పొత్థ
గెయ బళియ పణ్డరంగ వల్లియ జయ [౦] గొణ్డ సిద్ధా[న్త] భట్టారర
గుడ్డం జినవల్లభం సబ్బినాడ నట్టనడువణ ధర్మ్మపుర దుత్తర దిగ్భా
గద వృషభగిరియెం బనాది సంసిద్ధ తీర్త్థద దక్షిణ దిశాభాగ దీ సిద్ధ
శిలయొ ళ్తమ్మ కులదైవ మాద్యన్త జినబింబంగళుమం చక్రేశ్వరి
యుమం పెఱవుం జినప్రతి

3. మెగళుం త్రిభువనతిలక మెంబ బసదియుమం కవితాగుణా
ర్ణ్ణవ మెంబ కెఱెయుమం మదనవిళాస మెంబ బనముమం మాడి
సిదం । * వృత్తం॥ భ్రాత ర్ధర్మ్మపురం ప్రయాసి కి మతో
జైనాభిషేకోత్సవ క్షీరప్లావిత తుంగ శృంగ వృషభక్షోణీధ్రమీా

త్యామహే। యాత్రాయాత సమస్త భవ్యజనతా సన్మాన దానో
ద్యతం పంపార్య్యా

4. నుజ మత్ర భీమతనుజం సమ్యక్త్వరత్నాకరం ।।।
[౧॥*] గీతం గాతు మనేక భేద సుభగం కావ్యాని సోచ్చావచం
వాచా వాచయితుం ప్రియాణి వదితుం సాధ్వ్యపకర్తుం[1] సతాం
భోగా న్సేవితు మంగనా రమయితుం పూజా విధాతుం జినే జానీతే
జినవల్లభ ల్వర మిదం పంపాభి ధానానుజః [౨॥*] అజస్ర జినవర్ద్ధ
నాగత మునీ

5. శ్వర శ్రావక ప్రజా స్త వ రవ[2] ప్రతిధ్వనిత శబ్దకోళా
హాళై [ః] అధిష్ఠిత దిగంబరో వృభశైల ఏష స్వయం పరాం
వదతి వాచకాభరణకీర్త్తి[3] మాకల్పతః॥ [౩॥*] బగెయ లఱంబ
మీాబగెయ నాబ్బగెగ వెబ్బగెగ[4] గాసెయల్తు దిట్టెగె[5] పొలనల్తు
నీళ్దసఱియో ళ్జినబింబమ నీత నీగళే న్నగఱిసి[6] దప్ప నెన్దుబగె వన్నె
వరంజినబింబ

6. మల్లితొట్టగె నెగఱ్దేఱు వేం[7] చరిత మచ్చరియో జినవల్ల
[భే]న్ద్రినం[8]॥ [౧॥*] ఇదు కవితా గుణార్ణ్నవనకీర్త్తి [౯*]

---

1. "సాధ్వ్యాపకర్తుం" అని చదువవలెను.
2. "రవా" అని చదువవలెను.
3. 'కీర్త్తిః' అని.
4. 'వబ్బగెగ' అని చదువవలెను.
5. 'దిట్టిగె' అని.
6. 'న్నెగఱిసి' అని చదువవలెను.
7. 'నెగఱ్దేఱువేన్' అని.
8. 'జినవల్లభేన్ద్రినా' అని యుండవలయును.

యమూర్త్తి [౧*] వొలాగి దక్షిణార్ధద వృషభాద్రి యక్కె వృష
భేశ్వర బింబ సనాథ మెంబలం పొడవె నిజద్విజావసథ పర్వ్వతమం
జిన చైత్యమాగె మాడిద జినవల్లభంగె జినవల్లభనప్పుదు మొన్దు
ఛోద్యవో॥[9] [౨॥*] చదురమమ్మెయ సత్క

7. విత్వద సన్ద పంపనతమ్మ నొర్వ్వదె పొగత్తెయె బాజిస
ల్బరెయ ల్క విత్వద తత్వదొ ళ్పుదిదు నేర్వ్వడె పేఱలుర్వ్వి
గపూర్వ్వ మాగిరె బల్లొనప్పుదఱి నొర్వ్వనె వాగ్వధూవర వల్లభం
జినవల్లభం॥ [౩॥*] వినుత చళుక్య వంశపతి మిక్కరికేసరి సన్ద
విక్రమార్జునవిజయక్కె ధర్మ్మపురంమెన్దు[10] మదీయ మిదెన్దు
కీర్త్తి [౧] శాసన మెనె కొట్ట శాసనద పం

8. పన[11] నా బిరుదొన్దు జైన శాసనద నెగత్తెయం వృషభ
పర్వ్వత మన్తదు తానె పేఱదే॥ [౪॥] [ఎస] యెల్గాళి పుగల్పతంగ
కిరణం సార ల్మిగంపాఱ లాగసదొ ళ్పక్కిగళల్లి సల్ల వెనిసిర్ద్ద
న్యోదయం ధమ్మదొ ళ్జసమం పొంపుఱె మాడె మెచ్చి హారిగం
పంపంగె గొట్టా ద్విజావసథగ్రామ మదే న్నెగఱ్త్తెయ కళాప
గ్రామమం పోల్తుదొ॥ [౫॥*] బరెదురె

9. తాంబ్రశాసన మదేయమె ధర్మ్మపురం నెగత్తెవెత్తరి
గన కొట్టుదేనెగఱ్ద పంపన పెత్తుదె పేఱిమెన్దు నీమ్మరుళె పలమ్మెర్
యుం పలబగం బెసగొళ్ళదె పోగినోడు సున్దర వృషభాచళోన్నత
శిళాతళదొ ళ్బరెదక్కరంగళం॥ [౬॥*] కన్దం॥ జినభవనంబు

---

9. 'చోద్యమో' అని.

10. 'ధర్మ్మపురమెన్దు' అని.

11. 'పంపణ' అని.

లెత్తించుట[1] జినపూజ ల్సేయుచున్కి జినమునులకు నత్తిన యన్న దానం బీవుటం[2] జినవల్లభు బోలంగలరె[3].

10. జినధర్మ్మాపరుల్॥ [౧॥*] దినకరుసరి వెల్గుదుమని జిన వల్లభు నెట్టునెత్తు జితకవిననను[4] మనుజు ల్గలరే ధాత్రిం వినితిచ్చుదు ననియ వృత్తవిబుధకవీంద్రుల్॥ [౨॥] ఒక్కొక్క గుణాంబు[5] కల్లుదు రొక్కణ్డంగా[6] కొక్కలక్కలే వెవ్వరికిం లెక్కింప నొక్క లక్కకు మిక్కిలి గుణపక్షపాతి గుణమణి గుణంబుల్॥[7] [3॥*] ఎన్దు లోక మెల్లం పొగడె నెగడ్డ జినవల్లభన సుధమ్మ సంతతియో

11. ల్దొట్ట గుణావళియ నీవృషభగిరియ సిద్ధశిలయో శైతె యమ్మా టంకోత్కీర్ణ్ణ మ్మాడిదం॥

---

1. 'భవనము లెత్తించుట' అని చదువవలయును.
2. 'దానమీవుట' అని చదువవలయును.
3. 'బోలఁగలరె' అని చదువవలయును.
4. 'నననున్' అని చదువవలయును.
5. 'గుణము' అని చదువవలయును.
6. 'ఒక్కడ' అని చదువవలయును.
7. 'గుణముల్' అని చదువవలయును.

౯

# గుణగవిజయాదిత్యునినాటి వర్తమానములు

౧

వేంగీరాజ్యమును బరిపాలించిన పూర్వచాళుక్యరాజుల యందెల్ల గుణగవిజయాదిత్యుడు మేటరి. ఇతనికాలమున వేంగీ రాజ్యము ఉత్తరమున నొడ్డదేశము సరిహద్దు నుండి దక్షిణమున ద్రావిడదేశ పర్యంతము వ్యాప్తినందెను. గుణగవిజయాదిత్యుడు రణశౌండుడు. తన యద్వితీయపరాక్రమముచే శత్రుల నిర్జించి నిజశౌర్యమును బ్రకటించెను. అరిభీకరమైన చాళుక్యసైన్య మితని కాలమున నాంధ్రవిజయపతాకమును పరరాజ్యముల నెలకొల్పెను. ఆంధ్రసామ్రాజ్యమును బోలి యాంధ్రవాణియు నితని యాశ్రయమున బెంపందినది. కౌమార్యమున రాజరాజమనుమసిద్ధులును, నిండు యౌవనమున శ్రీకృష్ణరాయలును నెట్లు పోషించిరో యట్లే శైశవదశయం దాంధ్రభాషాయోషను గుణగవిజయాదిత్యనరపాలు డాదరించి పెంచెను. ఆంధ్రలోకమునకు వాఙ్మయమును బ్రసాదించిన యీ మహారాజు చిరస్మరణీయుడు గదా.

ఆధారములు: గుణగవిజయాదిత్యునికాలమున నడచిన వర్తమానములను గనుగొనుటకు ముఖ్యములగు నాధారములు శాసనములే. అన్యసాధనము లెవ్వియు నింతవఱకు బయల్పడలేదు. ఈ శాసనము లిరుతెరగులవి. మొదట నెన్నదగిన వతడును నతని యనుచరులును వేయించినవి. ఇందు తామ్రపట్టికలును శిలాశాసనములును గలవు.

తామ్రపట్టికలు: ఇప్పటివఱకును లభ్యమైన వితనివి తామ్రపట్టికలు ఆఱు కలవు.

౧. అప్పలనాయకుని పేట తామ్రపత్రఖండము[1]. ఇది విశాఖ పట్టణముజిల్లా పాలకొండతాలూకాలోని అప్పలనాయకుని పేటయందు దొరకినది. చిక్కినదంతయు నొక్క రేకుయొక్క శకలము. ఉభయ పక్షములందును వ్రాతకలదు. శాసనకాలము తెలియదు. కలివిష్ణు వర్ధనమహారాజునకు శీలమహాదేవియం దుద్భవించిన పుత్రుడు గుణగ విజయాదిత్యమహారాజు ఆస్థానమండపమున కొలువై యుండువేళ్ళ యువరాజు సమీపముపముననుండగా, నొక బ్రాహ్మణున కేదో భూదాన మొనర్చిన ట్లిందువల్ల దెలియుచున్నది.

౨. మచిలీపట్టణం పట్టికలు[2]. ఇందు శకాబ్దముగాని రాజ, వర్షముగాని నమూదుచేసియుండలేదు. చంద్రగ్రహణనిమిత్త మీ శాసనోక్తదానము జేయబడినట్లు మాత్రము తెలియవచ్చుచున్నది. ఉర్పుటూరు వాస్తవ్యుడును, దూర్కశర్మ పౌత్రుడును, దామోదర శర్మ పుత్రుడును నగు వినయాడిశర్మయను బ్రాహ్మణునకు, రణరంగ మున మంగిరాజును జంపు నుపాయమును జెప్పినందులకు సంతసించి గుణగవిజయాదిత్యమహారాజు గుద్రహారవిషయములోని త్ాండిపట్టు గ్రామమును దానము జేసిన ట్లిందు కలదు. ఇతనిచే రణనిహతుడై మంగిరాజునుగూర్చి యీ శాసనమున నిట్లు చెప్పియున్నది.

'హత్వామంగిం విజితసకలారాతి భూపాలవర్గం
రాగోద్రేకాధ్యసితనృపతి త్యాగశౌర్యప్రతాపం।
నానాహేత్యాహత హయభటోన్మత్తహస్తిప్రకీర్ణే
యుద్ధే యస్య ద్విజగణవరస్యాద్భుతాదేశతుష్టః॥

కాని యీ మంగియెవ్వరో చెప్ప లేదు.

---

1. ఆర్కియలాజికల్ రిపోర్ట్ ఆఫ్ ది గవర్నమెంట్ ఆఫ్ మద్రాస్, అప్పెండిక్స్ II, Cp. 4.

2. ఎపిగ్రాఫియా ఇండికా, సం. 5, పు 125 f.

3. పాములపాడు తామ్రశాసనము[1]. ఇది యప్రకటితము ఎచ్చటనున్నదో తెలియదు. భారతిలోని సాతలూరు తామ్రశాసనమువల్ల క్రీ. శే. శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు దీనిని బరిశోధించినట్లు తెలియుచున్నది. ఇందలి యక్షరము లొకవైపున కొఱగియున్నవని శ్రీ భావరాజు కృష్ణరావుపంతులుగారు ఆంధ్రైత్రైమాసికపరిశోధన త్రైమాసిక పత్రిక సం॥ ౫ లోని తమ సాతలూరు తామ్రశాసనపరిష్కరణ వ్యాసమున దెల్పియుండుటచేత వారీ పట్టికలనో, లేక వీని ప్రతిబింబములనో చూచినట్లు స్పష్టమగుచున్నది. వారి వ్యాసమును బట్టి చూడగా నీ పాములపాడు తామ్రపట్టికలలో గుణగవిజయాదిత్యుని కాలమువఱకును వేంగియం దేలిన పూర్వ చాళుక్యరాజుల పేర్లును, వారియం దొక్కొక్కరి రాజ్యకాల పరిమితియు వర్ణింపబడెనని తోచుచున్నది.

ర. గుంటూరు తామ్రపట్టికలు[2]. ప్రస్తుతము మద్రాసు మ్యూజియమందున్నవి. శాసన మసంపూర్ణము. మధ్య నొకటియో రెండో రేకులు నష్టమైపోయినవి. లభించిన రేకులు గూడ శిథిలావస్థయందున్నవి. ఇందు గుణగవిజయాదిత్యునిముందు వేంగి నేలిన పూర్వచాళుక్యరాజుల పేరులును, వారియం దొక్కొక్కరి రాజ్యకాలపరిమితియు జెప్పబడియున్నవి. గుణగవిజయాదిత్యుని పేరు, లభ్యమైన రేకులయందు కానరాకపోయినను నతని తలిదండ్రుల ప్రశంస కలదు. ఇతని తండ్రి కలివిట్టరదేవుఁడనియు, దల్లి రాష్ట్రకూట వంశోద్భవయగు శీలమహాదేవి యనియు దెలియవచ్చుచున్నది.

"రాష్ట్రకూటకులజలధివేలావర్ధిష్ణు సుఖచంద్రికయా కులజాయా అ(ను)కూలవత్యా సీలమహాదేవ్యా ఉమయా ఇవ శరవణభవోఽప్రతిహతశక్తి స్వతమన(ము).

1. భారతి. సం. ౧ సంచిక పుట ౯౨; జర్నల్ ఆఫ్ ది ఆంధ్రా హిస్టారికల్ రిసర్చి సొసైటి. సం. 5, పుట 102.

2. Cp. No. 5 of 1911—12.

ద్ధ్వరానేక తులాభారదానధారాప్రక్షాళిత కల్మషః....కలివిట్టరదేవస్య శీలమహాదేవ్యాశ్చ సముత్పన్నో....”

౫. పోణంగి తామ్రశాసనము[1]. ఇది పశ్చిమగోదావరిమండలములో ఏలూరు ప్రాంతమున పోణంగిగ్రామమున లభించినది. ఇందలి వంశానుక్రమణికాదులు పై శాసనములందువలెనే యున్నవి. గుంటూరుపట్టికలలో నష్టమైపోయిన గుణగవిజయాదిత్యప్రశంస దీనియందు సంపూర్ణముగ గానవచ్చుచున్నది.

“ ....కలివిట్టరదేవస్య చ శీలమహాదేవ్యాశ్చసముత్పన్నః....గుణగః....”

ఇతనికి ‘మనుజప్రాకార’ ‘రణరంగశూద్రక’, ‘విక్రమధవళ’ ‘పరచక్రరామ’, ‘నృపతిమార్తండ’, ‘బిరుదంకభీమ’, ‘అరసంకకేసరి’ యను బిరుదు లున్నట్లిందువలన దెలియవచ్చుచున్నది. ఇతడు కొణ్డపట్టునుగ్రామమును ౧౦౫ బ్రాహ్మణులకు దక్షిణాయన పుణ్యకాలమున దానము గావించెను. శాసనాంత్యభాగమున దానఫలమును దెలుపు శ్లోకముల తరువాత ‘పరచక్రరాముని ప్రక్కన నిల్చి యుద్ధ మొనర్చి యతనికొఱకు రణమున దన ప్రాణము లర్పించిన కడెయరాజు పుత్రుడు పాణ్డరంగడు పేర్కొనబడియున్నాడు[2].

౬. ఉరుటూరుతామ్రపట్టికలు.[3] ఈ పట్టికలు కృష్ణాజిల్లా నూజివీడుతాలూకాలోని యురుటూరు గ్రామమున దొరకినవి. వంశానుక్రమణికాదులు పై శాసనములను బోలి దీనియందును వర్ణింపబడియున్నవి. ఇందు గుణగవిజయాదిత్యుని తల్లి పేరు శీలక్క యనియును నామె రాష్ట్రకూటాధిపతియగు నింద్రభట్టారకుని కూతురనియు జెప్పియున్నది.

1. Cp. No. 3. of 1908—9.
2. ఆన్యువల్ రిపోర్ట్ ఆఫ్ సౌత్ ఇండియన్ ఎపిగ్రఫీ 1909 పుట 106.
3. ఆం. సా. ప. సం. ౧ పుటలు, ౧౪౦-౫౦.

"యస్యమాతా రాష్ట్రకూటాధిప స్యేన్ద్ర భట్టారకస్య హిమవతో భవానీవ పితుః భూధరమాన్యతాం జయంతీ జలధే ర్లక్ష్మీరివ జనకాత్సీతేవ శీలాదిగుణాన్వితత్వా చ్ఛీలకే త్యన్వర్థవ త్యజని."

మఱియు గుణగవిజయాదిత్యుడు ఉత్తరాయణపుణ్యకాలమున గుద్రహారవిషయమునకు జెందిన ఉరుటూరు గ్రామమున పదునలుగురు బ్రాహ్మణులకు దానము జేసెను. ఈ ధర్మమున కాజ్ఞప్తి పండరంగడు. విజయవాడవాస్తవ్యుడైన శ్రీ విజయాచార్యు డీ ధర్మశాసనమును జెక్కిన లేఖకుడు.

౭. సాతలూరుతామ్రశాసనము.[1] ఇది కృష్ణాజిల్లా బందరు తాలూకాలోని సాతలూరు గ్రామమున లభ్యపడెను. పూర్వచాళుక్య వంశానుక్రమణిక పై శాసనమును బోలియున్నను, ఇందొక విశేషము గాన్పించుచున్నది. కుబ్జవిష్ణువర్ధనుడు మొదలు ప్రస్తుత దానకర్త వఱకు నేలిన రాజులను పేర్వేర నిన్నిన్ని యేండ్లు ఏలిరని చెప్పి మరల నొక్కొక్క పేరిటి వా రిందఱెందఱు రాజ్యము సల్పిరని వివరింపబడియున్నది.

"ఏవం పఞ్చ విష్ణువర్ధననామానః ద్వౌజయసింహనామానౌ ఏకో మంగి యువరాజత్రయోవిజయాదిత్యనామానః"

ఇతర శాసనములందు గానరానివి గుణగవిజయాదిత్యుని బిరుదులు కొన్ని ప్రస్తుతశాసనమున బేర్కొనబడియున్నవి. ఇందు వీరమకరధ్వజ, గుణకెనల్ల, భువనకందర్పయనునవి ముఖ్యమైనవి. మఱియు నితడు సమధికపఞ్చమహాశబ్దశ్రవణవిత్రాసిత చతురాశా చక్రుడనియు, ప్రతిష్ఠాపిత గంగా యమునా చంద్రాదిత్య పాలీకేతనుడనియు బ్రశంసింపబడియున్నాడు. గుణగవిజయాదిత్యునికి నృపకాముడను దమ్ముడుండెననియు, నతనిచే బ్రేరితుడై నూర్గురు బ్రాహ్మణులకు సూర్యగ్రహణకాలమున గుద్రవారవిషయములోని

1. భారతి. సం. ౨౩, పుటలు ౩౭౫-౮౧, ౪౭౩-౭౯.

శంతగ్రామమును దత్తము జేసెననియు దెలియవచ్చుచున్నది. ఈ ధర్మమున కాజ్ఞప్తి భట్టకాలుని పుత్రుని పౌత్రుడగు పాండరంగడు శాసనలేఖకుడు లేఖాదిత్యుడు. ఇతడు విశ్వకర్మవంటివాడట. స్వయముగ ఘంటసాలను జేసెనట.

౮. సీసలితామ్రశాసనము[1] ఇది పశ్చిమగోదావరిజిల్లా భీమవరం తాలూకా సీసలిగ్రామమునం దాగ్రామకాపురస్తు లొకరు తమ భూమియందు పాటిమట్టికొఱకు త్రవ్వుచుండగా భూగర్భమునుండి బయటపడినది. శాసనము శిథిలావస్థయందుండుటచే నందందు గ్రంథపాతములు గలవు. ఇతర తామ్రశాసనములం బోలి యిందును పూర్వచాళుక్య వంశానుక్రమణిక కానవచ్చుచున్నది; విశేషమేమియు లేదు. గుణగవిజయాదిత్యునిగూర్చి యితర శాసనములందుక్తమైనవానితోపాటు మఱికొన్ని క్రొత్త చరిత్రాంశములిందు మూలమున వ్యక్తపడుచున్నవి. ఉరుటూరుశాసనమునందువలె దీనియందును రాష్ట్రకూటాధిపతియగు ఇంద్రభట్టారకుని కుమారితయగు శీలక్క ఇతని తల్లియనియు, మచిలీపట్టణతామ్రపట్టికలలో జెప్పినట్లు మంగ్యాఖ్యరావణుని వధించెననియు జెప్పియున్నది. మఱియు నృపతుంగుడనురాజితని భుజమును బ్రతిదినమును జక్కగ నర్చించి రిపునృపతుంగు డాయెనట. అతని ప్రఖ్యాతమైన బిరుదులు త్రిభువనాంకుశ, బిరుదంకభీమ, పరచక్రరామ యనునవి ఇందును బేర్కొనబడియున్నవి. గుణగవిజయాదిత్యుడు శాంత్యర్థముగా నీ దానము నొకానొక సూర్యగ్రహణకాలమున కౌండిన్యగోత్రోద్భవుడైన మేడయ కుమారులగు రాజాదిత్య, విక్రమధవళ, బిజ్యణ, కొండమశర్మ, సూరెమ యను నైదుగురు బ్రాహ్మణులకు పాగుణారవిషయములోని ఉమికిలి యను గ్రామమును అగ్రహారముచేసి దానమొసగెను. ఈ ధర్మమున కాజ్ఞప్తి పండరంగడు. విజయుడనువాడు లేఖకుడు.

---

1. భారతి. సం. ౨౩. పుటలు 325-౮౧, ౪౭3-౭౯.

౧౦. కాట్లపట్టుదానశాసనము.[1] ఈశాసనము పశ్చిమగోదావరిజిల్లా నరసపూరు తాలూకాలో మాంజిపాడుగ్రామమున ఉప్పరి యొకడు మట్టిదిబ్బను త్రవ్వుచుండగా నందు దొరకినది. ఇందైదు రేకులు గలవు. మొదటి రేకు మొదటి ప్రక్కను, నైదవ రేకు రెండవ ప్రక్కను వ్రాత లేదు. శాసనగ్రంథము సంస్కృత భాష యందు రచింపబడియున్నది. దానమును విశదీకరించు భాగముగద్య. తక్కిన శాసనము సర్వము శ్లోకమయము. శాసనగ్రంథము 'నమో నారాయణాయ' యను మాటతో ప్రారంభమగుచున్నది. గుణగ విజయాదిత్యుని ఇతర తామ్ర శాసనములవలె నిందును బూర్వ చాళుక్యవంశానుక్రమణిక గలదు. ఇంద్రరాజునకు పరమకాంబ యందు పుట్టిన కూతురు శీలకాంబయందు గుణగవిజయాదిత్యుడు జనించెనని చెప్పియున్నది. ఈ శాసనమున వర్ణింపబడిన దానమునకు బ్రతిగ్రహీతగుణగవిజయాదిత్యుని ప్రఖ్యాత బ్రాహ్మణ సేనాపతులలో నొక్కడైన రాజాదిత్యుడు. ఇతని కుటుంబచరిత్ర వినదగినదే. తొండ మండలమున కాటూరు వాయూరు నను గ్రామముల కధిపతియు, బల్లవనరపాలునికి సర్వసేనాధిపతియునైన కుమారమూర్తి యను బ్రాహ్మణు డొక్కడుండెను. అతడు తన రాజుతో గలహించి యతని శపించి వేంగి రాష్ట్రాంతర్గతమైన 'ఉండి' గ్రామమును జేరెను. అతనికి కుమారనామాంతరుడైన పెద్దన యను పుత్రుడు జన్మించెను. పెద్దనకు రాజాదిత్యుడను కుమారుడు కలిగెను. ఈ రాజాదిత్యుడు గుణగవిజయాదిత్యునికి ఖడ్గసహాయముచే సకల రిపులను నాశన మొనర్చి యపరిమిత ధనరాసులను దెచ్చియిచ్చెను. గుణగవిజయాదిత్యు డితని సేవను మెచ్చుకొని 'వేంగి సహస్రగ్రామములకు జెందిన కాట్లపట్టను గ్రామము సర్వకరపరిహారముగా నగ్రహారముచేసి యిచ్చెను. ఈ ధర్మమునకు ఆజ్ఞప్తి పండరంగడు.

---

1. ఎస్. టి. యన్. హైస్కూల్ అన్నువల్. ౧౯౩౯-౪౦ పు. ౨౩-౪.

శిలాశాసనము :—చారిత్రకదృష్టితో జూచిన తామ్రపట్టికల కంటె శిలాశాసనములే ముఖ్యతరములని చెప్పవలసియున్నది. తామ్రపట్టికలందు పేర్కొనని కొన్ని చరిత్రాంశములు పెక్కు వీని యందు వర్ణింపబడినవి. గుణగవిజయాదిత్యునినాటివి శిలాశాసనములు మూడు ఇంతవఱకు లభించినవి. వీని భాష తెలుగు. మూట రెండు పద్యశాసనములు. రెండును పండరంగడు వేయించినవే. మూడవది వచనశాసనము; దీని నెవ్వాఱు నెలకొల్పిరో చెప్పుటకు సాధ్యము గాదు. శిథిలావస్థయందున్నను గుణగవిజయాదిత్యుని కాలమున నడచిన వర్తమానములు వీని మూలమున గొన్ని తెలియవచ్చుచున్నవి.

౧. కందుకూరు శిలాశాసనము.[1] ఈ శిల బట్టర్వర్త్ వేణుగోపాలసెట్ల హయాములో నెల్లూరుజిల్లా కందుకూరు గ్రామములోని రామస్వామి (మేడ) గోడలో జేర్చి కట్టియుండెనట. అచ్చటనే యుండిన నష్టమైపోవునని యెంచి సెట్టిగారు దాని నూడబెరికించి తెచ్చి తాలూకా కచ్చేరిలో బదిలపఱచిరట. కాని యది యిప్పుడచట లేదని కింవదంతి. ఎట్లు మాయమైనదో! బట్టర్వర్త్ వేణుగోపాలసెట్టిగార్ల పాఠము నిర్దుష్టముగాదు. వారిచ్చిన శాసనశిలాప్రతిబింబమును స్పష్టమైనదికాదు. కావున నిందలి విషయమును నిశ్చితముగ జెప్పుటకు వీలుకాదు. గాని గుణకెనల్లాతని పక్షపాతియైన పండరంగడు కొలదిలేని కొట్టంబులను బొడిచెననగా యుద్ధమున జయించి కైకొనెనని చెప్పవచ్చును.

౨. అద్దంకి శిలాశాసనము.[2] ఇది యిప్పటి గుంటూరుమండలములోని యద్దంకి యందుండెను. ప్రస్తుతము మదరాసు గవరన్మెంటు

1. నెల్లూరుజిల్లాశాసనములు. సం. 3, కందు, నెం. ౩౧, ౩౨ పుటలు, ౫౪౪.

2. నెల్లూరుజిల్లాశాసనములు, సం. 3. ఒంగో. నెం. ౨. ఆం. సా. ప. ప. సం. ౧౪, పుట ౨౦, భారతి, సం. ౫ పుటలు ౪౭౩-౭౪, ARE. No. 839 of 1922; ఎపి. ఇండి. సం. 19, పుటలు 271-75, 275-6.

మ్యూజియములో నున్నది. ఇందు (గుణగవిజయాదిత్యుడు) తనకు పట్టంబుగట్టిన మొదటి సంవత్సరమున బలాతిశయముచే విజృంభించి, ప్రభువు పండరంగనికి సేనాధిపత్యమునకు బట్టముగట్టి యంపగా నతడు సామంతసేనతో గదలిపోయి బోయకొట్టములను బంౘ్రెండింటిని జయించి స్వాధీనపఱచుకొని వేంగినాటిని విస్తరింపజేసి యట్లు నూతనముగ వశమైన రాష్ట్రమున దన్నేలిన రాజుయొక్క చిహ్నమగు త్రిభువనాంకుశమునునిల్పి, కట్టెపుదుర్గమును విఱుగబొడిచి కందుకూరిని బెజవాడవంటి ప్రఖ్యాతనగరము గావించెనని ఇందలి సారాంశము.

3. ధర్మవరశిలాశాసనము.[1] ఇదియొక తునుక. గుణగవిజయాదిత్యునినాటిది. విశేషచరిత్రాంశములం దెవ్వియును లేవు. విజయాదిత్యుని సేవకులగు కడెయరాజును, నతని కుమారుడగు నయ్యపయ్యయ, బెదపండరంగులు, అల్లువపెర్గడలు మొదలయినవారు పేర్కొనబడియున్నారు.

గుణగవిజయాదిత్యుని రాజ్యచరిత్రనుగూర్చి యతని శాసనములకంటె నతని సంతతి వారి శాసనములవల్లనే యతిశయవిషయములు దెలియవచ్చుచున్నవి.

౧. వీనిలో మొదట పరామర్శింపదగిన దతని తమ్ముడు యువరాజ విక్రమాదిత్యుని కుమారుడును, నీతని పిమ్మట వేంగీసింహాసనము నధిష్ఠించినవాడైన ప్రథమ చాళుక్యభీముని కాలపు ధర్మవర శిలాశాసనము.[2] దీనియందు పండరంగని విజయములు వర్ణింపబడి యున్నవి.

---

1. ARE. No. 342 of 1942; నెల్లూరుజిల్లాశాసనములు. సం. ౨. ఒంగో. నెం. ౪౦; భారతి. సం. ౨౫, పుట ౬౧౮.

2. భారతి. సం. ౨౫, పుటలు ౬౧౫-౨౦.

1. తన్నెలిన రామవిభుని (అనగా) గుణకెనల్లుని నెదురించిన బోయల నడవి సొన్పెను.

2. లోహాసనము నెక్కి రాహును నోడిచిన వల్లభకొల్పున గన్నరాభూపతి వెన్ను నాజిలో నందఱు నెఱుగ జూచెను.

3. మఱియు సంకిలడ్డనురాజు బింకముడిపెను.

4. శత్రులదండు పైరాగా బెండైన చోటని గైకొనికాచెను.

5. వల్లభుడు గుణకెనల్లు డంపగా గిరణపురము, డహాలనిరు తంబు, దఱెనాడు, అచలపురము మున్నగు స్థలములను జొచ్చెను.

౨. ప్రథమచాళుక్యభీముని అత్తిలిదానశాసనము.[1] గుణగ విజయాదిత్యుని విజయము లందిట్లు వర్ణింపబడియున్నవి :—

'తత్పుత్రః - కిరణపుర మచలపుర మురునెల్లూరపురాణ్ విదాహచైతత్
త్రిపురమర్త్యమాహేశ్వరనామ్నా ఖ్యాతి యశోరాశిబభౌయస్సతతం ॥

అథచ - కాలింగగంగ రూప్యాది కోసలేశద్విపాది చ
పాండ్యపల్లవ హేమాది హరత్యా ఇత్థమాహరత్ ॥
గంగానారోపయ ద్గంగకూట మ్మంగి శిరోచ్ఛినత్
కృష్ణంరణే ఉజయ ద్వ్యక్తుం క స్సమర్థో సుసాహసాణ్ ॥

3. ప్రథమచాళుక్య భీముని మచిలీపట్టణ తామ్రపట్టికలు.[2] వీనికే మద్రాసు మ్యూజియంతామపట్టిక లని నామాంతరము. అత్తిలి శాసనమునందువలె నిందును గుణగవిజయాదిత్యుడు కిరణపురము, అచలపురము, నెల్లూరుపుర మను మూడు పురములను దహించి త్రిపురమర్త్యమాహేశ్వరుడను బిరుదు వహించెననియు, కాళింగుల కడ గంగులకడ ధనమును, కోసలులనుండి యేనుగులను,

1. Cp. No. 14 of 1917-18, ఆ. సా. ప. ప. సం. ౧౧ పుట ౨౪౧; IBORS. VIII, p 82 f.

2. Cp. No 1 of 1913-14.

పాండ్యులనుండియు పల్లవులనుండియు హేమమును గొనెననియు జెప్పియున్నది.[1]

పై శాసనములోని సంగతులే అమ్మరాజ విష్ణువర్ధనుని శాసనములందును వర్ణింపబడియున్నవి.

౪. ఏడేఱు తామ్రపట్టికలు.[2]

"గంగా నంగజవైరి శక్తిరసమాఙ్ రట్టేశసంచోదితో
జిత్వా మంగి శిరోహరత్ యుధి మహా బాహ్వోప్తవీర్యార్యమా
కృష్ణం సంకిలిమంకితాఖిలబలప్రాప్తోరు సద్విక్రమో
భీతార్తొచ విధాయ తత్పురమరం యో నిర్దదాహ ప్రభుః॥

బాదపరాజు ఈస్తేరు శాసనమున[3] పై సంగతులే యొండు రెండు నూతనాంశములతో వక్కాణింపబడియున్నవి.

౫. ఈస్తేరుతామ్రశాసనము.

'తత్పుత్రః పరచక్రరామాపరనామధేయః.'

'హత్వా భూరినొడంబరాష్ట్రనృపతిం మంగిం మహాసంగరే
గంగా నాశ్రితగంగకూటశిఖరా న్నిర్జిత్య సద్దాహలా
ధీశం సంకిలి ముగ్రవల్లభయుతం యో బాయయిత్వాచ త
శ్చత్వారింశతమబ్దకాంశ్చ విజయాదిత్యో రరక్ష క్షితిం॥

౬. మలియంపూండి తామ్రశాసనము.[4] అమ్మరాజవిజయాదిత్యుని మలియంపూండి తామ్రశాసనమునను పై శ్లోకముగలదు.

---

1. మదరాసు శాసనశాఖవారి సాంవత్సరిక నివేదిక. ౧౯౧౪, పుట ౮౫.

2. ఇండియన్ ఆంటిక్వరీ, సం. 13. పుట 56, సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్సు, సం. 1, పుట 36.

3. Cp No 6 of 1938-9.

4. నెల్లూరుజిల్లాశాసనములు సం. ౧, పుట ౧౭౭, ఎపి. ఇండికా, సం. 9 పుట 47.

మఱియు నీ విజయములందు కొన్ని పండరంగని పరాక్రమమువల్లనే చేకూరెనని చెప్పియున్నది.

> 'కిరణపురమథాక్షీత్ కృష్ణరాజస్థితం యః
> త్రిపురమివమహేశః పాణ్డరంగప్రతాపీ
> తదిహ ముఖసహస్రై రన్వితస్యాప్యశక్యం
> గణనమమల కీర్తే తస్య సత్సాహసానాం ॥

౭. కలుచంబఱ్ఱు తామ్రశాసనము.[1] అమ్మరాజవిజయాదిత్యుని కలుచంబఱ్ఱుశాసనమువల్ల గుణగవిజయాదిత్యుడు వల్లభ నృపునిచే గౌరవింపబడెనని తెలియుచున్నది.

"గుణగవిజయాదిత్య పతిరంకకాఱసాక్షాద్వల్లభ నృపసమభ్యర్చిత భుజః."

౮. కణ్డయం పట్టికలు.[2] దానార్ణవునికణ్డయం పట్టికలలో గుణగవిజయాదిత్యుని విజయములు ప్రశంసింపబడినవి.

> 'అబ్దాత్ సంగ్రామరంగే నిజలసదసినా మంగిరాజోత్తమాంగం
> తుంగాద్రేః శృంగముర్వ్యామశనిరివ ముదాపాతయత్ కన్నరాజ్యమ్
> నిశ్శంకం సంకిలేన ప్రథితజనపదా ద్దుర్గమాన్నిర్గమయ్య
> ద్రాగ్దావం యః ప్రవేశ్య ప్రఖరభవమనాః ప్రత్యపద్ బద్దెగాజ్యమ్'

౯. మొదటి శక్తివర్మయొక్క ఆంధ్రసాహిత్యపరిషత్పట్టికలు.[3] ఇందును కండయము పట్టికలలోని పై శ్లోకము గానవచ్చుచున్నది. శాసనము శిథిలావస్థయం దుండుటచే నక్షరము లచట నచట చెరిగి పోయి యున్నను మంగి, కన్నర, సంకిల, బద్దెగలమీాది విజయములు స్పష్టముగనే వర్ణింపబడియున్నవి.

---

1. ఎపి. ఇండికా, సం. 7, పుటలు 177 మొదలు ఇండియన్ ఆంటిక్వరీ సం. 20, పుట 271.

2. Cp 26 of 1937-8, జర్నల్ ఆఫ్ ది ఆంధ్రాహిస్టారికల్ రిసర్చి సొసైటీ. సం. 11, పుటలు 80 మొదలు.

3. Cp. 15 of 1917-18.

౨

ఇదివరలో [1] బేర్కొనిన పూర్వచాళుక్యశాసనములందు చెప్పబడిన విషయములను గ్రోడీకరించి చూడగా నీ క్రిందివిషయము లతని రాజ్యకాలమున నడచెనని వ్యక్తపడుచున్నవి.

౧. గుణగవిజయాదిత్యుడు వేంగిదేశమును బాలించిన విజయాదిత్య నామధారులగు పూర్వచాళుక్య రాజులలో దృతీయుడు. ఇతడు కలివిష్ణువర్ధనమహారాజునకు రాష్ట్రకూటవంశసంభూతుడగు నింద్రభట్టారకుని కుమారితయగు శీలమహాదేవి, లేక శీలక్క యను భార్యయందు జనించిన పుత్రుడు. ఇతనికి విక్రమాదిత్య యుద్ధమల్ల నృపకాము లను తమ్ములు ముగ్గురుండిరి, మఱియు నితడు శూరుడు; పెక్కు బిరుదులు గలవాడు; ఇందు పరచక్రరామ, గుణగనల్లాత, త్రిపురమర్త్యమాహేశ్వర యనునవి ముఖ్యమైనవి.

౨. పట్టాభిషిక్తుడైన ప్రథమవర్షంబున గుణగవిజయాదిత్యుడు పండరంగనికి సేనాధిపత్యపట్టము నొసగి సామంతబలములతోగూడ నతని బోయకొట్టములపై దండంపెను; పండరంగు బోయకొట్టములు పంద్రెండింటినిగొని, కట్టెపు దుర్గము బొడిచి, కందుకూరును బెజవాడ గావించెను. త్రిపురమర్త్యమాహేశ్వరుచే గాల్పబడిన త్రిపురము లలో నొక్కటియగు నెల్లూరుపురమును నత డీ దండయాత్రా సంద ర్భముననే తగులబెట్టి యుండును.

3. రట్టేశునిచే సంచోదితుడై యాతడు దండువెడలిపోయి యుత్తుంగ గంగకూటశిఖరము నాశ్రయము గావించుకొని యుండిన గంగులను జయించెను. నొడంబరాష్ట్రాధిపతియైన మంగి శిరమును ఖండించెను. ఇతని భుజములను రాష్ట్రకూట చక్రవర్తి నృప తుంగుడు ప్రతిదినము నభ్యర్చించెను.

---

1. చూ. భారతి. ౨3 వ సం. ౧౦ వ సంచిక, పుటలు. 3౬౭ - 3౭౨.

౪. మఱియు నితనిచే బంపబడినవాడై పండరంగడు దండు వెడలి కన్నర (కృష్ణ) భూపతి నోడించి యుద్ధరంగమున నాతని వెన్నుజూచెను; అతనితో గూడియుండిన సంకిలునికి గర్వభంగము గావించెను; బద్దెగని కభయమొసగెను. కిరణపురము, దహాలనిరుతము, దళెనాడు, అచలపురము మున్నగు స్థలముల జొచ్చెను; కిరణపురాచలపురములను పండరంగడు కాల్చిన దీయుద్ధయాత్రయందే. గంగాయమునా చన్ద్రాదిత్య పాలీకేతనాది రాజచిహ్నములను గొని వచ్చి నిజద్వారమున బ్రతిష్ఠాపించుకొనెను. అంతకుపూర్వము లేని సమధిగతపంచమహాశబ్ద బిరుదు నీసందర్భమున నే వహించియుండును.

౫. శత్రులు పై నెత్తిరా నిర్వహించుకొనలేక తల మరుగు సొచ్చిన చోఱ(ళ)ని రక్షించెను.

౬. కాళింగగంగులయొద్ద ద్రవ్యమును, కోసలులకడ ఏనుగులను, పాండ్యపల్లవుల దగ్గరనుండి హేమమును గ్రహించెను. పాండ్యపల్లవుల కడ గుణగుడు హేమము గొన్నది బోయకొట్టములపై పండరంగ డెత్తిపోయి నప్పుడేయని తోచుచున్నది.

ఇవి గుణగవిజయాదిత్యుని రాజ్యకాలమున నడచిన విశేష చరిత్రాంశములు. వీనియం దొక్క విషయమును గూర్చి కొంత చెప్పవలసియున్నది.

(౧) మొదట విచారింపదగినది యతని తలిదండ్రుల పూర్వోత్తరము. తండ్రినిగూర్చి పేర్కొనదగిన విశేషచరిత్రాంశములు లేవు; అతని పేరు కలివిష్ణువర్ధనుడు; కుబ్జవిష్ణువర్ధనుని సంతతిలో ప్రఖ్యాతుడైన నరేంద్ర మృగరాజాపరనామధేయుడగు నిమ్మడి విజయాదిత్యుని పుత్రుడు. నరేంద్రమృగరాజు అస్తంగతుడైన తరువాత నొక సంవత్సరకాల మతడు వేంగి నేలెను.

అతని తల్లి రాష్ట్రకూటుల యింటి యాడబడుచు;[1] ఆమె పేరన్ని శాసనములలోను శీలమహాదేవి యని యున్నను, నొక్కచోట

1. Cf. No. 5 of 1911—12.

మాత్రము శీలక్క యని యున్నది. ఈమె రాష్ట్రకూటాధిపతియగు నింద్రభట్టారకుని కుమారితె యట.[1] ఇది చక్కగ పాటింపదగిన యంశము. శీలమహాదేవి పుట్టిన రాష్ట్రకూటవంశము క్రీ. శ. ౮-౧౦ శతాబ్దములయందు సకల దక్షిణాపథముమీదను సార్వభౌమత్వమును నెగ్గించి కీర్తినందిన ప్రఖ్యాతరాష్ట్రకూటవంశముగాని యన్యముగాదు. అగునేని, శీలమహాదేవి జనకుడగు ఇంద్రభట్టారకు డెవ్వడో కనుగొన వలసియున్నది. అతడు గుణగవిజయాదిత్యుని తండ్రియగు కలివిష్ణు వర్ధనునకో, లేక ఆతని తండ్రియగు నరేంద్రమృగరాజ విజయాదిత్యు నకో, సమకాలికుడని నిశ్చయముగ జెప్పవచ్చును. ఏలన వీరిలో మొదటివానికి ఇంద్రభట్టారకుడు పిల్లనిచ్చిన మామ; రెండవవానికి వియ్యంకుడు. గుణగవిజయాదిత్యుడు శకాబ్దము ౮౧౪ అనగా క్రీ. శ. ౮౯౨ న గద్దెయెక్కిన మొదటిచాళుక్యభీమునికి పూర్వము నలువది నాలుగేండ్లు రాజ్యపరిపాలన మొనర్చినట్లు చాళుక్యశాసనముల యందు చెప్పియున్నది.[2] ఇందువల్ల గుణగవిజయాదిత్యుడు క్రీ. శ. ౮౪౮ మొదలు ౮౯౨ వఱకును రాజ్యమొనర్చెనని తెల్లమగు చున్నది. ఇతనికి పూర్వ మితని తండ్రి కలివిష్ణువర్ధనుడొకయేడు, అనగా క్రీ. శ. ౮౪౭ మొదలు ౮౪౮ వఱకు ప్రజాపాలన మొన ర్చెను; కలివిష్ణువర్ధనునికి పూర్వ మతని తండ్రి నరేంద్రమృగరా జొక నలువదినాలుగేండ్లు, అనగా క్రీ. శ. ౮౦౩ మొదలు ౮౪౭ వఱకును రాజ్యము సల్పెను. శీలమహాదేవి జనకుడగు రాష్ట్రకూటాధి పతి ఇంద్రభట్టారకుడు క్రీ. శ. ౯ శతాబ్దముయొక్క పూర్వార్ధమున వెలసెననియు, క్రీ. శ. ౮౦౩ మొదలు ౮౪౮ వఱకును వేంగి నేలిన నరేంద్రమృగరాజునకో, కలివిష్ణువర్ధనునకో సమకాలికుడనియు ధృఢ ముగ జెప్పవచ్చును.

---

1. ఆ. సా. ప. ప. సం. ౧ పుటలు ౧౪౦-౫౦.

2. ఆన్నివల్ రిపోర్ట్ ఆవ్ ఎపిగ్రఫీ, ౧౯౧౭, ప్యారా.

ఇక్కాలమున రాష్ట్రకూట సామ్రాజ్యమును బాలించు చుండినవారు జగత్తుంగప్రభూతవర్షశ్రీవల్లభాది బిరుదాంకితుడగు ముమ్మడి గోవిందచక్రవర్తియు, నతని కుమారుడగు నృపతుంగాపర నామధేయుడగు మొదటి యమోఘవర్షుడును. కావున శీలమహాదేవి తండ్రియగు రాష్ట్రకూటాధిపతి ఇంద్రరాజు రాష్ట్రకూటచక్రవర్తి కాడనుట నిశ్చయము. మఱి యాత డెవ్వరో కనుగొనుటకు సాధ్య మగునేమో చూతము. రాష్ట్రకూటవంశ శాఖ యొకటి క్రీ. శ. ౮౦౦ ప్రాంతమునుండి ౮౮౮ వ సంవత్సరమువఱకును లాటదేశ ముపై రాజ్యము సల్పెను. దీనికి చరిత్రకారులు గుజరాతుశాఖయని నామకరణము జేసియున్నారు. ఈ శాఖకు జెందిన రాజుల శాసన ములు పెక్కు ప్రకటితములై యున్నవి; వీనివల్ల గుజరాతురాష్ట్ర కూటవంశమునకు ముమ్మడిగోవిందచక్రవర్తికనుజన్ముడగు ఇంద్ర రాజు మూలపురుషుడని తెలియవచ్చుచున్నది. ఇత డన్నగారియెడ భక్తిపరుడై యతని కార్యమునకును ఖడ్గమునకును గర్తయై యనేక సమరములయందు పాల్గొని యతని ఆదరమునకును బాత్రుడాయెను. ఇంద్రరా జొనర్చిన సామ్రాజ్యసేవకు దృప్తినంది యతనిని లాట రాజ్యమునకు క్రీ. శ. ౮౦౦ ల ప్రాంతమున పట్టాభిషిక్తుని గావిం చెను. ఇట్లన్నగారి ప్రసాదమువల్ల లబ్ధమైనరాజ్యమును క్రీ. శ. ౮౧౦ వఱకును పాలించి యతడు దేహమును చాలించెననియు తోచుచున్నది.[1] ఈ యింద్రరాజే శీలమహాదేవితండ్రి. ఇట్లని తలంచు టకు నామసామ్యమును, కాలానుగుణ్యతయును మాత్రమే సాధనము లను కొనరాదు. పూర్వచాళుక్యరాష్ట్రకూట రాజకుటుంబములకు

---

1. ఇండియన్ ఆన్టిక్వెరీ. సం. ౧౨, పుటలు ౧౫౬ తరువాయి - ఇంద్ర రాజుకుమారుడగు కరకరాజసువర్ణవర్షుడు క్రీ. శ. ౮౧౨ లో రాజ్యము సల్పు చుండిన ట్లతని బరోడాపట్టికలవల్ల విదిత మగుచున్నది. కావున నింద్రరాజు తత్పూ ర్వము మృతినందెననుట నిశ్చయము.

ప్రాతచుట్టరికము గలదు. జథైవ్వపట్టికలయందీ చుట్టరిక మిట్లు వర్ణింపబడియున్నది:

"తస్య పరమభట్టారక మహారాజాధిరాజ పరమేశ్వర శ్రీమదకాలవర్ష పాదానుధ్యాత పరమభట్టారక మహారాజాధిరాజ పరమేశ్వర శ్రీధారావర్ష శ్రీధ్రువరాజదేవస్య మహాదేవీ సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన శ్రీవిట్టరసరాజదుహితా పరమేశ్వరీ పరమభట్టారికా శ్రీ శీలమహాదేవీ.[1]

ఇందువల్ల రాష్ట్రకూటచక్రవర్తి అకాలవర్షు (కృష్ణు)ని పుత్రుడగు ధారావర్షధ్రువుడు పూర్వచాళుక్యవంశజుడగు విష్ణువర్ధనుని సంతతికిజెందిన విట్టరసరాజు పుత్రికయగు శీలమహాదేవిని బెండ్లియాడెనని తెలియవచ్చుచున్నది. ధ్రువుడు ముమ్మడిగోవింద ఇంద్రరాజుల తండ్రి. ఇతడు క్రీ. శ. ౭౮౦ మొదలు ౭౯౩ వఱకును రాజ్యమొనర్చెను. ఇతనికి గూతునిచ్చి యుద్వాహముజేసిన విట్టరసరాజును నప్పటివాడనుటకు సందియములేదుకదా. కావుననే జథైవ్వపట్టికలను బరిష్కరించి ప్రకటించిన భండార్కరు పండితుడితడు పూర్వచాళుక్యరాజగు చతుర్థవిష్ణువర్ధనుడని గుర్తించెను. ఈ నిర్ధారణ సమంజసముగనే యున్నది. జథైవ్వపట్టికలలో నుక్తమైన పూర్వచాళుక్యరాష్ట్రకూట రాజకుటుంబముల యన్యోన్యసంబంధ మీక్రింది రీతిని వివరింపవచ్చును.

అకాలవర్షు(కృష్ణు)డు విష్ణువర్ధనుడు

విట్టరసరాజు (చతుర్థవిష్ణువర్ధనుడు)

|

ధారావర్షధ్రువుడు భార్య శీలమహాదేవి

1. ఎపిగ్రాఫియా ఇండికా. సం. ౨౨ పుటలు ౯౮ తరువాత.

ధారావర్షధ్రువునికి ముమ్మడి గోవిందరాజు ఇంద్రరాజు అను పుత్రు లిరువురు పుట్టిరి. వీరు శీలమహాదేవి గర్భమున బుట్టిరో, లేక యన్యపత్నియందు జనించిరో నిశ్చయించి చెప్పుటకు వీలులేదు; కాని వీరిలో నింద్రరాజు శీలమహాదేవి పుత్రుడే యని యూహించుట కవకాశము కలదు. కలివిష్ణువర్ధనుని ధర్మపత్నియు, గుణగవిజయాదిత్యుని తల్లియు నగు శీలమహాదేవి రాష్ట్రకూటాధిపతియగు ఇంద్రభట్టారకుని కూతురని పై జెప్పియున్నదికదా. ఈ యిరువురు శీలమహాదేవులకును నేద్దియేనియు సంబంధము కలదా? ఒక శీలమహాదేవికి రాష్ట్రకూటుల గృహము మెట్టినిల్లు; మఱియొక శీలమహాదేవి కది పుట్టినిల్లు; ఒక శీలమహాదేవికి ఇంద్రరాజను పుత్రుడు (కాదేని సపత్నీపుత్రుడు) గలడు; మఱియొక శీలమహాదేవితండ్రి పేరు ఇంద్రభట్టారకుడు. ఒక శీలమహాదేవి క్రీ. శ. ౮వ శతాబ్దాంతమున వెలసెను; మఱియొక శీలమహాదేవి తరువాత క్రీ. శ. ౯వ శతాబ్దద్వితీయ పాదాంతమున రాజ్యమునేలిన కలివిష్ణువర్ధనుని భార్య. హిందువులలో తాత పేరు మనుమనికిని, అవ్వపేరు మనుమరాలికిని బెట్టు నాచార మనాదిసిద్ధముగ వచ్చుచుండుటచేతను, నీ రెండవ శీలమహాదేవితండ్రియగు నింద్రభట్టారకుడును, ధారావర్షధ్రువమహారాజు కడగొట్టు కొడుకు ఇంద్రరాజును గొంచ మించుమించుగ సమకాలికులగుటచేతను వారిరువురును నొక్కరేయనియు, నీ యింద్రరాజు తన తల్లియో, లేక మాఱుదల్లియో యగు మొదటి శీలమహాదేవి పేరే తన కుమారితెకు బెట్టెననియు నూహించుట కవకాశము గలదు. ఈ యూహ యసమంజసముగాదేని రాష్ట్రకూట పూర్వచాళుక్యవంశముల బాంధవ్యము తరతరములుగ పెరుగుచుండెనని తేలును. ఈ రెండురాజకుటుంబముల పరస్పరసంబంధము నీ క్రిందివిధముగ గనుపఱుపవచ్చును. (చూ: క్రింది వంశవృక్షము.)

| రాష్ట్రకూట వంశము | పూర్వచాళుక్య వంశము |
|---|---|
| మొదటి యకాలవర్ష (కృష్ణ) మహారాజు | ముమ్మడి విష్ణువర్ధన మహారాజు |
| | మొదటి విజయాదిత్యుడు |
| | నాల్మడివిష్ణువర్ధనుడు (విట్టరసరాజు) |
| ధారావర్ష ధ్రువ మహారాజు–భార్య శీలమహాదేవి | నరేంద్రమృగరాజు ఇమ్మడి విజయాదిత్యుడు |
| ముమ్మడి గోవిందమహారాజు / ఇంద్రరాజు, లేక ఇంద్రభట్టారకుడు | |
| కర్కరాజు సువర్ణవర్షుడు | శీలమహాదేవి = భర్త ఐదవ లేక లేక శీలక్క కలివిష్ణువర్ధనుడు |
| | గుణగ విజయాదిత్యుడు |

(౨) తరువాత పరామర్శింపదగినది బోయకొట్టములపై దండయాత్ర :—గుణగవిజయాదిత్యుని కాలమున నడచిన ప్రథమచరిత్రాంశ మిది. ఈ దండయాత్రకు గారణ మద్దంకి శిలాశాసనమున—

'పట్టంబుగట్టిన ప్రథమంబునేడు బలగర్వ మొప్పంగ బైలేచి సేన
పట్టంబుగట్టించి ప్రభుపండరంగు బంచిన........'

అని చెప్పియున్నది[1]. దీనినిబట్టి చూడగా గుణగవిజయాదిత్యుడు తన బలగర్వము రాజ్యతృష్ణను బెంపొందించగా దండయాత్రను బోయకొట్టములమీది కంపెనని తోచుచున్నది; కాని మొదటి చాళుక్యభీముని ధర్మవరశిలాశాసనమున బోయల ప్రతిఘట

1. భారతి. సం. ౫. పుట ౪౫౧.

నమే దండయాత్రకు గారణమని వ్రాసియున్నది.[1] కారణమెద్ది యైనను రాజ్యమునకు వచ్చినవెంటనే గుణగవిజయాదిత్యుడు బోయలపై నొక దండయాత్ర నంపెనని నిశ్చయముగ జెప్పవచ్చును. ఈ బోయ లెవ్వరో, వారికి గుణగవిజయాదిత్యునితో నేల వైరము పొసగెనో విచారింపవలసియున్నది. అద్దంకిశిలాశాసనమువల్ల వీరి వృత్తాంతమును గొంత యూహింపవచ్చును. 'బోయకొట్టంబు ల్వణ్డ్రెణ్డుగొని...కట్టెపుదుర్గంబు గడు బయల్సేసి కణ్డుకూర్బెజవాడ గావిఞ్చి మెచ్చి' అను మాటలవల్ల బోయలు కందుకూరు ప్రాంతదేశమున బన్నెండు కొట్టములయందు నివసించుచుండిరని తెలియవచ్చుచున్నది. శాసనమున బేర్కొనబడిన కందుకూరు శ్రీ సోమశేఖర శర్మగారు చెప్పినట్లు ప్రస్తుత నెల్లూరుమండలములోని కందుకూరే గాని యన్యము గాదు.[2] కందుకూరులోని పండరంగనిశాసనమే దీనికి సాక్షి[3]. బోయ కొట్టములు కందుకూరినుండి దక్షిణమున నిప్పటి చిత్తూరిమండలములోని నారాయణవనము వఱకును వ్యాపించి యుండెననుటకు గొంత యాధారముగలదు. 'కోట్ట'మనగా శర్మగారు కోట యని యర్థము చేసుకొనిరి[4]. కాని కోట్టమనగా పాలనా సౌకర్యార్థమునకుగాను జేయబడిన దేశవిభాగమును దెల్పునని మదీయాభిప్రాయము. ఇది యరవమునుండి యెరవు తెచ్చుకొన్నమాట. అరవములో కోట్ట మనగా దేశవిభాగమని యర్థము. పల్లవుల

---

1. భారతి. సం. ౫, పుట ౬౮౯ '......న్నేలు నలరామవిభుతోఱ నెడతి [నబో]యల నడవి సా [న్నె?]' (శ్రీ మ. సోమశేఖర శర్మగారిచే పరిష్కృతమైన పాఠము) ఎడఱు=మీఱు, అతిక్రమించు అరవములోని 'ఇడఱ్' కన్నడములోని 'ఎడఱు'.

2. భారతి. సం. ౫. పుట ౪౭౩.

3. నెల్లూరుజిల్లా శాసనములు. సం. ౨. కందు. నెం. ౩౧, ౩౨ ర్లు.

4. భారతి. సం. ౫. పుట ౪౭౩. "దీనిని బెజవాడ యంతటిదిగ జేసెననుటలో, బోయరాజుల కోటల కిది సమీపమున నుండుటచేత" ఇత్యాది.

రాజ్యాంగవిధానమున వారి యేలుబడికి లోబడిన దేశమంతయు పాలనాసౌకర్యమునకై కోట్టములు, నాడులు, రాష్ట్రములుగ విభజింపబడియుండెను. పెక్కు కోట్టములు జేరిన ఒకనాడు అగును. ఇట్లే పెక్కునాడుల సమ్మేళన మొకరాష్ట్రముగ పరిగణింపబడు చుండెను. నెల్లూరు మండలము పల్లవుల యధికారము సంపూర్ణముగ నశించిపోవువఱకును వారి యేలుబడిక్రింద నుండెను. క్రీ. శ. ౯ వ శతాబ్దమున తొండమండలమున రాజ్యముజేసిన పల్లవవిజయకంప వర్మ శాసన మొకదానిని గూడూరు తాలూకాలోని మల్లం గ్రామమున నిటీవల శాసనశాఖవారు కనుగొనిరి. కావున పండరంగని శాసనములలోని కోట్టములు పల్లవరాజ్యమునకు జెందిన రాష్ట్రవిభాగము లనుట యొప్పును[1]. బోయల కునికిపట్టులగుటచేత నీ కోట్టములు బోయకోట్టము లనబడెను.

గుణగవిజయాదిత్యుడు వేంగిసింహాసనము నధిష్ఠించినప్పుడు పల్లవరాజ్యమును 'క్షాత్రియరిన్ద నంది' యను నామాంతరము గల ముమ్మడినందివర్మ యేలుచుండెను. ఇతని కాలమున, నంతకు పూర్వము పల్లవులకు గప్పము కట్టుచుండిన పాండ్యరాజులు ప్రబలులై తిరుగుబాటుచేసి తొండమండలపర్యంతము గల పల్లవ రాష్ట్రము నాక్రమించుకొని తొండమండలమును ప్రవేశించి దేశ సంక్షోభము గావించిరి. అదియే తరి యని వేంగిపూర్వచాళుక్యులు దక్షిణాంధ్రమును పల్లవుల నుండి స్వాధీనపఱచుకొనుటకు ప్రయత్న

1. కోట్టమునుగూర్చి నేను శర్మగారితో నిటీవల చర్చించితిని. వారుచెప్పు సమాధానము సమంజసముగనే యున్నది. పూర్వము దేశ సంరక్షణార్థమై యాయాపట్లయందు కోటలను నిర్మించెడివారు. ఒక్కొక్క కోటకు చుట్టుపట్టు ప్రదేశముల పరిపాలనయు నా కోటనుండియే నడచెడిది. కావున కోటయే పరిపాలనాధికారులు కార్యమును నిర్వహించు ప్రధాన స్థలమాయెను. ఈ కారణముననే యరవమున 'కోట్టమ'న పాలనాసౌకర్యార్థమొనరించిన దేశ విభాగ మను నర్థము గలిగినది. కావున కోట్ట మనిన కోటయని యర్థము జేసికొనుట యుక్తమే.

ములు నలుపగా, పల్లవులయెడ విశ్వాసము గల బోయలు వీరికి మాఱొడ్డినట్లు దోచుచున్నది. తత్కారణమున గుణగవిజయుడు వీరిపై దండుబెట్టవలసివచ్చెను.

దండయాత్రయందు నడచిన యంశములు కొన్ని శాసనముల వల్ల దెలియవచ్చుచున్నవి. సామంతసైన్యముతో బయలువెడలిపోయి పండరంగడు బోయకొట్టములను బంగ్రెండింటిని స్వాధీన పఱచుకొని వేంగిరాజ్యమును విస్తరింపజేసె ననియు, కట్టెపుదుర్గమును బయలుసేసి యనగా నేలమట్టము గావించి కందుకూరును బెజవాడగ జేసెననియు నద్దంకిశాసనము దెల్పుచున్నది. కట్టెపుదుర్గమెచ్చటిదో నిశ్చయించి చెప్పుటకు వీలు లేకపోయినను శ్రీ సోమశేఖరశర్మగారు చెప్పిన ట్లది బోయకొట్టములకు జెందినదే[1]. కావున నదియు నెల్లూరుమండలాంతర్గతమని తలచుట సమంజసము. మఱియు, ప్రథమచాళుక్యభీముని యత్తిలిత్రామశాసనమున పండరంగడు నెల్లూరుపురమును దగులబెట్టె నని చెప్పియున్నది[2]. నెల్లూరుపురదహనము సైతము బోయకొట్టములపై నడిపిన దాడియందే నడచియుండవలయును. ఈ దండయాత్రయందు పూర్వచాళుక్య సైన్యము నెల్లూరు దక్షిణపు సరిహద్దువఱకు గల రాష్ట్రమును జయించి స్వాధీనపఱచుకొనెనని తోచుచున్నది[3]. స్వాధీనపఱచుకొన్న దేశమున

1. భారతి. సం. ౫. పుట ౪౭౩.

2. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సం. ౧౧. పుట ౨౪౧.

3. ఈ సందర్భమున గమనింపదగిన విషయ మొకటి గలదు. నెల్లూరుజిల్లా గూడూరుతాలూకా దక్షిణపు కొనయందు శ్రీహరికోట కు గొంచె ముత్తరమున సముద్రతీరమున పంగ్రంగ మను నొక గ్రామముగలదు. ఇచ్చట పండరంగేశ్వరుని దేవాలయము గలదు. ఇది కడుప్రాచీన గ్రామమనుటకు దేవాలయములోని చోళశాసనములే సాక్షి. ఈ దేవాలయము పండరంగ ప్రతిష్ఠ కావచ్చును. ఇది యసంభావ్యము గాదేని, పండరంగని విజయయాత్ర శ్రీహరికోటవఱకును సాగినదని యెంచవచ్చును.

దన యధికారము సుస్థిరముగ నెలకొల్పుటకై గుణగవిజయాదిత్యుడు పండరంగని దాని కధిపతిగ జేసి యచటనే నిల్పెను. పండరంగడు కందుకూరిని తనకు రాజధానిగ జేసికొని యా ప్రాంతమందలి రాజ్యము నేల నారంభించెను. కావుననే యద్దంకిశాసనమున 'కణ్డుకుర్బెజవాడ గావిఞ్చి మెచ్చి' అని చెప్పియున్నది. పణ్డరంగని సంతతి వారు నెల్లూరుమండలముననే యుండినట్లు మల్లియంపూడి మొదలగు శాసనములచే దెలియవచ్చుచుండుటచేత పై యూహ సరియైనది యని తలచుచున్నాను.[1].

(౨) ధర్మవర శిలాశాసనమునందు, గుణగవిజయాదిత్యుని పంపున పండరంగడు బోయలను జయించిన పిమ్మట రాహణుని జయించినట్లు చెప్పియున్నది. శాసనోక్తరీతినిబట్టిచూడగా నీరాహణు డెవ్వడో కొంత ప్రఖ్యాతిని బొందిన ప్రభువైనట్లు తోచుచున్నది; కాని యతనిని గాని యతని యేలుబడిక్రింది దేశమునుగాని గుర్తించుటకు సాధ్యముగాక యున్నది. కొన్ని శాసనములయందు గుణగవిజయాదిత్యుడు పల్లవుల నుండియు పాండ్యులనుండియు హేమమును గొనినట్లు చెప్పియున్నది. కంచి పల్లవరాజులకు బోయ కొట్టములతో సంబంధముండుటచేత పండరంగడు బోయకొట్టములపై దాడినడిపినపుడే పల్లవులను వారికి దక్షిణముననుండు పాండ్యుల నోడించి హేమమును గొనియుండునని తోచుచున్నది.

(3) పాశ్చాత్యగంగరాజుపై దాడి:—గంగరాజుపై గుణగవిజయాదిత్యుని దాడి పెక్కు పూర్వచాళుక్య శాసనములందు ప్రశంసింపబడియున్నది. వీనియందు అమ్మరాజవిజయాదిత్యుని ఈడేరు శాసనము ముఖ్యమైనది. ఇతర పూర్వచాళుక్యశాసనములం దితడు గంగకూటనివాసులను, గంగులను జయించి మంగరాజు శిరః

1. ఎపిగ్రాఫియా ఇండికా. సం. ౯. పుట ౪౭.

ఖండనము గావించెనని మాత్రము గలదు; ఇందు వానితో గూడ మఱికొన్ని విశేషాంశములు జేర్పబడియున్నవి.

"గంగా నంగజవైరిశక్తి రసమాఞ రట్టేశసంచోదితో
జిత్వా మంగిశిరోహరత్ యుధి మహా బాహ్వప్తవీర్యార్యమా;
కృష్ణం సంకిలి మంకితాఖిలబలప్రాప్తోరుసద్విక్రమో
భీతార్త్తౌచ విహాయ తత్పుర మరం యో విర్దదాహ ప్రభుః"[1]

రట్టేశునిచే నాజ్ఞాపింపబడి (పురికొల్పబడి యుండె) గుణగ విజయాదిత్యుడు గంగులను జయించెననియు, యుద్ధమున మంగిశిర మును హరించె ననియు, భీతార్త్తులైన కృష్ణసంకిలుల పట్టణమును దహించె ననియు నిందలి భావము.

మఱి, గుణగవిజయాదిత్యుని గంగులపై కంపిన రట్టేశు డెవ్వడో కనుగొనవలసియున్నది. గుణగ విజయాదిత్యుడు క్రీ. శ. ౮౪౪ మొదలు ౮౮౮ వఱకు రాజ్యపరిపాలనము గావించెనని పై జెప్పి యున్నది కదా. ఈ కాలమున రట్టరాజ్యముపై నిరువురు రాజులు ప్రభుత్వము సల్పిరి. వీరియం దొకడు నృపతుంగాపరనామధేయుడగు ప్రథమామోఘవర్ష చక్రవర్తి. క్రీ. శ. ౮౧౪ మొదలు ౮౭౭ వఱకు నితడరువదిమూడేండ్లు ప్రజాపాలనము గావించెను. తరువాత నితని పుత్రుడగు నిమ్మడికృష్ణనరపతి క్రీ. శ. ౮౭౮ వ సంవత్సరమున సామ్రాజ్యాభిషిక్తుడై క్రీ. శ. ౯౧౪ వఱకును ప్రభుత్వము సల్పెను. దీనినిబట్టి ప్రథమామోఘవర్షుడును నిమ్మడి కృష్ణుడును గుణగ విజయాదిత్యుని సమకాలికులగు రాష్ట్రకూటచక్రవర్తులని తేలు చున్నది. ఇక వీరిద్దఱిలో గుణగవిజయాదిత్యుని గంగులపై కంపినాత డెవ్వడు? రట్టేశుడు పంపగా నితడేల గంగులపై దాడి వెడలెను? అను ప్రశ్నలకు సమాధానము చెప్పవలసియున్నది. ఈ దేటుశాసన మును బరిష్కరించుసందర్భమున డాక్టర్ హుల్ట్జుగారు పైనుదాహ

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్ సం. ౧. పుట ౩౯.

రింపబడిన శ్లోకములో చేర్కొనబడిన కృష్ణుడు రాష్ట్రకూట చక్ర వర్తియగు నిమ్మడి కృష్ణుడని గుర్తించి యతడే గుణగవిజయాదిత్యుని గయ్యమునకు జీరి గంగరాజ్యమునకు రప్పించెననియు చెప్పి యున్నారు.[1] కాని వీరి యభిప్రాయ మంగీకార్యము గాదు. ఏలనగా, మొదట 'రట్టేశసంచోదితః' అను మాటలలోని 'సంచోదితః' అను మాటకు 'ఛాలంజ్‌డ్' అని వీరు చేసిన యాంగ్లానువాదము సరి యైనది కాదు. 'ఛాలంజ్‌డ్' అనుమాట కీపట్టున 'యుద్ధమునకుజీరి' అని యర్థము చెప్పుకొనవలసియున్నది. 'సంచోదితః' అనుమాట కీ యర్థమెచ్చటను లేదు. దీనికి 'ఆజ్ఞాపింపబడి' లేక 'పురికొల్పబడి' యనియే యర్థము చెప్పవలసియున్నది; కావున రట్టేశునిచే నాజ్ఞా పింపబడియొండె' పురికొల్పబడియొండె గుణగవిజయాదిత్యుడు గాంగుల మీదికి దాడివెడలినచో నతడు రట్టేశునికి లోబడి యతని యాజ్ఞచొప్పున బ్రవర్తించినప్రభువని చెప్పనచ్చునే కాని స్వతంత్రు డును, వైరియునని చెప్పుటకు వీలుకాదు. ఈ యభిప్రాయము సరి యైనచో గుణగవిజయాదిత్యుని కోపాటించి యతడు నిజపురము నేర్చుచుండ జేయునది లేక, మిన్నకయుండిన దాయ యగు కృష్ణుడతని దన చిత్తానుసారము నడిపించిన రట్టేశు డెట్లగును? గుణగవిజయా దిత్యుడు మొదట కృష్ణుని యధికారమునకు లొంగి సామంతుడై యుండి తదనంతర మతనితో బ్రతిఘటించి, యోడించి, యతని పట్టణ మును గాల్చి యుండరాదా? యను ప్రశ్న మొకటి రావచ్చును. ఇది సంగతము కావచ్చును. కాని, కృష్ణునికి గుణగవిజయాదిత్యుడు లొంగి యాజ్ఞానువర్తియైయుండెననుట కాధారమేమియు గానరాదు. మఱియు నొక్క శ్లోకమునందే రట్టేశుని, గృష్ణుని బ్రత్యేకముగ చేర్కొని యుండుటచే వారిరువురు ఒక్కరని చెప్పుటకంటె భిన్నులని యెంచుట యుక్తమని తోచుచున్నది.

1. సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్స్. సం. ౧. పుట ౩౯.

గంగులమీదికి గుణగవిజయాదిత్యు నంపిన రట్టేశు డిమ్మడి ౦డు కానిపక్షమున నిక నతడు ప్రథమామోఘవర్షుడై యుండ వలయును. అట్లని చెప్పుట కమోఘవర్షుని శాసనములుగూడ కొంత వఱకు దోడ్పడుచున్నవి. క్రీ. శ. ౮౬౬ వ సంవత్సరము నాటి నిల్గుండ శిలాశాసనమున నమోఘవర్షుని అర్చించిన రాజులలో వేంగీశ్వరు డొకఁడని చెప్పియున్నది.[1] మఱియు, క్రీ. శ. ౮౭౨ నాటి సన్జన్ తామ్రపట్టికలలో వేంగీనాథు డమోఘవర్షుని వాహ్యాళిభూమిని పెంట పోజిమ్మి కూలిగూడ లేని వెట్టి యొనర్చెనని యున్నది.[2] తరువాత రాష్ట్రకూటరాజుల శాసనములందు పూర్వచాళుక్యుల నమోఘవర్షుడు వింగవల్లిరణక్షేత్రమున నిర్జించెనని యున్నది[3]. కావున నరేంద్రమృగ రాజు కాలమున పూర్వచాళుక్యులచే నాక్రమింపబడిన నిజరాజ్య మును మరల స్వాధీనపఱచుకొని వారి నమోఘవర్షుడు వింగవల్లి యుద్ధరంగమున నోడించెనని నిశ్చయమగుచున్నది.

అమోఘవర్షునిచే బరాజితుడై యతని గొల్చిన పూర్వ చాళుక్యరా జెవ్వరో స్పష్టముగా దెలియదు. ఈ విషయమునం దభి ప్రాయభేదము కొంత కానవచ్చుచున్నది. డాక్టరు డి. ఆర్. భండార్కా రితడు నరేంద్రమృగరాజవిజయాదిత్యు డగు ననిరి[4]. కాని వీరి యభి ప్రాయము సరియైనదని నమ్ముటకు వీలు లేదు. ఏలనగా, వీ రమోఘ వర్షునికి సమకాలికుడైన పూర్వచాళుక్యరాజు నరేంద్రమృగరా జొకఁడే యని తలచి యట్లు వ్రాసిరి. కాని యమోఘవర్షునికి సమ

---

1. ఎపిగ్రాఫియా ఇండికా, సం ౬ పుట. ౧౦౩.

2. ఎపిగ్రాఫియా ఇండికా, సం. ౧౮, పుట. ౨౪౬.

3. జర్నల్ ఆఫ్ ది బాంబే బ్రాంచ్ ఆఫ్ ది రాయల్ ఏషియాటిక్ సొసైటీ. సం. ౧౮. పుటలు ౨౬౫-౬౯; ఎపిగ్రాఫియా ఇండికా. సం. ౭. పుటలు ౩౭-౮; ఇండియన్ అంటిక్వెరి. సం. ౧౨. పుట.

4. ఎపిగ్రాఫియా ఇండికా. సం. ౯. పుట.

కాలికులగు పూర్వచాళుక్యరాజులు నరేంద్రమృగరాజు గాక మఱి యిరువురు గలరు. కలివిష్ణువర్ధనుడును, గుణగవిజయాదిత్యుడును గూడ నతనికి సమకాలికులే. కావున భండార్కారుగారి యభిప్రాయము సరియైనదని దృఢముగ జెప్పుటకు వలనుపడదు. రాష్ట్రకూటచరిత్రకారులగు డాక్టర్ ఎ. ఎస్. ఆల్టెకారు అమోఘవర్షునిచే బరాజయము నందినవాడు గుణగవిజయాదిత్యుడని నిశ్చయించిరి. పూర్వచాళుక్యుల ప్రస్తావ మమోఘవర్షుని శాసనములలో క్రి. శ. ౮౬౬ నాటి సిరూరుశిలాశాసనముననే మొదట గానవచ్చుచున్నది. తత్పూర్వశాసనములయం దెచ్చటను లేదు. కావున నమోఘవర్షుడు వేంగిచాళుక్యులను జయించినది క్రీ. శ. ౮౬౬ ప్రాంతమున ననియును, నప్పుడు వేంగి నేలుచుండిన రాజు గుణగవిజయాదిత్యుడగుటచే, నతడే యమోఘవర్షునిచే నిర్జింపబడి యతని సేవించిన వేంగీశ్వరుడనియును దీర్మానము గావించిరి[1]. లబ్ధమైన యాధారముల నన్నిటిని సమకూర్చిచూడగా డాక్టర్ ఆల్టెకారుగారి యభిప్రాయము యుక్తముగనే కన్పట్టుచున్నది. కావున, వీరి యభిప్రాయము బూర్వపక్షము సేయదగిన వ్యతిరేక సాక్ష్యము బయల్పడువఱకు నిదియే సరియైనదని మన మంగీకరింపవచ్చును.

గుణగవిజయాదిత్యునికిది రాష్ట్రకూటులతోనైన తొలిపోరాటము; దీనికి రాష్ట్రకూట పూర్వచాళుక్యవంశపు రాజులకు పరంపరగ వచ్చుచుండిన వైరమే ముఖ్యకారణము. నరేంద్రమృగరాజుకాలము నుండియు బూర్వచాళుక్యుల ప్రతాపము మధ్యందినమార్తాండునివలె దుర్నిరీక్ష్యమై యసహ్యమై వెలుగొంద జొచ్చెను. గుణగుడు రాజ్యాభిషిక్తుడైన మొదటియేడే పల్లవరాజ్యముపై నెత్తిపోయి యందలి యుత్తరసీమల నాక్రమించుకొనెను. పల్లవరాజగు మూడవ నందివర్మ యమోఘవర్షుని యల్లుడు. దీనికిదోడు గుణగవిజయాదిత్యుడు

1. రాష్ట్రకూటులు, వారికాలము, పుట ౭౨.

రాష్ట్రకూటుల యేలుబడియందుండిన పశ్చిమాంధ్ర దేశముపై నెత్తి పోయి కొన్ని స్థలములను పాడుగావించెనని మున్నాడి ఇంద్రరాజు బుగుమ్రా శాసనమువల్ల దెలియవచ్చుచున్నది. అందు—

'సమూలోన్మీలిత స్తమ్బాన్ దండేనానీతకణ్టకః
యోఽదహ ద్ద్విషిత శ్చణ్డచలుక్యాన్ చణకా నివ'

అను శ్లోకమున నమోఘవర్షుడు దండోపాయముచే సమూలముగ బెకలింపబడిన కాడ (స్తంబము)గల శత్రులగు చండచాళుక్యులను, శనగ చెట్లను హాలికుడు దండమునకు దగిల్చి తెచ్చిన కంటకము బోలి దహించెనని యున్నది. ఈ శ్లోకమున శ్లేష కలదు. ఉత్తరార్థము లోని 'స్తంబాన్' అను పదమును ముఖ్యముగ గమనింపవలయును. దీనికి రెం డర్థములను జెప్పవచ్చును; శనగ మొక్కల పరమున కాడలనియు, చాళుక్యుల పరమున 'స్తంబపుర' మనియు నర్థము జెప్పవచ్చును. ఇందు శ్లేష యున్నదని మొదట గ్రహించి రెం డర్థములను విశదము చేసినవారగు డాక్టరు భండార్కారుగారీ స్తంబపురము బంగాళదేశాంతర్గత మగు మిథునపురమందలి 'తాంలూక్' అనబడు ప్రాచీన తామ్రలిప్తమని గుర్తించిరి[1]. కాని వీరిస్థలనిర్ధారణ మంగీకరింపదగినది కాదు. ఏలనగా, బంగాళదేశ మీకాలమున పాలరాజుల యధికారముక్రింద నుండినది; పూర్వచాళుక్యులు బంగాళముపై దండెత్తి పోయినట్లు గాని, పాలరాజులతో యుద్ధము చేసినట్లుగాని తెలిపెడి యాధారము లెవ్వియులేవు. 'స్తంబపుర'మనునది వేంగి రాష్ట్రకూట రాజ్యములలో నెచ్చటనో యుండవలయును. ప్రస్తుత కర్నూలు మండలములోని 'కంబము' కావచ్చును. ఈ స్థలనిర్ధారణ యొప్పదగినదేని గుణగవిజయాదిత్యుడు రాష్ట్రకూటరాజ్యముపై నెత్తిపోయి కంబమును నాశముగావించెనని చెప్పవచ్చును. దీనికి తరువాత వింగవల్లియుద్ధము. ఈ యుద్ధమును

1. ఎపిగ్రాఫియా ఇండికా. సం. ౯. పుట. ౨౭.

గూర్చిన వివరమేమియు మనకు తెలియదు; కాని యొక్క సంగతిని నిశ్చయించి చెప్పవచ్చును. గుణగవిజయాదిత్యుడు యుద్ధమున సంపూర్ణముగ బరాజితుడై యమోఘవర్షుని కరిగాపై యాతని సార్వభౌమత్వము నంగీకరింపవలసివచ్చెను. ఏతత్కారణముననే రట్టేశసంచోదితుడై గాంగులపై దండువెడలినది.

గుణగవిజయాదిత్యుని దండయాత్రకు గుఱియైన గాంగు లెవ్వరు? ఆకాలమున దక్షిణహిందూస్థానమున రాజ్యము సేయు చుండిన గంగనామాంకిత రాజకుటుంబములు రెండు కలవు. అందొకటి కర్ణాటకమున గంగవాడి నేలుచుండెను. దీనికి బాశ్చాత్యగంగవంశ మనిపేరు. తూర్పుసముద్రతీరమున మఱియొక గంగవంశము ప్రభుత్వ మొనర్చుచుండెను. దీనికి పూర్వగంగవంశమని పేరు. గుణగవిజయా దిత్యు డెత్తిపోయినది పశ్చిమగాంగుల మీాద.

'హత్వా భూరి నొడంబరాష్ట్రి నృపతిం మంగిం మహాసంగరే
గంగా నాశ్రితగంగ కూట శిఖరా న్నిర్జిత్య.........'

అను ఈ స్తేఱు మలియంపూడిశాసనముల శ్లోక మీా విషయ మును విశదపఱచుచున్నది. నొడంబరాష్ట్రము ముప్పదిరెండువేల దేశము. అసలు పేరు 'నొఱంబ'దేశమని. 'నొళంబ' 'నొడంబ' 'నొణంబ' యనునవి దీని రూపాంతరములు. ప్రస్తుత బళ్లారి యనంత పురమండలములోని కొంతభాగమునకును, మైసూరు సంస్థానములోని కోలారు తుంకూరుమండలములందు కొంతభాగమునకును ప్రాచీన కాలమున నొళంబరాష్ట్రమను పేరు చెల్లుచుండెను. కాంచీపురపల్లవ వంశశాఖ యొక్కటి యిచట రాజ్యముసేయుచుండెను. వీరిని నొలంబులని, నొలంబపల్లవులని యాధునిక చరిత్రకారులు పేర్కొను దురు. నొలంబులు బాశ్చాత్యగాంగులకు పొరుగువారగుటచే చిర కాలమునుండి వారికి గాఢమైన సంబంధ మేర్పడినది. గుణగవిజయా దిత్యుని కాలమునం దా రెండిండ్ల రాచవా రొండొరులలో మైత్రి

వాటించుచుండిరి. మఱియు నొలంబులు పాశ్చాత్య గాంగుల కాశ్రితులై కప్పము గట్టుచుండి రనుటకు గొంత యాధారము గలదు. కావున నొడంబరాష్ట్రాధిపతియగు మంగి రణమరణమును, గాంగుల యోటమియు బూర్వచాళుక్యశాసనములం దెల్లెడలను జేర్చి చెప్పబడి యుండుటచేత గుణగవిజయాదిత్యున రట్టేశుని యాజ్ఞానుసార మెత్తి పోయినది పాశ్చాత్యగాంగులమీద నని నిశ్చయముగ జెప్పవచ్చును.

గాంగులకును రాష్ట్రకూటులతోడి వైరము బహుకాలము నుండి యభివృద్ధినందుచుండినది. రాష్ట్రకూటుల రాజ్యకాంక్షయే దీనికి ముఖ్యమైన కారణము. మొదటి యకాలవర్ష కృష్ణరాజు గంగవాడిని జయింప సమకట్టి సైన్యయుక్తుడై దాడివెడలెను. పాశ్చాత్య గాంగరాజగు శ్రీపురుషముత్తరసుడు రట్టసైన్యముల నెదిర్చెను; కాని దైవదుర్విపాకముచే బరాజితుడాయెను. ఈయవాంతరమున నొక వేళ నీతడు మరణించినను మరణించియుండవచ్చును. కాని గంగవాడి రాష్ట్రకూటులకు స్వాధీనపడలేదు; శ్రీ పురుషుని పుత్రులు వారికి మాఱొడ్డిరి. ధ్రువరాజనిరుపమకలివల్లభుడు రాజ్యాభిషిక్తుడైన పిమ్మట గంగవాడిపై మరల దండెత్తిపోయి శ్రీపురుషుని ప్రథమ పుత్రుడగు శివమారభూపతిని బరాజితునిజేసి బందీకృతుని గావించెను; కాని యతని యనుజుడగు దుర్గరాజు రాష్ట్రకూటుల విజయము నొప్పుకొనక శత్రువులతో బ్రతిఘటించి పోరనారంభించెను. దైవ ప్రాతికూల్యముచే నపజయమును బొందవలసివచ్చెను.[1]

---

1. ధ్రువరాజ నిరుపమకలివల్లభుని రాణియగు శీలమహాదేవియొక్క జైథని తామ్రపట్టికల (ఎపిగ్రాఫియా ఇండికా. సం. ౨౧. పుటలు. ౯౮-౧౦౯)లోని ఇరువదినాల్గవ శ్లోకమునం దీయంశము సూచింపబడియున్నది:

యోఽసౌ ప్రసాధితజగత్త్రియసారదుర్గో
గంగౌఘసంతతినిరోధవివృద్ధకీర్తిః
ఆత్మీకృతోన్నతవృషాంకవిభూతి రుచ్చై
ర్యత్కం తతాన పరమేశ్వరతా మిహైకః.

ధ్రువరాజుమరణానంతర మతని కుమారుడగు ముమ్మడిగోవింద రాజు శివమారభూపతిని బంధముక్తుని గావించి మరల నతని స్వదేశ మున కంపెను. శివమారునకు పారతంత్ర్యము నచ్చదాయె. నిజ రాష్ట్రమును జేరిన వెంటనే యతడు రాష్ట్రకూటుల సామ్రాజ్యాధి పత్యము నంగీకరింపక స్వతంత్రుడై రాజ్యవ్యవహారములను నడుప నారంభించెను. ఇందుకు గోపించి ముమ్మడిగోవిందరాజు గంగవాడిపై దండెత్తివచ్చి శివమారుని నిర్జించి మరల కారాగారమున బంధిం చెను. గోవిందరాజు రాజ్యముసేయుచున్నంతకాలమును గాంగులు మరల తలయెత్తలేదు. కాని యాతని యనంతరము రాజ్యాభిషిక్తు డైన ప్రథమామోఘవర్షుని బాల్యము నవకాశము జేసికొని గాంగులు స్వాతంత్ర్యమును బ్రకటించిరి; కాని యమోఘవర్షుని పితృవ్య పుత్రుడును, లాటాధిపతియునునైన కర్కరాజసువర్ణవర్షుని కృషి మూలమున గంగవాడియందు రాష్ట్రకూటుల యధికారము మరల సుప్రతిష్ఠితమాయెను. ఇంతటితో గాంగులు నిరాశజెందలేదు; కాలమునకు గట్టువడి యదను వేచియుండిరి. అమోఘవర్షుని రాజ్యపు టుత్తరార్ధమున నదను సమకూడెను. గంగరాజగు నీతిమార్గుడు రాష్ట్రకూటుల యధికారమును గూలద్రోయుటకు ప్రబలమైన ప్రయ త్నము గావించెను. రాష్ట్రకూటసామంతు లనేకు లతని గూడిరి; అప్పటి స్థితిగతులు క్రీ. శ. ౮౬౦ నాటి కొన్నూరుశాసనమునందు విపులముగ వర్ణింపబడియున్నవి[1].

---

ఈ శాసనమున బరిశోధించిన డాక్టరు డి. ఆర్. భండార్కరుగారుగాని, శాసనాంతరమున గానవచ్చు నీ శ్లోకముపై దీర్ఘవ్యాఖ్యానము గావించిన (ఎపి గ్రఫియా ఇండికా. సం. ౨౧. పుటలు ౧౩౩-౪౭) డాక్టర్ ఎ. ఎస్. ఆల్టెకారు గారుగాని 'దుర్గః' యనునది యొక వ్యక్తియొక్క నామమని గ్రహింపక 'దుర్గ'మని యన్వయము జేసికొనిరి.

1. ఎపిగ్రాఫీయా ఇండికా. సం. ౬. పుట ౩౦.

తత్రాన్తరేఽస్య త్సామన్తై ర్మాత్సర్యాహితమానసై
రుపేక్షితోఽపి కోపాద్యత్సాహాయ్యైకసఖః స్వయం ॥

ముకుళవంశజుడును నెల్లకేతనుడును నగు బంకెయరసు అను సామంతుని, నమోఘవర్షుడు దన మూలబలముతో, నీతిమార్గుని గర్వ భంగము గావించి గంగవాడిని మరల స్వాధీనపఱచుకొని రమ్మని పంచెను. బంకెయరసుడు శూరుడైన సేనాని. రాజాజ్ఞానుసారము దండెత్తి గంగవాడిని ప్రవేశించి, నీతిమార్గుని పరాభూతుని గావించి, కేడళదుర్గమును గొని, తాళవనపురాధీశ్వరుని దిశాపట్టునిగ జేసి, కావేరిని దాటి శత్రురాజ్యమును జయించెను[1]. బంకెయరసునికి ప్రాపుగనే యమోఘవర్షుడు గుణగవిజయాదిత్యుని గంగవాడిపై నెత్తిపొమ్మని యాజ్ఞ యిచ్చినది. బంకెయరసుని మూలబలములతో బంచినట్లే గుణగవిజయాదిత్యుని మిత్రబలముతో నంపెను.

గుణగవిజయాదిత్యుడు గంగవాడి జేరుటకు నోలంబవాడిమార్గ మున బోవలసియుండెను; నోలంబరాజు గంగరాజగు నీతిమార్గునికి మరదియగుటచే నతడు పూర్వచాళుక్యసైన్యములను మార్గమున నరికట్టెను. ఈ నోడంబరాజుపేరు మంగియని యీ స్తోత్రము మలియం పూండిశాసనములయందు స్పష్టముగ జెప్పియున్నను నోలంబవంశా వళి యందుగాని, శాసనములయందుగాని యప్పుడు మంగియను రాజొక డున్నట్లు చెప్పియుండలేదు. శాసనములనుబట్టి చూడగా నప్పుడు రాజ్యము సేయుచుండిన నోలంబరాజుపేరు పొఱల్చోఱనో లంబాధిరాజని తెలియవచ్చుచున్నది. కావున చారిత్రకపరిశోధకుల కితని వ్యక్తినిరూపణ మొక సమస్యగ నేర్పడినది. పాశ్చాత్య గాంగ రాజుల చరిత్రను రచియించిన శ్రీ యం. వి. కృష్ణరావుగారీ మంగి నోలంబుల సేనాధిపతియని వ్రాసిరి.[2] కాని ఇది యొప్పదగినది కాదు.

---

ధ్వస్తరిపునీతిమార్గో రణవిక్రమ మేకబుద్ధ మభినీయ
సమదీయహృదయసంగత మవన్ధ్యకోపత్వ మావహతి॥

1. ఎపిగ్రాఫియా ఇండికా. సం. ౬ పుటలు ౨౯, ౩౦.

2. తలకాడుగాంగులు. పుట ౭౪.

ఏలనగా, పై బేర్కొన్న యీస్తేఱుమలియంపూండి శాసనములందు 'నొడంబరాష్ట్రనృపతిం' అని యుండుటచే నీత డెవ్వడైనను నొడంబ రాష్ట్రము నేలిన రాజు కావలయును గాని కేవలము నొలంబుల సేనాధిపతిమాత్రము గాజాలడు. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 'వేంగీచాళుక్యు' లను దమ గ్రంథమున నీ మంగి పొలల్చొర నోలం బాధి రాజని నిర్ధారణగావించియున్నారు.

"ఇక నాతనికి సమకాలికుడైనవాడు పొలల్చొరనోలంబాధి రాజు. ఇతనికే మంగిరా జను నామాంతర ముండియుండవచ్చును. నోలంబులలో పూర్వుడైన యొక నోలంబాధిరాజునకు మంగళుడను నామాంతర ముండినట్లు వారి శాసనముల ననుసరించి తెలియు చున్నది. అట్లే పొలల్చొరనోలంబాధిరాజునకు కూడ మంగళుడను నామాంతరము కలదేమో? మంగి యనునది మంగళశబ్దముయొక్క హ్రస్వరూపమై యుండునేమో?...విజయాదిత్యుడు జయించిన మంగి రాజు నొడంబరాష్ట్రాధిపతియని శాసనములయందు జెప్పబడియుండుట చేతను, విజయాదిత్యునికి పొలల్చొరనోలంబాధిరాజు సమకాలికు డును, నోలంబరాష్ట్రాధిపతియు నగుటచేతను ఈ నోలంబాధిరాజునకే మంగిరా జను నామాంతర ముండియుండునని యూహింప నవ కాశము గల్గెను.[1]

1. వేంగీచాళుక్యులు. పుట 32_౮. గుణగవిజయాదిత్యునిచే వధింపబడిన మంగిరాజు నొడంబపల్లవుడు కాడనియు, నాంధ్రచోళవంశజు డనియు, నతని శాసనప్రతిబింబ మొక్కటి తనయొద్ద నున్నదనియు శ్రీ మల్లూరు వెంకట్రామయ్య పంతులుగా రొకప్పుడు చెప్పిరి. ఆ రాజుచరిత్రనుగూర్చి ప్రశ్నింపగా తరువాత నెచ్చటనో వ్రాయ నుద్యమించియుండుటచేత నతని విషయము నప్పుడు బయలు పఱచుటకు వీలుగా దనిరి. శ్రీ వెంకటరామయ్యపంతులుగారు చెప్పిన ట్లితడు తెనుగుచోళుడే కావచ్చును. కాని యతని శాసనము ప్రకటితమై యతడే గుణగు నిచే నిహతుడైన నొడంబరాష్ట్రాధిపతి మంగియని నిశ్చయముగువఱకును నిదమిత్థమని చెప్పుటకు వలనుపడదు.

గుణగవిజయాదిత్యునికి మంగిపై విజయము సులభముగ చేకూడినది కాదు. మంగి శూరుడగుటచే బూర్వచాళుక్యుల కడ్డపడి యతడు ఘోరాహవము గావించెను. పండరంగని తండ్రియైన కడియరాజు నిజప్రభువగు విజయాదిత్యునికి బాసటయై నిలిచి కయ్యము సేయుచు దనప్రాణములను రణరంగమున నర్పించెనని పోణంగి శాసనమునందున్నది[1]. కడియరాజు నిహతుడైనది, గుణగవిజయాదిత్యుడు మంగి మొదలగు వారితో నొనర్చిన యుద్ధమునందే యని శాసనపరిశోధక శాఖవారి యభిప్రాయము[2]. కాని, కడెయరాజు మృతినందినది గుణగవిజయాదిత్యుని ప్రథమరాజ్యవర్షమున బోయకొట్టముల తోడి యుద్ధమునకు బూర్వమని శ్రీ సోమశేఖరశర్మగారు చెప్పుచున్నారు.

"విజయాదిత్యుని పరిపాలన ప్రారంభకాలము నందలి బోయ యుద్ధములలోను, ఇతరశత్రువుల తిరుగుబాటులలోను అతనికి సహాయభూతుడైనవాడు కడెయరాజు అనునతడు. విజయాదిత్య మహీపతికి విశ్వాసపాత్రుడైన మిత్రవర్యుడై, పరమవిధేయుడైన భృత్యుడై, ఆలోచనలు జెప్పు మంత్రియై పేరుకెక్కినవాడు. తుట్ట తుద కీత డీ యుద్ధములలో విజయాదిత్యునికి బాసటగ నిలిచి తన శౌర్యపరాక్రమములం జూపి స్వామిహితమునకై జీవితసర్వస్వమును ధారవోసి రణరంగమున వీరశయనము నలంకరించెను......విజయాదిత్యుడు తన పరిపాలనమున ప్రథమసంవత్సరమున పాండరంగనికి బట్టముకట్టినట్లు శాసనదృష్టాంతమువలన దెలియవచ్చుచుండుటచేత కడెయరాజు మరణానంతరమే పాండరంగనికి సర్వసైన్యాధిపత్యము లభించెనని...యూహించుట సమంజసము[3]."

---

1. భారతి. సం. ౫. పుట. ౬౧౬.

   పరచక్రేణ యుధ్వాజౌ దత్తప్రాణస్య భూభృతే
   సూనుః కడెయరాజస్య పాండరంగో గుణాధికః ॥

2. అన్నువల్ రిపోర్ట్ ఆఫ్ ఎపిగ్రఫీ. ౧౯౧౪. పుట. ౧౦౭.

3. వేంగిచాళుక్యులు పుట 33.

కాని పై సిద్ధాంతమునకు వ్యతిరేకములగు నంశములు కొన్ని కలవు. గుణగవిజయాదిత్యుని ప్రథమరాజ్యవర్షమున నడచిన బోయ యుద్ధమునకు ముందే కడెయరాజు మడిసె ననికదా శర్మగారను చున్నారు. ఇంతకు పూర్వము గుణగవిజయాదిత్యు డెవ్వరితోడను యుద్ధము జేసినట్లు కానరాదు. అట్లని చెప్పుట కాధారము లేదు. ఇప్పటికి లభించిన శాసనాధారములనుబట్టి చూడ బోయకొట్టముల మీదియుద్ధమే యతని రాజ్యకాలమున నడచిన ప్రథమయుద్ధమని చెప్పవలసియున్నది. మఱియు పాండరంగని 'పడవ'కు, బట్టముగట్టి బోయకొట్టములపై నంపినంతమాత్రముననే యతని తండ్రి యంతకు ముందే మరణము జెందెనని యెంచవలసినయావశ్యకతయు గాన రాదు. బోయలపై బోవ సముకూర్పబడిన 'పడవ'కు నాయకుడుగ పట్ట బద్ధుని గావించెనని యున్నదేకాని సర్వసేనాధిపతి పదవికని లేదు. కావున కడెయరాజు మృతిజెందినది బోయకొట్టములపై నడచిన దండయాత్ర కావలనే యని తలచుట యుక్తము. శాసనపరిశోధన శాఖవారు జెప్పినట్లు మంగి మొదలగువారితో జేసిన సంగరమున గావచ్చును; కాదేని మఱియొక సందర్భమున గావచ్చును.

కడెయరాజు మంగిపైని దండయాత్రయందు పాల్గొనినను లేకుండినను మఱియొక బ్రాహ్మణయోధు డతని ప్రక్కను నిలిచి యుద్ధముజేయుచు గుణగవిజయాదిత్యునకు జయము జేకూర్చుటకు వలయునంత సాయ మొనర్చెను. ఇతని పేరు వినయడిశర్మ. ఇతడు యుద్ధభూమియందు గుణగవిజయాదిత్యునికి మంగిని జంపుట కను వైన యుపాయమును బోధించెను. దీనికి సంతసించి విజయాదిత్యు డాతనికి బండపట్టను గ్రామము నగ్రహారముగ నొసగెనట[1].

---

1. ఎపిగ్రాఫియా ఇండికా. సం. ౫. పుట ౧౨౫. వినయడిశర్మయాదేశముచే గుణగవిజయాదిత్యుడు మోసముజేసి మంగిని జంపెనని కొందఱు చరిత్రకారు లభి ప్రాయపడుచున్నారు. రాష్ట్రకూటచరిత్రకారుడగు డాక్టర్ ఎ. యస్. అల్టెకారు

ఇట్టి యభిప్రాయమునే వెలిబుచ్చి యున్నారు; 'విజయాదిత్యుడు నొలంబ సైన్యము నోడించి, వంచనచేసి తత్సైన్యాధిపుడగుమంగిని చంపిన ట్లున్నది' అని చెప్పి తమ యభిప్రాయము నిట్లు సమర్థించుకొనియున్నారు. "విజయాదిత్యుడొక విద్వాంసుడగు బ్రాహ్మణునకు, ముమ్మరముగ యుద్ధము నడచుచుండిన సమయమున నతడు దనకుజేసిన యుపదేశము చొప్పున దాను మంగిని జంపగలుగుటకు పారితోషికముగ చంద్రగ్రహణకాలమున దానముజేసినట్లు చెప్పియున్నది. పేరునుబట్టియు, జంద్రగ్రహణపుణ్యకాలమున జేయబడిన దానము బ్రతిగ్రహించుటచేతను, జోదుకాడని తెలియవచ్చెడి యొక బ్రాహ్మణుని యాదేశానుసరణమువలన విజయాదిత్యుడు మంగిని చంపగల్గుటచేత, నతని మరణము బహుధా యొక కుయుక్తిమూలమున సంప్రాప్తమై యుండునని చెప్పవలసియున్నది. (Rashtrakutas and Their Times, P. 94 N. 14). తలకాడుగాంగుల చరిత్రను వ్రాసిన శ్రీ యం. వి. కృష్ణారావుగారుగూడ డాక్టర్ అల్టెకారుగారి మార్గమునే యవలంబించి 'పరాక్రమశాలి యగు నొలంబసేనానిని మంగిని ద్రోహముచేసి చంపెను' అని వ్రాసిరి. (The Gangas of Talakad P. 84) కాని వీరి యభిప్రాయములకు శాసనమందెట్టి యాధారమును లేదు. వినయడిశర్మ యోధకాదని చెప్పినారు అల్టెకారు. ఇది యతని పేరు వల్లను, దానప్రతిగ్రహీత యగుట వల్లను తెల్లమగుచున్న దట! శర్మాంతనామధారియు, బ్రాహ్మణుడును నగుటచే అతడు యోధ కాకపోలేదు. ఆకాలమున బ్రాహ్మణు లనేకులు శస్త్రోపజీవులై రాజులకు గార్యమునకు ఖడ్గమునను దోడ్పడుచువచ్చిరి. వినయడిశర్మకు సమకాలికులగు కడెయరాజును, పండరంగడును బ్రాహ్మణులే, మొదటి చాళుక్యభీమునికి ఖడ్గసహాయము జేసిన రంగాధికక్కయను బ్రహ్మచారియును బ్రాహ్మణుడే. వలయునేని చాళుక్యులశాసనములనుండి యెన్నియేనియు నుదాహరణముల జూపవచ్చును. యోధుడైయుండిన ప్రతిగ్రహీత కాగూడదను నియామ మెచ్చటను లేదు. ఎందరో యోధులు దమ ప్రభువులకడనుండి దానములను గొనియున్నారు. వాణసవంశజుడును గల్యాణపుర చాళుక్యచక్రవర్తియగు సాహసమల్ల సోమేశ్వరుని దండనాయకుడును నగు కాళిదాససేనాని పేర బరమేశ్వరదత్తిగా బ్రాహ్మణుల కొఱ కొక యగ్రహారము నాతడు బడసెనని నాగవాయిశాసనములం దొకదానియందు చెప్పియున్నది. (నాగాయిశాసనములు, హైదరాబాదు ఆర్కియలాజికల్ సీరీస్. నెం ౮ రు, పుట ౨౨.) కావున శస్త్రోపజీవులై రాజసేవానిరతులైన బ్రాహ్మణులు దానములను గ్రహించుటయం దసంగతమేమియు లేదు. శాసనశ్లోకమునందు వినయడిశర్మయాదేశముచొప్పున రాజు ప్రవ

మంగిని వధించిన యనంతరము గుణగవిజయాదిత్యుడు గంగ వాడిని ప్రవేశించెను. గాంగులితని ధాటి కోర్చుకొనజాలక గంగ కూటశిఖరముపై తలదాచుకొనిరి.[1] కాని గుణగుడు వారిని వదల లేదు. దురారోహ మగు నాకొండ నెక్కి వారిని యుద్ధమున నోడించి జయము గొనెను. గంగుల కాశ్రయభూతమైన గంగకూట మెద్దియో కనుగొనవలసియున్నది. నొడంబరాష్ట్రమును దాటిన తరువాత గంగుల మీద గుణగవిజయాదిత్యుడు యుద్ధమొనర్చినట్లు చెప్పి యుండుటచేత నీ గంగకూటము గంగవాడియందలి దేయై యుండవల యును; కావున ప్రస్తుత మైసూరురాజ్యమందలి కొండలలో నొకటి ప్రాచీనకాలమున నీ పేర బ్రసిద్ధి నందియుండెనని మన మూహింప వచ్చును. బెంగుళూరుజిల్లా నెలమంగలతాలూకాయందలి పశ్చి మోత్తర భాగమున శివగంగ యను నొక కొండ కలదు; ఇది పుణ్య స్థానము: దక్షిణకాశియని దీని నామాంతరము. 'శివగంగేశాద్రి' యని మఱియొకపే రున్నట్లు శాసనములవల్ల దెలియవచ్చుచున్నది.[2] ఈ కొండకు ర౫౦౦ అడుగుల పొడవుగల సూచియైన శృంగమొకటి యున్నది. ఇదియే పూర్వచాళుక్యుల శాసనములలో బేర్కొన బడి యుండు గంగకూట మని తలంచెదను. ఈ స్థలనిర్ధారణ సరియైన దేని

---

త్రించి జయమును బొందెనని యున్నది కాని యా యాదేశ మూలమున వంచనగాని, ద్రోహముగాని చేసినట్లు లేదు. యుద్ధము సేయుచుండిన వినయడిశర్మ శత్రుమర్మము నెట్లో యెఱిగి రాజున కది తెలియజెప్పియుండవచ్చును; ఇందు వంచనకుగాని, ద్రోహమునకుగాని యెడము లేదు. కావున గుణగవిజయాదిత్యుడు వంచనచేసి మంగిని చంపి జయముగొనె ననుట యొప్పదగని విషయము.

1. 'గంగా నారోపయ ద్గంగకూటం' అను ప్రథమచాళుక్యభీముని యత్రిలి తామ్రశాసనము. (ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. సం ౧౧. పుట ౨౪౧.) ఒకా నొకచోట 'గంగకూటం' అనుదానికిబదులు 'తుంగకూటం' అని యున్నది. (జర్నల్ ఆఫ్ ది ఆంధ్రహిస్టారికల్ రిసర్చి సొసైటి. సం. ౧౧ పుట ౫౦ మొ.)

2. ఎపిగ్రాపియా కర్ణాటికా, సం. ౯. నెలమంగలం. ౫౪.

గుణగవిజయాదిత్యుని సైన్యములు దాదాపు తుముకూరుపరిసరముల వఱకు గూచిచేసెనని చెప్పవలసియున్నది.

# రాష్ట్రకూటులు

గుణగవిజయాదిత్యుని గంగవాడి దండయాత్రను వర్ణించుచు నతనికి, రాష్ట్రకూటులకు గల సంబంధమును కొంతవఱకు వివరించి యున్నాను. చెప్పినది మరల నిచట చెప్పవలసిన యావశ్యకత లేదు. వింగవల్లిపరాజయానంతరము గుణగుడు రాష్ట్రకూటులకు లొంగి యరికాపై యుండెనా, లేక నిజస్వాతంత్ర్యమును పునఃప్రతిష్ఠించు కొనగలిగెనా? అను విషయములు విచారింపదగినవి.

ఇటీవల ప్రకటితమైన గుణగవిజయాదిత్యుని సీసలి తామ్ర శాసన మీ యంశమును గొంత విశదము సేయుచున్నది. 'యస్యభుజ న్నృపతుఙ్గః, ప్రతిదిన మభ్యర్చ్య భవతి రిపునృపతుఙ్గః' అనువాక్య మొకటి కానవచ్చుచున్నది.[1] శాసనపరిష్కర్తలగు శ్రీ సోమశేఖర గారు "ప్రతిదినమును విజయాదిత్యుని భుజమును సమభ్యర్చనము చేసి నృపతుంగు డనునతడు రిపునృపతుంగుడు (విజయాదిత్యుని శత్రునృపతులలో సమున్నతుడు) అగుచున్నాడు" అని దీనికి అర్థ వివరణము గావించియున్నారు[2]. ఈ వివరణమువలన గుణగవిజయా దిత్యునికి నృపతుంగుడు శత్రువనియు, నతని కోడి నృపతుంగు డతని భుజమునకు సమభ్యర్చనము గావించి యతని శత్రువులలో సము న్నతు డాయె ననియు దేలుచున్నది. శర్మగారి వివరణము ననుస

1. భారతి సం. ౨3. పుట ౪౫౬.

2. భారతి సం. ౨3. పుట 3౭౫.

రించిన యెడల వింగవిల్లిరణము నడచిన తరువాత గుణగవిజయా దిత్యుడు నృపతుంగుని పరాభూతుని గావించి తన స్వాతంత్ర్యమును మరల నెలకొల్పుకొనెనని యెంచవలసియున్నది. కాని పై సీసలి శాసన వాక్యమునకు వేరొక విధముగ నర్థము జేసికొనవచ్చును: 'విజయాదిత్యుని భుజమును సమభ్యర్చనము జేసి నృపతుంగుడు రిపు నృపతుంగుడు - అనగా శత్రురాజులకు అతిశయు డగుచున్నాడు' అని యర్థము జెప్పినను తప్పు కాదు. ఈ విధముగ పై శాసన వాక్యము నర్థము చేసికొనిన, విజయాదిత్యుడు శర్మగారు చెప్పునట్లు శత్రువు కాక మిత్రుడగుచున్నాడు. అతడు నృపతుంగునిచే సమభ్యర్చితుడై యతని శత్రువులను నిర్జింపగా నతడు శత్రువుల కతిశయు డాయెనని చెప్పవలసివచ్చును. పరికించి చూడగా నిదియే శాసనగ్రంథకర్త యభిప్రాయ మని తోచుచున్నది. ఈ సందర్భమున అమ్మరాజ విజ యాదిత్యుని కలుచంబఱ్ఱు తామ్రశాసనమందలి 'గుణగవిజయాదిత్య పతి రంకకార స్సాహోద్వల్లభనృపసమభ్యర్చితభుజః'[1] అను వాక్య మును స్మరణకు దెచ్చుకొనవలయును. 'పతియైన గుణగవిజయా దిత్యుడు సాహోత్తు వల్లభ నృపతిచే సమభ్యర్చిత భుజుడైన యంక కాఱుడు' అని యీ వాక్యమున కర్థము. అంకకాఱుడన నెవ్వడో, వానిధర్మ మెట్టిదో తెలిసికొనినగాని పై బిరుదవాక్యముయొక్క భావము సంపూర్ణముగ మనకు బోధపడజాలదు. అంకకాఱ యను నది కన్నడపదము. ప్రధానసేవకుడు, ప్రముఖయోధు డని రెండర్థ ముల నీ మాటకు కిట్టెలు వ్రాసియున్నాడు. 'అంకకాఱ' తెనుగున అంకకా డగుచున్నది. తెనుగు నిఘంటుకర్తలును, పండితులును దీని కెవరికేది సమంజస మని తోచిన దాని కనుగుణముగ నర్థము వ్రాసి యున్నారు. ''అంకకాడు. దే. విశే. (అంకము+కాడు) చలముపట్టు

---

1. ఎపి. ఇండి. సం. ౭, పుటలు ౧౭౭ మొదలు; ఇండి. ఆంటి. సం. ౨౦. పుట ౨౭౧.

వాఁడు, చలపాది' అని సీతారామాచార్యులు. "మొనగాఁడు, ముఖ్యుఁడు, శూరుడు; చలపాది, మాత్సర్యశీలుఁడు, కళంకముగల వాఁడు" అని సూర్యారాయకారులు. 'అంకకాఁడు'నకు రూపాంతర మగు 'అంకంబువాఁడు' అను మాటకు శ్రీ వేటూరు ప్రభాకర శాస్త్రిలవారు 'ముద్రాధారి' అని యర్థము వ్రాసిరి[1]. 'అంకము' అనుమాటకు 'గుఱుతు' అని యర్థ ముండుటచేతను, 'ముద్ర'యు 'గుఱుతు'ను సమానార్థక పదము లగుటచేతను 'అంకంబు వాఁడు' అన 'ముద్రాధారి' యని యర్థము జెప్పవచ్చును. మఱియు పాల్కుర్కి సోమనాథుఁడు శివుని కొలువు నియోగములను లెక్కించుచు "అంకఁబువాఁడు నేణాధినాథుండు"[2] అని చెప్పియుండుటచేతను, 'అంక కాఁడు' డెబ్బదిరెండు నియోగములోనివాఁడే యగుటచేతను శాస్త్రుల వారు చెప్పిన యర్థమే సరియని తోఁచవచ్చును. కాని బసవపురాణ మునం దీమాటకు శాస్త్రిలవారు చెప్పిన యర్థము సరిపడదేమో యని సందేహము గలుగుచున్నది. ఏణాధినాథుని కథ ప్రకరణాంతర మున బసవపురాణమున గలదు. (పుట ౧౩౬). ఇతఁడు ఏలాపురమున రాజ్యముసేయుచు బరరాజులకు 'నక్కగొట్టు' అగుచు వారికడ గప్పము గొనుచు వచ్చెను. కాని శివభక్తుఁడు. 'భూతి రుద్రాక్షధార ణుల దన ప్రాణలింగభావన విశ్వసించు' వాఁడు; వారితో యుద్ధము సేయఁడు. ఇది యతని నియమము. ఈ మర్మము నెఱిఁగి పరరాజులు 'భూతరుద్రాక్షధారణు' నొక్క 'దళవాయి శాసనధారి గావించి' పంపగా నేణాధినాథుఁడు "తన తంత్రమును దాను జనుదెంచి తాకి, యనిసేయుభూతిరుద్రాక్ష ధారణుని గని 'శివశివ' యంచు గరవాలు వైచి, చనుదెంచి భువి జక్క జాగిలి మ్రొక్కె"నట. ఈ వర్ణన జూడగా నేణాధినాథుఁడు శూరుఁడైన రాజుగాని కేవల ముద్రాధారి

1. బస. పీఠిక. పుట ౧౧౭.

2. బస. ఆ. ౨. పుట ౪౬.

కాడని తోచుచున్నది; 'అంకకాడు'ను బాహత్తర నియోగముల లోనివాడే యగుటచేత నిచట 'అంకంబువాడు' అనగా 'శూరుడు' అని యర్థము చెప్పుకొనుట యుక్తము.

అంకకాడు యోధుడేయైనను, యోధులందఱును నంక కాండ్రు కాజాలరు. అంకము సేయువాడు అంకకాడు. అంకము యుద్ధమే యైనను యుద్ధము లన్నియు నంకము లనుటకు వలనుపడదు. 'అంకము' 'అంకకాడు' అనునవి పరిభాషా పదములు. ఇవి పరిభాషా పదము లని గుర్తింపకపోవుటచే మన నిఘంటుకర్తలును బండితులును వీనియర్థమును గ్రహింపలేకపోయిరి. 'అంకము' అన ద్వంద్వయుద్ధము. సర్వజ్ఞసోమేశ్వరుడు దన యభిలషితార్థచింతామణియం దీ యంక యుద్ధ స్వరూపమును విపులముగా వర్ణించియున్నాడు. అంకయుద్ధము రాజవినోదములలో నొక్కటి, ఒకడు సమానుడైన మఱియొక్క నితో తుల్యమైన యాయుధము జేకొని రంగస్థలమున నిలిచి చేయు యుద్ధము విజ్ఞులచే 'నంక' మనబడుచున్నది. అంకము లెనిమిది విధములైనవి.[1] అందొక్కొక్క దానియొక్క లక్షణములను, కారణములను, పేరులను వేఱేఱుగ వర్ణించుచున్నాను. (౧) పరి భూతాంకము :—శి కొట్టుట, మూర్ధహననము, దళబంధ నము, నోటియందలి తమ్మ నుమియుట, కేశచ్ఛేదనము మొదలగు వాని మూలమున గలిగిన యవమానమును బాపుకొనుటకై చేయు నంకము బరిభూతాంకమని జనసంసదులందు చెప్పబడుచున్నది. (౨) మత్సరాంకము :—ఒక వేశ్యానిమిత్తము కామక్రోధములకు లోనై యీర్ష్యచే జేయునట్టి యంకము మత్సరాంక మనబడుచున్నది. (౩) భూమ్యంకము :—గృహక్షేత్రాదులను హరించుటవల్లను, సీమా

1. "అఙ్కాశ్చ త్రివిధాః ప్రోక్తాః" అని ముద్రితపాఠము. ఈ శ్లోకమునకు దరువాత వరుసగ నెనిమిదివిధములైన యఙ్కములు వర్ణింపబడియుండుటచేత నిది యపపాఠమనుట తెల్లము. "అఙ్కాశ్చాష్టవిధాః ప్రోక్తాః" అని యుండవచ్చును.

వ్యాజమువల్లను, దేశలాభ నిమిత్తమునను గలుగు పోరాటము భూమ్యంకమనబడును. (౪) బిరుదంకము:—ఒకని నుద్దేశించి మఱియొక్కడు అందరిచేతను బిరుదములను పఠింపించినను, పాడించినను, కాహాలములను మ్రోయింపించినను, మదోద్ధతుడై మహిషముపై స్వారిచేసినను, పగలు దీపము ప్రదీపించినను, వీథులందు గడ్డిపరకలను విదిల్పించినను గలుగునంకము బిరుదంకమని చెప్పబడుచున్నది. (౫) విద్యాంకము:—యుద్ధవృత్తివలన జీవించువారు శస్త్రవిద్యాగర్వితులై సల్పు యుద్ధము విద్యాంక మనంబడుచున్నది. (౬) వైరాంకము:- పితాదుల మరణమువలన గలిగిన వైరమును దలచుకొని చేయు యుద్ధమునకు వైరాంకమని సోమభూపతి పేరిడుచున్నాడు. (౭) ద్రోహాంకము:-కృతాపరాధులను నిగ్రహించుటకు తాదృశులైనవారిచే రాజు చేయించు యుద్ధమునకు ద్రోహాంక మని పేరు. (౮) మోహామువలన పాపములను జేసి విరక్తుడై రాజు కడకు వచ్చి యఘనివృత్తి కొఱకు జేయు యుద్ధము ప్రాయశ్చిత్తాంకమని చెప్పబడుచున్నది[1].

రాజవినోదములలో నంకవినోద మొకటి యగుటచే రాజులు, మండలేశ్వరులు, సామంతులు మున్నగువారు పూర్వకాలమున దమ యాస్థానములయం దంకకాండ్రను నియమించువారు. ఎవ్వరి కొలువున వీ రంకయుద్ధము సేయ నియమింపబడియుండిరో వారి యంకకారుల మని సగర్వముగ వీరు చెప్పకొనెడివారు. 'విక్రమాదిత్యనంకకాఱు,' 'సత్తిగనంకకాఱు', 'ఆహవమల్లనంకకాఱు' మున్నగునవి దీని కుదాహరణములు.[2] రాజులకే కాక సేవలకును, దేవాలయములకును, దేశమునకుగూడ నంకకాండ్రుండువారు. 'సేనెయనంకకాఱు' 'మహాసేనెయ నంకకాఱు', 'భగవతియనంకకాఱు' 'శివనంకకాఱు' 'దేశి

1. అభి. చింతా. (గై. ఓరి. సీరీస్) పుట ౨-౫.

2. దక్షి. ఇం. శాసనములు. సం. ౯. భా. ౧ నెం. ౧౬౧; సం. ౬. నెం. ౧౦౨.

యంకకాఱ' మొదలగు బిరుదు లీవిషయమును దెల్లముసేయు చున్నవి.[1] తమ యాస్థానముల యందు స్థిరముగ నియోగింపబడిన యంకకాఱులను గాక రాజు లొక్కొక్కప్పుడు సమానులతోడనో, లేక వారి ప్రతినిధులతోడనో పోరాడుటకు గొప్పవారిని అంక కాండ్రుగ నియమించెడివారు. క్రీ. శ. ౧౦ వ శతాబ్దమున వెలసిన రాజశేఖరకవి తన బాలరామాయణ నాటకమున రామరావణుల పక్షమున వారి యంకకాఱు లొనర్చిన యుద్ధమును వర్ణించి యున్నాడు. విషయము ముఖ్య మగుటచే నించుక దీర్ఘమైనను నాటకభాగము నిం దుదాహరించుచున్నాను."

"అతః పరం వీరవిలాసో భవిష్యతి.

(తతః ప్రవిశతో రాక్షసౌ.)

ఏకః: సఖే దుర్ముఖ, కిమపి మహాన్ సత్త్వభ్రంశో రావణస్య; య త్కుమారసింహనాదవధ మప్యాకర్ణ్య న శోకః కృతో, నాప్యమర్షః. కేవల మేకం తులాద్యూతం[2] ప్రవర్తితం. తత్రచ లఙ్కాధిపత్యం, సీతాపహారితా న పునరర్పితా.

దుర్ముఖః:—ఆర్య సుముఖ, స్వామిన్యా త్రిజటయా సమాదిష్టం. యథా గచ్ఛతం అఙ్గద నరాన్తకయో రేకతులాం ప్రేక్షేథాం. యేన యష్మన్ముఖాత్ శ్రుత్వా, సీతాదేవ్యై నివేదయిష్యామి. తద్భావవప్యావాంచ గతా విత్యేతావ దహం జానామి నపునః కారణం. తత్ కథ్యతాం యథాప్రతిపన్నమ్.

సుముఖః:—పరం లఙ్కేశ్వరేణ శుకసారణౌ ప్రహితౌ దాశరథి మభిధాతు మభిహితం చ తాభ్యామ్.

వక్త్రామ్భోజార్చనాభిః ఫల మభిలషితం హేలయా యస్య లిప్సోః
సోత్కణ్ఠం కణ్ఠకాణ్డే ష్వహమహమికయా ఖడ్గధారాగ్రగేషు,
స్తోత్రైత్య క్తప్రణామ ప్రకుపితగిరిజాకృష్టవామార్ధపాణి
స్తోషోద న్తన్యహ స్త్రుఘుటితినఘటితా శాంభవీ తాలలీలా.

---

1. దక్షి. ఇం. శాసనములు. సం. ౭. నెం. ౩౬౮, ౩౭౮, ౩౬౫; సం. ౯. భా. ౧. నెం. ౩౭౭, ౨౧౫, ౧౧౦.

2. 'తులాద్యూత' మనగా సమానులు చేయు యుద్ధము అని యర్థము.

సనిశాచరచక్రవర్తీ త్వా మాహ, యదుత కి మఖిలవానరరాక్షసక్షయ కారణ సంయామేణ తదేకం తులాద్యూతం ప్రవర్తయావః. తత్రచ—

త్వత్కాఙ్కారవిజయే తవ రామ లఙ్కా
సీతాచ తే పున రియం భవతోఽస్తుదారాః
మత్కాఙ్కారవిజయే తు మమాధిపత్యం
తస్యాంచ తే పురి, కళత్రజనేచ తత్ర.
దుర్ముఖః—తత స్తతః ?

సుముఖః—తతశ్చ హాస లవలాంఛితాధరముద్రేణ రామభద్రేణాభిహితం— యదాహ ద్రుహిణప్రణప్తా, కింపున రావయో రఙ్కకారత్వ మూచితం యయో రన్తరఙ్గోఽభియోగః.

దుర్ముఖః—తత స్తతః ?

సుముఖః—తతశ్చ సౌమిత్రి సుగ్రీవ విభీషణ జామ్బవ దాంజనేయ ప్రభృతిభి ర్నిషిద్ధేనాపి తథేత్యభ్యుపగమ్యాఙ్కకారీకృతః కుమారోఽఙ్గదో రఘూద్వహేన; నిజపుత్రో నరాన్తకస్తు లఙ్కేశ్వరేణ."

పై జూపిన యుదాహరణములవలన - అంకకాడన కేవలము శూరుడు గాడనియు, నంకయుద్ధము సేయు యోధుడే యంకకాడనియు, నంకయుద్ధము దంద్వయుద్ధ విశేషమనియు, నంకవినోదము రాజవినోదములలో నొకటి యగుటచే రాజులు తమ యాస్థానమున నంకకాండ్రను స్థిరముగ నుంచుకొనెడివా రనియు, నొక్కొక్కప్పుడు సమానులైన రాజులతోగాని, వారి ప్రతినిధులతోగాని పోరవలసి నపుడు దనకు బదులు యుద్ధముసేయుటకు దమ కాశ్రయులైన రాజులనో, రాజకుమారులనో తాత్కాలికముగ నంకకాండ్రుగ నియమించువా రనియు దేలుచున్నది. మఱియు నంకయుద్ధమున జయమందిన యంకకాండ్రను రాజులు సత్కరించి గౌరవించెడివారు.

"ప్రతిజ్ఞాపాలకానాంతు జయం దద్యా న్నృపః స్వయం
ప్రసాదదానకం భూరి వస్త్రకాఞ్చనభూషణమ్.
గ్రామా నశ్వాం స్తథా నిష్కా న్వృత్తిం దత్వాతు జీవితమ్

మృతానాం బన్ధురక్షార్థం పరలోకక్రియాకృతే
కృపాదానం ప్రదాతవ్యం కాఞ్చనం భూరిభూభుజా."1

అంకయుద్ధమును గూర్చియు, అంకకాంద్రను గూర్చియు చెప్ప వలసిన విషయము చాల కలదు. కాని యది ప్రస్తుత మనావశ్యమగు టచే నంకకాఱ శబ్దవిచారమును చాలింతము. గుణగవిజయా దిత్యుడు సాక్షాత్తు వల్లభనృపసమభ్యర్చితభుజుడైన యంకకాఱు డగుటచే వల్లభనృపుని కత డాశ్రయుడైన రాజేకాని యాతనిపై విజయమందిన శత్రువు కాజాలడు. మఱి యతడు గుణగవిజయా దిత్యుని భుజము నేల సమభ్యర్చించెననగా, గుణగు డతని యాదే శముచొప్పున నతని శత్రువులను నిర్జించినందుకు సంతసించి గౌర వించుటకొఱకే. ఈ సందర్భమున 'గంగా నంగజవైరి శక్తి రస మాఙ్ రట్టేశసంచోదితో జిత్వా...'యను నమ్మరాజవిష్ణువర్ధనుని ఈడేరుశాసన శ్లోకమును స్మరణకు దెచ్చుకొనవలయును.2 కావున సీసలితామ్రశాసనమువలన నతడు నృపతుంగు నోడించె నని చెప్పు టకు వీలు లేదు; శాసన శ్లోకము గుణగుడు నృపతుంగుని కాశ్రితు డనియే తెలుపుచున్నది. ఇంతవఱకు లభ్యమైన శాసనసాక్ష్యమును బట్టి చూడగా నృపతుంగుని మరణకాలమువఱకును గుణగవిజయా దిత్యుడు రాష్ట్రకూటుల కరిగాపై యుండెననియే తోచుచున్నది.

నృపతుంగుని రాజ్యము క్రీ. శ. ౮౭౮ తో సమాప్తినందినది. తరువాత నతని కుమారు డగు నిమ్మడి కృష్ణవల్లభుడు రట్టసామ్రాజ్య మున కభిషిక్తు డాయెను. ఇతని యాధిపత్యమును గుణగవిజయా దిత్యు డంగీకరింప లేదు. ఇమ్మడి కృష్ణవల్లభుడు పూర్వచాళుక్యులపై దన యధికారమును నెలకొల్పగడగెను. అంతట పూర్వచాళుక్య రాష్ట్రకూటయుద్ధము మరల ప్రారంభమైనది. ఈ యుద్ధము పెక్కు

1. అభి. చిం. (గై. ఓరి. సిరీస్) పుట ౨౨౯.

2 దక్షి. ఇం. శాసనములు. సం. ౧. పుట ౩౬.

పూర్వచాళుక్య శాసనములయందు వర్ణింపబడియున్నది. వీనియందు గుణగవిజయాదిత్యుడే స్వయముగ రాష్ట్రకూటకృష్ణుని యనుచర సహితముగ నోడించినట్లు వ్రాసియున్నను, వాస్తవముగ రట్టరాజ్యముపై దండయాత్రను సూత్రధారుని వలె నడపించినవా డతని బ్రాహ్మణసేనాపతి పండరంగడు. మొదటి చాళుక్యభీముని నాటి ధర్మవర శిలాశాసనమునను, అమ్మరాజ విజయాదిత్యుని మలియంపూండి శాసనమునందును నీ విషయము స్పష్టము సేయబడియున్నది.

ఈ యుద్ధమునకు సంబంధించిన యంశములు కొన్ని పూర్వచాళుక్యశాసనములందు వర్ణింపబడియున్నవి. ఇవన్నియు నేకఘాటికి జెందినవో, లేక రెండుమూడు ప్రత్యేకయుద్ధయాత్రలందు నడచినవో నిశ్చయించిచెప్పుటకు వీలుకాదు. ఈ యుద్ధమును వర్ణించెడి శాసనము లన్నిటియందును ప్రథమచాళుక్య భీముని కాలపు ధర్మవర శిలాశాసనము ప్రాచీనతమము. ఇది గుణగవిజయాదిత్యుని మరణానంతర మిరువదేండ్ల లోపల వేయించినది. ఇందు—

> "లోహాసనం బెక్కి రాహను నొడిచిన వల్లభు కొల్పున నెల్ల నెఱుంగ
> కన్నరాభూపతి వెన్నాజిలోం జూపె సంకిలాణ్ణను తేని బింక ముడిపె
> దణ్ణుపై వచ్చిన బెణ్ణెన చోళనిం జేకొని కాచె భూ లోకం బెఱుంగ
> కిరనపురము డహాలనిరుతంబు దటెనాండు నచలపురము సొచ్చె నచలితుణ్ణు
> వల్లభుణ్ణు గుణకెనల్లుణ్ణు వన్నినం బణ్ణరంగ చూరె పణ్ణరంగు"[1].

అని యుద్ధమునందు నడచిన యంశములు వర్ణింపబడినవి. మొదటి రెండుపంక్తులును గడపటి, గీతపాదములును గన్నరభూపతి తోడి యుద్ధమునకు జెందినవి. వీనిమధ్యనుండు నీసతృతీయపాదము చోళసంరక్షణను దెల్పుచున్నది. ఈ చోళు డెవ్వడో, వానిపై నెత్తి వచ్చిన శత్రు వెవ్వడో తెలియదు. కాని యాచోళుడు దాక్షిణాత్య ద్రమిళచోళు డనుటకంటె బశ్చిమాంధ్రమున నా కాలమున రాజ్యము

1. భారతి. సం. ౫. పుటలు. ౬౯౯-౬౭౦.

సేయుచుండిన కరికాలాన్వయులగు దెలుగుచోళులలో నొక్కడై యుండునని తలంచుట సమంజసము. అట్లైన నితనిపై నెత్తివచ్చిన శత్రువు కన్నరుడే యైనను గావచ్చును. రాష్ట్రకూటులు దక్షిణ కర్ణాట, పశ్చిమాంధ్రములపై దమ యాధిపత్యమును స్థాపించుటకై యచటి రాజులతో నిరంతరము బోరుచుండిరి. కాని యిది యిట్లని నిశ్చయించి చెప్పదగు సాధనములు లేవు. చోడునికి గన్నరునితో నెట్టి సంబంధము లేకపోయినను బోవచ్చును. దీని సత్యాసత్యము లెట్లున్నను శాసనగ్రంథమున శాసనగ్రంథకర్త యుద్ధాంశములను వర్ణించిన విధమును జూడగా, గుణగవిజయాదిత్యుడు కన్నరునితో రెండుపర్యాయములు పోరాడియుండవలయునని తోచుచున్నది.

కన్నరునితో మొదటియుద్ధము :— ఈయుద్ధ మెచ్చట నడచెనో చెప్పుటకు వీలులేదు. ఒకవేళ నిది యాంధ్రదేశమున నడచియుండిన నుండవచ్చును. అమోఘవర్షుడు దివంగతుడైనపిమ్మట నిజస్వాతంత్ర్యమును బ్రకటించిన గుణగవిజయాదిత్యుని మరల రాష్ట్రకూటుల యధికారముక్రిందికి దెచ్చు నుద్దేశముతో నిమ్మడి కృష్ణవల్లభుడు పూర్వచాళుక్య రాష్ట్రముపై నెత్తివచ్చిన దండయాత్ర ఇది యని యూహించుచున్నాను. ఇతనికి బాసటయై సంకిలు డను బింకముగల శూరుడు నిజసైన్యముతో నడచెను. కాని వీరిరువురును యుద్ధమున నోడి పాటిపోయిరి. ఇచట పరామర్శింపవలసిన యంశములు రెండు కలవు.

(౧) పై నుదాహృతమైన ధర్మవరశాసనపద్యమున మొదటి పంక్తియందు 'లోహాసనం బెక్కి రాహాను నోడిచినవల్లభు కొల్పున' పండరంగడు యుద్ధమునకు వెడలినట్లు చెప్పియున్నది. రాహానుని గుర్తించుటకు సాధ్యముగాదని యింతకుపూర్వము చెప్పియున్నాను. అత డెవ్వడైనను నతని నోడిచిన వల్లభుడు గుణకెనల్లుడు, అనగా గుణగవిజయాదిత్యుడని నిస్సంశయముగ జెప్పవచ్చును. ఇట్లనుటకు

గారణములు రెండు: పండరంగడు కొలిచిన ప్రభువు గుణగవిజయా దిత్యుఁ డగుట యొకటి; 'వల్లభుణ్ణుగుణకెనల్లుండు వన్ని'న యను శాసనవాక్యము రెండవది. కావున పండరంగని కన్నర సంకిలుల పైకి యుద్ధమున కంపిన వల్లభుఁడు గుణగవిజయాదిత్యుఁ డగుట నిశ్చయము. 'వల్లభ' బిరుదము తొలుదొల్త ప్రాచీన బాదామిచాళుక్య రాజులది. వారినుండి యది రాష్ట్రకూటులకు సంక్రమించెను. రాష్ట్రకూటులు వల్లభులని ప్రఖ్యాతినందిరి. కాని ధర్మవరశాసనమందలి యీ బిరుదు రాష్ట్రకూటుల కన్వయింపదు; గుణగవిజయాదిత్యునికే చెల్లునని పైని నిరూపించియున్నాను. గుణగవిజయాదిత్యునికి పూర్వికులైన వేంగిచాళుక్యరాజులకుగాని, యతని తరువాత రాజ్యభారము వహించిన యతని వంశజులకుగాని యీ బిరు దుండినట్లు కానరాదు. రాష్ట్రకూటులను జయించిన పిమ్మట వారినుండియే యత డీ బిరుదును గ్రహించియుండవలయును.

(౨) ఇందు పేర్కొనబడిన కన్నరుడు రాష్ట్రకూట ఇమ్మడి కృష్ణవల్లభు డని ఇంతకుముందు చెప్పియున్నాను. సంకిలాండను నతడు డాహళాధీశ్వరుడని ఈ స్తేరు, మలియంపూడి తామ్రశాసనములవల్ల దెలియుచున్నది.[1] ప్రస్తుత బుందేలుఖండమునకు పూర్వము, హిందూరాజుల యేలుబడియందు, డహళము, చేదిమండల మను పేర్లు చెల్లుచుండెను. హైహయవంశజులైన రాజు లిచట రాజ్యము సేయుచుండిరి. వీరికిని రాష్ట్రకూటరాజులకును సన్నిహితబాంధవ్యముండినట్లు శాసనములవల్ల దెలియుచున్నది. రాష్ట్రకూట నాల్మడి గోవిందరాజుయొక్క శాంగ్లి తామ్రశాసనమునం దీబాంధవ్యమిట్లు వర్ణింపబడియున్నది[2].

---

1. ఎపి. ఇండి. సం. ౯. పుట ४४; Cp. No. 6 of 1938-39 (అప్రకటితము).

2. ఇండి. ఆంటి. సం. ౧౨. పుట ౨౫౦.

"తస్మా దకాలవర్షో నృపతి రభూ ద్యత్పరాక్రమ త్రస్తైః
సద్యః సమణ్డలాగ్రం ఖేటకమహితైః పరిత్యక్తం.
సహస్రార్జున వంశస్యభూషణం కొక్కలాత్మజా
తస్యా భవ న్మహాదేవీ జగత్తుంగః తతోజని."

"గంభీరాద్రత్నని ధే రభూద్భూభృత్ప్రతిపక్షరక్షణ
కొక్కలసుతరణవిగ్రహజలధే ర్లక్ష్మీ సముత్పన్నా."

ఈ శ్లోకములవల్ల సహస్రార్జునుని వంశజుడగు కొక్కల్లునికి కుమార్తె యకాలవర్షుని (కృష్ణుని) భార్య యాయెననియు, నీ కొక్కలునికి రణవిగ్రహు డను కొడుకుండెననియు తెలియుచున్నది. మఱియు నిమ్మడి కర్కరాజు కర్డాతామ్రపట్టిక లీరణవిగ్రహునికి సంకుకశంకరగణ యను నామాంతరము లుండినట్లు తెల్పుచున్నవి.[1]

"చేదీశో దశకణ్ఠదర్పదళనః శ్రీ హైహయానాం కులే
కొక్కల్ల స్సమభూ చ్చ తస్య తనయా యా శఙ్కుకస్యానుజా,
తస్యాం కృష్ణనృపాత్తతః శ్రుతమహాదేవీ పదాయా మభూత్
తైస్తై ర్యః ప్రథితో గుణైర్భువి జగత్తుంగాభిధానః సుతః."

ఈ శఙ్కుకుడే పండరంగనితో యుద్ధమున నోడిపోయిన డాహళాధీశ్వరుడైన సంకిలుడని చరిత్రకారుల యభిప్రాయము.

కన్నరునితో రెండవ యుద్ధము, డహాళవిజయయాత్ర:—ఇది కన్నరునితో విజయాదిత్యుడు చేసిన మొదటి యుద్ధమునకు దరువాయి. నేనూహించినట్లు మొదటి యుద్ధము కన్నరుడు పూర్వ చాళుక్యరాజ్యముపై నెత్తివచ్చినప్పు డాంధ్రదేశముననే నడచి యుండినచో దాని కిది జవాబు. ఇదివఱకు పరిశోధకులుగాని, చరిత్ర కారులుగాని గమనింపక విడిచిన యంశము నొకదాని నిచట నొక్కి చెప్పవలసియున్నది. ఈ రెండవ యుద్ధము నడచిన రంగ మాంధ్ర దేశముగాదు, రాష్ట్రకూటసామ్రాజ్యమును గాదు; హైహయరాజుల

1. ఇండి. ఆంటి. సం. ౧౨ పు. ౨౬౫.

కులక్రమాగతమైన దహాళరాజ్యము. సంకిలిలునితో గూడ కృష్ణ వల్లభుని గుణగవిజయాదిత్యుఁడచటనే యోడించెను. దీనికి వాస్తవమైన కారణమేమో తెలియదు; కాని యది రెండువిధములుగ నుండి యుండవచ్చును; విజయాదిత్యునిచే నిర్జితుడై నిజరాజ్యమున తల దాచుకొనుటకు తావులేకపోగా, కృష్ణవల్లభుడు తన మిత్రుడును, మరదియు నైన సంకిలునియండ జేరియుండవచ్చును; గుణగుడు పరారియైన కృష్ణుని వెన్నంటి తఱుముచుపోయి డహాళదేశమును జొచ్చి దాని జయించియుండవచ్చును. అథవా, సంకిలుడు గృష్ణ వల్లభునికి సహాయమొనర్చినందులకు గినిసి, విజయాదిత్యుడు డహాళముపై నెత్తిపోగా గృష్ణవల్లభుడు సంకిలునికి సహాయముచేయుటకు డహాళమునకు పోయి యచ్చట నతడు పూర్వచాళుక్యసైన్యముల నెదిర్చి యుండవచ్చును. కారణ మేదియైనను గుణగవిజయాదిత్యుడు డహాళముపై నెత్తిపోయి, సంకిల కృష్ణవల్లభుల నోడించి యా దేశమును జయించినది సత్యము. మఱియు గుణగవిజయాదిత్యుడు కళింగ గాంగులను, హైహయులకు సామంతులైన కోసలులను, రాష్ట్రకూటుల సామంతులైన లేములవాడచాళుక్యులను జయించినట్లు పూర్వచాళుక్యశాసనములవలన దెలియవచ్చుచున్నది. ఈ విజయము లన్నియు డాహాళదండయాత్రయందే చేకూడినవని తలంచుచున్నాను.

కళింగగాంగులు:—ప్రాచీన కాలమునుండియు త్రికళింగము లలో రెండు, మధ్యదక్షిణ కళింగములు పూర్వచాళుక్యుల ప్రభుత్వముక్రింద నుండినవి. కావున గుణగవిజయాదిత్యునిచే నిర్జితులై యతనికి ఏనుగులను వెండిని సమర్పించుకొన్నవా రుత్తర కళింగులై యుండవలయును.[1] పూర్వగాంగ శాసనములనుబట్టి చూడగా నా

1. కొక్కలివర్మ మహారాజు బొడ్డేరిశాసనములో (ARE Cp. 13 of 1908-9. చూ. Cp. 10 and 11 of 1908-9) విశాఖపట్టణమండలములోని భీమునిపట్టణము తాలూకాకు చెందిన భోగపురము మధ్య కళింగాంతర్గతమైనట్లు చెప్పియున్నది. క్రీ.శ. ౧౦ వ శతాబ్దమునాటి చోళశాసనములలో ప్రాతగంజాము మండలములోని

కాలమున చీడివలసదానశాసనము నొసగిన దేవేంద్రవర్మ తండ్రి యగు భూపేంద్రవర్మ యుత్తరకళింగము నేలుచుండినట్లు తోచుచున్నది.[1] తమరాజ్యమును గాపాడుకొనుటకు పూర్వగాంగులు లే ప్రయత్నములు గావించిరో తెలియదు; కాని యుద్ధమున నిర్జితులై పై జెప్పినట్లు వీరు సంధిగావించుకొనవలసి వచ్చెను.

కళింగవిజయము డాహళదండయాత్రకు ప్రస్తావనవంటిది. వేంగినుండి కనుమయవ్వలి దేశములపై దండయాత్ర నడుపగోరు విజిగీషువులకు కళింగమును మొదట జయించుట యావశ్యకము. తీర

---

మహేంద్రగిరిపర్వతము కళింగదేశమునకు ఉత్తరపుసరిహద్దనియు, నటుపై నుండు దేశము ఒడ్డదేశ మనియు జెప్పియున్నది. (దక్షిణ. ఇం. శాసనములు. సం. ౩. ఎపి. ఇండి. సం. ౨౧, పుట ౨౩౨) ప్రథమ కులోత్తుంగ చక్రవర్తికాలమున విరచింపబడిన కళింగత్తుప్పరణియందు ఉత్తర కళింగాధిపతి యతనికి గప్పము కట్టకపోగా యతని నణచుటకు కులోత్తుంగ చక్రవర్తి దండయాత్రనంపినట్లును, నతని సేనాధిపతి యా యుత్తరకళింగాధిపతిని జయించి మహేంద్రగిరి శిఖరముపై జయస్తంభము నిలిపినట్లును వ్రాసియున్నది. ప్రొఫెసరు నీలకంఠ శాస్త్రి, చోళులు, సం. ౨. పుట. ౩౬) ఈ విజయమును బ్రకటించు శాసనములు నేటికిని మహేంద్రగిరిపై నున్నవి. భీమునిపట్టణప్రాంతదేశము మధ్యకళింగమైన, దానికి ఉత్తరమున మహేంద్రగిరిపర్యంతము వ్యాప్తమైన దేశము ఉత్తరకళింగమై యుండవలయును. మఱియు గోదావరి తూర్పుగట్టుననుండి భీమునిపట్టణమువఱకును గల దేశము దక్షిణకళింగ మనుట తెల్లము. సాతలూరు తామ్రశాసనమున (భారతి సం ౧. సంచిక ౧. ౧౦౪) గుణగవిజయాదిత్యుడు 'సదక్షిణాపథ సత్రికలింగదేశ మన్వపాలయ' త్తని చెప్పియుండుటచేత నతడుత్తర కళింగమునుగూడ జయించి స్వాధీనపఱచుకొనెనని మనము నిశ్చయించి చెప్పవచ్చును.

1. ఆం. హి. రి. సొ. పత్రిక. సం. ౨. పుటలు ౧౪౬-౧౬౪. ఇది తూర్పు గాంగశకము క్రీ. శ. ౪౯౬ వ సంవత్సరమున ప్రారంభమాయెనన్న యభిప్రాయము ననుసరించి చెప్పినమాట. (చూ. ఇండి. ఆం. సం. ౫౧. పుట ౨౩౭ మొదలు). కాని, శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు గాంగ శకము క్రీ. శ. ౫౦౫-౬ న ప్రారంభమాయెనని చెప్పుచున్నారు. (ఇండి. కల్చ. సం.) పై రెండభిప్రాయములలో నేది సత్యమైనను, నామాటలను మరల్చుకొన నవసరములేదు.

ప్రాంతమునుండి దేశాంతర్భాగమునకు పోవు మార్గములు కళింగములోని కనుమలగుండ పోవుచుండుటచేత, క్రీ. శ. ౧౦ వ శతాబ్దము నాటి చోళచక్రవర్తులవలె, గుణగవిజయాదిత్యుడును ప్రప్రథమమున కళింగమును స్వాధీనపఱచుకొనవలసిన వాడాయెను.

బద్దెగడు:—దానార్ణవుని కన్డయము తామ్రశాసనమునను, మొదటి శక్తివర్మయొక్క పెన్నేరు,పభుపట్టు,ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలయందును గుణగవిజయాదిత్యుడు బద్దెగుడను నొక శత్రువునకభయ మిచ్చినట్లు చెప్పియున్నది[1]. ఈ బద్దెగడు గుణగవిజయాదిత్యునివలెనే చాళుక్య వంశజుడు; కాని శాఖాంతరమునకు జెందినవాడు. అతడు రాష్ట్రకూట సామంతుడు; వారి సామ్రాజ్యమునకు మూలస్తంభము వంటివాడు. అతనికి వృత్తిగా వారిచ్చిన దేశము గుణగవిజయాదిత్యుని కెడమపార్శ్వమున తెలింగాణమున గోదావరికి దక్షిణతీరమున నుండినది. గవర్నమెంటు శాసనశాఖవారు చెప్పిన ట్లాతడు కన్నడ మహాకవియగు పంపని కాశ్రయ భూతుడైన యిమ్మడి యరికేసరి నరపాలుని పూర్వులలో నొక్కడు[2]. ఈ శాఖకు మూలపురుషుడైన మొదటి యుద్ధమల్లుడు మాన్ఖేడు రాష్ట్రకూట సామ్రాజ్యస్థాపకుడగు దంతిదుర్గునికి సమకాలికుడు. దంతిదుర్గు డుత్తర దిగ్విజయమునకు వెడలినపుడు యుద్ధమల్లు డతని వెంటబోయి, రాజపుత్రస్థానమందలి సపాదలక్ష దేశము నతని పక్షమున గొంతకాలము పాలించెను. దంతిదుర్గుని మరణానంతరము రాష్ట్రకూట సామ్రాజ్యమున గలిగిన కళవళమువలన ఉత్తరదేశమందు వారి యధికారము క్షీణించెను. అప్పుడు యుద్ధమల్లుడు సపాదలక్షనుండివచ్చి యిప్పటి

1. ఆం. హిం. రి. సొ. పత్రిక. సం. ౧౧. పుట. ౨౦ తరువాయి; మద్రా. గవ. ఓరి. మ్యా. లైబ్రరీ ౧౫-౬-౨౬, సం. ౧. పుటలు ౩౪౭-౫౦; ఆం. పరి. పత్రి. సం. ౩-పుట ౪౦౮; C. P. No. 15 of 1917—18.

2. ARE 1918 Part II, Para 5.

హైదరాబాదు రాజ్యములోని నిజామాబాదు జిల్లాను చెందిన బోధనపురప్రాంతమున నొక చిన్నరాజ్యమును స్థాపించెను. తరువాత నితని వంశజులు కరీంనగరమండలములోని లేంబులవాటిక, లేక లేములవాడ (యిప్పటి వేములవాడ) యను స్థలమునకు దమ రాజధానిని మార్చుకొనిరి. ఈ కారణముచేత నీ వంశము వారికి వేములవాడచాళుక్యు లని చరిత్రకారులు నామకరణము జేసియున్నారు.

బద్దెగని ప్రతాపమును పంపమహాకవి తన విక్రమార్జున విజయ పీఠికయందు వర్ణించి యున్నాడు. అం దతడు వర్ణించిన యంశము లన్నియు గుణగవిజయాదిత్యుని కాలమునకు బిమ్మట నడచినవి. పంపని పీఠికయందుగాని, లేములవాడ చాళుక్యశాసనములలోని ప్రశస్తులందుగాని బద్దెగని పరాభవమును గూర్చి యొక్క మాటయేనియు గానరాదు. పంపాది గ్రంథకర్తల యొక్కయు, లేములవాడ ప్రశస్తికర్తల యొక్కయు మౌనమువలన పూర్వచాళుక్య శాసనముల యాథార్థ్యము సంశయగ్రస్త మని యెంచరాదు. ఏలన, వారిమౌనమునకు గారణము దమ కాశ్రయమైన రాజవంశముయొక్క పరాభవము దలపెట్ట నిష్టము లేకపోవుటయే.

బద్దెగనికి గుణగవిజయాదిత్యుని సైన్యములతో నెచ్చట ఘర్షణ గలిగెనో తెలిదు. మల్లప్పదేవుని పిఠాపురశిలాశాసనమున గుణగవిజయాదిత్యుడు చక్రకూట దుర్గమును దగులబెట్టినట్లు చెప్పియున్నది.[1] మధ్యహిందూ యుగమున దక్షిణాపథమున బలవత్తమ మని ప్రఖ్యాతినందిన దుర్గములలోనిది యొక్కటి. రణదృష్టి జూచిన నా పరిసర దేశముల కిది యాయస్థానమువంటిది. పూర్వోత్తర దక్షిణాపథ భూముల యుద్ధయాత్రలుసేయు దండనాథు లందఱును చక్రకూటమును సాధించుట ప్రధాన కార్యముగ గణించువారు. ఈ చక్రకూటము బద్దెగని రాష్ట్రమున కతిసమీపమున గోదావరి

1. ఎపి. ఇండి. సం. ౪, పుటలు ౨౩౩ - ౪.

కవ్వాలి తీరమున నుండియుండుట వలన ప్రాయశః అది యతని యధికారముక్రిందనే యుండి యుండవచ్చును. ఈ యూహ సరియేని బద్దెగనికి విజయాదిత్యునితో కలహ మిచటనే నడిచి యుండనలయును. ఇదియెట్లున్నను బద్దెగడు విజయాదిత్యుని కోడి సంధిగావించుకొనెను.

కోసలులు:—చక్రకూట దహనమైన తరువాత కోసలులతో యుద్ధము. అప్పటి కోసలచరిత్రను గూర్చి విశేష మేమియు లేదు. గుణగవిజయాదిత్యుని సైన్యముల నెదిరించిన కోసలాధిపు డెవ్వడో చెప్పుటకు వీలు లేదు. కోసలాధిపతుల మని చెప్పుకొనిన సోమవంశ రాజు లప్పటికింక నభ్యుదయ మందలేదు. రాయపుర ప్రాంతములను పాలించుచుండిన శ్రీపుర పాండువంశ నరపాలుర యధికార మప్పటికి సమాప్తి నందిన ట్లున్నది. ఒకవేళ గుణగవిజయాదిత్యుని ప్రతిపక్షి శ్రీ పురాధిపుల యధికారము గూలద్రోసి కొంత కాలము కోసలమును పాలించిన శరభపుర రాజ వంశమునకు జెందియుండవచ్చును. హైహాయవంశజు డగు ముగ్ధతుంగ ప్రసిద్ధధవళ శంకరగణుడు, అనగా రాష్ట్రకూట యిమ్మడి కృష్ణవల్లభుని మరదియు, మిత్రుడునునైన సంకిలుడు కోసలేంద్రు నొకని జయించి, యతని కడనుండి 'పురి' యను స్థలమును గైకొనినట్లు తెలియవచ్చుచున్నది.[1] గుణగ విజయాదిత్యునిచే నోడి సంధిచేసికొనినవా డితడైనను కావచ్చును. కోసల పాలకు డెవ్వడైనను, పండరంగని ప్రతాపమున కోర్చుకొనజాలక యేనుగులను సమర్పించుకొని డాహళమార్గమున పూర్వచాళుక్య సైన్యమును నిరాటంకముగ సాగిపోనీయవలసి వచ్చెను.

పూర్వచాళుక్య సైన్య మన్నిదేశములను గడచి తుదకు డాహళమును బ్రవేశించెను. సంకిలుడు చాళుక్యుల దాడినుండి దన రాజ్యమును సంరక్షించుట కెట్టి కట్టుదిట్టములను గావించెనో తెలి

1. హేమచంద్రరాయ్, డినాస్టిక్ హిస్టరీ, సం. ౨. పుటలు ౭౫౭-౫౮; ఎపి. ఇండి. సం ౧. పుట ౨౫౬.

యదు. యుద్ధమున నడచిన సంగతుల వివర మేమియు దెలియరాక పోయినను, చాళుక్యసైన్యములు నడచిన మార్గమును స్థూలముగ నిర్ణయింపవచ్చును. ధర్మవరశాసనప్రకారము పండరంగడు కిరణపురము, డహాళము, నిరుతము, దజె(ళై)నాడు, అచలపురము మున్నగు స్థలములను, దేశములను ప్రవేశించెను[1]. ఇందు పేర్కొనబడిన కిరణపురము మధ్యపరగణాలలోని బాలెఘాటుజిల్లాయందలి యిప్పటి 'కిరణ్‌పూర్' పట్టణమే యని డాక్టరు ఎ. ఎస్. ఆల్టేకరుగారు చక్కగా గుర్తుపట్టినారు.[2] ఇదియే సంకిలుని రాజధాని యని వీరి యభిప్రాయము. పండరంగడు కిరణపురమును ముట్టడించినపుడు సంకిల కృష్ణవల్లభు లిరువురు నచటనే యుండిరి. కాని, వారు శత్రుల నెదిరించుట కెట్టి ప్రయత్నమును గావించినట్లు కానరాదు. అడ్డమాక లేక పైకొనివచ్చు చాళుక్యసైన్యముల యాటోపమును గాంచి భయవిహ్వాలులై పట్టణమును విడిచి పాఱిపోయిరి[3]. రాజు త్యజించిపోయిన రాజధానిని రక్షించువా రెవ్వరు? సులభముగ నది చాళుక్యులకు హస్తగత మాయెను. శత్రువుల గుండెల దిగులుకొల్పుటకు పండరంగడు కిరణపురమును దగ్ధము గావించెను. కిరణపురదహనము వెనుక డాహాళనిరుతంబులును, దజెనాడును సత్వరముగ జయింపబడినవి. డాహాళము పై జెప్పినట్లు చేదిరాజుల కాటపట్టు; తక్కిన రెండు

---

1. భారతి. సం. ౫, భా. ౧. పుట ౬౨౦.

2. రాష్ట్రకూటులు, వారికాలము, పుట. ౯౫. శ్రీ భావరాజు వెంకట కృష్ణరావు పంతులుగారు తమ గుణగవిజయాదిత్యుఁడను చారిత్రక నాటకము యొక్క పీఠికయందు "వారి (రాష్ట్రకూటుల) రాజధాని మాన్యఖేటము. దానికే కిరణపురమని ప్రతినామమున్నట్లు తోచును" అని వ్రాసిరి. (భారతి సం. ౨౮ పుట ౫౬3). ఇట్టి తలంపు కలుగుట కవకాశము లేదు. కిరణపురము వేరు మాన్యఖేటము వేరు.

3. దక్షి. ఇండి. శాసనములు - సం. ౧. పుట 3౬; ఎపి. ఇండి, సం. ౯. పుట. ౪౭.

సీమ లెచ్చటివో నిశ్చయించుటకు సాధ్యముకాకపోయినను, నవి చేదిరాజ్యాంతర్గతములై యుండవలయును. ఈ దేశములను జయించిన పిమ్మట పండరంగడు సైన్యములను నడిపించుకొని పశ్చిమముగ బోయి యచలపురమును ముట్టడించెను; ఇది యిప్పటి బీరారుదేశమున నెల్లిచ్‌పూ రనుపేర బరగుచున్నది. దీనిగూడ, శత్రువులను దఱిమి వశముగావించి, రగులుకొల్పెను[1].

అచలపురపతనముతో గృష్ణవల్లభునిపై గుణగవిజయాదిత్యుని దాడి ముగిసినది, అది గొప్ప విజయము. ఈ దీర్ఘదండయాత్రయందు చాళుక్య సైన్యములకు జేకూడిన విజయపరంపరలవలన కృష్ణవల్లభునికి వెన్నెముక విరిగినది. రాష్ట్రకూటరాజలాంఛనములగు గంగాయమునాచంద్రాదిత్య చిహ్నములను పాలిధ్వజమును విజయాదిత్యునికి సమర్పించి సంధిని కోరెను. కృష్ణవల్లభునిపై దన జయమును బ్రకటించుటకు విజయాదిత్యుడు రాష్ట్రకూటుల 'వల్లభ' బిరుదమును స్వీకరించి పంచమహావాద్యములను మ్రోయించెను. 'సదక్షిణాపథ సత్రికలింగ'పాలకు డని ప్రకటించెను. కాని గుణగవిజయాదిత్యునికి రాష్ట్రకూటసామ్రాజ్యమును గూలద్రోయు నుద్దేశము లేదు. అట్టి యుద్దేశ ముండినను నది నెఱవేరియుండదు. విజయాదిత్యునిచే నెన్ని పర్యాయములు నిర్జితుడైనను కృష్ణవల్లభుడు సంపూర్ణముగ శక్తిహీనుడు కాలేదు; మిత్రబలము సమయలేదు; మిత్రరాజు లెవ్వరును నతని విడనాడక యెప్పటియట్ల మైత్రివాటించుచుండిరి. సామంతులు గాని, మాండలికులు గాని ద్రోహము దలపెట్టలేదు. ఇట్టి పరిస్థితుల యందు రాష్ట్రకూటుల యధికారమును దొలగద్రోయుట సాధ్యమైన కార్యము గాదు. విజయాదిత్యుడు రాష్ట్రకూటులపై యుద్ధము ప్రకటించుటకును, డాహాళముపై దండువెడలి యా దేశమును పాడు

1. ఆం. పరి. పత్రిక. సం. ౧౧. పుట ౨౪౧. "కిరణపుర మచలపుర ముదు నెల్లూరుపురా న్విదాహచైతత్."

సేయుటకును ముఖ్యముగ రెండు కారణములు గాన్పించుచున్నవి: నిజ స్వాతంత్ర్యమును నెలకొల్పుట యొకటి; పూర్వము రాష్ట్ర కూటులును, వారిమిత్రులును చాళుక్యులకు గావించిన పరాభవము నకు బ్రతీకారము సల్పుట మఱియొకటి. ఈ రెండుకార్యములను సంపూర్ణముగ నెఱవేర్చి యాతడు కృతకృత్యు డాయెను. కావున కృష్ణవల్లభుడు దన యోటమి నొప్పుకొని సంధిని కోరగా గుణగు డందులకొప్పుకొని యుద్ధమునగొనిన రాజ్యమును, సామ్రాజ్యపద మును నతనికి మరల నిచ్చి సైన్యములను మరల్చుకొని నిజరాజ్యము నకు దరలివచ్చెను[1].

డాహళయుద్ధయాత్ర జయప్రదముగ ముగిసిన వెనుక గుణగ విజయాదిత్యుడు మూడు నాలుగేండ్ల పర్యంతము రాజ్యపాలన మొన రించెను. దేశమున నెట్టి యుపద్రవము లేకపోవుటచే శాంతి ప్రబ లెను; విజయాదిత్యుడు రాజ్యభారమునంతయు మంత్రులపై నిడి ధర్మకార్యములయందు కాలము గడపుచు క్రీ. శ. ౮౯౧ సంవత్సర మున, నలువదినాలుగేండ్ల పర్యంతము కీర్తిప్రతాపములతో ప్రజా పాలన మొనరించి దివంగతు డాయెను.

పూర్వచాళుక్యవంశజులైన రాజు లందరిలో గుణగవిజయా దిత్యు డుదాత్తతముడు. ఇతని రాజ్యకాలమున చాళుక్యుల కీర్తి ప్రఖ్యాతులవలె రాష్ట్రముకూడ వర్ధిల్లినది. తత్పూర్వముగాని, తదనంత రముగాని పూర్వచాళుక్య రాజ్యమంతటి వైశాల్యము నందియుండ లేదు. అమోఘవర్షుని కోడి యతని యాధిపత్యమును గొంతకాల మంగీకరింపవలసి వచ్చినను, దరువాత కృష్ణవల్లభుని జయించి, తన స్వాతంత్ర్యమును పునరుద్ధరించుకొనగలైను; కృష్ణవల్లభునిపై దన యధికారమును నెలకొల్పి యతని దనకు పాదాక్రాంతునిగా గావించుకొనెను. పూర్వచాళుక్య శౌర్యపరాక్రమము లానా డుచ్చ

1. ఎపి. ఇండి. సం. ౪. పుట ౨౩౩.

స్థితి నందినవి. 'చండచాళుక్య' నామము సార్థకమై శత్రులకు గుండె లవియించినది.

గుణగ విజయాదిత్యునికి సంతు లేదు. ఇతనికి ముగ్గురు తమ్ము లుండినట్లు శాసనముల వలన దెలియుచున్నది. విక్రమాదిత్యుడు పెద్దవాడు; గుణగవిజయాదిత్యునికి యువరాజై యుండి యన్నకు ముందే గతించిన ట్లున్నది. ఇతడు పెక్కు పూర్వచాళుక్య శాసనము లందు 'సచ్చమూపతి' అని స్తుతింపబడి యుండుట చేత సేనల కూర్చుటయందును, విచ్చుటయందును నితడు గడునేర్పరియై యుద్ధములయందు విజయాదిత్యునికి చేదోడై యుండెనని యెంచ వలసి యున్నది. ఇతనికి ప్రథమ చాళుక్యభీము డను పుత్రుడొకడు పుట్టెను. యువరాజ విక్రమాదిత్యునికి వెనుకటివారు నృపకామ యుద్ధమల్లులు. నృపకాముని విజ్ఞప్తి మీదనే గుణగుడు సాతలూరు గ్రామమును బ్రాహ్మణులకు దానముచేసినది[1]. యుద్ధమల్లు[2] డంతటి సుప్రసిద్ధుడు కాడు; కాని యతని పుత్రపౌత్రాదుల ప్రఖ్యాతి వల్ల నతని పేరు ముందుకు వచ్చినది. తన సోదరులతో గూడి గుణగ విజయాదిత్యుడు రాజ్యమును జనరంజనముగ పాలించెనని యేదో యొక శాసనమున జదివినట్లు స్మరణయం దున్నది. ఇది యెట్లున్నను యువరాజ విక్రమాదిత్యుడును, నృపకాముడును నతని కనుకూలముగ ప్రవర్తించుచుండిరని శాసన సాక్ష్యమువలన రుజు వగుచున్నది. యుద్ధమల్లుడు ప్రతికూలుడైన ట్లెచ్చటను లేదు. కావున గుణగవిజయాదిత్యుడు రాజ్యతంత్ర మర్మజ్ఞుడై తమ్ములను గూడదీసి కొని యైకమత్యముతో ప్రభుత్వము సలిపెను.

గుణగవిజయాదిత్యుని ఖడ్గమునకును, గార్యమునకును గర్తలై రాజకార్యములను జయప్రదముగ సాగించిన శూరులు కొంద ఱతని

---

1. ఆం. పరి. ప., సం. ౧౧. పుట. ౫౬౪.

2. Cp. 6. of 1938-39 (అప్రకటితము). 'చాలుక్యభీమ పితృవ్య యుద్ధమల్లస్యనన్దన స్తాలనృపః'

శాసనములందు పేర్కొనబడియున్నారు. వీరియందు కడియరాజును, నాతని కుమారుడగు పండరంగడును ప్రముఖులు. పుట్టుకచే బ్రాహ్మణులైనను, నప్పటి ద్విజోత్తము లనేకుల మార్గము ననుసరించి, వీరు వేదాధ్యయనముతోబాటు ధనుర్వేదమునుగూడ నభ్యసించి, సమిధలు, దర్భలు దాల్చు కరముల నాయుధములు ధరించి శస్త్రోపజీవులై రాజసేవయందేమి, దేశసంరక్షణయందేమి నిరంతరము పాటుపడుచు దమ యసువులను ధారబోసి కీర్తిని గడించిరి. కడియరాజు భట్టకాలుని వంశమున బుట్టెను. ఇతని వాస్తవ నామధేయ మెద్దియో తెలియదు. 'కడియరాజు' అను పదము 'కటకరా' జను సంస్కృతశబ్దమునకు భ్రష్టరూపము. 'కటకము' అనగా సేన; కటకమున కధిపతి కటకరాజు. కావున నిది యుద్యోగనామముగాని పురుషనామము గాదు. కడియరాజు పూర్వచాళుక్యమూలబలమున కధ్యక్షుడు; స్వశక్తిసామర్థ్యములవల్ల నతడీపదవిని పడసెను; అసమాన ధైర్యసంపన్నుడగు నీ బ్రాహ్మణ సేనాపతి దన యవక్రపరాక్రమమును బ్రకటించి గుణగుని పార్శ్వమున నిలిచి పోరాడుచు నొకానొక రణక్షేత్రమున శత్రువులచే దెగటారెను[1].

అబ్బను మించిన కొడుకు పండరంగడు. ఆయుధపరిచయమును, సేనాప్రవేశమును నితనికి బాల్యముననే కలిగినట్లున్నది. ఇతడు దన పోటరితనమును, దండునడపు నేర్పును ప్రప్రథమమున బోయదండయాత్రయందు ప్రదర్శించి ప్రభువు మన్ననకు పాత్రుడాయెను. అదిమొదలు కొంచె మించుమించుగ గుణగవిజయాదిత్యుని యుద్ధము లన్నియు నితని యాధిపత్యముక్రిందనే నడచినవి. పండరంగడు గుణగవిజయాదిత్యుని కృపాణహస్తమని చెప్పవచ్చును. సంకిల, కృష్ణవల్లభులపై విజయమును, డాహళదండయాత్రయు నీతని యాధ్వర్యముక్రిందనే నడచెనని ముందే చెప్పియున్నది. అతిదుర్గమ

1. ఆం. హి. రి. సొ. పత్రిక, సం. ౫ పుట. ౧౧౪.

మైన చక్రకూటదుర్గమును దన క్రోధాగ్నిచే రగులుకొల్పిన దితఁడే. మర్త్యమాహేశ్వరుని కోపోద్దీపితమైన కంటి చిచ్చున మసియైన కిరణపు రాచలపుర నెల్లూరుపురము లను త్రిపురములును పండరంగడు కాల్చినవే. పండరంగడు సాటిసేని జోదు; మేటి దళవాయి. సమకాలికులయం దితనితో జతగూర్చి పేర్కొనగల దండనాయకుడు లేడు; దక్షిణభారతభూమియంతయు నీతని ప్రతాపభానుమూర్తిచే దేదీప్యమానముగ వెలుగందిపోయినది. పండరంగడు గుణగవిజయాదిత్యుని మరణానంతరముగూడ కొంతకాలము జీవించియుండెనేమో; కాని గుణగుని యనంతర మతడు కత్తిని మరల చేబట్టలేదు.

ఆంధ్ర ద్రోణాశ్వత్థామ లనదగిన ఈ యిరువురు మహావీరులే గాక, మఱికొందఱు బ్రాహ్మణయోధులు గుణగవిజయాదిత్యునికి ఖడ్గసహాయు లుండిరి. వీరియందు వినయడిశర్మ యొక్కడు. నొలంబాధీశ్వరుడగు మంగి రాజుతో గుణగవిజయాదిత్యుడు యుద్ధము సేయుచుండగా నితడు మంగిని వధించు మార్గమును విజయాదిత్యుని కుపదేశించెను; తన కృతజ్ఞతా సూచకముగ ట్రండపట్టనుగ్రామమును నగ్రహారముజేసి గుణగు డితనికి దానమొసగెను. విజయాదిత్యుని సైన్యమున వినయడిశర్మయొక్క స్థానమునుగూర్చి చరిత్రపరిశోధకు లభిప్రాయభేదము గనపఱచియున్నారు. ఈ యంశమునకు సంబంధించిన సంగతుల నన్నిటిని పరామర్శించిచూడగా, వినయడిశర్మ విజయాదిత్యుని సేనాధ్యక్షవర్గములోనివా డని తోచుచున్నది[1].

గుణగవిజయాదిత్యునికి ఖడ్గసహాయుడైన బ్రాహ్మణవీరు డింకొక్కడు కలడు. ఇతని పేరు రాజాదిత్యుడు; తొండమండల పాలకుడైన కాడువెట్టియొక్క సేనాపతి కుమారమూర్తి వంశమున జన్మించెను. కాట్లపట్టు దానశాసనమున కుమారమూర్తి చరిత్ర కొంత గలదు. ఏదోయొక కారణమువలన దన యేలికయగు కాడువెట్టితో

1. ఎపి. ఇండి. సం. ౫, పుట. ౧౨౫.

గలహించి యతని శపించి వేంగి మండలమునకు వచ్చి ఉండి యను గ్రామమును నివాసస్థానముగ జేసికొని యచట స్థిరముగ గాపుర ముండెను. కుమారుడను నామాంతరము గల పెద్దన యను కొడుకు కత నికి కలిగెను. పెద్దనకొడుకు రాజాదిత్యుడు. ఈ రాజాదిత్యు డస్త్ర విద్యాపారగుడై గుణగవిజయాదిత్యుని యుద్ధములయందు శత్రుక్ష యము గావించి యపరిమిత ధనరాసుల నతనికి దెచ్చియిచ్చెను. రాజాదిత్యుని సేవకు మెచ్చుకొని గుణగవిజయాదిత్యు డతనికి వేంగి సహస్రగ్రామములకు జెందిన కాట్లపఱ్ఱును గ్రామమును సర్వాకరపరి హారముగా నగ్రహారము చేసియిచ్చెను[1].

## వా ఙ్మ య వి శే ష ము లు

గుణగవిజయాదిత్యుని రాజ్యకాల మాంధ్ర వాఙ్మయ చరిత్ర యందు ప్రథమఘట్టము. సాలంకాయనులనాటి నుండియు దేశమున దెనుగుభాష వాడుకయం దుండెనని చెప్పుటకు గొన్ని యాధారము లున్నను భాషాస్వరూప మిట్టిదని నిర్ణయించుటకు దగిన సాక్ష్య మెద్దియు గానరాదు. క్రీ. శ. 2 వ శతాబ్దమున నాంధ్రభాషాచరిత్ర యారంభమైనదని చెప్పవచ్చును. క్రీ. శ. ౬౦౦ - ౬౩౦ ల మధ్య రాజ్యపాలన మొనర్చిన మొదటి మహేంద్రవర్మ పల్లవుని శాసన ములయందు కొన్ని తెలుగు బిరుదులు కలవు. వీనికంటె ముఖ్యమైనవి రేనాటి తెలుగుచోళుల శాసనములు. పూర్వపాశ్చాత్య చాళుక్య రాజులవి ఈ శతాబ్దమునకు జెందినవే మఱి కొన్ని శాసనములు గలవు; సామాన్యముగ నివి యన్నియు చిన్నవి. మూడునాలుగు వాక్యములతో శాసనగ్రంథమంతయు ముగిసిపోవును; పద్యముల పొడ యెచ్చటను కానరాదు. చక్కని వచనము. ప్రాత తెలుగు శాసనములు పెక్కింటిని పరిష్కరించి ప్రకటించిన శ్రీ మల్లంపల్లి

---

1. ఎస్. టి. వి. యఙ్ హైస్కూల్ ఆన్యువల్. ౧౯౩౯ - ౪౦. పుటలు ౨౩ - ౨౪.

సోమశేఖరశర్మగారు వీనిలో గొన్నింటియందు గానవచ్చు భాషా
విశేషమును గూర్చి యిట్లు వ్రాసియున్నారు: "శాసనభాష అంతా
తెలుగే. శాసనమంతా గద్యంలో వున్నది. కొన్నికొన్ని పదాలు
మాత్రమే కాకుండా వాక్యరచన కూడా విలక్షణంగానే వున్నది"[1]
"శాసనము లోని తెలుగుపదముల కొన్నిటి రూపమును, అర్థమును
గూడ సుబోధ మగుట లేదు. ఇంకను విచిత్రమైనది ఇందలి వాక్య
రచనాపద్ధతి. ఇది మనమిప్పుడు వాడు పద్ధతికి భిన్నమైనది. ఇప్పుడు
మనము వాక్యరచనలో క్రియా పదమును కర్తకర్మలకు తరువాత
బెట్టుదురు. మన యీ మాచర్ల శాసనమున అది కర్తకు దరువాతను,
కర్మకు పూర్వమునను వచ్చినది. ఇది అపూర్వము. పొట్లదుర్తి-
మాలెపాడు శాసనమునను ఈ పద్ధతియే కానబడును. ప్రాచీనాంధ్ర
వాక్యరచనాపద్ధతి యిదేనా? ఇది యింక నితరశాసనములలో గాన
వచ్చునా? ఇదియే యైన, యీ పద్ధతి ఎంతకాలమువఱ కుండెను?
ఇది నాటి సామాన్యపద్ధతి కానిచో పొట్లదుర్తి-మాలెపాడు,
మాచెర్ల శాసనములలో నిట్లుండుటకు కారణమేమి?"[2] లభ్యమైన
ప్రాచీన తెలుగుశాసనముల నన్నిటిని సమకూర్చి వానిని ఒండొం
టితో బోల్చి పరిశోధించి చూచినగాని సోమశేఖరశర్మగారి ప్రశ్నల
కన్నిటికిని సరియైన సమాధానము కుదురదు. ఈ ప్రాచీన తెలుగు
శాసనములందు సంస్కృతములకంటె దెనుగుపదములే యెక్కువగ
గానవచ్చుచున్నవి. శాసనగ్రంథకర్తలు దమ పాండిత్యమును జూపక
చెప్పవలసిన విషయమును నిర్వక్రమముగ వర్ణింతురు. కాని గుణగ
విజయాదిత్యుని కాలమునకు శాసనభాష మారిపోయినది. సంస్కృత
పద భూయిష్ఠమైనది; శబ్దాలంకారములు మెండైనవి. పొట్లదుర్తి-

1. పొట్లదుర్తి-మాలెపాడు శాసనము-వ్యాససంగ్రహము పుట 30౨.

2. మొదటి జయసింహవల్లభుని మాచెర్ల శాసనము భారతి సం. ౨3 పుటలు ౧౭3-౧౭౪.

మాలెపాడు శాసనమును గుణగవిజయాదిత్యుని ధర్మవరశాసనముతోఁ బోల్చిచూచిన నీ విషయము తెల్లము గాఁగలదు.

### పొట్లదుర్తి - మాలెపాడు శాసనము

స్వస్తి॥ శ్రీ పోఱిమహారాజు ల్లొళన। ఇన్నుఱోలి అణపోతులు రేవణకాలు పుద్దణకాలు ఇచ్చినప। న్నసపెన్రాఱ ఇశెఱేనికిఁ॥ తేనిఱిచ్చిన వాన్డుప। ఞ్చమహాపాతకస్డకుఁ॥ ఆసివైరువు లికితమ్॥

### ధర్మవర శాసనము

విజయాదిత్య పాదప। ద్మభ్రమరాయమాణ శ్రీమత్కడెయరాజు గుణగణాభరణుణ్డు దన। కె. ని ఈశ్వరునకుం గార్తికేయుణ్డుంబోలె చాపష్టికలా విశారదుణ్డ। య్న అయ్యపయ్యాయు సకలశాస్త్రార్థపారగులయ్న పెద। పణ్డరంగులు అల్లయ పెగ్గడలుం గరనమ్మున పణ్డరంగును ఈధ। మ్మనివ్వాహానోద్యోగమ్మునకు బృహస్పతి సమానులయ్న పెగ్గడకాడెయ। గారి కొడుకు బెజయరాజు సమర్థుణ్డని ఆత్మానుమతంబునన బన్చిన ప్ర। సాదం బని సమస్తరాజ్యభరనిరూపిత మహామన్త్రాధిపతి। మహేశ్వర పక్షపాతి దేవబ్రాహ్మణ గురుభక్తిపరుణ్డు సశక్తిత్రయ। సంపన్నుణు మయ బెజయరాజు బెజయేశ్వరంబు గలశనివ్వాహానంబు సేసి దిశగుణ్లుం బ్రాకారంబు మటంబును నెమియించి........

ధర్మవరశాసనభాషతో నన్నయభట్టారక కృతమహాభారతములోని యీ క్రిందివచనమును జూడుఁడు:

"అఖిలజలధివేలావలయవలయితవసుమతీవనితా విభూషణం బైన వేంగీదేశంబునకు నాయక రత్నంబునుం బోని రాజమహేంద్రపురంబునందు మహేంద్రమహిమతోఁ బరమానందంబున ననవరతమహామహీరాజ్యసుఖంబు లనుభవించుచు సకలభువనలక్ష్మీవిలాసనివాసం బయిన రమ్యహర్మ్యతలంబున మంత్రిపురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధానానంత సామంతవిలాసినీ పరివృతుండయి... యిష్టకథావినోదంబులనుండి యొక్కనాఁడు."[1]

ఆంధ్రవచనరచనయందు ధర్మవరశాసనము గడు ముఖ్యమైనది. పొట్లదుర్తి - మాలెపాడుశాసనమునకును, నాంధ్రమహాభారతమునకును, భాషాస్వరూపమునుబట్టి, యిది మధ్యస్థానము నాక్ర

1. మహాభారతము, ఆది. ఆ. ౧ : ౮.

మించుకొనుచున్నది. ధర్మవర శాసనమునకు బొట్లదుర్తి - మాలెపాడు శాసనము కంటె నన్నయకృత మహాభారతముతో నెక్కువ చుట్టరికముకలదు. శ్రీ సోమశేఖరశర్మగారు చెప్పినట్లు ధర్మవరశాసన భాష గ్రాంథికము. "విజయాదిత్యుని నాటి శాసన మంతయు 'గ్రాంథికగద్యపద్ధతి'నుండి నాటి గద్యరచనముల ధోరణిని దెలుపుచున్నది. రెండవ శిలాశాసనమున పద్యమును, గద్యమును గూడ గలవు. ఈ రెండుశాసనములును ఈ విధమున ఆంధ్రభాషాచరిత్రమునకు అత్యంతముఖ్యములైనవయినను ఇంతవఱకు భాషాభిమానులు కాని, పండితులు కాని వీటిని వలసినంత శ్రద్ధతో పరిశీలించి పరిశోధింపక పోవుట విచారకరము"[1] అను శర్మగారి వాక్యము లాంధ్ర భాషాచరిత్రకారు లెల్లరును మననము చేయదగినవి.

గుణగవిజయాదిత్యునికాలమున నాంధ్ర పద్యరచన మొట్టమొదట పొడసూపినది; తత్పూర్వ మాంధ్రమున పద్యరచన యుండెనని చెప్పుటకు దగిన శాసనాది సాక్ష్యము గానరాకపోయినను గుణగుని కాలము దాని జన్మకాలము గాదు; లభించిన మూడునాలుగు పద్యములను శోధించిచూడగా నాంధ్రకవుల కది పద్యరచనయందు ప్రథమప్రయత్నము గా దనియు, గుణగుని నాటికి కవిత్వముసెప్పుట వారికి చిరపరిచితమైన దనియు దోచగలదు. పదముల పొందిక యట్లుండనిచ్చి, పద్యముల నడకయు, ఛందోవిశేషములును నన్నయ కవిత్వమును స్మరణకు దెచ్చుచున్నవి. ధర్మవరశాసన సీసమున నన్నయసీసములు కొన్నిటియందువలె ప్రాసయతియే నాలుగుపాదములయందు గానవచ్చుచున్నది. మఱియును నీ కాలమునకు జెందిన పద్యశాసనము లన్నిటియందును సీసగీతములును, దరువోజయు మాత్రము వాడబడినవి. వృత్తములు లేవు; తెనుగు వృత్తము లెందును గానరాకపోయినను వృత్తరచన యప్పటివారెఱుగరని

1. ధర్మవరశిలాశాసనములు _ భారతి, సం. ౫. పుట. ౬౧౩.

యెంచరాదు. గుణగవిజయాదిత్యుని సాతలూరు తామ్రశాసనము నందు ప్రాసముతోఁగూడిన చంపకమాలావృత్త మొకటి కానవచ్చు చున్నది. చూడుడు :

"అరినృపవాజివారణపదాతిమహోభ్రవిరామమారుతః
వరకరిసుస్థితాసిభరుచిప్రవినాశనభానుసన్నిభః
గురుతరదీనభాగవతమానవమానితకల్పపాదపః
వరకరిగల్లభూమిప భు జాసిరిహోజి భువి ప్రహాసతే."

ఈ చంపకమాలావృత్తముపై సాతలూరు తామ్రశాసన సంపాదకులైన శ్రీ. శే. కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారు ఇట్లు వ్రాసియున్నారు: "దాని నాలుగు చరణములందును ప్రాస కలదు. యతిమాత్రము సంస్కృత సంప్రదాయము ననుసరించియే యున్నది. ఆంధ్ర సంప్రదాయము ననుసరించి లేదు." "చంపకమాలావృత్తము సాంస్కృతికమైనను దానికి సంస్కృతవాఙ్మయమునందు విశేష ప్రచారము లేదనుట యందఱకు దెలిసిన విషయమే. సుప్రసిద్ధకవు లెవ్వరు దానిని వాడి యుండలేదు. కర్ణాటాంధ్రభాషలయందు నీ వృత్తము విశేషముగ గాన్పించుచున్నది. అట్లే ద్వితీయాక్షర ప్రాస విషయమును. ఈ రెండును దేశభాషలందు కలవు. సంస్కృతము నందు లేవు. కావున పై పద్యము సంస్కృతమునం దున్నను అది దేశభాషా సంప్రదాయము ననుసరించి వ్రాయబడె ననుటకు సంది యము లేదు. అనగా తొమ్మిదవశతాబ్దములో గుద్రవారవిషయ ములో, అనగా గుడివాడప్రాంతమునందు తెనుగు కవులు ప్రాస యుక్తమైన చంపకమాలావృత్తము రచించుచుండి రని మన మీ సంస్కృతశ్లోకమువలన నూహింపవచ్చును. అప్పటికి వృత్తములలో యతి పాటింపబడుచుండెనో లేదో ఈ పద్యమును బట్టి మనము నిశ్చ యముగ జెప్పలేము. కన్నడమునందువలెనే యతి నియమము తెనుగునందు మొదట లేకయుండెనేమో?"[1].

1. భారతి. సం. ౧. సంచి. ౧. పుటలు ౯౧-౯౨.

చంపకమాలావృత్తమునకు సంస్కృతవాఙ్మయమున ప్రచారము లేదనియు, ద్వితీయాక్షరప్రాసనియమము దేశభాషలయందే కానవచ్చుచున్న దనియు, తత్కారణమున నది యాంధ్రభాషాసంప్రదాయము ననుసరించి వ్రాయబడె ననియు పై వాక్యముల సారాంశము. కాని యాంధ్రభాషయందు చంపకమాలాదివృత్తములను రచించుట కొక సంప్రదాయ మప్పటికే యేర్పడియుండె నని యుదాహృతశాసన శ్లోకమువలన నిశ్చయము కాజాలదు. ఆంధ్రసంప్రదాయమునకు ప్రధానాంగము యతి. ఇది సంస్కృత కర్ణాటాదిభాషలలోని యతి, అనగా విరామము గాదు. ఆంధ్రసంప్రదాయము ననుసరించిన యతి. గుణగవిజయాదిత్యునినాటి యద్దంకి ధర్మవరశాసనములయందు గానవచ్చుచున్నది. గుణగవిజయాదిత్యునినాటికి సాతలూరు శాసనచంపకమాలయందు గానవచ్చుదానికంటె భిన్నమైన యతి నియమము నాంధ్రకవుల పాటించుచుండి రనుట తెల్లము. అనగా నప్పటికే యతిప్రాసలను గూర్చి నేటివఱకు చెల్లుచుండు సంప్రదాయ మేర్పడినది. కావున శ్రీ లక్ష్మణరావుగా రనుమానించునట్లు 'కన్నడమునందువలెనే యతినియమము తెనుగునందు మొదట లేకయుండెనేమో'యని చింతించుట కవకాశము లేదు. ఏ కారణము చేతనో సాతలూరు శాసనగ్రంథకర్త యాంధ్రసంప్రదాయమును త్యజించి కర్ణాటకసంప్రదాయము ననుసరించినాడు; కాని యతని మార్గ మాంధ్రకవులకు రుచింపలేదు. ఇట్లు గుణగవిజయాదిత్యునికి పూర్వమే యాంధ్రమున పద్యరచన ప్రారంభ మాయె నని తలచుట కవకాశ మున్నను చాళుక్యులకు పూర్వము దెనుగువారు కవిత్వముసెప్పి యెఱుగరని దృఢముగ జెప్పవచ్చును. ఈపట్టున—

> "మునుమార్గకవిత లోకంబున వెలయగ దేశికవిత బుట్టించి తెనుం
> గున నిలిపి రంధ్రవిషయంబున జన జాళుక్య రాజు మొదలుగ పలువుర్."

అను నన్నెచోడుని పద్యమును జ్ఞప్తికి దెచ్చుకొనవలయును. ఆంధ్రవాఙ్మయ విమర్శకాగ్రేసరుడని వాసికెక్కిన శ్రీడాక్టరు కట్టమంచి

రామలింగా రెడ్డిగారు రాజరాజవర్ధంతి యుత్సవమందు దమ యధ్యక్ష వచనమున "ఇక్కడ బేర్కొనిన చాళుక్యరాజు రాజరాజుగాని, ఇంకొక డనుట అసాధ్యమైన కార్యము" అని దృఢముగ జెప్పిరి.[1] రెడ్డిగారు మిక్కిలి గొప్పవారు; వారి కీర్తిచే మోహితులై మఱి కొందఱు విమర్శకులు విషయమును పరిశీలించిచూడకయే రెడ్డిగారి యభిప్రాయమునే యంగీకరించిరి. గుణగవిజయాదిత్యుని కాలమున కవిత్వ మాంధ్రులు జెప్పుచుండిరని శాసన సాక్ష్యమువల్ల రుజువగు చుండగా, దేశికవితనుబుట్టించి తెనుంగును అంధ్రవిషయమున నిలిపిన చాళుక్యరాజు రాజరా జని చెప్పుట కెట్లు సాధ్యమగును? కావున పెద్దలే యైనను రెడ్డిగారు వచించిన వాక్యమును ద్రోసిపుచ్చుట సరి. చక్కగ చింతించి చూడగా నన్నెచోడడు బేర్కొనిన చాళుక్యరాజు రాజరాజును గాడు, గుణగవిజయాదిత్యుడును గాడు. అతనికి ముందు తెనుగు దేశమును పాలించిన చాళుక్య రాజులలో నొక్కడు కావలయును. మఱియు నతడు పూర్వచాళుక్య వంశజుడే యని తలపవలసిన యవసరము లేదు. బాదామి చాళుక్య వంశజుడైనను కావచ్చును. పూర్వచాళుక్యుల యధికారము క్రింద నుండిన తెనుగుదేశముకంటె వీరి యధికారమునకు లోనై యుండిన తెనుగుదేశము వైశాల్యమున పెద్దది. మొదటి విక్రమాదిత్యుని కాలమునుండి రెండవ కీర్తివర్మయంత్యమునకును తెలంగాణము సర్వమును, రాయలసీమయం దశేషభాగమును బాదామి చాళుక్య రాజుల యేలుబడిక్రింద నుండెను. వారి శాసనములు తెనుగు భాష యందు రచింపబడినవి రాయలసీమయం దచట నచట గానవచ్చు చున్నవి. కావున తెనుగున కవిత్వము పుట్టించిన చాళుక్యరాజు వీరియం దొక్కడైనను గానవచ్చును.



1. రాజరాజ నరేంద్రపట్టాభిషేక సంచిక. పుట. ౨౦౨.

# ౧౦

# రాజరాజనరేంద్రుని కలిదిండితామ్రశాసనము

## శాసలబ్ధి

కృష్ణామండలములోని కైకలూరుతాలూకాకు జేరిన కలిదిండిగ్రామమున నొక రైతు పాటిమట్టికై త్రవ్వుచుండగా వరాహముద్రతోటి కడియమున గూర్చిన యైదు రేకుల తామ్రశాసన మొకటి భూగర్భమున గానవచ్చెను. సదరు రైతు కడ దానిని గ్రహించి మిత్రులు శ్రీ గూడవల్లి రామబ్రహ్మంచౌదరిగారు ప్రచురణార్థము నా కిచ్చిరి. శాసనము నాచేతికి వచ్చి దాదాపు నాలుగేండ్లయినను కారణాంతరముల వల్ల ఇంతకాలము పరిష్కరించి ప్రకటింప వీలుకలుగదాయె. భూగర్భమున చిర కాలము స్థాపితమైయుండిన కారణముననేమో శాసనపురేకులను దట్టముగ చిలు మావరించి చిట్టెము గట్టుకొని యచ్చటచ్చట నందలి యక్షరములనుసైతము తినివేసియుండెను; శాసనముయొక్క కడపటిరేకులో జాలభాగము తునిగి నష్టమై పోయెను. సంపూర్ణముగ లభించిన తక్కిన నాలుగు రేకులయందుగూడ నచ్చ టచ్చట బెజ్జములు పడినవి. శాసనము నాచేతికి రాకపూర్వమే కడియ మెవ్వరి చేతనో తెగగొట్టబడియుండినది. శాసనము రేకులనుండి చిలుమును వదల్చి పరిశుద్ధము చేసి యిచ్చినందులకు మద్రాసు గవర్నమెంటు మ్యూజియము సూపరింటెండెంటగు డాక్టరు అయ్యప్పన్ గారికిని, ఆర్కియాలాజికల్ కెమిస్టగు డాక్టరు పరమశివన్ గారికిని నా కృతజ్ఞతాపూర్వకవందనములను సమర్పించుచున్నాను.

## పరిమాణాదులు

సంపూర్ణముగ నుండు నాలుగురేకులయందు ఒక్కొక్కటియు ౧౦ అం. నిడి వియు, ౫ అం. వెడల్పును గలది. లభ్యమైన యైదవరేకుయొక్క తునుకవెడ ల్పన్నిటివలె నైదంగుళములే యైనను నిడివి హెచ్చుతగ్గులుగలిగి యున్నది. దీని నిడివి కొన్నితావుల ౨ అం; మఱికొన్నియెడల ౩౺ అం. కడియము బటువైనది. ఘనము ౪ అం; మధ్యకొలత ౫ అం. రేకులలోని బెజ్జముగుండ కడియము దూర్పబడి రెండు కొనలును గలియు చోట రాజముద్రికతో జేర్చి తాపటము సేయబడియున్నది. వల యముతోగూడ రేకులయొక్క తూకము ౩౯౨ తులములు. పరిమాణాదులను నిశ్చ

యించి నాకు చెప్పినందుకు (ఇప్పుడు) గవర్నమెంటు ఎపిగ్రాఫిస్టు శ్రీ రావుబహదరు ఆర్. కృష్ణమాచార్యులు, బి. ఏ. గారికి నాకృతజ్ఞత నిందుమూలమున దెల్పుకొనుచున్నాను.

## రాజముద్రిక

ఇంతవఱకు లభించిన పూర్వచాళుక్యముద్రికలలో నిది కడు సొంపైనది. దీనితో బోల్పదగినవి పెక్కు కానరావు. ఉభయతలములను అంచు తీర్పబడి యున్నది. అధోభాగము నాలుగురేకుల పుష్పమువలె దీర్పబడి కర్ణిక యుండుచోట వలయముతో దాపటముసేయబడియున్నది. ఉపరితలమధ్యమున 'త్రిభువనాంకుశం' అను బిరుదాక్షరములును, వాని పైభాగమున జాళుక్యనృపాలుర రాజ్యచిహ్నములును నిత్రముగా జెక్కబడియున్నవి: మధ్యభాగమున డాపలిముఖమై పరుగిడుచుండునట్లు చెక్కబడిన చాళుక్యుల వరాహలాంఛనమును, దాని యెదుట అంకుశమును వెనుక డమరుసు, పోత్రమునకు కొంచెము పైన శంఖమును, తలదోకలకడ చామరములును గానవచ్చెడిని. వరాహముయొక్క శిరమున కెగువ ముద్రిక పైయంచు నానుకొని ఛత్రమును, వీపున కెగువ సూర్యచంద్రబింబముల రూపములును దెలియావచ్చుచున్నవి. బిరుదాక్షరములక్రింద ఎడమవైపు చిన్న గద్దెయు, మధ్య నాల్గురేకులతోడి పుష్పమును, కుడిప్రక్క నాళముతోడి తామరపువ్వును గలవు.

## లిపి

ఇందలి లిపి తూర్పుసముద్రాంధ్రదేశమున క్రీ. శ. ౧౧-వ శతాబ్దమున సామాన్యముగ వాడుకయందుండిన ప్రాచీనాంధ్రలిపి. వ్రాత చక్కనిది. అక్షరములు ఇంతకుపూర్వము ప్రకటితమైన రాజరాజనరేంద్రుని కోరుమెల్లి నందంపూడి శాసనములవంటివే; లోతుగ జెక్కబడియుండుటచేత శిథిలమైన తావులయందు దప్ప తక్కినయెడల స్పష్టముగా గానవచ్చుచున్నవి. శాసనమునందు వెరసి ౧౨౨ పంక్తులవ్రాత కలదు. మొదటిరేకు మొదటిప్రక్కను, నైదవరేకు రెండవప్రక్కను వ్రాత యేమియు గానరాదు. తక్కిన రేకు లన్నిటిలోను రెండుప్రక్కలను వ్రాతకలదు. మొదటిరేకు రెండవప్రక్కను, మూడునాల్గు రేకుల మొదటిప్రక్కను నొక్కొక్కదానియందు ౧౬ పంక్తులును, రెండవరేకున కుభయపక్షముల నొక్కొక్కదానియందు ౧౭ పంక్తులును, మూడవరేకు ద్వితీయపార్శ్వమున ౧౫ పంక్తులును, నాల్గవరేకు రెండవవైపునను, నైదవరేకు మొదటివైపునను ౧౩

పంక్తులునుగలవు. ప్రస్తుతము పరిష్కృతమగుచున్న దానితోగూడ రాజరాజనరేంద్రు నివి మూడు తామ్రశాసనములు లభించినవి. వీని యన్నిటియందును సామాన్యముగ నొక విశేషము గానవచ్చుచున్నది. ఈ శాసనములకు సంబంధించిన రేకులన్నియు వీనికొఱకే ప్రథమమున సిద్ధపఱచినవి కావు; కొన్ని ప్రాచీన తామ్రశాసనముల నుండి సంగ్రహింపబడి యందలి ప్రాతయక్షరముల జదియగొట్టి తలమును సమము చేసి వాడబడినవి. ప్రాచీనాక్షరములు జదిసియు సంపూర్ణముగ రూపుచెడక సూక్ష్మముగ బొడకట్టుచున్నవి. ఇట్లు మొదటి వ్రాతను దుడిచి దానిపై మరల వ్రాసిన వ్రాత కాంగ్లమున 'పాలింప్సె'స్టందురు. కోరుమెల్లి శాసనమును బరిష్కరించు సందర్భమున డాక్టరు ఫ్లీటుగా రిట్లు చెప్పియున్నారు: "ఇందలి మొదటిరేకొక పాలింప్సెస్టు: వెలుపలిప్రక్క, పంద్రెండుపంక్తుల ప్రాచీనతరమైన చదరపు టక్షరముల వ్రాతపొలకువ స్పష్టముగ గోచరించుచున్నది. కాని యక్షరము లన్నియు జక్కగ జదిసిపోయియుండుటచేత నేభాగమును నిర్ధరించి చదువుటకు శక్యము గాక యున్నది"[1] నందంపూండి శాసనమున నీవిషయమునందు గొంత వ్యత్యాసము గానవచ్చుచున్నది. కోరుమెల్లి శాసనము వలె నదియు గొంతవఱకు ప్రాతశాసనపు రేకులలో జదునుసేయబడిన ప్రాచీనాక్షరముల మీద జెక్కబడినదే (చూ: రే. 3, ప్ర. ౨, పం. ౫౦-౫౫). ఇంతేకాదు. వంశవర్ణన గలయంతవట్టు నట్లె సంగ్రహింపబడిన యొక ప్రాతశాసనపు రేకులతో దానమును వివరించు క్రొత్త రేకులు జతసేయబడియున్నవి. ఈ విషయమై డాక్టరు కీల్హార్న్ గా రిట్లు చెప్పియున్నారు: "(నందంపూండిశాసనమునందలి) యక్షరములు సర్వత్ర దక్షిణమున వాడుకయం దుండినవే. కాని వీనియందు రెండు పూర్వోత్తరఘట్టములు బొడకట్టుచున్నవి. ఏబదియవపంక్తి (మూడవరేకు రెండవప్రక్కలోని ౭-వ పంక్తి) వఱకు నందలి యక్షరము లిమ్మడి యమ్మరాజుతామ్రశాసనముల యక్షరముల బోలియున్నవి. ఈ యక్షరములయందే మూడవరేకు కడవఱకు మొదట చెక్కబడియుండెను. కాని ౫౦-౫౫ పంక్తులలో నీయక్షరములు జదియగొట్టబడి, మూడవరేకునందు (౫౦-వ పంక్తిలోని మొదటి మూడక్షరములుదప్ప) కడపటి ౭ పంక్తులు, ౪, ౫-వ రేకులును గండాచార్యునిచే జెక్కబడిన మొదటి రాజరాజుయొక్క కోరుమెల్లిశాసనపు వ్రాతనుబోలిన యక్షరముల లిఖింపబడియున్నవి"[2].

---

1. Indian Antiquary, XIV p. 49.

2. Ep. Ind. IV. p. 301.

ప్రస్తుతము బరిష్కృతమగుచున్న ఈ కలిదిండిశాసనములోని యుత్తర భాగముగూడ పైజెప్పినరీతినే యక్షరములను జదిపి స్నిగ్ధముజేసిన ప్రాతశాసనపు రేకుల మీదనే చెక్కబడియున్నది. ఎబ్బదియైదవ (రే. 3. ప్ర. ౨. పం. ౯) పంక్తి మొదలుకొని శాసనాంతమువఱకు ప్రాచీనాక్షరముల యానవాళ్లు స్పష్టముగ దెలియవచ్చుచున్నవి. అక్షరము లన్నియు జక్కగజదిసిపోయి యుండుటచే వానిని గుర్తించుటకు సాధ్యపడదాయెను. మొదటి రెండు రేకులను జెక్కిన విలేఖరి తక్కిన రేకుల జెక్కినవానికంటె భిన్నుడని తోచుచున్నది. కాని శాసనమునం దన్ని యెడలను నక్షరములకు గాఢమైన పోలిక లగపడుచుండుటచే నీయంశము నొత్తి చెప్పుటకు వలనుపడదు. రాజరాజనరేంద్రుని కాలమున ప్రాతశాసనములను జెరిచి వానిపై నూతనశాసనముల వ్రాయు నాచార మేల ప్రబలెనో తెలియదు. రాగి వలసినంత లభింపకపోవుటయే దీనికి కారణమై యుండునేమో.

## భాష

శాసనభాష సంస్కృతము; గద్యపద్యాత్మకము. నానాజాతుల వృత్తములు ౪౧ కలవు; ౭ గద్యములు (పెద్దవి చిన్నవి చేరి) పద్యములతో దిలతండులన్యాయమున గలసియున్నవి. శాసనగ్రంథ మంతయు సంస్కృతమున విరచితమైనను దానియం దచ్చటచ్చట గొన్ని తెనుగు మాటలు గానవచ్చుచున్నవి. దానోద్దిష్టగ్రామపు బొలిమేర మొదలగువానిని వర్ణించు సందర్భమున "థరేవులు నామ విషయసహితం పల్లపు గుద్రవార విషయం" (పం. ౭౪ - ౭౫); "తామరకొలని క్రొవ్విండి యేటంబాసిన తల్లిక్రొయ్య నామ నదీ" (పం. ౧౦౭ - ౯) యను వాక్యము లీ యంశమును విదితము సేయుచున్నవి. లేఖకుని ప్రమాదమున శాసనగ్రంథమున పెక్కుతావుల దప్పులు దొర్లియున్నవి. వీని నన్నిటిని అధోజ్ఞాపికల యందు దెలుపుచున్నాను.

## ప్రశస్తి

ఈ శాసనమున కప్పటి యన్యచాళుక్య రాజశాసనములతో సన్నిహిత బాంధవ్యము కలదు. ముఖ్యముగ నీపట్టున రాజరాజనరేంద్రుని కోరుమెల్లి నందంపూండి శాసనములును, నతని తండ్రియగు విమలాదిత్యుని రణస్తిపూండిశాసనమును స్మరింపదగినవి. శబ్దజాలమందేకాక వాక్యములయందును పోలికలు గలవు. శ్లోకములు కొన్ని కొంచెమైన మార్పు లేక గానవచ్చుచున్నవి; ఇంచుక మార్పుతో మఱికొన్ని యగపడుచున్నవి. శాసన గ్రంథారంభమందలి 'శ్రీధామ్నః' (పం. ౧ - ౩)

'తస్మా దభూత్' (౩_౪) కొంచెము మార్పుతో నన్నిటి యారంభమునను గలవు. అందందు కతిపయశ్లోకములతోఁగూడ గానవచ్చు గద్య (పం. ౪౦_౪౧) యన్నిటి యందును కించి ద్వ్యత్యాస మేనియు లేక సర్వత్ర యేకవిధమున నుండకపోయినను కేవలము భిన్నమని చెప్పుటకు వీలులేదు. ఒకశాసనమందలి గద్యకు మఱియొకదాని యందలిభేదములు పాఠాంతరములని చెప్పదగియున్నవి. పైఁబేర్కొనిన శాసనము లన్నింటిలోను గోరుమెల్లి శాసనగ్రంథము దీనికి గడు సన్నిహితము. ఈ పెద్ద గద్యయందు వచ్చెడి శ్లోకములు కొన్ని యన్నిశాసనములకును సామాన్యము. 'పుత్ర స్తస్య' (పం. ౧౧_౧౨) యను శ్లోక మించుక భేదములతో నన్నిటను గలదు. అట్లే 'తస్యాసీ ద్విజయాదిత్యో' (పం. ౨౩) యనునది యన్నిటిలోను బొడసూపు చున్నది. ఈ శాసనములోని 'అమ్మరాజానుజో' పం. ౪౧) యను ననుష్టు పించుక వ్యత్యాసముతో కోరుమెల్లి దానశాసనమున నగపడుచున్నది. 'తతః పరం' (పం. ౪౫_౪౬) రెంటను నొక్క తెరగుననే కలదు. దీని తరువాత వచ్చు 'అథ దానార్ణవా జ్జాతః' (పం. ౪౬_౪౭), 'యస్యోత్తమాంగం' (పం. ౫౫_౫౬) 'సద్వీపం' అను శ్లోకము లీషద్భేదముతో రెంటను గానవచ్చెడిని. మఱియు 'ఖ్యాత సమస్తనరనాథ' (పం. ౫౬_౫౭)యను శ్లోకముయొక్క పూర్వార్ధము కించిద్భేద ముతో 'నాథసమస్తనరనాథ' యని కోరుమెల్లిశాసనమున చోళచక్రవర్తి ప్రథమ రాజరాజును వర్ణించెడి యొక శ్లోకముయొక్క ఉత్తరార్ధముగ నగపడుచున్నది.

## శా స న గ్రం థ ము

శాసనగ్రంథమును నాలుగు భాగములుగ విభజింపవచ్చును: (౧) రాజరాజనరేంద్రుని పర్యంతము గల పూర్వచాళుక్యవంశాను చరితము, (౨) దానసందర్భ వివరణము, (౩) దానోద్దిష్ట గ్రామ మర్యాదవర్ణన, (౪) దానఫలాది కథనము.

## ౧

మొదట వంశక్రమమునుగూర్చి కొంత చెప్పవలసియున్నది. వంశక్రమమును పౌరాణికము, చారిత్రకము అని రెండు పాయలుగ నేర్పఱుపవచ్చును.

పౌరాణికము:— శాసనోక్త పూర్వచాళుక్యవంశానుచరితము భగవంతుడగు నారాయణుడు, బ్రహ్మ, అత్రి, చంద్రుడు మున్నగు

దేవతలతో నారంభమై చంద్రవంశజుడగు శతానీకుని పుత్రుడు ఉదయనునివఱకు నవిచ్ఛిన్నముగ జెప్పబడినది. తరువాత కొంత యెడ మగపడుచున్నది. ఉదయనుని తరువాతి రాజులను బేర్కొనక ప్రశస్తికారుడు అనామధేయులగు నేబదితొమ్మండ్రు రాజులయోధ్యాపురము నుండి భూపరిపాలన యొనర్చిరని చెప్పి యాఘట్టమును దాటెను. తరువాత యరువదియవవాడగు విజయాదిత్యుడు దక్షిణాపథమునకు వచ్చి త్రిలోచనపల్లవు నెదుర్కొని యుద్ధమున నిహతుడయ్యెనట. ఇతడు మడియునప్పుడు చూలాలై యుండిన ఇతని రాణి విష్ణువర్ధను డను నొక కుమారుని గనెను. అతడు స్వవంశము నభివృద్ధిపఱచి నర్మదాసేతువులమధ్య నుండు దేశముపై దన యధికారమును నెలకొల్పెను. సంగ్రహముగ నిందలి పూర్వచాళుక్యుల పౌరాణికవంశక్రమ మిది.

ఈ సందర్భమున జాళుక్యుల కీ పౌరాణికవంశానుక్రమణిక యెట్లు సంక్రమించెనో మొదట దెలిసికొనవలసియున్నది. దీని పొలకువ విమలాదిత్యునికి పూర్వము వేంగి నేలిన చాళుక్యరాజుల శాసనములలో దేనియందు గానరాదు. క్రీ. శ. ౧౧-వ శతాబ్దారంభమున గల్యాణి రాజధానిగ జేసికొని కర్ణాటపశ్చిమాంధ్రదేశముల బాలించిన పాశ్చాత్యచాళుక్యుల శాసనములయందుమాత్రము గొన్ని పోలిక లగపడుచున్నవి[1]. కాని యీ పోలికలు కాకతాళీయము లని తోచెడిని. ఒకవేళ రెండు రాజకుటుంబములలోను సామాన్యమైన గాథ యిట్టి దొకటి వాడుకయం దుండుటయే పై జెప్పిన పోలికలకు గారణమైయుండవచ్చును. సందర్భోచితాంశముల నన్నిటిని బరిశీలించి చూడగా, కీ. శే. కె. వి. లక్ష్మణరావుపంతులుగారు చెప్పినట్లు[2] విమ

1. అయోధ్యలో నేబదితొమ్మండ్రనామధేయనృపాలుర రాజ్యప్రసక్తియు ననంతరదక్షిణాపథాగమనమును క్రీ. శ. ౧౦౦౮ నాటి యైదవ విక్రమాదిత్యుని కౌథేయముశాసనమున జెప్పబడియున్నవి. ఇం. ఆంటి. సం. ౧౬, పుట ౨౧.

2. లక్ష్మణరాయవ్యాసావళి, పుటలు ౫౯-౬౦.

లాదిత్యుని కొలువున నుండిన ప్రశస్తికర్తలే తమ్మేలిన రాజునకు జంద్రవంశముతో సంపర్కమును గల్గించి దాని కనుకూలముగ నీ శాసనమున గానవచ్చెడి పౌరాణికవంశానుక్రమణికను గల్పించి రని తోచుచున్నది.

పూర్వచాళుక్యప్రశస్తిపరిణామమున విమలాదిత్యుని కాల మొక ముఖ్యఘట్టమైయున్నది. కుబ్జవిష్ణువర్ధనుని కాలమునుండి గుణగ విజయాదిత్యునివఱకును గల రాజుల శాసనములలోని ప్రశస్తి కొన్ని యల్పభేదములతో నాంధ్రదేశమును బాలించిన ప్రాచీన నృపాలుర ప్రశస్తివలె నున్నది. వానియందు సాధారణముగ దాతయొక్క పితృ పితామహులుమాత్రమే పేర్కొనబడియున్నారు. వారినిగూర్చి మఱి యెట్టి విశేషములును నందు కానరావు. గుణగవిజయాదిత్యుడు సింహాసనము నధిష్ఠించినది మొదలు పూర్వచాళుక్యప్రశస్తియం దొక క్రొత్త మార్పు గానవచ్చెడిని. పితృపితామహులతోపాటు వేంగియం దాదినుండియు ప్రభుత్వమొనర్చిన తూర్పుచాళుక్యరాజుల నందఱిని, వారి ప్రత్యేకరాజ్యకాలములను దెల్పు నాచారము ప్రారంభ మాయెను. పురుషాంతరములు గడచుకొలదియు గ్రమక్రమముగ బ్రశస్తియు నభివృద్ధి జెందుచువచ్చి కడపట వంశచరిత్రగ బరిణామ మందెను. విమలాదిత్యుని రాజ్యాభిషేకకాలమువఱకు వేరుమార్పు నందక ఇట్లే వాడుకయం దుండెను. తరువాత నింకొక మార్పు బొడ కట్టెడిని. పౌరాణికవంశక్రమమును, నయోధ్యాసంపర్కమును విజ యాదిత్య దక్షిణాపథగమనమును నప్పుడు నూతనముగ వంశచరి త్రతో జోడింపబడెను.

పౌరాణికవంశనిర్మాణమునకు గారణ మెద్దియో తెలియదు. క్రీ. శ. ౧౧-వ శతాబ్దారంభమునుండియు గలిగిన చోళరాజకుటుం బముతోటి సంబంధ మొక కారణ మైయుండవచ్చును. అప్పటి నుండియు బూర్వచాళుక్యులు చోళచక్రవర్తుల కాశ్రితులైరి.

వేంగి రాజ్యము స్వాతంత్ర్యరహితమై చోళసామ్రాజ్యాంతర్గతసంస్థాన ముగ మారెను. పూర్వచాళుక్యవంశజులు చోళచక్రవర్తుల కొలువున బ్రవేశించి చోళరాష్ట్రమున రాజకీయోద్యోగము సేయ నారంభించిరి.[1] చోళచక్రవర్తి మొదటి రాజరాజుకుమార్తెయగు కుందవను వివాహమాడి విమలాదిత్యుడు దన రాజ్యాభిషేకమునకు బూర్వము జోళరాజధానియగు దంజనగరప్రాంతమున నుండు దిరువైయ్యారు ప్రాసాదమున నివసించుచుండెను. పట్టాభిషిక్తుడై రాజ్యము సేయుచుండగా నొక్క పర్యాయ మతడు మామగారి కడ కరిగినట్లు గాన వచ్చుచున్నది.[2] చోళరాజకన్యను బెండ్లాడి, చోళరాజ్యమున నివసించుచుండుకాలమున విమలాదిత్యునకు దన వంశమునకు పౌరాణిక రాజవంశములతో సంబంధము గల్పించుకొనవలయు నని యిచ్ఛ పొడమియుండును. చోళచక్రవర్తి దన వంశము స్వాయంభువు, బ్రహ్మ, సూర్యుడు, మనువు, ఇక్ష్వాకు, రాముడు మొదలగు పురాణ పురుషులనుండి యుప్పత్తిల్లె నని విశ్వసించి, తాను సూర్యవంశక్షత్రియుడ నని ప్రకటించుకొనుచుండెను. అంతటి యుదాత్తరాజవంశముతో వివాహసంబంధము గావించుకొనిన విమలాదిత్యుడు స్వవంశ మంతకు దీసిపోయిన దని చెప్పుట కంగీకరించునా? తాను చోళుల యాశ్రితుడై నంతమాత్రముననే చిరకాలము సామ్రాజ్యవైభవ మనుభవించిన నిజవంశ ప్రాధాన్యత యంతరించిపోవునా? కావున మామగారి వంశమువలె దన వంశమును బ్రాచీనక్షత్రియవంశ మని ప్రకటించుకొనుటకు విమలాదిత్యుడు పౌరాణిక వంశానుక్రమణికను నిర్మించుకొని శాసనస్థము గావించుకొనెను. చోళులు దమ వంశము సూర్యునినుండి పుట్టినట్లు చెప్పుకొన, విమలాదిత్యుడు దన వంశము సూర్యుని జోడగు చంద్రునుండి యుత్పత్తియాయెననియు, మన్వాది

---

1. ARE 44 of 1896.

2. ARE 633 of 1902 (S. I. I. viii 234); 215 of 1894 (S. I. I. v., 514.)

పురాణపురుషులకు సములైన బుధ, పురూరవ, భరత పాండవాదులు దన వంశమునకు మూలపురుషు లనియు దెల్పెను.

ఈపట్టున విచారణీయమైన యంశ మింకొకటి కలదు. చాళుక్యవంశకర్త యనబడు విజయాదిత్యుడు చారిత్రకపురుషుడా, లేక కల్పితపురుషుడా? పరిశోధకపండితులు కొందఱు ఇతడు చారిత్రకపురుషుడనియు, త్రిలోచనపల్లవకరికాలచోళుల సమకాలికుడనియు నభిప్రాయపడుచున్నారు.[1] కాని ఈ సిద్ధాంతమున కాశ్రయభూతములైన యాధారములు కేవల మర్వాచీనము లగుటచే విశ్వాసపాత్రములు గావు. చాళుక్యకులమునకెల్ల మూలకంద మనదగిన బాదామిచాళుక్యవంశమున నీ విజయాదిత్యునికి తావు లేదు. వంశకర్త ప్రస్తావనాసందర్భమున బాదామిచాళుక్యరాజులు విజయాదిత్యుని పేర్కొనకపోవుటయేకాక తమ వంశమునకు మూలపురుషుడు జయసింహవల్లభు డని తెల్పుదురు. జయసింహునికి విజయాదిత్యుడను నామాంతర మున్నట్లెందును లేదు. కల్యాణిచాళుక్యులుగూడ నీసందర్భమున విజయాదిత్యుని బేర్కొనరు, కౌథేయముశాసనమున విజయాదిత్యసంస్మరణ కలదు. కాని యది యొక ప్రత్యేకవ్యక్తిని దెల్పునామము గాదు; చాళుక్యరాజుల విశేషనామము: బిరుదని చెప్పవచ్చును. ఈ క్రిందివాక్యము దీనిని దెల్లము జేయుచున్నది:

"సమస్తభువనాశ్రయ సర్వలోకాశ్రయ విష్ణువర్ధన విజయాదిత్యాది విశేషనామానామ్ రాజరత్నానా ముద్భవభూమిః"[2]

కావున నీ విజయాదిత్యనామము ఇచ్చట సమస్తభువనాశ్రయ సర్వలోకాశ్రయ నామముల తరగతికి జేరినది; వట్టి బిరుదు. పూర్వచాళుక్యులయందుగూడ విమలాదిత్యుని పూర్వికు లెవ్వరు విజయా

1. ఆచార్య కె. ఏ. నీలకంఠశాస్త్రి: చోళ స్టడీస్. పుటలు ౫౪-౬౧. పూర్వము ప్రస్తుత వ్యాసకర్తగూడ నిట్టి యభిప్రాయమును గలిగియుండెను. కాని ఇటీవలి పరిశోధనమువల్ల నిది సమంజసము గాదని తోచుటచే దీనిని విసర్జించెను.

2. ఇం. ఆంటి. సం. ౧౬. పుట ౨౧.

దిత్యుడు దమ వంశకర్త యని చెప్పియుండలేదు. వారెవ్వరును వంశకర్తవిజయాదిత్యు నెఱుగరు. పైజెప్పిన యంశముల నన్నిటిని కణిశించిచూడగా విజయాదిత్యుడు చారిత్రకవ్యక్తి యనియు, జాళుక్య వంశస్థాపకు డనియు జెప్పుట సమంజసముగాదని తోచుచున్నది.

చారిత్రకము:—పూర్వచాళుక్య ప్రశస్తియందలి చారిత్రక భాగము వంశానుచరితముగ నేర్పడు చున్న దని మీాద జెప్పియున్నాను. పూర్వచాళుక్యశాసనములలోని విశేషచరిత్రాంశము లెల్ల నిందు సూత్రప్రాయముగ వర్ణింపబడియున్నవి. కాని తగిన వ్యాఖ్యానము లేక వానిని గ్రహించుట సాధ్యముగాదు. శాసనోక్త విషయగ్రహణమునకు వంశాను చరిత్రజ్ఞాన మంతగ నావశ్యకము కాకపోవుటచేతను, గ్రంథబాహుళ్యభీతిచేతను ఇచట వ్యాఖ్యానరచనకు బూనుకొనలేదు. పూర్వ చాళుక్యశాసనముల స్వభావము నెఱిగినవారికందఱికిని వారి వంశానుచరిత్ర పరిచితమే. కుబ్జవిష్ణువు మొదలు రాజరాజనరేంద్రునివఱకు నడచిన చరిత్ర రాజరాజనరేంద్రుని యితర శాసనములం దున్నట్లే యిందును గలదు. కాని యల్పభేద మొకటి యిందు గానవచ్చుచున్నది. పూర్వచాళుక్యశాసనము లన్నిటియందును కుబ్జవిష్ణువును, నాతని తదనంతరము రాజ్యపాలన మొనర్చిన మొదటి జయసింహుని పేర్కొనిన పిమ్మట "తదనుజేంద్ర రాజ స్సప్తదినాని" యని యుండగా నీశాసనమునను, కోరుమెల్లి శాసనమునను "తదనుజేంద్రరాజనందన స్సప్తదినాని" (పం. 33)[1] యని యున్నది. ఇది కేవల ప్రమాదజనిత మని తలచెదను. ఏలనగా 'ఇంద్రరాజనందనః' యని మఱి యే పూర్వచాళుక్య శాసనమునను గానరాదు. 'ఇంద్రరాజః' అనియే యన్నిటను గలదు. మీాదు మిక్కిలి యేడు దినము లేలినవాడు ఇంద్రభట్టారకాపరనామధేయు డగు నింద్రరాజుగాని యతని నందనుడు గాడు. ఇంద్రరాజుకొమారుడిమ్మడి విష్ణువర్ధనమహారాజు. ఇతడు తొమ్మిదివర్షములు రాజ్యము

1. ఇం. ఆంటి. సం. ౧౪, పు. ౫౨. (పం. ౩౭.)

సల్పిన ట్లన్ని పూర్వచాళుక్యశాసనములందును గలదు. కావున 'ఇంద్రరాజనందనః' యనునది తప్పనియు, నుల్లేఖకుని ప్రమాదము వల్ల గలిగిన యపపాఠ మనియు నిశ్చయముగ జెప్పవచ్చును.

పూర్వ చాళుక్య శాసనములలో గానవచ్చువంశావళియే యిందును గానవచ్చుచున్నది. రాజరాజనరేంద్రుని కోరుమెల్లినందం పూండిశాసనములు దీని కత్యంతసన్నిహితములు. కాని యిందు రాజ రాజనరేంద్రుని గూర్చి కొన్ని నూతనాంశములు గలవు. కోరుమెల్లి నందంపూండి శాసనములలోవలె నిచటను గుందవాంబావిమలా దిత్యుల వివాహమును, రాజరాజనరేంద్రుని జననమును వర్ణింపబడి నవి. ఇందును రాజరాజనరేంద్రుని పట్టాభిషేకకాలనిరూపణశ్లోకము గలదు. శకము ౯౪౪-వ సంవత్సర సింహ బ॥ ౨ గురువారమున నుత్తరభాద్రాసహితవణిజిల్లగ్నమున నతని పట్టాభిషేకమహోత్సవము నడచెను. ఈ విషయములు చిరపరిచితములే. ఇవిగాక నిం దొకటి రెండు నూతనాంశములు బొడకట్టుచున్నవి. రాజరాజనరేంద్రుడు బాల్యదశయందే యావరాజ్యపదచిహ్నమైన రత్నకంఠికను బడసె నట. మఱియు నతని సుగుణసంపత్తిని విని సంతసించి యతని మాతు లుడు చోళచక్రవర్తి రాజేంద్రచోళమధురాంతకదేవుడు దన కుమార్తెయగు నమ్మంగదేవి నిచ్చి యుద్వాహము గావించెనట. అమ్మంగదేవీ వివాహప్రసంగ సందర్భమున నామె తండ్రియగు రాజేంద్రచోళచక్రవర్తిప్రశంస కొంత కలదు. అతని కీర్తివైభవ మును, పరాక్రమాతిశయమును, రాజ్యవిస్తారమును విపులముగ వర్ణింపబడియున్నది (పం. ౫౮-౬౪). కాని యందు బేర్కొనదగిన విశేషచరిత్రాంశము లేవియు గానరావు. "ఏకస్యాసీదపి స హిమ వాన్", "సద్వీపం చతురంబురాశిపరిఖాం" (పం. ౫౮-౬౨) అను శ్లోకములు రాజేంద్రచోళుని గంగా దండయాత్రను, బూర్వ సము ద్రాంతర్గత ద్వీపవిజయమును సూచించునేమో.

## ౨

ఈ శాసనగ్రంథము రాజరాజనరేంద్రుని జీవితమున నడచిన ముఖ్యాంశములను నాల్గింటిని దెల్పుచున్నది: (౧) జననము, (౨) యౌవరాజ్యాభిషేకము, (౩) రాజ్యాభిషేకము, (౪) వివాహము. వీనియం దొక్కొక యంశమును గూర్చియు జెప్పదగిన విషయము కొంతయున్నది.

౧. జననము :— రాజరాజనరేంద్రుని జన్మకాలమును దెల్పు గ్రంథ సామగ్రి యెద్దియు నింతవఱకు లభింపలేదు. సూక్ష్మముగ నిర్ధారించుటకు సాధ్యము గాకపోయినను మన కింతవఱకు దెలిసిన చరిత్రాంశముల నాధారపఱచుకొని యుజ్జాయించి స్థూలముగ నతని జన్మకాలమును సూచింపవచ్చును. బాల్యముననే రాజరాజనరేంద్రుడు యౌవరాజ్యపదచిహ్నమగు రత్నకంఠికను బడసె నని పరిష్కృతమగు నీశాసనమువల్ల దెలియుచున్నది గదా.[1] యౌవరాజ్యపదచిహ్నమగు నీకంఠిక రాజరాజనరేంద్రు డతని తండ్రియగు విమలాదిత్యుని రాజ్యాభిషేకమునకు బూర్వము బడసియుండజాలడు. విమలాదిత్యుని రాజ్యాభిషేకము క్రీ. శ. ౧౦౧౧ లో జరిగెను. రాజరాజనరేంద్రుని యౌవరాజ్యాభిషేక మతని తండ్రి సింహాసనము నధిష్ఠించిన పిమ్మటనే జరిగి యుండవలయును. ఒకవేళ నతని యౌవరాజ్యాభిషేక మతని తండ్రిపట్టాభిషేకముతోపాటు క్రీ. శ. ౧౦౧౧ లో నడిచెననియు, నప్పటికిని రాజరాజనరేంద్రుడు పదునారేండ్లప్రాయము గలవాడనియు దలచినచో నతడు క్రీ. శ. ౯౯౫-వ సంవత్సరమున బుట్టియుండవలయును.

౨. యౌవరాజ్యాభిషేకము :— రాజరాజనరేంద్రుని యౌవరాజ్యాభిషేకము నిరభ్యంతరముగ జరిగియుండవలయును. అతడు

1. పం. ౫౨-౫౩. 'బాల్యే భూషణ మభవ ద్రత్నమయీ యస్య కంఠికా కంఠే.'

విమలాదిత్యుని జ్యేష్ఠపుత్రుడు.[1] మీదుమిక్కిలి యొక చోళచక్రవర్తిమనుమడు; మఱియొక చోళచక్రవర్తి మేనల్లుడు. కావున యౌవరాజ్యపదమున కతనికి గల సహజమైనహక్కునకు దోడు తల్లివంకబంధువుల ప్రోద్బలమును జేకూడెను. ఇక నతని యౌవరాజ్యపట్టాభిషేకము నిరాటంకముగ జరిగెనని నిస్సంశయముగ బలుకవచ్చును.

3. యౌవరాజ్యాభిషేక మిట్లు నిర్బాధకముగ గొనసాగినను రాజ్యాభిషేక మంత సులభముగ జరుగలేదు. కోరుమెల్లి నందంపూండి తామ్రశాసనములవలె నీశాసనమును రాజరాజనరేంద్రుని రాజ్యాభిషేకము శకము ౯౪౪-వ సంవత్సర సింహ బ. ౨ గురువారమున నుత్తరభాద్రాసహితవణిజిల్లగ్నమున జరిగె నని తెల్పుచున్నదికదా! పూర్వచాళుక్యశాసనము లన్నియు విమలాదిత్యుని యనంతరము రాజరాజనరేంద్రుడు సింహాసనము నధిష్ఠించినట్లు తెల్పుచున్నవి. ఇందువల్ల విమలాదిత్యుని రాజ్యకాలము ముగిసినవెంటనే రాజరాజనరేంద్రుని పాలన ప్రారంభమాయె నను తలపు సహజముగ గలుగుచున్నది. కాని యిది సరియని చెప్పుటకు వీలుకాదు. విమలాదిత్యుడు శకము ౯33-వ సంవత్సరమున బట్టాభిషిక్తు డాయెనని యతని రణస్తిపూండిశాసనము దెల్పుచున్నది. మఱియు నా శాసనోక్త దాన మాతని యష్టమవర్షసింహమాసమున నిచ్చిన ట్లందే చెప్పియుండుటచే[2] విమలాదిత్యుడు శకము ౯౪౦-వ సంవత్సర సింహమాసమువఱకు రాజ్యమొనర్చెననుట నిస్సంశయము. తరువాత

1. మహాభారతకర్త నన్నియభట్టీయంశమును స్పష్టముగ దెలియపఱచి యున్నాడు:

"సత్యాశ్రయకులశేఖర నిత్యోదయరాజరాజనృప సుకవిజన
స్తుత్యమహాగుణ విమలాదిత్యాగ్రతనూజ విమలధీరమణీయా."

(ఆం. భా. ఆది. ౪-౧౭౨)

2. ఎపి. ఇండికా. సం. ౬, పుటలు 3౫౮, 3౬౧.

నాత డెంతకాలము రాజ్యము సేయుచుండెనో తెలియదు. కాని యతని సంతతివారి శాసనములం దన్నింటను నత డేడు సంవత్సరముల కాలమే రాజ్యపరిపాలన మొనర్చినట్లు చెప్పియుండుటచేత నతని నేలుబడి యష్టమరాజ్యవర్షము సంపూర్తి కాకమునుపే సమాప్తమై యుండవలయు నని తోచుచున్నది. ఈయూహాసరియైనచో విమలాదిత్యుని యంతిమ రాజ్యవర్షమునకును, రాజరాజనరేంద్రుని పట్టాభిషేకకాలమునకును మధ్య నాలుగేండ్ల యెడ యేర్పడి పూర్వచాళుక్య రాజ్యకాలానుక్రమణికయం దొక విచ్ఛిత్తి కలుగుచున్నది. దీనికి గారణ మారయ సమకట్టి పరిశోధకులు భిన్నమార్గముల ద్రొక్కుచు కొన్ని యభిప్రాయములను వెలిబుచ్చియున్నారు. గంజాంమండలములోని మహేంద్రగిరిపై నుండు, కాలము దెలియని, రెండు శిలాశాసనములను, జోళచక్రవర్తి మొదటి రాజరాజదేవుని ౨౧-వ రాజ్యవర్షమున (శకము ౯౩౬) తంజనగర పరిసరమున నుండు తిరువైయ్యారుగ్రామమునందలి పంచనదేశ్వరుని దేవాలయమున జెక్కించిన మఱియొక శిలాశాసనమును[1] నాధారపఱచుకొని, మొదటి రాజరాజచోళుడును నాతని పుత్రుడును క్రీ. శ. ౧౦౧౩-౪ (అనగా శకము ౯౩౫)న వేంగిపై దండువెడలి విమలాదిత్యుని బందీకృతుని గావించి తంజనగరమునకు జెఱగొనిపోయి రనియు, నవ్వల గొంతకాలము గడచినపిమ్మట నతని బంధవిముక్తుని గావించి చోళచక్రవర్తి దన కూతురగు గుందవాంబ నతని కిచ్చి యుద్వాహము గావించి క్రీ. శ. ౧౦౧౫-వ (శకము ౯౩౭) వర్షమున వేంగి నేలుటకు మరల నంపెననియు, నీకారణమువల్ల విమలాదిత్యుడు వాస్తవముగ శకము ౯౩౩ మొదలు ౯౪౪ పర్యంతము పదునొకం డేండ్లు ప్రజాపాలన మొనర్చినను దాని గణింపక అతని సంతతివా రతడు బంధవిముక్తుడై తిరిగి వేంగి నేలవచ్చినది మొదలు రాజరాజనరేం

1. ARE 396 of 1896 (S. I. I. v.) 215 of 1894 (S. I. I. v. 514.)

ద్రుని పట్టాభిషేకకాలమువఱకు లెక్కవేసి యతని రాజ్యకాల మేడేండ్లని చెప్పిరనియు గొందఱి యభిప్రాయము.[1]

ఈయభిప్రాయ మంగీకరింపదగినది కాదు. ఇచట జెప్పిన చొప్పున విమలాదిత్యుడు వాస్తవముగ శ. ౯౩౩ మొదలు శ. ౯౪౪ వఱకు పదునొకండు సంవత్సరములు రాజ్యపాలన మే చేసియుండెనేని యతని సంతతివా రతని రాజ్యకాలమున మొదటి నాలుగేండ్ల నే కారణమున వదలిపెట్టిరో తెలుపలేదు. అది యట్లుండగా మహేంద్ర గిరి శిలాశాసనము లీ యభిప్రాయమున కాధారభూతములు గాజా లవు. ప్రప్రథమమున నందు పేర్కొనబడిన రాజేంద్రచోళు డెవ్వడో కనుగొనవలసియున్నది. ఇతడు చోళచక్రవర్తి మొదటి రాజరాజ దేవుని కుమారుడగు మొదటి రాజేంద్రచోళ చక్రవర్తి యని పరి శోధకు లందఱు నిశ్చయించియున్నారు. కాని యీవ్యక్తినిర్ధారణ సంశయగ్రస్తము. మహేంద్రగిరిశాసనములలోని రాజేంద్రచోళు డేరాజేంద్రచోళుడో నిశ్చయించిచెప్పుటకు దగు సాధనములు లేవు. వాదమునకై యతడు చోళచక్రవర్తి మొదటి రాజేంద్రచోళుడే యని యొప్పుకొన్నను నతనిచే బట్టుపడి చెఱబోయినవాడు చాళుక్య విమలాదిత్యుడు గాడు. "నిస్తీర్థ్వా న్నిజవిక్రమేణ విమలాదిత్యం కులూతేశ్వరం" అని స్పష్టముగ మహేంద్రగిరిశాసనముననే యత డెవ్వ డైనదియు వివరించియున్నది.

ఇందువల్ల చాళుక్యవిమలాదిత్యుడు చోళచక్రవర్తిచే బట్టు పడలే దని తెల్లమగుచున్నది. ఇక నతడు నిర్బంధితుడై తంజనగర మున నుండెనేమో విచారించవలసియున్నది. ఈ యంశమును రుజువు సేయుటకై యుదాహరింపబడిన తిరువైయూరుశాసనమునందు చెఱ మాటయే లేదు. విష్ణువర్ధనమహారాజను పేరుగల విమలాదిత్యదేవు

1. ఎపి. ఇండి. సం. ౬, పుట ౩౫౦.

డాయూర నుండిన లోకమహాదేవీశ్వర ముడయ మహాదేవుని యాల యమునకు గొన్ని రజతపాత్రల నిచ్చెనని తెల్పుచున్నది.[1] విమలా దిత్య రాజరాజచోళుల యన్యోన్యబంధుత్వప్రస్తాప మిందు లేదు. ఆకారణమువల్ల విమలాదిత్యకుందవాంబల వివాహ మప్పటి కింకను జరుగలేదని తలపరాదు. ఏలన క్రీ. శ. ౧౦౧౦ (శ. ౯౩౨) నాటి తిరువలఞ్జులిశిలాశాసనము విమలాదిత్యుడు కుందవాంబయొక్క భర్త యని తెల్పుచున్నది.[2] ఇందుమూలమున విమలాదిత్యుడు నిజ రాజ్యాభిషేకమునకు బూర్వమే కుందవాంబను బెండ్లాడె నని నిశ్చయ మగుచున్నది. కావున విమలాదిత్యుడు చోళులచే జిక్కుటయు, దంజ నగరమున జెఱయందు నిర్బంధితుడై యుండుటయు నాకాశపురా ణములని నిశ్చయము.

ఈ సందర్భమున పరామర్శింపదగిన యభిప్రాయ మింకొకటి కలదు. రణస్తిపూండిశాసనమునందు 'పరమబ్రహ్మణ్య' 'పరమమాహే శ్వర' యను నభిధలు విమలాదిత్యుని కుండినట్లు చెప్పియుండుటవల్ల నత డప్పటివఱకును (అనగా శాసనకాలమగు రాజ్యాష్టమవర్షము వఱకును) శైవు డనియు, తదనంతరము జెక్కబడిన కాలము దెలి యని రామతీర్థ శిలాశాసనమున నతని గురువు త్రికాలయోగి సిద్ధాంత దేవు డని చెప్పియుండుకారణమువల్లను[3] నతడు విరక్తుడై జైనదీక్ష బుచ్చుకొని దేశపాలనమును దన పుత్రుడైన రాజనరేంద్రుని కప్ప జెప్పి శ. ౯౪౪ వఱకు దపోనిష్ఠాగరిష్ఠుడై యుండి దేహము జాలించె ననియు, నాకారణమువల్ల శ. ౯౪౦ మొదలు రాజ్యపాలన మంతయు రాజరాజనరేంద్రుని మూలమున జరుగుచుండినను విమలాదిత్యుని

1. 215 of 1895, S. I. I. v. 514.
2. 633 of 1902. S. I. I. viii 234.
3. ARE 831 of 1917. S. I. I. ix, i 403.

మరణానంతరముగాని యతని పట్టాభిషేకము నడచుటకు వీలుగాక పోయెననియు గొందఱు తలంచుచున్నారు[1].

ఈ యూహాసైతము దృష్టికర మైనది కాదు. రామతీర్థశాసనమున త్రికాలయోగిసిద్ధాంతదేవుడు 'విమలాదిత్యన గురుగళ్' అని చెప్పియుండుటచేత నతడు విమలాదిత్యునికి మతదీక్ష నొసగిన యాచార్యు డనుట కవకాశము గలదు. కాలము దెలియని యాశాసన మెప్పటిదో? విమలాదిత్యుని కడపటి దినములలోనే దీనిని జెక్కియుందు రని నిరారించి చెప్పదగిన సాక్ష్య మెద్దియు గానరాదు. రామతీర్థశాసనము విమలాదిత్యుని రాజ్యారంభదశ కేల జెంది యుండగూడదు? మొదట జైను డైయుండి యవ్వల శైవమతము నేల స్వీకరించియుండరాదు? కావున రామతీర్థశాసన మీ పట్టున నుపయోగింపదు. ఇంకొకమాట. విరక్తుడై, జైనసన్న్యాసియై సర్వసంగపరిత్యాగము గావించిన విమలాదిత్యుడు శ. ౯౪౪ వఱకును నామకార్థమేనియు రాజుగ నుండె ననుట యెట్లు పొసగును? జైనరాజులు సన్న్యసింప నిశ్చయించి తమ పుత్రులకు రాజ్యాభిషేక మొనర్చి యరణ్యములకు బోయినట్లు జైనగ్రంథములు దెల్పుచున్నవి. విమలాదిత్యు డట్లే రాజరాజనరేంద్రునికి బట్టాభిషేక మొనర్చిసన్న్యసించియుండవచ్చునుగదా. సన్న్యసించి రాజ్యవిముఖుడై తపస్వియైపోయిన తండ్రిచావున కెదురుచూచు రాజరాజనరేంద్రుడు దన పట్టాభిషేకము నేల యాపుకొనవలసివచ్చెనో తెలియదు. కాన నీయభిప్రాయము గూడ సంగతము గాదు.

పట్టాభిషేకమునకు (శ. ౯౪౪) గొన్ని యేండ్లకుమును పే రాజరాజనరేంద్రుని యేలుబడి యారంభ మాయె నని చెప్పుటకు గొంత యాధారము గలదు. ఇతడు నలువదియొక సంవత్సరములు సంపూర్ణముగ రాజ్యపాలన మొనర్చిన పిమ్మట నితని పదచ్యుతుని గావించి

1. జర్నల్ ఆఫ్ ది ఓరియంటల్ రిసర్చ్, సం. ౫, పుట ౪౨.

సింహాసన మధిష్ఠించిన వాడగు నితని సవతి తమ్ముని- సప్తమ విజయాదిత్యుని- పుత్రుడగు నిమ్మడికీర్తివర్మ శ. ౯౭౩ తులా శు. ౨ గురువారమునాడు అనూరాధాయుక్తకుంభలగ్నమున బట్టాభిషిక్తుడాయెను.[1] ఇందువల్ల శ. ౯౮౩ నకు ముందు రాజరాజనరేంద్రుడు సంపూర్ణముగ నలువదియొక్క సంవత్సరములు వేంగి నేలినట్లు తెల్లమగుచున్నది. రాజరాజనరేంద్రుని శాసన మొకటి యతని నలువదియొకటవ రాజ్యవర్షమున జెక్కినది దీని సత్యమును రుజువుపఱచుచున్నది.[2] శ. ౯౮౩ లో నతడు రాజ్యపాలన జేసిన ౪౧ సంవత్సరములు దీసివేయగా నతడు శ. ౯౪౨ లో రాజ్యపాలన నారంభించెనని తేలుచున్నది. ఇంతే కాదు. రాజరాజనరేంద్రుని శిలాశాసనములు కొన్ని పై విషయమునే వ్యక్తపఱచుచున్నవి. ఇవి శకాబ్దములతోపాటు రాజ్యవర్షములను దెల్పుచుండుటచేత రాజ్యారంభకాలమును గనుగొనుట కనువుపడుచున్నవి. ద్రాక్షారామ భీమేశ్వరాలయమునందలి యుగ్రాణములో నుండు నొక చాపఱాయిమీద సర్వలోకాశ్రయవిష్ణువర్ధన మహారా జను నామాంతరము గల రాజరాజదేవుని శాసనము శ. ౯౬౮ నకు సరియగు ౨౬-వ రాజ్యవర్షమున వ్రాయించిన దొకటి కలదు.[3] శ. ౯౮౦-వ సంవత్సరమునకు సరియైన ౩౮-వ రాజ్యవర్షమున వేయించిన శాసన మింకొకటి గుంటూరుమండలములోని తెనాలితాలూకాకు జెందిన నందివెలుగు గ్రామములోని శివాలయముకప్పుమీద గానవచ్చుచున్నది.[4] మఱి యొకటి శ. ౯౮౩ ప్లవసంవత్సరమునకు సరియైన సర్వలోకాశ్రయ విష్ణువర్ధనమహారాజుగారి ౪౧-వ రాజ్యవర్షమున జెక్కించినది పై తాలూకాలోని వలివేరు గ్రామమందలి శివాలయమున కెదుట బడి

---

1. ఆంధ్రచారిత్రకపరిశోధనసంఘపత్రిక సం. ౫, పుట ౪౭.
2. ARE 671 of 1920.
3. ARE 183 of 1893, SII. IV. No. 1008.
4. ARE 663 of 1920.

యున్న బండపై నున్నది.[1] ఈశాసనములు రాజరాజనరేంద్రుని పరిపాలన భిన్నకాలముల నారంభమైనట్లు సూచించుచున్నవి.

ఈపట్టికయందు బొందుపఱచిన శాసనములవల్ల రాజరాజనరేంద్రుని పరిపాలన భిన్నకాలముల యందు రెండు పర్యాయము

| శాసనసంఖ్య | శకాబ్దము | రాజ్య వర్షము | రాజ్యారంభ కాలము |
|---|---|---|---|
| 163 of 1893 | ౯౬౯ | ౨౬ | ౯౪౩ |
| 663 of 1920 | ౯౭౦ | ౩౫ | ౯౪౩ |
| 671 of 1920 | ౯౭౩ | ౪౧ | ౯౩౨ |

లారంభమైనట్లు తెలియవచ్చుచున్నది. పరిపాలన భిన్నకాలముల ప్రారంభమగుట యెట్లు పొసగును, ఇచట గానవచ్చు వ్యత్యాసమెట్లేర్పడినది యను నీయంశములు విచారణీయములు. శాసనముల కాలమును దెల్పునపుడు కొన్ని యెడల గతాబ్దమును, మఱికొన్ని యెడల వర్తమానాబ్దమును నమూదుసేయు నాచారము ప్రాచీనకాలమున వాడుకయందుండెను. రాజరాజనరేంద్రుని పాలన రెండు భిన్నకాలములయందు ప్రారంభమాయె నని తలచుటకంటె నీయాచారముచొప్పున పై శాసనముల గానవచ్చు శకాబ్దములు కొన్ని గతములనియును, మఱి కొన్ని వర్తమానములనియు నూహించుట లెస్స. ఈ శకాబ్దము లన్నియు గతములో, వర్తమానములో నిర్ధారించి చెప్పుటకు దగిన సామగ్రి లేదు. కాని కడపట బేర్కొనబడిన శాసనమున (671 of 1920) శకాబ్దము (౯౭౩) ప్రభవాది షష్ట్యబ్దముల లోని ప్లవనామ సంవత్సరముతో జోడింపబడియుండుటచేత నది గతాబ్దమని నిశ్చయముగ జెప్పవచ్చును.[2] తక్కిన రెంటివిష

1. ARE 671 of 1920.
2. ఇండి. ఎఫిమెరిస్ సం. 3, పుట ౧౨౪.

యమై నిశ్చయించి చెప్పుటకు సాధ్యము గాకున్నను రాజ్యారంభ కాలవ్యత్యయమును దొలగించుటకై యందు జెప్పబడిన శకాబ్దములు వర్తమానాబ్దము లని గ్రహించుట యుక్తము. ఇట్లు సేయుట సమంజసమైనచో వీనిలోని శకాబ్దములనుగూడ గతాబ్దములుగ మార్చి యందుమూలమున రాజ్య ప్రారంభకాలమును నిర్ణయింప వలసియుండును.

| శాసనసంఖ్య | గత శకాబ్దము | రాజ్య వర్షము | రాజ్యారంభ కాలము |
|---|---|---|---|
| 183 of 1892 | ౯౬౮ | ౨౬ | ౯౪౨ |
| 963 of 1920 | ౯౭౯ | ౩౭ | ౯౪౨ |
| 671 of 1920 | ౯౮౩ | ౪౧ | ౯౪౨ |

ఇట్లు పై మూడుశాసనములోని శకాబ్దములను గతాబ్దములుగ బరిగణింపగా రాజరాజనరేంద్రుని పాలన శ. ౯౪౨ న ప్రారంభమాయె నని తేలుచున్నది. ఇది రెండవ శక్తివర్మయొక్క ఆంధ్రసాహిత్యపరిషత్తామ్రశాసనమున సూచింపబడిన రాజరాజనరేంద్రుని రాజ్యారంభకాలమునకు సరిపోవుచున్నది.[1] కాని పై సిద్ధాంతమునకు వ్యతిరిక్తమగు రాజ్యారంభకాలమును దెలుపు శాసనము మఱియొకటి కలదు. ఏడవ విజయాదిత్యుని పాములవాక తామ్రశాసనము విమలాదిత్యునియనంతర మతని పుత్రుడగు రాజరాజు పండ్రెండేండ్లు రాజ్యపాలనము నొనర్చె ననియు, దరువాత విమలాదిత్యుని కుమారుడును, రాజరాజునకు ద్వైమాతురుడును నగు విజయాదిత్యు డాతని వెడల నడచి రాజ్యము నాక్రమించుకొని శకము ౯౫౨-వ సంవత్సర కర్కటశుద్ధ ౫ అదితిసుత దినమున నుత్తరాఫల్గునీనక్షత్రముతో గూడిన కన్యాలగ్నమున బట్టాభిషేకము

1. ఆంధ్రచారిత్రకైతిహాసకసంఘపత్రిక, సం. ౫, పుట ౪౪.

గావించుకొనె ననియు దెల్పుచున్నది.[1] ఈ పాములవాక శాసనమున జెప్పినట్లు శ. ౯౪౨ నకు ముందు పండ్రెండు సంవత్సరములు రాజ రాజనరేంద్రుడు రాజ్యము జేసినది నిక్కమైనయెడల నతడు శ.

---

1. ఆంధ్రచారిత్రకైతిహాసపరిశోధకసంఘ పత్రిక, సం. ౨. పుట ౨౮౪.

"తస్య ముమ్మడిభీమస్య సుతః కృతమతి ర్మహా
రాజరాజాహ్వయో రాజా ద్వాదశాబ్దా నధరా మపాత్ ॥
తం రాజరాజనృపతిం నిర్ధాట్య భువః ప్రసహ్య విజయాదిత్యః
విమలాదిత్యతనూజో తస్య ద్వైమాతురోఽగ్రహీ ద్రాజ్యమ్ ॥
శ్రీమార్ శాకే సమాఘే దృగిషునిధిమితే కర్కిగే కర్కశాంశౌ
శుద్ధాత్మా శుద్ధపంచమ్యాదితిసుతదినే సూర్యభే శౌర్యశాలీ
కన్యాలగ్నే తిథన్యే శశికులతిలకో రాజమార్తాణ్డసూను
ర్వేంగీసామ్రాజ్యపట్టం స్మ వహతి విజయాదిత్యభూపః ప్రతాపీ ॥"

శ్రీ భావరాజు వెంకటకృష్ణారావు పంతులుగారీశ్లోకోక్తవిజయాదిత్యపట్టాభిషేకకాలము శకసంపత్ ౯౫౨ కర్కాటకశుద్ధ ౫ బృహస్పతివార, హస్తానక్షత్ర కన్యాలగ్నమని గ్రహించి యాంగ్లకాలమానమున నది క్రీ. శ. ౧౦౩౦ జూలై తే ౯ ది బృహస్పతివారమునకు సరియగునని గుణించి చెప్పియున్నారు. కాని యిది యంగీకార్యము గాదు. సూర్యభే యనగా హస్తానక్షత్రమనియు, నదితిసుత దిన మనగా బృహస్పతివార మనియు వీరభిప్రాయపడిరి. ఈ శ్లోకమును కలకత్తా ఇంపీరియల్ లైబ్రరీ ప్రధానాధికారవర్గములో నొక్కరగు మిత్రులు శ్రీ కె. జి. శంకర్ ఎం. ఏ. గారి కంపగా వారిందలి కాలము నిట్లు గుణించి, 11-11-1941 నాఁడొక జాబుమూలమున నిట్లు తెలిపిరి: శకదృగిషునిధిమితే=శ౯౫౨=క్రీ. శ. ౧౦౩౦-౩౧ కర్కిగే కర్కశాంశౌ = కరకములో సూర్యుడు. (జూన్-జులై) శుద్ధ పంచమి = శుద్ధ౫. అదితిసుతదినే = ఆదిత్యవారము, సూర్యభే = ఉత్తరఫల్గునీ (ఆర్యమాన్) లేక పూర్వఫల్గునీ (భగ), కన్యాలగ్నే = కన్యాలగ్నము, పూర్వాహ్ణము ౧౦ మొదలు ౧౨ గంటలవఱకు.

ఈయంశము లన్నియు క్రీ. శ. ౧౦౩౧ జూన్ తే ౨౭ ది ఆదివారమునకు చక్కగ సరిపోవుచున్నవి. ఆ దినమున శుద్ధపంచమి తిథి రా౭ కు ముగిసినది; ౮రాలకు పూర్వఫల్గుని యంతమంది యుత్తరఫల్గుని యారంభమాయెను. పూర్వాహ్ణము ౧౦-౧౨ గంటల మధ్య తిథి శుక్ల ౫; నక్షత్రము పూర్వఫల్గుని.

(౯౪౨-౧౦౨=) ౯౪౦-వ సంవత్సరమున రాజ్యపాలన మొనర్ప నారంభించి యుండవలయును. శ. ౯౪౦ సింహాసనమువఱకు విమలాదిత్యుడు ప్రభుత్వము సేయుచుండినట్లు రణస్తిపూండిశాసనము వల్ల విదితమగుచుండుటచేత రాజరాజనరేంద్రుడు తండ్రి గతించిన వెంటనే రాజ్యము సేయదొడగెనని చెప్పవలసియున్నది. లబ్ధమైన శాసనాధారముల కీల్లొండొంటితో బొందుకుదురకపోవుటచే రాజరాజనరేంద్రుని రాజ్యారంభకాలమును సూక్ష్మముగ నిర్ణయించుటకు సాధ్యము కాకున్నది. కాని యతడు దన పట్టాభిషేకమునకు ముందు రెండుమూ డేండ్లనుండియు ప్రభుత్వము సేయుచుండె నని స్పష్టముగ దెలియుచున్నది.

పైన బేర్కొనిన శాసనములు సూచించునట్లు రాజరాజనరేంద్రుడు శ. ౯౪౦ లోనో, లేక శ. ౯౪౧ ననో ప్రభుత్వము సేయ నారంభించినచో, నతడు వెంటనే పట్టాభిషేకము జేసికొనక శ. ౯౪౪ పర్యంతము వేచియుండుటకు గారణ మెద్దియేనియు నుండవలయును. పూర్వచాళుక్యశాసనముల మూలమున దీని దెలిసికొనుటకు సాధ్యము గాకపోయినను, సమకాలిక చోళశాసనములవల్ల వేంగిదేశమున నప్పు డంతఃకలహముల మూలమున గొంత యలజడి కలిగినట్లు దెలియవచ్చుచున్నది.

అనంతపురమండలములోని మడకశిరతాలూకాకు జెందిన కొత్తశివర మను గ్రామమునందలి యాంజనేయస్వామి దేవాలయమున చోళచక్రవర్తి మొదటి రాజేంద్రచోళదేవుని కాలపు శాసనములు రెండుకలవు. ఇందొకటి రాజేంద్రచోళదేవుని దశమరాజ్యవర్షమున (అనగా శ. ౯౪౩ = క్రీ. శ. ౧౦౨౧) వేయించినది. ఇందు రాజేంద్రచోళదేవుని సైన్యాధిపతియు, దిరెమూరునాటిలోని చాత్తమంగళపాలకుడును నగు విక్రమచోటచోటియవరియ మను బిరుదాంకితుడైన అరెయం రాజరాజ మను నతడు మంటపము నొక

దాని గట్టించె నని చెప్పియున్నది. ఇతనికి నాల్మడి (లేక నాన్మ భీమ, చోళనచక్ర, సామంతాభరణ యను బిరుదనామములు గలవు.[1] ఇంకొక దానియందు వీరభీమ, యెదిర్తవర్ కాలన్, సామంతాభరణన్ అను బిరుదులు బేర్కొనబడినవి.[2] మఱియు గొత్తశివర పాతశివర గ్రామముల మధ్యమున నుండు నొక శివాలయమున రెండు శాసనములు గానవచ్చుచున్నవి. ఒకటి పై జెప్పిన నాన్మడి వీము(భీము)ని దెనుగువారిని బేర్కొనుచున్నది. ఇతనికి జయసింఘకులకాల, సామన్తతళప్రహారి యను బిరుదులు గలవు.[3] రెండవది యహితరొట్టశివ యను బిరుదాంకితుడగు నీతడు కళింగ ఒడ్డె తెలుంగులతో జేసిన యుద్ధమును వర్ణించుచున్నది.[4] ఇవి కాక మడకశిర గ్రామమునందలి వేణుగోపాలస్వామియాలయములో మంటపమున మఱి రెండు శాసనములు గానవచ్చుచున్నవి. వీనియం దొకటి మొదటి రాజేంద్రచోళ చక్రవర్తిదశమరాజ్యవర్షమునాటిది. తిరుమూరునాటికి జెందిన శాత్తమంగళాధిపతియు, రాజేంద్రచోళదేవుని చమూనాథుడును నగు విక్రమసోల సోళియవరియ నను నామాంతరము గల అరియన్ రాజరాజ ననునత డిందు బేర్కొనబడియున్నాడు. ఇతనికి యెదిర్తనర్ కాలన్, సామంతకేసరి యను బిరుదులు గలవు.[5] రెండవది రాజేంద్రచోళదేవుడు దన చమూపతియగు సోటియవరస ననునతనికి వేంగిదేశముపై నెత్తిపోయి యాదేశమును స్వాధీనపఱచుకొమ్మని యాజ్ఞ జేసెననియు, నావార్త చెవి సోకినంతనే వేంగిదేశపురాజు పలాయితుడయ్యెననియు దెల్పుచున్నది.[6] ఆచార్య నీలకంఠశాస్త్రిగారు చెప్పిన ట్లీశాసనము లన్నియు నేక కాలమున వేయించినవే.[7] వీనిమూలమున రాజేంద్రచోళచక్రవర్తి తన రాజ్య దశమవర్షమున, ననగా శ. ౯౪౩-వ సంవత్సరమున వేంగిదేశమున కొక దండయాత్ర నంపె

1. ARE 23 of 1917. 2. ARE 24 of 1917. 3. ARE 30 of 1917.
4. ARE 31 of 1917. 5. ARE 752 of 1917. 6. ARE 751 of 1917.
7. చోళులు, సం ౧. పుట ౨౭౯.

సనియు, జోళుల ధాటి కాగజాలక అప్పుడు వేంగి నేలుచుండిన నర పాలుడు దేశత్యాగము జేసి పాఱిపోయె ననియు దెలియుచున్నది.

చోళసైన్యము నెదుర్కొనజాలక పరారియైన వేంగిరాజెవ్వడో తెలియదు. అతని నానవాలు పట్టుట సులభసాధ్యము గాదు. కాని యాతడు చోళులకు బ్రతికూలుడనియు, నాతని శిక్షించుటకే రాజేంద్రచోళదేవుడు పై జెప్పిన దండయాత్రను వేంగి దేశమున కంపెననియు నిశ్చయించి చెప్పవచ్చును. అప్పటి పూర్వ చాళుక్యశాసనాంతర్గతవంశానుచరితమున విమలాదిత్యుని యనంతరము రాజరాజనరేంద్రుడు రాజ్య మేలినట్లు చెప్పియుండుటచేత చోళదండయాత్ర నడచినప్పుడు వేంగి నేలుచుండిన రాజు రాజరాజనరేంద్రు డను నూహ సహజముగ పొడమవచ్చును. కాని యది సంగతము గాదు. రాజరాజనరేంద్రుడు చోళులకు పరమాప్తుడుకాని విరోధి గాడు. అతడు రాజేంద్రచోళచక్రవర్తికి గడు సన్నిహిత బంధుడు; మేనల్లుడు. తాను చోళుల యింటి యాడుబిడ్డ గర్భమున బుట్టితి నని సగర్వముగ దన శాసనములయం దన్నిటను జెప్పుకొని యున్నాడు. మఱియు నతడు చోళులయెడ బ్రతికూలుడై ప్రవర్తించి నట్లు తలచుట కెట్టి యాధారమును గానరాదు. కావున చోళ సైన్యము వచ్చుచున్న దని విని పాఱిపోయిన వేంగిరాజు రాజరాజనరేంద్రుడు కాజాలడు. రాజరాజనరేంద్రుడు కాకపోయిన మఱి యాత డెవ్వ డను ప్రశ్న యొకటి బయలువెడలుచున్నది. ఇతడు రాజరాజనరేంద్రుని ప్రతిస్పర్ధి యని యూహించుటకు గొంత యవకాశము గలదు. ఈ సందర్భమున గమనింపదగిన యంశములు కొన్ని యున్నవి. విమలాదిత్యుని రాజ్యము శ. ౯౪౦ లో ముగిసెను. తండ్రియనంతరము రాజరాజనరేంద్రుని యేలుబడి యారంభమైనట్లు అప్పటి పూర్వచాళుక్యశాసనములు దెల్పుచున్నను, నతని పట్టాభిషేకము మఱి నాలుగేండ్ల తరువాత గాని జరుగలేదు. శ. ౯౪౩

నందో, లేక యించుక ముందో చోళచక్రవర్తి రాజేంద్రదేవుడు వేంగిపై దండెత్తెను. ఈ దండయాత్రకు ప్రతిఫలితముగ వేంగి నేలుచుండిన రాజొకడు దేశమును విడిచి పాఱిపోయెను. అటువెనుక శ. ౯౪౪-వ సంవత్సరమున రాజరాజనరేంద్రుడు పట్టాభిషిక్తుడాయెను. ఈ యంశములను బరిశీలించి చూడ విమలాదిత్యుని యనంతరము వేంగియందు రాజ్యవిప్లవము సంభవించి తన్కాలమున గొంత యలజడి గలిగినట్లు తోచుచున్నది. రాజ్యమున పోరాటము ప్రారంభ మాయెను. పిత్ర్యమైన రాజ్యమును రాజరాజనరేంద్రు నేలనీయక ప్రతిపక్షి యెవ్వడో నాచికొనగా, దుర్బలుడును, నిస్సహాయుడు నైన మేనల్లునికి బాసటగ రాజేంద్రచోళుడు సైన్యము నంపి యతని శత్రుని బాఱదోలి పూర్వ చాళుక్య రాజ్యమున నతని మరల ప్రతిష్ఠించెను. వ్యక్తమైన చరిత్రాంశముల నాధారపఱచుకొని దృఢముగ జెప్పగలిగిన దింతియే.

రాజరాజనరేంద్రుని కడనుండి రాజ్యమును నాచికొన్న శత్రు వెవ్వరో నిశ్చయించి చెప్పుటకు వీలులేదు. కాని చోళ దండయాత్రా సందర్భమున నడచిన కార్యవిశేషములవల్ల నితని గుర్తించుటకు సాధ్యమగునేమో చూతము. ఈ దండయాత్రాచరిత్రనుగూర్చి తెలియవచ్చు విషయ మత్యల్పము. ఇతర జైత్రయాత్రలవలె నిది చోళశాసనములందుగాని, మఱి యెచ్చటగాని విపులముగ వర్ణింపబడలేదు. మడకశిర శాసనములలో దప్ప దీని ప్రస్తావన మఱియెచ్చటను గానరాదు. అందైనను చెప్పబడినవిషయ మతిసంగ్రహము. కావున వీని నత్యంతసూక్ష్మముగ శోధించి యీ దండయాత్రచరిత్రను గనుగొనవలసియున్నది. ఈ దండయాత్రకు నాయకుడైన సోఱియవరసుని బిరుదులలో గొన్నిటిని జూడ వేంగియం దప్పుడు సంభవించిన విప్లవముతో గల్యాణిచాళుక్యులకు గొంత సంబంధ ముండినట్లు తోచుచున్నది. పై జెప్పిన మడకశిర శాసనములలో నొకటి చోఱియ

వరసుడు 'జయసింఘకులకాలు' డని తెల్పుచున్నది. దీనివల్ల జయ సింఘుని కులమును రూపుమాపుటచే నితని కీ పేరు వచ్చెనని చెప్ప వచ్చును. ఇచట పేర్కొనబడిన జయసింఘుడు శ. 932-వ సంవత్సరమున బశ్చిమచాళుక్యసామ్రాజ్యము నేల నారంభించిన జగదేకమల్ల నామాంతరు డగు నిమ్మడి జయసింహుడు. 'జయసింఘకుల కాల' యను బిరుదువల్ల జోళియవరసు శ. 943 నకు బూర్వము చాళుక్యచక్రవర్తియగు జయసింహునితో బోరుసల్పె ననుట నిశ్చయము. ఈ బిరుదును దెల్పు శాసనముననే 'తెలుంగరు'[1] అనగా దెలుగువారు ముఖ్యముగ పేర్కొనబడియుండుటచేత జోళియవరసు జయసింహునితో బోరినది యాంధ్రదేశమునం దనుట తెల్లము. వేంగి దండయాత్రకు పూర్వము చోళియవరసు జయసింహునితో యుద్ధము చేసినట్లు తెల్పు నాధారము లెవ్వియు లేవు. రాజేంద్రచోళుడు రట్టపాడిమీద నంపిన దండయాత్రయందు చోళియవరసు పాల్గొని యుండినందువల్ల నతనికి జయసింఘకులకాలు డను బిరుదు గల్గెనని చెప్పుటకు వీలులేదు. ఏలనగా వేంగి రట్టపాడి దండయాత్రలు రెండును నేకకాలమున జరిగినవి. మఱియు రట్టపాడిదండయాత్ర కేవలము గర్ణాటకమున సాగినది. అందు తెలుగువారి ప్రాముఖ్యమున కవకాశ మేమియు లేదు. కావున జయసింహునితో జోళియవరసు పోరినది తెలుగుదేశమునందే యని చెప్పవలసియున్నది. ఈ యుద్ధమున జయసింహుని గాని, లేక యాతని వంశజు లగు నన్యులనుగాని జయించిన కారణమున జయసింఘకులకాలు డను బిరుదనామము నాతడు వహించియుండును.

రాజేంద్రచోళదేవుడు వేంగి రట్టమండలములపై రెండు సైన్యముల నేకకాలమున నంపుట కేవలము కాకతాళీయ మనుకొనరాదు. ఏదో యొక యుద్దేశము నెఱవేర్చుకొనుటకే రెండు దండయాత్రలను ఏకకాలమున సాగించియుండు ననుట సమంజసము. ఈ సమయమున

1. ARE 30 of 1917.

జయసింహుడు చోళరాజ్యపుసరిహద్దు ప్రాంతమున 'మున్నెన్నడు లేని యాటోపమును జూపుచుండి'నది నిక్కమే. చోళులు రట్టపాడిపై నెత్తిపోవుట కది యొక్కటియే కారణము గాదు. కేవలము రాజ్యాకాంక్షవల్ల నని చెప్పుటకుగూడ వీలులేదు. ఏలన రట్టపాడి దండయాత్రకు పూర్వము జయసింహు డేస్థితియం దుండెనో తరువాతను నా స్థితియందే యుండెను. ముశంగి[1] రణక్షేత్రమున జయసింహుని జయించి యత డేలుచుండిన సార్ధ స ప్త లక్షరాజ్యము నోడిచికొంటి నని రాజేంద్రచోళచక్రవర్తి దన శాసనములయందు బ్రకటించుకొనినను, జయించిన దేశము నతడు స్వాధీనపఱచుకొన్నట్లు గానరాదు. ఈ పట్టున సందేహమున కెడము లేదు. జయసింహుని శాసనము లీ యుద్ధము వల్ల నాతని కీషత్తైనను రాజ్యనష్టము కలుగలే దని తెల్పుచున్నవి. బళ్ళారిమండలమునకు జెందిన హరపణహళ్లి తాలూకా యందలి శిలాశాసనములు రెండు శ. ౯౪-౩, ౯౪౪ నాటివి తుంగభద్రా దక్షిణతటదేశ మంతయు జయసింహుని యధీనమున నుండె నని చెప్పుచున్నవి.[2] మఱియు శ. ౯౪౬ నాటి మిరాజ్ తామ్రపట్టికలందు మహాపరాక్రమశాలియు, పంచద్రామిళాధిపతియు నగు చోళుని జయసింహు డోడించినట్లు స్పష్టముగ జెప్పియున్నది.[3] కావున జయసింహునికి ముశంగిరణమున గలిగిన యోటమివల్ల రాజ్యనష్టము గా లేదనుట నిశ్చయము. రాజేంద్రచోళుడు దాను జయించిన రాష్ట్రమును స్వాధీన పఱచుకొన జాలక పోవుటకు కారణము రెండు విధముల నూహింపవచ్చును. జయించిన దేశమును స్వాధీనపఱచుకొని

1. ఎపి. ఇండి. సం. ౯, పుట ౨౩౩. యుద్ధము నడచినస్థలమగు ముశంగి ఇప్పటి హైదరాబాదురాష్ట్రములోని రాయచూరుమండలాంతర్గత లింగసుగుర తాలూకాకు జెందిన మస్కిగ్రామమే కాని యన్యముగాదు. అచటి చాళుక్య శాసనములందు ఇది హిరియముశంగి యని పేర్కొనబడియున్నది. (చూ: హైద. ఆర్కి. సిరీసు, నెం ౧ ద. పు ౧.

2. ARE 211 of 1918, 294 of 1918.

3. ఇండి. ఆంటి. సం. ౮. పుట ౧౮.

తన యధికారము నందు నెలకొలుపుటకు జాలినంత శక్తిలేకపోయి యైన నుండవలయును, లేక దన వాస్తవోద్దేశమును శత్రుల కెఱుకపడనీయక మఱుగుపఱచి వారిని వంచించుటకు బన్నిన పన్నాగమేనియు గావలయును. మొదటియూహ సరియైన దని తలచుటకు వలనుపడదు. చోళుల యధికార మప్పుడు నిర్వ్యాక్రమముగ సాగు చుండెను. అంతటి పోటు బలిమిగల దండు భరతఖండమున మఱియే రాజుకడను లేదు. కావున శక్తిహీనతవల్ల రాజేంద్రచోళుడు రట్ట పాడియందు దన యధికారమును నిల్పుకొనజాలకపోయె ననుట తగదు. రట్టపాడిని జయించి తనరాజ్యమున గలుపుకొనవలయు నను నుద్దేశముతో రాజేంద్రచోళు డెత్తిపోయిన ట్లగపడదు. వేంగిని దన యధికారముక్రిందికి దెచ్చి తన మేనల్లు నారాజ్యమున కధిపతిగ జేయుటయే యతని ముఖ్యోద్దేశము. కాని వేంగి నాక్రమించుకొని యేలుచుండిన రాజు సులభసాధ్యుడు గాడు. అతనికి మిత్రబలసంపత్తి మెండు. జయసింహుని ప్రాపు గలయంతకాలము నతని నిర్జించుట దుస్సాధ్యము. కావున జయసింహుని జిక్కులపెట్టి వేంగి నతని దృక్పథమునుండి తొలగించి నిస్సహాయుడైన వేంగినాథు నోడించి యా రాజ్యము నాక్రమించుటకొఱకే రాజేంద్రచోళుడు వేంగిరట్టమండలములపై నేలకాలమున దాడివెట్టినది. రట్టమండలమున జోళదండయాత్రవల్ల నత్యంతక్షోభగలిగినను జయసింహుడు దనమిత్రుడైన వేంగిరాజును సంపూర్ణముగ విడనాడలేదు. కొంతసైన్యము నతనికి దోడంపెను. ఈకొంచెపాటి సైన్యము నోడించియే చోళసేనాధిపతి చోఱియవరసు పై జెప్పినట్లు 'జయసింఘకులకాల' యను బిరుదును వహించినది.

జయసింహు నోడించినంతటనే వేంగి చోళులకు స్వాధీనముగాలేదు. రాజరాజనరేంద్రుని ప్రతిస్పర్ధికి మిత్రుడు జయసింహు డొక్కడే కాడు. కళింగోత్కళాధిపతులుగూడ నతనికి సాహాయ్యులే. కొత్తశివరశాసనములలో నొక్కటి చోళదండనాయకుడగు చోఱియవరసు కాళింగులను నొడ్డెవారిని దెలుగువారిని నోడించె నని తెల్పు

చున్నది.[1] దీనినిబట్టి చూడ వేంగిరాజు దనరాష్ట్రమును దూర్పుదెస నానుకొనియుండు కళింగోత్కళరాష్ట్రాధీశ్వరులతో సఖ్యము గావించుకొనిన ట్లున్నది. పశ్చిమకళింగరాజ్యమును జాళుక్యు లాక్రమించిన నాటనుండియు గళింగాధిపతులు వేంగిరాజకీయపరిస్థితులను గడు శ్రద్ధతోనరయుచు, సమయము పడినపుడెల్ల వేంగీశ్వరుల బలమును గ్రుంగదీయుటకు సంసిద్ధులగువారు. చోళచక్రవర్తి కాశ్రితుడైన వేంగిరాజు దమకు బ్రక్కలోని బల్లెమని వా రెఱుగుదురు. చోళులు దమ దేశముపై నెత్తివచ్చు పక్షమున వారికి వేంగిప్రభువులు దప్పక దోడ్పడుదు రనుట నిశ్చయము. చోళులకు బ్రతికూలుడు వేంగి నేలునంతకాలమును గళింగమునకు వారివలని యుపద్రవ ముండదు కావున కళింగోత్కళాధిపతులు విమలాదిత్యుని యనంతరము వేంగి రాజ్యమునకై యంతఃకలహములు బొడమగా చోళులకు బ్రతికూలుడైన రాజనరేంద్రుని ప్రతిస్పర్ధిని గూడి యతనికి వలయు సహాయము జేయ నారంభించిరి.

రాజరాజనరేంద్రుని ప్రతిస్పర్ధిని గుర్తింపగడగునపు డీయంశముల నన్నిటిని జ్ఞప్తియం దుంచుకొనవలయును. విమలాదిత్యుని యనంతరము వేంగిదేశము నాక్రమించుకొని రాజరాజనరేంద్రుని పదచ్యుతుని గావించినవా డతని సవతితమ్ము డగు సప్తమవిజయాదిత్యు డని కొంద ఱభిప్రాయపడుచున్నారు.[2] ఈ యభిప్రాయము సరియైన దని ఋజువుసేయుటకు దగిన యాధారము లేకున్నను, దండ్రి మరణానంతరము రాజరాజనరేంద్రుని దొలగద్రోసి విజయాదిత్యుడు రాజ్యము నాక్రమించుకొనియుండినను నుండవచ్చును. అది యసంగతము గాదు. విజయాదిత్యుని యుత్తరచరిత్ర పై యభిప్రాయమునకు బుష్టిగలిగించుచున్నది. రాజరాజనరేంద్రుడు పట్టాభిషేకము జేసికొనిన పిమ్మట నాతని దొలగద్రోసి ఇతడు రాజ్యము నాక్రమించుకొనుటకు

1. ARE 31 of 1917.
2. ఇం. హి. క్వా: సం. ౧౨, పుట ౪౯.

నిరంతరము యత్నముసల్పుచుండువాడు. శ. ౯౫౨ లో నొకమారును, శ. ౯౪౩ లో నింకొకమారును రాజరాజనరేంద్రుని బోద్రోలి రాజ్యమును స్వాధీనము జేసికొనెను.[1] మఱియు నతడు కల్యాణిచాళుక్యులతో సఖ్యము గావించుకొని చోళులతో బ్రతిఘటించి పలుమారు పోరాడెను.[2] కల్యాణిచాళుక్యులతోడనేకాక కళింగులతోడను మైత్రి నెఱపి వారి సాహాయ్యమును బడసి రాజరాజనరేంద్రుని పుత్రుడగు రాజేంద్రాపరనామధేయుడగు కులోత్తుంగునితో యుద్ధము జేసెను[3] కావున నీవిజయాదిత్యుడే తండ్రిమరణానంతరము కల్యాణిచాళుక్యుల వల్లను, కళింగోత్కళుల వల్లను సాయము వడసి రాజరాజనరేంద్రుని బదచ్యుతిని గావించి రాజ్యము నాక్రమించుకొనియుండవచ్చును. కాని దీనిని నొక్కి చెప్పుటకు దగిన యాధార మెద్దియు గానరాదు. ఇది యెట్లున్నను విమలాదిత్యుని మరణానంతరము రాజరాజనరేంద్రుని పిత్ర్యమైన సింహాసనము నధిష్ఠింపనీయక యడ్డుపడి ప్రతిపక్షి యెవ్వడో రాజ్యము నాక్రమించుకొన్నది నిశ్చయము. చోళసైన్యము వచ్చి వాని నోడించి తఱుమువఱకును రాజరాజనరేంద్రునకు రాజ్యము స్వాధీనము గాదాయెను.

చోడియవరసు దేశమును వశపఱచుకొనినపిమ్మట రాజేంద్ర చోళచక్రవర్తి స్వయముగ రాజమహేంద్రనగరమునకు బోయి శ.

1. ఆంధ్రేతిహాససంశోధకపత్రిక, సం. ౨ పుట ౨౪౪.

"తం రాజరాజనృపతిం నిర్ధాట్య భువః ప్రసహ్య విజయాదిత్యః
విమలాదిత్యతనూజో తస్య ద్వైమాతురోఽగ్రహీ ద్రాజ్యం"

పైపత్రిక : సం. ౫, పుట. ౪౪.

"పరోక్షే రాజరాజస్య భ్రాతు ద్వైమాతురస్య యః,
ప్రత్యగ్రహీ న్మహీరాజ్యశ్రియం వీరశ్రియా యుతః"

2. EC. XI. Dg. 11, 143, cd. 47; Mk. 29. ARE. 257, 286, 278 of 1918; 138, 139 of 1899; 322 of 1924.

3. ఇం. ఆంటి. సం ౧౪, పుట ౧౯౬.

౯౪౪ సింహ బ ౨ గురువారమునాడు రాజరాజనరేంద్రునికి పట్టాభిషేకమహోత్సవము గావించెను.[1]

ప్రస్తుతము పరిష్కృతమగుచుండు నీశాసనమునందు రాజరాజనరేంద్రుని జీవితమునుగూర్చి చెప్పబడిన యంశములలో నింకొక్కటి మిగిలియున్నది. అది రాజరాజనరేంద్రుని వివాహము. ఇంతవఱకు నితడు దన మేనమామయగు రాజేంద్రచోళుని పుత్రికయగు నమ్మంగదేవిని వివాహమాడె నను విషయ మాతని సంతతివారి శాసనముల మూలముననే తెలియవచ్చుచుండినది. ఇంతకుమునుపు ప్రకటితములైన రాజనరేంద్రుని కోరుమెల్లి నందంపూండి శాసనము

1. తిరువాలంగాడు తామ్రశాసనము (S. I. I. III. No. 205) నందు రాజేంద్రచోళదేవుడు గంగా దండయాత్రను జయప్రదముగ సాగించి మరలివచ్చుచుండిన తన సేనాపతిని గోదావరియొడ్డున గలసికొనినట్లు జెప్పియున్నది. ఈ గంగా దండయాత్ర ప్రస్తావన ప్రప్రథమమున రాజేంద్రచోళదేవుని రాజ్యైకాదశ వర్ష శాసనములందు గానవచ్చుచున్నది. (ARE 167 of 1905. EC. x. Ct. 47). రాజేంద్రుని రాజ్యవర్షములు శ. ౯౩౪_వ సంవత్సరమునుండి గణింపబడుటచే నతని ౧౧_వ రాజ్యవర్షము శ. ౯౪౫_వ సంవత్సరమునకు సరిపోవుచున్నది. ఇందువల్ల శ. ౯౪౫ నకు ముందే గంగాదండయాత్రయు, రాజేంద్రచోళుని గోదావరీ ప్రయాణమును ముగిసె ననుట నిశ్చయము. కావున రాజేంద్రచోళుడు దన సేనాపతిని శ. ౯౪౪ లో గోదావరిగట్టున గలసికొనెనని తలచుట యసమంజసము గాదు. రాజరాజనరేంద్రుని పట్టాభిషేకముగూడ నీ యేటనే రాజమహేంద్రపురమున జరిగెను. రాజేంద్రచోళుని గోదావరీప్రయాణమునకు గారణ మెందును జెప్పియుండలేదు; గంగాదండయాత్రకు దీనితో నెట్టి సంబంధ ముండినట్లు గానరాదు. రాజేంద్రుడు గోదావరీ తీరమున కప్పుడు స్వయముగ నొక ప్రత్యేక దండయాత్రను నడుపుచుండెననుట కాధారము లేదు. మఱియు దన మేనల్లుడగు రాజరాజనరేంద్రుని వేంగీరాజ్యమున బునఃప్రతిష్ఠ సేయుటకు రాజేంద్రచోళుడు శ. ౯౪౩ లో నొక సైన్యము చోడియవరసుని యాధిపత్యముక్రింద నంపి యుండుటచేతను, రాజరాజనరేంద్రుని పట్టాభిషేకము రాజేంద్రచోళుని గోదావర్యాగమనకాలమున నడచియుండుటచేతను రాజేంద్రచోళుడు రాజరాజనరేంద్రుని వేంగిరాజ్యమున కభిషిక్తునిగ జేయుటకే గోదావరీతీరమునకు, ననగా రాజమహేంద్రపురమునకు బయనముజేసె ననుట యొప్పును.

లలో నీ వివాహప్రస్తావము గానరాదు. ఇప్పటివఱకు లభ్యపడిన రాజరాజనరేంద్రుని శాసనము లన్నిటిలోను దీనియం దొక్కదాని యందే యమ్మంగ దేవీ వివాహప్రస్తావము గలదు. అర్వాచీనపూర్వ చాళుక్య శాసనముల యాథార్థ్య మిందువల్ల స్థిరపడుచున్నది.

రాజరాజనరేంద్రుని సుగుణ సంపత్తిని విని సంతసించి రాజేంద్రచోళుడు దనకుమారిత నిచ్చి యాతని కుద్వాహము జేసిన ట్లీశాసనమున జెప్పియున్నది. రాజనరేంద్రుని సుగుణ సంపత్తి యొక్కటియే యీ వివాహమునకు గారణముగాదు. పూర్వబాంధవము మఱియొక కారణము. రాజరాజనరేంద్రుడు రాజేంద్రచోళుని సోదరియగు కుందవ మహాదేవిపుత్రుడు. పాతచుట్టఱికమును ఖిలమై పోనీక నూతనసంబంధము జేసి దానిని బలపఱచెను. అన్నిటికంటె ముఖ్యమైనకారణము రాజేంద్రచోళుని సామ్రాజ్యకాంక్ష. రాజేంద్రుడు రాజ్యతంత్ర మర్మజ్ఞుడు. సామ్రాజ్యవ్యాపన కప్పుడు జరుగుచుండిన చోళపాశ్చాత్యచాళుక్య ద్వంద్వయుద్ధమున వేంగీరాజ్య మత్యంతప్రాధాన్యము నందెను. పూర్వచాళుక్యులను బాశ్చాత్య చాళుక్యులవంకకు మ్రొగ్గనీయక దన పక్షముననే నిల్పుకొనుట యత్యావశ్యకమైయుండెను. కావున రాజరాజనరేంద్రుని కమ్మంగ దేవి నిచ్చి వివాహము గావించిన నత డెల్లప్పుడును దనకు వశ్యుడై యుండు నని తలచి యట్లొనర్చెను.

ప్రస్తుత శాసనగ్రంథమున దానసందర్భమును వర్ణించు భాగ మత్యంతము ముఖ్యమైనది. ఏ సందర్భమున శాసనోక్తదానమును దానుచేసెనో చెప్పుచు రాజరాజనరేంద్రు డపూర్వమైన నూతన చరిత్రాంశములను గొన్నిటిని దెల్పియున్నాడు. "ప్రఖ్యాతుడు రాజరాజ బ్రహ్మమహారాజను మహాదండాధిపతి గలడు. అతడు మధురాంతకభూభుజుని కరుణారసముచే దడిసి యభివృద్ధి నందిన యశోలతిక గలవాడు; మఱియు నాతడు రాజేంద్రచోడభూపాలుని రాజ్యలక్ష్మి యను నిధిని గాపాడదగిన యుగ్రభుజంగమసదృశ బాహువు గల

వాడు. నా మాతులుడగు రాజేంద్రక్షితిపాలుని యీ దేశమును వినిన వెంటనే దక్షిణదిక్కునుండి మహాప్రచండసైన్యమును బురస్కరించుకొని, శత్రురక్తము ద్రావ నాసక్తుడగు నపరకాలుడా యేమి యనునట్లు ఆంధ్రదేశమున కితడు వచ్చెను." ఇతనితోగూడ నుత్తమశోడ చ్చోడగోను, ఉత్తమచోడ మిలాడుడైయ్యా నను మఱి యిరువురు దండనాథులు వచ్చిరి. వీరికి అరణ్యమును బోలిన కర్ణాట సైన్యముతో మహాఘోరమైన యుద్ధము పొసగెను. ఈ ఘోరరణమున రాజరాజ బ్రహ్మమహారాజును, దక్కిన యిద్దరు ద్రమిళ సేనాధిపతులును గడుధైర్యముతో బోరి దివంగతులైరి. రాజరాజ బ్రహ్మమహారాజు నుద్దేశించి రాజరాజేశ్వర మను శివాయతనమును, దక్కిన యిద్దరిపేర జెరియొక శివాయతనమును నిర్మించి, వాని మంగళోత్తుంగ సంగీతకఖండస్ఫుటితనవకర్మబల్యుపహారార్థమును, శాస్త్రాధ్యయనము సేయు నేబదిమంది విద్యార్థుల భోజనసత్రార్థమును, నేబదియిద్దఱు వేశ్యలతోడను, బ్రహ్మవిదులును, హుతజాతవేదసులును నగు బ్రాహ్మణశతముతోడను, ధనదోపములగు వైశ్యశతముతోడను, బ్రహ్మపాదకులసంభవులైన శూద్రశతముతోడను స్వార్థమైన మధురాంతకనల్లూరను ప్రసిద్ధనామము గల [యీవకూరు కడపట్టు] గ్రామాధిక్యమగు కలిదిండిగ్రామము నిచ్చెను. (శాసన పంక్తులు. ౭౭-౧౦౪)

రణక్షేత్రము:—పైన గ్రోడీకరించిన శాసనగ్రంథభాగ మాంధ్రదేశమున, ననగా వేంగిరాజ్యమున గలిదిండి గ్రామముకడ జోళకర్ణాటకసైన్యములకు నడిచిన మహాసంగ్రామమును వర్ణించుచున్నది. శాసనగ్రంథమున బేర్కొనకున్నను రణము నడచిన క్షేత్రము గలిదిండి యనుటకు సంశయింపబనిలేదు. యుద్ధనిహతులైన ద్రమిళదండనాయకుల స్మారణచిహ్నములగు శివాలయములు మూడును గలిదిండిగ్రామమున నిర్మించుటయే దీనికి దార్కాణ.

స్మారణచిహ్నములగు నిట్టి దేవాలయములను సామాన్యముగ నెవ్వారి జ్ఞాపకార్థముగ నవి యుద్దేశింపబడునో వారి సమాధిపై గాని, చితిపై గాని నిర్మించుట ప్రాచీనాచారము. కావున చోళదండనాయకుల స్మారణచిహ్నములగు శివాలయములు గలిదిండియం దుండుటచేత వారు నిహతులైన యుద్ధ మచటనే జరిగియుండవలయును.

మధురాంతకదేవుడు:— రాజరాజనరేంద్రుని మేనమామ యగు రాజేంద్రచోళుని యుత్తరువు ప్రకారము రాజరాజబ్రహ్మ మహారాజు చోళసైన్యమును నడిపించుకొని యాంధ్ర (వేంగి) దేశమునకు వచ్చినట్లు చెప్పబడియున్నది. మఱియు నీ రాజరాజ బ్రహ్మమహారాజు మధురాంతక దేవుని కరుణచే నభివృద్ధి నందె ననియు గలదు. వీరెవరు, వీరికిగల సంబంధమెట్టిది అను ప్రశ్నలకు సమాధానము చెప్పవలసియున్నది. మధురాంతకదేవ రాజేంద్ర చోళులు భిన్నపురుషులు గారు. ఈ రెండును నొక్క ప్రభువుయొక్క నామాంతరములే. రా ంద్రచోళుడు పాండ్యరాజ్యమును దువ ముట్టించి వారి రాజధానియగు మధురాపురమును గొనుటచే నతని ేరు కలిగెను.

కర్ణాటదండయాత్ర:- -రాజేంద్రచోళుడు ప్రచండసైన్య ముతోగూడ నిజదండనాథు నాంధ్రదేశమున కేల పంపెనో యిందు చెప్పలేదు. "రాజేంద్రక్షితిపాలకస్యమహతో మన్త్రాతుల స్త్రాతుల స్త్యాదేశం ప్రతిపద్య తత్ క్షణత ఏవాంధ్రక్షమాం ప్రాగమత్" అని యుండుటచేత దామసింపగూడని రాచకార్య మెద్దియో యాంధ్ర దేశమునగలిగె ననియు, నట్లు చోళసైన్య మాంధ్రమును జేరగనే "కర్ణాటకబలారణ్యం దగ్ధుకామ మశేషతః, దణ్డనాథత్రయం దృష్ట మగ్నిత్రయ మివోజ్జ్వలమ్" అని చెప్పుటచేత గర్ణాటకసైన్య మాంధ్రముపై నెత్తివచ్చి దేశము నాక్రమించుకొనుటచేత దద్రక్ష ణార్థము రాజేంద్రచోళదేవుడు దన సేనాధిపతి నాంధ్రదేశమున

కంపెననియు నూహింపవలసియున్నది.[1] 'కర్ణాటద్రమిళాధీశ దణ్డేశా మభవ ద్రణం' అను వాక్యమువల్ల జోళదండాధీశు లెదుర్కొనిన కర్ణాట సైన్యము గర్ణాటరాజుచే నంపబడె నని స్పష్టమగుచున్నది. ఈ గర్ణాటరా జెవ్వడో తెలియదు. కాని, "ఇందు జెప్పిన కర్ణాటక నృపాలుడు మొదటిరాజేంద్రచోళునకు సమకాలికుడును, పాశ్చాత్య చాళుక్యుడునునగు నిమ్మడిజయసింహు డగునట్లున్నది" యని శాసన శాఖవా రభిప్రాయపడుచున్నారు.[2] కావచ్చును.

కర్ణాటరాజెవ్వడు:— మొదట నీ యుద్ధము జరిగిన కాలమును నిర్ణయించినగాని చోళులకు బ్రతిస్పర్ధియైన కర్ణాటరాజు నానవాలు పట్టుటకు సాధ్యముగాదు. ప్రస్తుతశాసనమున రాజరాజనరేంద్రుని పట్టాభిషేకము శ. ౯౪౪ లో జరిగెనని చెప్పియున్నదికదా. మఱియు రాజేంద్రచోళుని గంగాదండయాత్రయు, ద్వీపాంతర దిగ్విజయము లును నందు గూఢముగ సూచింపబడిన వని పైని దెల్పియున్నాను. గంగాదండయాత్ర శ. ౯౪3 లోను, ద్వీపాంతరదిగ్విజయములు మఱి మూడేండ్లపిమ్మట శ. ౯౪౬ నందును జరిగినట్లు చోళశాసనముల వల్ల దెలియుచున్నది. మఱియు నీ కలిదిండియుద్ధము నడచినపుడు రాజరాజనరేంద్రుని మేనమామయగు రాజేంద్రచోళచక్రవర్తి యింకను రాజ్యము సేయుచుండెను. రాజేంద్రుడు శ. ౯౬౬ వఱకును రాజ్య మేలుచుండిన ట్లతని శాసనములు దెల్పుచున్నవి. కావున కలి దిండియుద్ధము శ. ౯౪౬-౯౬౬ లకు మధ్య జరిగియుండవలయును. ఈ యిరువది యేండ్ల కాలమున కర్ణాటకమున నిద్దరు రాజులు

1. రాజరాజనరేంద్రుడు పంపుమని వేడికొనగా రాజేంద్రచోళుడు దన సేనాధిపతులను సైన్యయుక్తులుగ నాంధ్రదేశమున కంపినట్లు శాసనశాఖవారు చెప్పియున్నారు. (Annual Report of South Indian Epigraphy, 1937—38. P. 82) శాసనగ్రంథమున దీని కాధారముగానరాదు. కాని యట్టి యూహ కెడముగలదు.

2. MER 1937-8. Part II. P 82.

రాజ్యము సేయుచుండిరి. శ. ౯౪౦-వ సంవత్సరమున సింహాసనము నధిష్ఠించిన జగదేకమల్లాపరనామధేయుడగు నిమ్మడిజయసింహుడు శ. ౯౬౪ వఱకు రాజ్యపాలన మొనర్చెను. అతని మరణానంతర మతని కుమారుడగు త్రైలోక్యమల్లాహవమల్లాపరనామధేయుడగు మొదటి సోమేశ్వరుడు సింహాసనము నధిష్ఠించెను. జయసింహుని రాజ్యకాలమునందు శ. ౯౪౩ నకు దరువాత చోళులతో నతడు యుద్ధము చేసినట్లు గానరాక పోయినను, సోమేశ్వరుని యేలుబడి యొక చోళదండయాత్రమధ్యమున నారంభమగుటచేత రాజ్యాంత కాలమున జయసింహునకు జోళులతో మరల యుద్ధము పొసగినట్లు సంశయము గలుగుచున్నది.

రాజేంద్రచోళుని కట్టకడపటి రాజ్యవర్షములం దతడు రట్టపాడి సప్తార్ధలక్ష దేశముపై నెత్తిపోయి మొదటి సోమేశ్వరునితో బలుమారు పోరాడి యతని నోడించి కల్యాణకొల్లిపాకపురములను నాశనము జేసినట్లు తెలియుచున్నది. ఈ చోళచాళుక్యయుద్ధము శ. ౯౬౪-వ సంవత్సరమునకు సరియైన మొదటిరాజాధిరాజు యొక్క ౨౪-వ రాజ్యవర్షశాసనములందే[1] ప్రప్రథమము వర్ణింపబడియుండుట చేత నది యాసంవత్సరమునకు ముందే, జయసింహుడింకను రాజ్యమేలుచుండగనే నడచెననుట యొప్పును. మఱియు శ. ౯౬౬ నకు సరియైన రాజాధిరాజు ౨౬-వ రాజ్యవర్షశాసనములం దతడు కొల్లిపాకను గాల్చినట్లు చెప్పియుండుటచేత[2] గలిదిండి యుద్ధముగూడ నీ సందర్భముననే నడచియుండవలయునని తోచుచున్నది. అట్లగునేని చోళదండయాత్ర యారంభమగునప్పుడు జయసింహుడే రాజ్యము సేయుచుండెనని చెప్పవలసియున్నది. అతడు వృద్ధుడై రాజ్యభారము నంతటిని కుమారునిపై మోపియుండుట చేత రాజ్యసంరక్షణార్థమై చోళులతో సోమేశ్వరుడు యుద్ధము జేయవలసివచ్చెను.

1. ARE 245 of 1928-9.
2. ARE 172 of 1894.

చోళులు రట్టపాడిపై నెత్తిపోవుటకు గారణము :-చోళులు నిష్కారణముగ రట్టపాడిమీద దండు వెడలలేదు. సోమేశ్వరుని చోళ దండయాత్రకు బ్రతీకారము సల్పుటకే చోళులు రట్టపాడిపై నెత్తి వచ్చిరి. ఈ యుద్ధకారణమును జక్కగ గ్రహించుటకు జోళచాళుక్య పరస్పరసంబంధజ్ఞాన మత్యంతావశ్యకము.

చోళ పాశ్చాత్యచాళుక్య కలహచరిత్ర:-రాష్ట్రకూటరాజ్యము నాక్రమించుకొనినప్పటినుండి పాశ్చాత్యచాళుక్యులు చోళులతో బోర నారంభించిరి. దీనికి సామ్రాజ్యకాంక్షయే ప్రధానకారణము. చోళ పాశ్చాత్యచాళుక్యపరస్పరసామ్రాజ్యకలహములకు వేంగి సహజ మైన రణరంగ మాయెను. దానార్ణవుని సంతతి వేంగిరాజ్యమున బునఃప్రతిష్ఠితమైనదాది రెండు సామ్రాజ్యములకును స్పర్ధ దినదిన ప్రవర్ధమాన మగుచు వచ్చెను. చోళచక్రవర్తి మొదటి రాజరాజు దానార్ణవుని బిడ్డలకు శరణ్యుడై యభయము నొసగి శ. ౯౨౨ ప్రాంతమున పిత్ర్యమైన రాజ్యమునందు వారియందు పెద్దవాడగు మొదటి శక్తివర్మను నిలిపెను. కేవలము శరణాగతవాత్సల్యముచే రాజరాజు దానార్ణవుని పుత్రులకు సాయము జేయలేదు. రాజరాజు నకు సామ్రాజ్యకాంక్ష మెండు. వేంగిరాజవంశమున కాశ్రయమిచ్చి వారి రాజ్యమును వారికి దీసియిచ్చిన, వారు తనకు వశంవదులై ప్రవ ర్తింతు రని గుర్తెఱిగియే యతడు శక్తివర్మను వేంగియందు నిలిపి యతని తమ్ముడగు విమలాదిత్యునికి దన కూతురు కుందవమహాదేవి నిచ్చి పెండ్లిచేసి తనకడ నుంచుకొనెను. వేంగి యిట్లు చోళుల చేతి క్రిందికి వచ్చెను. ఇది కల్యాణిచాళుక్యులకు గనుకుట్టినట్లాయెను. కాని వా రప్పుడపుడే రాష్ట్రకూటవంశమును గూలద్రోసి కర్ణాటకసామ్రా జ్యము నాక్రమించుకొనుచుండుటచేత వేంగిని చోళహస్తగతము గానీయక యాపునంతటి సత్త్వము వారికి లేకపోయెను. కల్యాణి చాళుక్యవంశమునకు మూలపురుషుడగు నిమ్మడి తైలపదేవుడు చోళు

లతో బోరవలసివచ్చినను, దన రాజ్యకాలము నంతటిని స్వాధికార మును స్థిరపఱచుకొను ప్రయత్నములయందే గడపెను.

తైలపుని వెనుక గర్ణాటకసింహాసనము నతని పుత్రుడగు సత్యాశ్రయు డధిష్ఠించెను. ఇతడు శూరుడు. చోళులను వేంగినుండి తఱిమివేసి దన యధికారమునందు నెలకొల్పదలచి శ. ౯౨౮-వ సంవత్సరమున నొక ప్రచండసైన్యమును బయలునంబి యను దండ నాథుని యాధిపత్యముక్రింద నచటి కంపెను. బయలునంబి పూర్వ సముద్రతీరమునకు సైన్యమును నడపించుకొనివచ్చి కృష్ణాతీరమందలి ధరణికోట, యనమదల యనుకోటలను రెంటిని దగులబెట్టి యిప్పటి గుంటూరుమండలములోని చేబ్రోలునందు విడిసెను.[1] అప్పుడు వేంగి నేలుచుండిన శక్తివర్మ కర్ణాటకులబారి బడనీయక స్వరాష్ట్రము నెట్లు కాపాడుకొనగలిగెనో తెలియదు. కాని మిత్రసహాయము లేనియెడల దా నెట్టి ప్రయత్నము జేసియుండినను దన యధికారము నతడు నిల్పుకొనియుండజాలడు. శక్తివర్మకు పిత్ర్యమగు రాజ్యము నిచ్చి సింహాసనము నెక్కించిన చోళచక్రవర్తి రాజరాజు ఆపత్కాలమున నాతని దిగవిడువలేదు. కర్ణాటకులు వేంగిపై నెత్తిపోయిన వార్త విన్నంతనే వారి నచటినుండి వెడలనడచు మార్గము నారసి యొక మహాసైన్యముతో దన కుమారు డగు రాజేంద్రచోళుని రట్టపాడిపై కంపెను. దండయాత్రను సాగించునప్పుడు రాజేంద్రచోళుడు దయా దాక్షిణ్యములను విడనాడి దేశమును జూఱగొని, గ్రామములను, పట్ట ణములను రగులబెట్టి, బ్రాహ్మణు లనక స్త్రీలనక, బిడ్డలనక చేత జిక్కినవారి నెల్ల వధించి కులాచారములను గూలద్రోసెను[2] ఇట్లు ప్రవర్తించుటవల్ల నల్పకాలముననే చోళచక్రవర్తియొక్క మనో రథము సిద్ధించెను. చోళులను దఱిమి నిజరాజ్యమును సంరక్షించు

1. ARE 145 of 1897; S. I. I. VI. 102.
2. ఎపి. ఇండి. సం. ౧౬, పుట ౭౨.

కొనుటకొఱకు సత్యాశ్రయుడు సైన్యముతోగూడ బయలునంబి నాంధ్రదేశమునుండి రప్పింపవలసివచ్చెను. అంతటితో వేంగిరాజ్యము నాపాదించిన యుపద్రవమును దొలగిపోయెను.[1]

---

1. చోళ చరిత్రకారు లీ దండయాత్ర చరిత్ర నింకొకరీతిని వ్రాసియున్నారు. చేబ్రోలు శిలాశాసనమును, మహేంద్రగిరిపై నుండు గాలము దెలియని మఱి రెండు శిలాశాసనముల నాధారపఱచుకొని (S. I. I. VI. 102; V. 1351-2.) యప్పుడు పూర్వచాళుక్యులు పాశ్చాత్య చాళుక్యులతో జెలిమి పాటించుచుండి రనియు, దన శత్రువుల గలసినందుకు గోపించి పూర్వచాళుక్యులను శిక్షించుటకై చోళచక్రవర్తి రాజరాజు రట్టపాడి దండయాత్ర ముగిసిన పిమ్మటనే తనపుత్రుడగు రాజేంద్ర చోళుని యాధిపత్యముక్రింద నొక సైన్యమును వేంగిపై కంపెననియు, జయప్రదముగ దాడి సాగించి రాజేంద్రచోళుడు మహేంద్రగిరిపై జయస్తంభమును నిలిపె ననియు నాచార్య నీలకంఠశాస్త్రిగారు వ్రాసియున్నారు. (చోళులు, సం. ౧, పుటలు ౨౧౧, ౨౧౩, ౨౧౯-౨౦.) కాని వీరి సిద్ధాంత మంగీకార్యము గాదు. పూర్వపశ్చిమ చాళుక్య లప్పు డొండొరులతో మైత్రి బాటించుచుండిరని నిరూపించుటకు చేబ్రోలు శాసనము సాక్షి కాజాలదు. ఇందు పాశ్చాత్య చాళుక్య దండనాథుడగు బయలునంబి పూర్వచాళుక్యరాజ్యములోని యనమదల, ధరణికోట దుర్గములను గాల్చినట్లు చెప్పియున్నది. సుహృద్భావమును జూపు మార్గ మిట్లుండదు గదా. కావున పూర్వచాళుక్యులు పశ్చిమచాళుక్యులతో చెలిమి పాటించుచుండి రనుట చెల్లదు. ఇక రాజరాజు శ. ౯౨౯-వ సంవత్సర ప్రాంతమున వేంగిమీదికి దండంపెనేమో విచారింపవలసియున్నది. దీనిని రుజువు సేయుటకై యుదాహరించిన మహేంద్రగిరిశాసనము లందు వేంగి మాటయే లేదు. ఒకవేళ నందు పేర్కొనబడిన కలింగమునందు వేంగి యిమిడియున్న దని యభిప్రాయపడినను నీ శాసనము లెప్పటివో తెలియదు. రాజేంద్రచోళ నామధారు లనేకులు గానవచ్చుచుండుటచేత వీనియందు పేర్కొనబడిన రాజేంద్రచోళు డెవ్వడో నిశ్చయించి చెప్పుట సులభసాధ్యము గాదు. ఈ కారణమువల్ల బరిశోధకు లీశాసనముల కాలమును ఎవ్వరి సిద్ధాంతముల కనుకూల మగు రీతిని వారు, ముందునకు, వెనుకకు నెట్టుచున్నారు. మహేంద్రగిరి శాసనములను బరామర్శించిన పరిశోధకు లందఱును ప్రాయికముగా నందు పేర్కొనబడిన రాజేంద్రచోళుడు చోళచక్రవర్తియగు మొదటి రాజరాజు పుత్రుడును, గంగైకొండబిరుదాంకితుడును నగు మొదటి

ఇంతటితో పాశ్చాత్య చాళుక్యులు వేంగిపై నాసను వదలుకొనలేదు. జగదేకమల్ల బిరుదాంకితుడగు నిమ్మడి జయసింహుడు

రాజేంద్రచోళచక్రవర్తియే యని సిద్ధాంతీకరించియున్నారు. ఇంతవఱకు వీరికందరికి నైకమత్యము కుదిరినది. కాని రాజేంద్రచోళు డెప్పు డీశాసనములను మహేంద్రగిరి మీద నిలిపెనో నిర్ణయింప వలసివచ్చినపుడు వీరిలో నొండొరులకు పొంతనములు కుదురకపోవుటచే నభిప్రాయభేదము లుప్పతిల్లినవి. కొందఱు గంగాదండయాత్రా సందర్భముననే ఈశాసనమును రాజేంద్రుడు వ్రాయించెనని చెప్పుదురు. (S. I. III. P 388; n. 6) కాని యితరు లీ సిద్ధాంతమున కనుకూలమైన సాక్ష్యము రాజేంద్ర చోళచక్రవర్తిశాసనములం గానరాదని తలచి యతని కళింగదండయాత్ర యాతని తండ్రియేలుబడియందే జరిగియుండవలయు నని నిశ్చయించి, రాజరాజు ౧౯-వ రాజ్యవర్షపు (శ. ౯౨౬) శాసనములయం దాతడు కళింగమును జయించినట్లు జెప్పియుండుట నూతగొని రాజేంద్రు డప్పుడే మహేంద్రగిరిశాసనములను వ్రాయించె నని యూహించిరి. (చోళులు సం. ౧. పుటలు ౨౧౯-౨౦) తిరువాలంగాడు తామ్రశాసనము (శ్లో ౧౨౦) గోదావర్యాగమనకాలమున నతడు ఒడ్డెరాజును వధించినట్లు కలదు. (S. I. I. iii. P. 400) వీరరాజేంద్రుని కన్యాకుమారీశాసనమున రాజేంద్రచోళుడు దన సేనాధిపతులనంపి కులూతోత్కలదేశములను జయించినట్లు చెప్పియున్నది. (Ep. Ind. xviii. P. 52) కొత్తశివర మడకశిరశాసనము లతని దశమరాజ్యవర్షమున (శ. ౯౪౩) నాతని సేనాధిపతి చోళియవరసు వేంగికళింగములను జయించినట్లు స్పష్టముగ దెల్పుచున్నవి. మహేంద్రగిరిపైని శాసనముల నపుడు జెక్కించియుండవచ్చును గదా. ఇట్లు మహేంద్రగిరిశాసనములను రాజేంద్ర చోళుడు దనరాజ్యదశమవర్షమున వేయించెననుట కవకాశమున్నను వానితో నతని కేలాటిసంబంధమున్న ట్లగపడదు. వీనిని జాగ్రత్తతో బరిశీలించి చూడగా నందు బేర్కొనబడినవాడు గంగైకొండరాజేంద్రచోళుడు గాడనియు, నతని దౌహిత్రుడగు ప్రథమ కులోత్తుంగ రాజేంద్రచోళు డనియు దెలియవచ్చుచున్నది. ఇందలి యరవశాసనమునం దీదండయాత్రను నడపి తన్నేలిన ప్రభువుపేర జయస్తంభమును నిలిపిన సేనాధిపతిపేరు గలదు. "శ్రీమహానాయక రాజేన్ద్రచోఅప్పల్లవరైయన్ రాజరాజమారాయన్ మహేన్ద్రవారీశ్వరత్తుక్కొణ్డాన్, వీరానుశముమ్ విట్టి వారాణమల్ల విమలాదిత్తనైయు జ్కలిజరు త్తానెయుమ్ ఎరిహేన్దిరణు శ్రీమహేన్ద్రత్తిల్ జయస్తంబంనాట్టి" (S. I. V. 1352). ఈ శాసనమువల్ల మహేన్ద్రగిరిని గొని, కాళింగులనుండి యేనుగులను గైకొని విమలాదిత్యుని జెఱగొన్నవాడు శ్రీమహా

విమలాదిత్యుని యనంతరము రాజ్యార్థము పొడమిన యంతఃకలహ ములయందు ప్రవేశము గలుగజేసికొని వేంగి రాజకీయ వ్యవహార ములయం దభివ్యాప్తి నందెను. ఈ సందర్భమున జెప్పవలసిన యంశ ముల నన్నిటిని నింతకుపూర్వమే తెలిపియున్నాను. మరల వాని నిట బ్రస్తావించుట యనావశ్యము. వీనినిబట్టి చూడగా విమలాదిత్యుని మరణానంతర మిమ్మడి జయసింహుడు జోరావరిగ వేంగిరాజ్యము నాక్రమించుకొనిన రాజరాజనరేంద్రుని ప్రతిస్పర్ధిపక్షము—ఒకవేళ

---

నాయక రాజేన్ద్రచోళపల్లవరైయన్ రాజరాజమారాయ నని స్పష్టమగుచున్నది. మొదటి రాజేంద్రచోళచక్రవర్తికాలమున నీపేరు గల సేనాపతి యొకడుండె ననుట కాధారమేమియు లేదు. కులోత్తుంగచక్రవర్తి ప్రధానసేనాపతులలో పల్ల వరైయు డొకడు గానవచ్చుచున్నాడు. కళింగత్తుప్పరణియందు గులోత్తుంగుని యాజ్ఞపై నతని సేనాధిపతి తొండమాన్ కరుణాకరుడు దండెత్తిపోయి కళింగ మును జయించి, యేనుగులనుగొని జయస్తంభమును నాటించెనని చెప్పియున్నది. (ఇండి. ఆంటి. సం. ౧౯, పుట ౩౩౬) కరుణాకరుడు పల్లవవంశజుడు; ఇతని యన్న యగు సేనాపతి పల్లవరసరు కళింగదండయాత్రయందు బాల్గొనెనని కళింగత్తుప్ప రణివల్ల దెలియవచ్చుచున్నది. (కళిం. పర. ౧౧: ౫౩; చోళులు, సం. ౨, పుట ౫౯) చోళమండలాంతర్గత తిరినఱయూర్నాటిలోని మండలంజేరి వాస్తవ్యుడగు పల్లవరాజొకడు దన్నేలిన ప్రథమకులోత్తుంగ రాజేంద్రచోళచక్రవర్తి యాజ్ఞపై కళింగాదిదేశములను జయించి జయస్తంభము స్థాపించినట్లు ద్రాక్షారామమందలి కులోత్తుంగ చక్రవర్తి ౩౩-వ రాజ్య వర్షము (శ. ౧౦౨౫) నాటి యొక శాసన మందు జెప్పియున్నది (S. I. I. IV. 1239).

> "భస్మీకృత్య కళింగదేశ మఖిలం నిర్జిత్య గంగం రణే
> భఙ్త్వా కోసలఖణ్డపాల (?) నివహైః దేవేంద్రవర్మాదికాన్,
> వీరః పల్లవరాజ ఇత్యభిహితో రాజేన్ద్రచోడ ప్రభోః
> కీర్తుస్తంభమివోగ్రసంధిషు జయ స్తంభం శుభం న్యక్షిపత్."

కావున మహేంద్రగిరి శాసనములు మొదటి రాజేంద్రచోళ చక్రవర్తినాటివి కావనుట నిశ్చయము. వీనిపై నాధారపడి శ. ౯౨౬-వ సంవత్సరమున రాజరాజు పూర్వచాళుక్యులను శిక్షించుటకు సైన్యముతో గూడ దన కుమారుని రాజేంద్రచోళు నంపెనని చెప్పుట సరికాదు.

నితడు సప్తమవిజయాదిత్యుడైన గావచ్చును—వహించి యతనిని సింహాసనము నెక్కించెను. కాని చోళనాథు డగు చోడియ వరసని విజయము లీతని యెత్తుగడలను సాగనీయక భగ్నము గావించెను. తరువాత వేంగి వ్యవహారములలో జయసింహుడు మరల ప్రవేశము గలిగించుకొనెనేమో తెలియదు. శ. ౯౫౩ లో రాజరాజనరేంద్రుని ద్వైమాతురుడు పై బేర్కొనిన సప్తమ విజయాదిత్యుడు వేంగి రాజ్యమును బలాత్కారముగ నాక్రమించినప్పుడు జయసింహు డాతనికి దోడ్పడియుండవచ్చును. కాని యేతద్విషయ మేమియు దెలియరాదు. శ. ౯౫౫-వ సంవత్సరమున జయసింహుడు వేంగి సరిహద్దుపై నుండు కొల్లిపాక గడిదుర్గమున నివసించుచుండెను.[1] ఇది కేవలము గాక తాళీయముగా గానవచ్చును. వేంగియం దప్పుడు సంభవించిన రాజవిడ్డూరములకును, నతని కొల్లిపాక నివాసమునకును నెట్టి సంబంధము లేకపోవచ్చును.

ఇమ్మడి జయసింహుని కడపటి దినములలో బాశ్చాత్యచాళుక్యులు వేంగిని వశపఱచుకొనుటకు మఱియొకప్రయత్నము జేసిరి. జయసింహుడు వృద్ధుడగుటచేత రాజకార్యముల కన్నిటికిని అతని పుత్రుడగు నాహవమల్లసోమేశ్వరుడు గర్తయై తండ్రిపేర రాజ్యము గావించుచుండెను. చోళుల బలమును గ్రుంగదీసినగాని వేంగి వశము గాదని యాత డెఱుగును. కావున చోళులతో యుద్ధము సేయ ననుకూలమగు తఱివచ్చునంతకు వేచి తగుప్రయత్నములు గావించుచుండెను. మొదటి రాజేంద్రచోళచక్రవర్తి యంతిమరాజ్యవర్షములందు చోళసామ్రాజ్యమున మహత్తరమైన యల్లరి యొకటి రేగెను. పాండ్యకేరళసింహళభూపాలురేకమై చోళుల యధికారము దొలగద్రోసి స్వతంత్రులగుటకు బ్రయత్నములు సల్ప నారంభించిరి. వారిని

1. ఎపి. ఇండి. సం. 3, పుట ౨౩౦; బొంబయి కర్ణాటకశాసనములు, సం. ౧. భా. ౧. ౭౦, ౭౧.

జిదుగగొట్టి యథాపూర్వము దన యధికారమును స్థాపించుటకు రాజేంద్రచోళచక్రవర్తి సైన్యములతో దన పుత్రులను దక్షిణదేశమున కంపెను.[1] అదియే చోళులపై నెత్తిచనుటకు దగిన సమయమని గ్రహించి సోమేశ్వరుడు దన దండనాథులలో నొకడగు పొలకేశిని గొప్పసైన్యముతో ద్రావిడదేశముమీాది కంపెను. ఈ దండయాత్రప్రస్తావము శ. ౯౮౦ నాటి యొక నాగాయిశాసనమునం దిట్లున్నది :

"చలదిం ధారెయ నత్త పూణ్దురిపి మున్నం మండవంగొండ దో
ర్బలదిం కంచియ నిత్త లార్దురిపి కాయ్పం చోళనం కొందు పం
దలెయం కొండ నళుకెఱయుజ్జయినియం ధాళిట్టు సుట్టల్లి తో
ళ్వలదిం బెళ్ళియగుండుగొండ నదటం త్రైలోక్యమల్లాధిపం"[2]

ఇందు చోళుని చంపి వాని పందలను గొనుటకు ముందు త్రైలోక్యమల్లుడు కంచిని దగులబెట్టినట్లు చెప్పియున్నది. శ. ౧౦౮౦ నాటి భారంగిశాసనమున నీ విషయమింక కొంత విపులముగ వర్ణింపబడియున్నది.

"తాణెయ కెత్తి ముమ్మరియ గొణ్మరిగొండపదక్కె చార త
న్నాణెయ నిట్టు కంచియ నిరాకులదిం పొలకేసిసుట్ట క
ల్యాణవ చోళ సుట్ట నెన లొందె గజేంద్రద నెయికొంద న
క్షీణపరాక్రమం సుభటచోళన నాహవమల్లభూభుజం"[3]

ఈ పద్యమువల్ల గాంచీపురమును నిరాకులుడై పొలకేశి కాల్పగా జోళుడు కల్యాణపట్టణమును దహించె నని విని యాహవమల్లు డేనుగునెక్కి యొంటరియై పోయి సుభటుడగు చోళుని జంపెనని తెలియుచున్నది.

---

1. చోళులు, సం, ౧. పుటలు ౨౬౫-౭౦.
2. హైద. ఆర్. సీ. నెం. ౫ రు, పుట ౧౦.
3. ఎపి. కర్ణా. సం. ౭ సోరబ, ౩౨౫.

ఈ రెండు శాసనములందును పేర్కొనబడిన చోళుడు మొదటి రాజాధిరాజు. ఇతడు కొప్పసంగ్రామమున శ. ౯౭౬-వ సంవత్సరమున నాహవమల్ల సోమేశ్వరునితో యుద్ధము జేసి నిహతుడాయెను.[1] ఇతడు శ. ౯౬౪ కు సరియగు దన ౨౪-వ రాజ్యవర్షమున కల్యాణమునుగొని ధ్వంసము గావించెననియు, దత్పూర్వవర్షశాసనముల నీ ప్రస్తావన లేదనియు నింతకుముందే తెల్పియున్నాను.

కావున నితడు గల్యాణపురమును గాల్చినది ఆ సంవత్సరముగాని, మఱి కొంచెము ముందుగాని యైయుండవలయును. పొలకేశి కంచిని దగులబెట్టినందులకు బ్రతీకారము సల్పుటకై రాజాధిరాజు కల్యాణమును గాల్చినాడని చెప్పియుండుటచేత గంచిదహనము గల్యాణదహనముకంటె ముందు నడచెనని గట్టిగ జెప్పవచ్చును. కావున కంచిదహనమును, దానికి సంబంధించిన పొలకేశిదండయాత్రయు శ. ౯౬౩ నం దిమ్మడి జయసింహుని యంతిమ రాజ్యవర్షమున నడచె ననుట నిశ్చయము.

పాశ్చాత్యచాళుక్యులు వేంగి దేశముపై శ. ౯౬౬ నకు పూర్వమెత్తివచ్చిరనుట కవకాశము గలదు. త్రైలోక్యమల్ల సోమేశ్వరుని సామంతులలో నొకడగు సోభనరసు శ. ౯౬౬ నాటి శాసనమున దాను వేంగీపురవరాధీశ్వరుడ నని చెప్పుకొనియున్నాడు.[2] పాశ్చాత్యచాళుక్య సామంతు డొక డీ బిరుదును వహించుట చింత్యమగు విశేష చరిత్రాంశమే. వేంగీపురవరాధీశ్వరుడనగా వేంగీపట్టణము నేలు ప్రభువని యర్థము. సోభనర సాంధ్రుడుగాడు. వేంగీశ్వరులగు పూర్వచాళుక్యుల కాతనితో నెట్టి సంబంధ ముండినట్లగపడదు. మఱియు వేంగీ

1. చోళులు. సం. ౧, పుట ౩౦౫.

2. లోకల్ రికార్డ్సు, సం. ౨౫. పుటలు. ౯౦-౯౧. ధార్వాడ మండల మందలి డంబాలు సమీపస్థమగు నెరెగలు గ్రామములోని హనుమంతుని దేవాలయమున కెదుట నిలిపియుండు రాతిపలకమీద నీ శాసనము జెక్కబడియున్నది. దీని యునికి నాకు దెలిపినందులకు శ్రీ వే. వేంకటరాయశాస్త్రి ఎం. ఏ. గారికి గృతజ్ఞుడను.

పురవరాధీశ్వర యనునది సోభనరసునికి వంశక్రమానుగతమగు బిరుదుగాదు. కావున ౯౭౭ కు పూర్వము నడచిన పాశ్చాత్య చాళుక్య దండయాత్రయందు వేంగిపట్టణమును స్వాధీనపఱచుకొని యేలుటచే నితని కీ బిరుదము కలిగిన ట్లూహింపవలసియున్నది. ఈ యూహ యసమంజసము గాదేని యాహవమల్ల సోమేశ్వరుడు శ. ౯౭౭ నకు ముందు, అనగా కొంచె మించుమించు కాంచీదండయాత్ర కాలముననే వేంగిపై నెత్తిపోయి యాదేశమును స్వాధీనపఱచుకొనె నని చెప్పవలసియున్నది.

రాజరాజనరేంద్రుడు దన రాజ్యమును రక్షించుకొనుట కేప్రయత్నముల నొనర్చెనో తెలియదు. రాజ్యరక్షణభారము నంత టిని చోళచక్రవర్తిపై నిడి మిన్నకయుండెనేమో. అతని యత్న మెట్టి దైనను రాజేంద్రచోళుడు వేంగిని కర్ణాటకులకు విడిచిపెట్టి యూర కుండలేదు. వారి నచటినుండి తక్షణమే తోలివేయుటకు సమకట్టెను. పాశ్చాత్య చాళుక్యులతోడి యుద్ధమునకు గడగి పూర్వపద్ధతి ననుస రించి యేక కాలమున రట్టపాడిమీదికిని, వేంగిమీదికిని రెండు ప్రత్యేకసైన్యముల నంపెను. రట్టపాడికి బలిష్ఠమైన దెబ్బ తలిగిన గాని పాశ్చాత్యచాళుక్యులు వేంగిపైని పట్టును వదలరు. కావున దక్షిణదిగ్విజయమును సంపూర్ణము గావించుకొని విజయుడై తిరిగి వచ్చిన కుమారుని రాజాధిరాజును రట్టపాడిపై కంపెను. ప్రఖ్యాతు డును, బరాక్రమశాలియు నగు దన బ్రాహ్మణసేనాధిపతిని, రాజ రాజ బ్రహ్మమహారాజును, నుత్తచోడ మిలాడుడై యుత్తమ చోళ చోళకోనులను దోడిచ్చి మహాసైన్యముతో వేంగిమీది కంపెను.

రాజాధిరాజు రట్టపాడిని బ్రవేశించి పాశ్చాత్యచాళుక్య సైన్యములను నిర్జించి యాహవమల్లుని దఱిమి కల్యాణపురమును ధ్వంసముజేసి యచట వీరాభిషేకమును గావించుకొనెను.[1] ఈ యుద్ధయాత్రయందే రాజాధిరాజు కొల్లిపాకను దగులబెట్టె నని చోళ

1. ARE 245 of 1928-9.

చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు.[1] కాని కొల్లిపాక దహనమునకును, రట్టపాడి దండయాత్రకును సంబంధము లేదని తలచెదను. ఈ సందర్భమున నీయంశములను జ్ఞప్తికి దెచ్చుకొనవలయును. రాజాధిరాజు ౨౮-వ రాజ్యవర్ష శాసనములలో రట్టపాడిదండయాత్ర వర్ణింపబడెనే కాని కొల్లిపాక ప్రస్తావము గానరాదు. కొల్లిపాక దహనమును దెల్పుశాసనము లాతని ౨౬-వ వర్షము నాటివి. కావున రట్టపాడిదండయాత్ర కొల్లిపాక దహనమునకు రెండేండ్లు ముందు నడిచెననుట స్పష్టము. రట్టపాడిదండయాత్ర పశ్చిమాంధ్ర దేశమున నెచ్చటనో యారంభమై తుంగభద్ర, కృష్ణ భీమరథులు ప్రవహించెడు దేశముగుండ ఉత్తరకర్ణాటకమునకు వ్యాపించి, కల్యాణియందు రాజాధిరాజు వీరాభిషేకముతో సమాప్తినందెను. ఈ దండయాత్రలోని ప్రధానయుద్ధము పూండిరణక్షేత్రమున నడచెను. ఇచట చాళుక్య సేనాపతి విచ్చయ యనునతడు చోళులపోటునకు దాళజాలక పాఱిపోయెను. మఱియు నీ దండయాత్రయందు నుళంబ, కాళిదాస, చాముండ, కొమ్మయ్య, విల్లవరాజు లను చాళుక్య దండనాయకులు జోళులకు మాఱొడ్డి యుద్ధమున నిర్జితులై కాలికి బుద్ధిజెప్పిరి. పాఱిపోక నిలిచిన గూర్జరరాజు మడిసెను.[2] కొల్లిపాకదండయాత్ర కర్ణాటకసామ్రాజ్యపు దూర్పుసీమకడ నెచ్చటనో ప్రారంభమైనది. కొల్లిపాక వేంగి పాశ్చాత్యచాళుక్యరాజ్యముల సరిహద్దుప్రాంతమందుండిన గడిదుర్గము. వేంగి యప్పుడు చోళసంరక్షణక్రిందనుండిన రాజ్యమగుటచేత నీ దండయాత్ర వేంగి నుండి బయలు వెడలెననుట యొప్పును. ఈ దండయాత్రలోని ప్రధానయుద్ధ మొక యజ్ఞాతస్థలమున నడచెను. ఈ యుద్ధమున చోళుల నెదిర్చిన దళనాయకులలో గండపయ్యయు, గంగాధరుడును వీరస్వర్గమును జూఱగొనిరి. విక్కియు, విజయాదిత్యుడును, సంగమయ్యయు బ్రదుకు

1. ఆచార్య కె. ఎ. నీలకంఠశాస్త్రి: చోళులు, సం. ౧, పుట ౨౭౮.
2. చోళులు, సం. ౧. పుటలు ౨౭౮-౯.

జీవుడా యని పరువెత్తిరి. విజయోన్మత్తులగు చోళులు దేశమును గొల్లగొట్టి కొల్లిపాకను పరశురామప్రీతి గావించిరి.[1] పైనుదాహృతములైన రాజాధిరాజుశాసనములవల్ల రట్టపాడిదండయాత్రకును, కొల్లిపాకదండయాత్రకును నొండొంటితో సంబంధము లేదనియు, నవి ప్రత్యేక దండయాత్ర లనియు దెల్లమగుచున్నది.

తన ౨౮-వ రాజ్యవర్షమున బాశ్చాత్యచాళుక్యుల నోడించి వారి రాజధానిని ధ్వంసమొనర్చి యచట వీరాభిషేకము గావించుకొన్న రాజాధిరాజు మరల దన ౨౯-వ రాజ్యవర్షమున వారిపై నేల ఎత్తిపోవలసెనో కనుగొనవలసియున్నది. దీనికి వేంగియందు చోళులకు గలిగిన ఘనపరాజయమే కారణము. రాజేంద్రచోళ చక్రవర్తి యాదేశముమీద రాజరాజ బ్రహ్మమహారాజును, నితరచోళదండనాథులును వేంగిదేశమునకు బాశ్చాత్యచాళుక్యులను దోలివేయుటకు బోయియుండిరి కదా. వీరు వేంగిని జొచ్చినపిమ్మట కలిదిండి సమీపమున గర్ణాటకసైన్యములను దారసిల్లిరి. ఇరుపక్షముల వారికిని మహాభీకరసంగ్రామ మావహిల్లెను. కర్ణాటకులతో హోరాహోరిగ బోరి చోళసేనాధిపతు లందఱు రణశయ్య నలంకరించిరని ప్రస్తుత శాసనము దెల్పుచున్నది. చోళదండనాయకులందఱు నిశ్శేషముగ మడియుటను జూడ చోళుల కిచట సంపూర్ణపరాజయము గలిగెనని తోచుచున్నది.

ఈ పరాజయవార్త వచ్చినవెంటనే రాజేంద్రచోళుడు రాజాధిరాజును వేంగిపై కంపెను. చోళసైన్యములు మరల వచ్చుచున్నవని విని సోమేశ్వరుడు వారి నెదిరించుటకు దన కుమారుడగు విక్రమాదిత్యుని రాజరాజనరేంద్రుని సవతితమ్ముడగు విజయాదిత్యునితో గూడ నంపెను. ఇరువాగులకు సమరము సంప్రాప్తమాయెను. పైని జెప్పినరీతిని విక్రమాదిత్య విజయాదిత్యు లోడి పాఱిపోయిరి. వారిని వెన్నంటి తఱుముచు రాజాధిరాజు కొల్లిపాకవఱకు బోయి యాపట్టణ

1. పై గ్రంథము. సం. ౧. పుట ౨౭౪.

మును దగులబెట్టెను. కాని యా దుర్గము చోళులకు స్వాధీనపడలేదు. శ. ౯౬౬-వ సంవత్సరమునాటి యొక శిలాశాసనమున నాహవమల్ల సోమేశ్వరుని యనుచరులలో నొక్కడగు సింఘణ తాను 'కొల్లిపాకెయకావం' అనగా కొల్లిపాకను రక్షించినవాడనని చెప్పుకొనియున్నాడు.[1] ఇది సత్యమగునేని చోళసైన్యములు కొల్లిపాకనుండి తఱుమబడెనని చెప్పవలసియున్నది.

చోళసేనాధిపతులు:—కలిదిండి యుద్ధమున గర్ణాటకులతో బోరి రణక్షేత్రమున గూలిన చోళదండనాయకుల చరిత్రనుగూర్చి విశేష మేమియు దెలియదు. వీరియందు ఉత్తమచోడమిలాడుడైయ్యానను నతడు రాజేంద్రచోళుని చతుర్థవర్షపు (శ. ౯౩౭) శాసనమున బేర్కొనబడియున్నాడు. ఇప్పటి యుత్తర ఆర్కాటుమండలములోని పర్వతప్రాంతభూమి నేలుచుండెను. ఇతడు భార్గవగోత్రోద్భవుడగు యాదవభీముడని యందు చెప్పియున్నది.[2] ఇతని యనంతర చరిత్రను దెల్పు సామగ్రి యేదియు లభ్యపడలేదు. తక్కిన యిరువురి పేరు చోళశాసనములలో నెచ్చటను గానరాదు. రాజరాజబ్రహ్మమహారాజు బ్రాహ్మణుడు. బ్రాహ్మణు లాకాలమున కత్తి యుద్ధము సేయగల నేర్పరులై సైన్యమున మహోన్నతపదముల నందుచుండి రనుట కిది యొక నిదర్శనము. సేనాపతి యుత్తమసోజబ్రహ్మమారాయుడొకడు శ. ౯౫౫ నాటి కోలారు శాసనమున బేర్కొనబడియున్నాడు. ఇతడు ప్రస్తుత శాసనమున బేర్కొనబడిన రాజరాజబ్రహ్మమహారాజునకంటె భిన్నుడు.

దానవిషయము:—కలిదిండియుద్ధమున మృతినందిన ముగ్గురు చోళసేనాపతులపేర దాను గట్టించిన మూడు శివాలయములలోను

1. ఎపి. కర్ణా. సం. ౭. షి. కా. ౩౨౩. దీనిని నా దృక్పథమునకు దెచ్చిన శ్రీ వే. వెంకటరాయశాస్త్రి, ఎం. ఏ. గారియెడ కృతజ్ఞుడను.

2. ARE 20 of 1905.

నిత్యనైవేద్యదీపారాధనలకును, నుత్సవములు నడపుటకును పల్లపుగుద్రవార విషయములోనికి యణకువమైన మూడు గ్రామములను దానముజేసెను. వీని నన్నిటి నేకముజేసి యొక గ్రామముగ మార్చి, దానికి మధురాంతకనల్లూరని[1] క్రొత్తగ నామకరణము జేసినను వీని హద్దులు ప్రత్యేకముగనే వర్ణింపబడియున్నవి. మొదట (పం. ౧౦౩-౬) కలిదిండి పొలిమేరలు, తరువాత (౧౦౬-వ పంక్తిలోని 'పల్లపుగుద్రవారే' మొదలు ౧౧౦-వ పంక్తియారంభమందలి 'సీమ' వఱకు) కడుపట్టుపొలిమేరలును, కడపట (౧౧౦-వ పంక్తిలోని పల్లపుగుద్రవారే అను తావునుండి) మూడవ గ్రామమగు [ఆ]వకూరు పొలిమేరలు వర్ణింపబడియున్నవి. ఈ మూడుగ్రామములలో గలిదిండి యన్నిటికంటె దూర్పున నుండెను. దానికి ఉత్తరమునను నీశాన్యమునను పోతుంబఱ్ఱియు, దూర్పున కొన్నెకియు, నాగ్నేయమున [న?]ల్లిద్రొఱ్ఱును, దక్షిణమున కొంతామయు, నైఋత్యమున వేవాకయు, బశ్చిమమున గడపఱ్ఱును, వాయవ్యమున దా[తా]డినాడును మేరలు. రెండవ గ్రామమగు కడపఱ్ఱు కలిదిండికి బశ్చిమమున నుండెను. దానికి ఉత్తరమున గల్వసండయు, నీశాన్యమున దా[తా]డినాడును, దూర్పునను, నాగ్నేయమునను గలిదిండియు, దక్షిణమునను, నైఋత్యమునను వేవాకయు, పశ్చిమమున నావకూరును, వాయవ్యమున తామరకొలనిక్రొవ్వింద్లేటం బాసిన తల్లిక్రొయ్యా నదియు మేరలు. ఐదవ రేకులో జాలభాగము తునిగి నష్టమై

1. ఈ నూతననామ మర్థగర్భితమైనది. మధురాంతకుడను పేరు రాజేంద్రచోళచక్రవర్తికి గలదని ప్రస్తుతశాసనమునందే చెప్పియున్నది. రాజరాజనరేంద్రుడీ నూతనగ్రామమునకు రాజేంద్రచోళమధురాంతకదేవుని పేరు పెట్టినాడనుట నిశ్చయము. సామాన్యముగ సామంతులు మన్నగువారు గ్రామదానము సేయునపు డట్టి గ్రామములకు దమ్మేలిన ప్రభువుపేరు పెట్టు సంప్రదాయము కలదు. దీని ననుసరించి రాజరాజనరేంద్రుడు చోళచక్రవర్తియగు రాజేంద్రుని కాశ్రితుడని చెప్పవలసియున్నది.

పోయినందున నందు జెప్పబడిన మూడవ గ్రామమగు నావకూరి యెల్లలు చక్కగ దెలియరావు. కాని దాని హంసాయి గ్రామము లలో గడపట్లు, గొండికముంజులూరు గ్రామముల పేరులు మాత్రము మిగిలియుండు తుంటెయందు గానవచ్చుచున్నవి. ఇవిగాక కడ పట్లుతోగూడ -ౢగ్గియవాడ యను నామాంత్యము గల గ్రామ మొక్కటి కూడ పేర్కొనబడియున్నది. ఈ రెండు గ్రామములకు గల సంబంధ మెట్టిదో తెలియదు.

దానము సేయబడిన మూడు గ్రామములలోను గలిదిండి యావకూరులను స్పష్టముగ గుర్తింపవచ్చును. ఇవి కృష్ణాజిల్లా కైక లూరు తాలూకాలో కొల్లేరు సరస్సుకు దూర్పున నున్నవి. ఇప్పుడు లభ్యమగు పటములందు గడపట్లు కానరాకపోయినను నది యావ కూరు కలిదిండి గ్రామముల మధ్య నుండెనని నిశ్చయముగ జెప్ప వచ్చును. ఇప్పటికిని ఈ పేరుగల గ్రామ మచ్చట కలదేమో. సరి హద్దు గ్రామములలో తాడినా డిప్పటి తాడొనాడయె. శాసనమున జెప్పిన ట్లది కలిదిండికి వాయవ్యదిశయందే యున్నది. పోతుంబత్తి యనునది పోతుంబట్లునకు షష్ఠి. ఇది ఈ తాలూకాలోని ప్రస్తుత పోతుంబట్లు గ్రామమే కాని యన్యము గాదు. వేవాక యనునది యిప్పటి వైవాక కావచ్చును. క్రొవ్వింటేటంబాసిన తల్లిక్రొయ్యే నదిని గాని, తక్కిన సరిహద్దు గ్రామములనుగాని గుర్తించుటకు సాధ్యముగా లేదు. స్థలజ్ఞులు వీనిని గుర్తింపగలుగుదు రేమో.

౪

దానకాలము :—సూక్ష్మముగ దానకాలమును నిర్ణయించి చెప్పుటకు దగిన సాధన మిందేదియు గానరాదు. తునిగి నష్టమై పోయిన మైదవరేకు ఖండమున దానకాలవివరణ ముండెనేమో. లభ్యమైన తునకవల్ల నిది నందంపూండి శాసనమునకంటె మునుపటి దనియు, గోరుమెల్లి శాసనముకంటె వెనుకటి దనియు నిశ్చయముగ

జెప్పవచ్చును. శాసనోక్తచారిత్రాంశములను పరామర్శించి యందు వర్ణింపబడిన కలిదిండియుద్ధము శ. ౯౬౪-వ సంవత్సరమున జరిగి యుండవలయు నని చెప్పియున్నాను. కలిదిండియుద్ధమున జోళులు పరాజితులగుటచేత వేంగియందు వారి యాశ్రితుడైన రాజరాజ నరేంద్రునికి శాసనోక్తశివాయతననిర్మాణమునకు గాని, తత్పోష ణార్థము భూదాన మొసగుటకుగాని యవకాశ ముండెనని తలచుటకు వీలులేదు. రాజాధిరాజునాధిపత్యముక్రింద చోళసైన్యము మరల శ. ౯౬౬ న వేంగిపై నడచి పాశ్చాత్యచాళుక్య సైన్యముల నోడించి గడిదుర్గమైన కొల్లిపాకవఱకును దోలినట్లు చోళశాసనములవల్ల దెలియవచ్చుటచే రాజరాజనరేంద్రుని కప్పుడు వేంగి స్వాధీనమై యుండు ననుట నిస్సంశయము. తరువాత దేవాలయనిర్మాణమున కొక్క సంవత్సరమేనియు బట్టియుండును. కావున శాసనోక్త దానము శ. ౯౬౭ ప్రాంతమున జేయబడె నని చెప్పవచ్చును.

ఆజ్ఞప్తి, శాసనకావ్యకర్త, లేఖకుడు:—లభ్యమైన శాసన భాగమువల్ల వీ రెవ్వరైనదియు స్పష్టముగ దెలియవచ్చుటలేదు. కాని మైదవ రేకులో మిగిలిన ముక్కయందలి కడపటిపంక్తి 'శో రాచియ పెద్దేరి' యను మాటలతో నారంభమగుచున్నది. కడపటి యక్షరమగు 'రి'కి గుడిప్రక్కను 'ఈ'కారముతో గూడిన యక్షర లేశము కానవచ్చుచున్నది. దీనిని జదువగనే కోరుమెల్లిశాసనము లోని 'ఆజ్ఞప్తిః కటకేశో రాచియపెద్దేరి భీమనామతనూజః । కర్తా బేతనభట్టః కావ్యానాం లేఖకోఽస్య గణ్డాచార్యః' అను శ్లోకము స్మరణకు వచ్చుచున్నది. ఇందలి 'శో రాచియపెద్దేరి' ఇత్యాది పై శ్లోకములోనివే యని తలచెదను. పంక్తిప్రారంభాక్షరమగు 'శో' 'ఆజ్ఞప్తిః కటకేశో'లోని యంత్యాక్షరమేకాని యన్యము గాదు. కావున కోరుమెల్లిశాసనమునకు బోలి దీనికిని యాజ్ఞప్తి కటకేశు డని చెప్పవలసియున్నది. 'కటకేశు' డనునది యొక వ్యక్తినొక్క

నామము గాదు. అది యొక యధికారపదమును దెల్పు పేరు. 'కటక' మనగా నగర మని యర్థము. 'సైన్య' మని చెప్పినను చెప్ప వచ్చును. కావున 'కటకేశు' డనగా నాగరకు డని గాని, సైన్యా ధ్యక్షు డనిగాని యర్థము జేసికొనవలయును. పూర్వచాళుక్యశాస నములలో బెక్కింటి యందు కటకేశు డాజ్ఞప్తిగ బేర్కొనబడి యున్నాడు. కటకరాజు, కటకాధిపతి మొదలగు పేర్లన్నియు నీకట కాధీశపదమునకు నామాంతరములే.

శాసనకావ్యకర్త :—లభించిన ప్రస్తుత శాసనభాగమున శాసనగ్రంథకర్తప్రస్తావ మెచ్చటను గానరాదు. కాని యట్టి ప్రస్తా వము లేకపోవుట యతడు తన విషయ మిందు జెప్పుకొనకపోవుటచేత కాదు. ఈ పట్టున శాసనపురేకు విఱిగిపోవుటయే యతని విషయ మెఱుకపడకుండుటకు గారణము. కడపటి పంక్తియందలి 'రాచయ పెద్దేరి' యిచ్చట గడు ముఖ్యము. 'పెద్దేరి'తో నీపేరు సమాప్తము గాలేదు. 'రి'కి గుడివైపున 'ఈ'కారముతో గూడిన యక్షరలేశము గానవచ్చుచున్నదని ముందే తెల్పియున్నాను. ఈ 'యీ'కార మక్ష రముయొక్క యుపరిభాగమున దాకుచున్న ట్లున్నది. ఎడమభుజము గుడినుండి యించుక గ్రిందికి దిగి యెడమవైపున కీషణ్మాత్రము దిరిగి మరల క్రిందికి దిగిన ట్లున్నది. కావున నిది 'భీ' కావచ్చును. రాచియ పెద్దేరిభీమన యనునతడు విమలాదిత్యుని రణస్తిపూండిశాసనగ్రంథ మును రచియించెను. రాచియపెద్దేరిభీమన పుత్రుడు బేతనభట్టు రాజరాజనరేంద్రుని కోరుమెల్లిశాసనమును రచించెను. కోరుమెల్లి శాసనమునకును, ప్రస్తుతశాసనమునకును సన్నిహితసంబంధము గల దని యీ వ్యాసారంభమున నిరూపింపబడియున్నది. మఱియు నిది కోరుమెల్లిశాసనమునకు దరువాతి దని చెప్పుటకు గొంత యవ

కాశము గలదు. కోరుమెల్లి శాసనమున గానరాని వేంగీచాళుక్య చోళపరస్పరసంబంధమును దెల్పు చరిత్రాంశము లిందు కొన్ని వర్ణింపబడియున్నవి. ఈ కారణములవల్ల గలిదిండి శాసనగ్రంథము రచియించినాతడు రాచియపెద్దేరిభీమనపుత్రుడు బేతనభ ట్టనియే తలంచెదను. బేతనభట్టు విద్వత్కుటుంబమునకు జెందినవాడు. ఈ కుటుంబములోని మొదటివారగు రాచియపెద్దేరులను గూర్చి యేమియు దెలియకపోయినను మూడవవాడగు భీమన విద్వాంసుడు. ఆతని కవితాకౌశలమును రణస్తిపూండి శాసనము విశదపఱచు చున్నది. బేతనభట్టు సంస్కృతమున లలితమైన కవన మల్లగల వాడు. ఇతని వైదుష్యమునకును, గవితానైపుణ్యమునకును నితనిచే విరచితములైన కోరుమెల్లి కలిదిండి శాసనములే సాక్షులు. శయ్యా సౌష్ఠవముననేమి, యర్థగాంభీర్యముననేమి, పదలాలిత్యముననేమి, వర్ణనాచాతుర్యముననేమి కలిదిండిశాసనగ్రంథము గోరుమెల్లిశాసన మును మించినది. రాజేంద్రచోళుని వైభవమును దెల్పు శ్లోకములు సంస్మరణీయములు. కలిదిండియుద్ధవర్ణన రణక్షేత్రమును బాఠకుల చక్షురింద్రియములకు గోచరమగురీతి బ్రదర్శించి చోళకర్ణాటకాంధ్ర వీరుల శౌర్యవిజృంభణమును విశదముగ దెల్పుచున్నది. భీమన భట్టును, నాతని పుత్రుడును నాకాలమున బేరొందిన కవులైయుండి నట్లు తోచుచున్నది. కావుననే రాజపురోహితుడును, నాంధ్రశబ్ద శాసనుడును నగు నన్నయభట్టు వీరిచే విరచింపబడిన శ్లోకములను గొన్నిటిని దన నందంపూండిశాసనగ్రంథములోని కెక్కించుకొని యున్నాడు. ఈ విషయమును స్థలాంతరమున నిరూపించుచున్నాడ.

లేఖకుడు:—లేఖకుని మాట యిం దెచ్చటను లేదు. కాని యతడు గండాచార్యుడేకాని యన్యుడుగా డని తలచెదను. ఇతడే

రాజరాజనరేంద్రుని శాసనముల నన్నిటిని జెక్కిన లేఖకుడు. కోరుమెల్లి నందంపూడి, మండతామ్రశాసనముల లేఖకుడు గండాచార్యుడని ఆ శాసనములయందే కలదు. కోరుమెల్లిశాసనమునకు దరువాతిదీ కలిదిండిశాసనమని నిర్ధారించియున్నాను. ఈ నిర్ధారణ సరియైనదేని దీని లేఖకుడును గండాచార్యుడే కావలయును.

ఈ శాసనమును జదివి పరిష్కరించుటయందును, జరిత్రాంశములను బరిశీలించుటయందును నిప్పటి గవర్నమెంటు ఎపిగ్రాఫిస్టగు రావుబహదూరు సి. ఆర్. కృష్ణమాచార్యులుగారును, మదరాసు విశ్వవిద్యాలయము ఇండియన్‌హిస్టరి అండు ఆర్కియాలజీ ప్రొఫెసరగు కె. ఎ. నీలకంఠశాస్త్రిగారును, పై విశ్వవిద్యాలయమునందే సంస్కృతోపన్యాసకులగు డాక్టరు వి. రాఘవన్‌గారును నాకు దోడుపడిరి. వీరికి నా కృతజ్ఞతాపూర్వక వందనములను సమర్పించుచున్నాడను.



# మూ ల ము

## మొ ద టి రే కు : రెం డ వ ప్ర క్క

౧ శ్రీ [ధామ్నః పురుషో]త్తమస్య మహతో నారాయణస్య ప్రభో
న్నాభీపంకరుహా ద్బభూ [వ జగత] స్స్రష్టా స్వయం
౨ భూ స్తత [ః।] జజ్ఞే మా [న] ససూను రత్రిరితి య స్తస్మాన్మునే
రత్రి త స్సోమో వం [శ] కర స్సుధా[ం]శు రుదిత శ్శ్రీక]ణ్ఠచూ
3 డామణిః[1] [।౧॥*] తస్మా దభూ త్సుధాసూతే ర్బుధో బుధ
నుత స్తతః [।] జాతః పురూరవానామ చ [క్రవ ర్తీస] విక్ర
౪ మః [॥౨*॥][2] తస్మా దాయు స్తతో నహుషః తతోయయాతిః
చక్రవ ర్తీ వంశక ర్తా తతః పురు [రితి] చక్ర[వ ర్తీ]తతో జ
౫ నమేజయో [౭*] శ్వమేధత్రితయస్య క ర్తా తతః ప్రాచీశః
త [స్మా*] త్సైన్యయాతిః తతో హయపతిః తత స్సార్వ భౌ
౬ మః తతో జయసేనః తతో మహాభౌమః త [స్మా*] దై శానకః
తతః క్రోధానః తతో దేవకిః తస్మాదృభు
౭ కః తస్మా దృక్షకః తతో మతివరః సత్రయాగయాజీ సరస్వతీ
నదీనా [థః] తతః కాత్యాయనః
౮ తతోనీలః తతో దుష్య న్తః తత్సుతః। [।*] చక్రవ ర్తీ మహా
తేజా భరతో యూపకాననం। కృత్వాశ్వమేధా
౯ నకరో ద్గంగాయమునయో స్తటే [3][॥3*] తతో భరతా
ద్భూమన్యుః। తత స్సుహోత్రః। తతో హ స్తీ। తతో విరోచనః
౧౦ తస్మా దజమీలః। తత స్సంవరణః। సంవరణస్య తపనసుతాయా
స్తపత్యాశ్చ సుధన్వా। తతః పరిక్షిత్।
౧౧ తతో భీమసేనః। తతః ప్రదీపనః। తతః శ న్తనుః। తతో విచిత్ర
వీర్యః। తతః పాణరాజః॥[4] పుత్రా స్తస్య యు

---

1. శార్దూలవిక్రీడితము. 2. అనుష్టుభ్. 3. కడపటియక్షరమగు 'టే'కు గుడి ప్రక్క నకారపుపొల్లువంటి రేఖయొకటి కాన్పించుచున్నది. 4. 'పాండురాజః' అని చదువవలయును.

౧౨ ధష్ఠిర[1]భీమార్జుననకులసహదేవాః। పంచేంద్రియవ త్పంచ స్యు
ర్విర్నయగ్రాహిణ స్తత్ర ॥ [౪॥*[2]] జిత్వా యేన పుర
౧౩ ందరం హుతవహే[3]హవ్యీకృతం ఖాండవం[4] [।*] య శ్శంభో
ల్లబ్ధ తేస్మ సంయతి బహూ న్యస్త్రాణి దివ్యానిచ। యేనాధ్యాసిత
౧౪ మాసనం మఘువత శ్చార్ధం సురద్వేషిణాం[5][౧*] సంపిష్యాగ
మయత్ కృతా న్తనగరీంయః కౌరవాన్విద్విషః[౫॥6*]తతోర్జునా
౧౫ దభిమన్యుః। తతః పరిక్షిత్। తతో జనమేజయః।తతః క్షేముకః।
తతో నరవాహనః। తతః శతానీకః। తస్మా
౧౬ దుదయనః।తతః పరం తత్ప్రభృతి ష్వవిచ్ఛిన్నసన్తానే ష్వయో
ధ్యాసింహాసనాసీనే ష్వేకాన్నషష్టి[7] చక్రవర్తిష.

రెండవ రేకు : మొదటి ప్రక్క

౧౭ షుగతేసు[8] తద్వంశ్యే విజయాదిత్యనామరాజా విజిగీషయా దక్షి
ణాపథం గత్వాత్రిలోచనపల్ల
౧౮ వ మధక్షిప్య[9] కాలవశా ల్లోకా న్తర మగమత్।తస్మి న్నంకులే
తస్య మహాదేవీ గర్భభారాలసా న్తఃపురాధికృ
౧౯ తవనితాకంచుకి [10]భిస్సార్ధం వృద్ధామాత్త్యైః పురోహితేనచ
నీయమానా కథంచి న్మడివేము [11]నామాగ్రహారముపగ
౨౦ మ్య తద్వాస్తవ్యేన విష్ణుభట్టసోమయాజినా దుహితృనిర్వి
శేష[12]; మభిరక్షితా[13] సతీనందనం విష్ణువర్ధన మసూత
౨౧ సా తస్యచ కుమారస్య మానవ్యసగోత్రహారీతిపుత్రాదిస్వక్షత్ర
గోత్రక్రమోచితాని కర్మ్మాని[14] కారయిత్వా త

1. 'యుధిష్ఠిర' అని. 2. ఆర్యా. 3. 'హుతవహే' అని. 4. 'ఖాణ్డవం' అని. 5 'సురద్వేషిణాం' అని. 6. శార్దూలవిక్రీడితము. 7. 'షష్ఠి' అని. 8. 'గతేషు' అని చదువవలయును. 9. 'మధిక్షిప్య' అని. 10. 'చ' కారము యొక్క కొమ్ము వట్రువసుడివలె నున్నది. 'కి' యొక్క కుడిప్రక్కనొక చిన్న నిలువు గీటుకలదు. 11. 'కథంచిన్మడివేము' అని. 12. 'నిర్విశేష' అని. 13. 'రక్షితా' అని.14. 'కర్మ్మాణి' అని.

౨౨ మవర్ధయత్॥ నచ మాత్రా విదితవృత్తాన్త స్స న్ని గ్గ[1] త్య
చలుక్యగిరౌ నందాం భగవతీం గౌరీ మారాధ్య కుమారనారాయ
౨౩ ణమాతృగణాంశ్చ సంతర్ప్య శ్వేతాతపత్రైకగంఖ[2] పంచ
మహాశబ్దపాలికేతనప్రతిఢక్కా-వరాహలాంచ్ఛనపిం
౨౪ చ్ఛ[3] కు న్తసింహాసనమకరతోరణకనకద[ణ్డ]గంగాయమునా
దీని స్వకులక్రమాగతాని నిక్షిప్తాని
౨౫ వ[4] సామ్రాజ్యచిహ్నాని సామాసాద్య[5] త్రిలోచనపల్లవం
జిత్వాతత్సుతా ముత్తమదానీ ముపయ
౨౬ మ్య కదంబగంగాదిభూమిపా న్నిజ్జి[త్య*] సతు[6] నమ్మర్
దామధ్యం సార్ధసప్తలక్షం దక్షిణాపథం పాల
౨౭ యామాస॥ తస్యాసీ ద్విజయాదిత్యో విష్ణువర్ధనభూప తేః।
పల్లవాన్వయజాతాయా మహాదేవ్యాశ్చ నందనః। [౬॥*][7] త
౨౮ త్సూనుః పులకశీ[8] వల్లభః। తత్పుత్రః కీర్తివర్మా। తస్య
తనయః। శ్రీమతాం సకలభువనసంస్తూ[య]మానమా
౨౯ నవ్యసగోత్రాణాం హారీతిపుత్రాణాం కౌశికీవరప్రసాదలబ్ధరాజ్యా
నాం మాతృగణ పరిపాలితానాం స్వామిమ
౩౦ హాసేనపదానుధ్యాతానాం[9] భగవన్నారాయణప్రసాద సమా
సాదితవరవరాహలాం [చ్ఛనే[10] క్షణక్షణవశీకృ]
౩౧ తారాతి మణ్డలానా మశ్వమేధావభృతస్నాన[11] పవిత్రీకృత
వపుషాః[12] చాలుక్యానాం [కులమలంకరిష్ణోస్సత్యా]

---

1. 'సన్నిగర్త్య' అని. 2. 'శంఖ' అని. 3. లాంఛన 'పింఛ' అని. 4. 'నీవ' అని. 5. 'సమాసాద్య' అని. 6. 'సేతు' అని. 7. అనుష్టుభ్. 8. 'పులకేశీ' అని. 9. 'పాదానుధ్యాతానాం' అని 10 'లాంఛనే' అని. 11. 'భృథస్నాన' అని. మూడవయక్షరమగు 'స్నా' వ్రాయుటయందు లేఖకుడు మొదట 'సా'కు 'మ' వత్తు నిచ్చి దాని దుడిచి పైన 'న' వత్తు వ్రాసినట్లున్నది. 12. 'వపుషాం' అని.

౩౨ త్రయవ[ల్లభేం]ద్రస్య భ్రాతా కుజ్జ[1] విష్ణువర్ద్ధనో [౭*] ష్టాద
శవర్షాణి వేఙ్గీదేశ మపాలయత్ ।...[జయసిం]

౩౩ హ [వల్లభస్త్ర్య] స్త్రింశతం । తదను జేంద్రరాజనందన స్సప్త
దినాని [।*] తత్పుత్రో [వి]...న [ (?)వవ]

రెండవ రేకు : రెండవ ప్రక్క

౩౪ ర్షాణి । తత్సూను మ్మఙ్గియువరాజః పంచవింశతిం । తత్త
నయో జయసింహస్త్ర యోదశ । తద[నుజ]ః కో

౩౫ కిలిః[2] షణ్మాసాన్ । తస్య జ్యేష్టో[3] భ్రాతా విష్ణువర్ద్ధన స్తము
చ్చాట్య సప్తత్రింశత మబ్దాన్ । తత్పు[త్రో విజయా]ది

౩౬ త్యభట్టా*] రకో [౭*] ష్టాదశ। తత్పుత్రో విష్ణువర్ద్ధనః షట్
త్రింశతం।తత్సూను న్నరేంద్ర మృగరాజో [౭*] [ష్టా]చత్వారింశతం

౩౭ । తత్సుతః కలివిష్ణువర్ద్ధనోధ్యర్ద్ధవర్షం । తత్తనయో గుణగ
విజయాది[త్య*]శ్చతశ్చత్వా [రింశతం] । త[ద్భ్రాతు]

౩౮ ర్వ్విక్రమాదిత్యభూపతే స్సుత శ్చాలుక్యభీమ స్త్రింశతం ।
తత్పుత్రో విజయాదిత్యష్షణ్మాసాన్ । త[త్సూనుర

౩౯ మ్మరాజ స్సప్తవర్షాణి । తత్సుతం విజయాదిత్యం బాల
ముచ్చాట్య తాడపరాజో మాస మేకం । [తం జిత్వా]

౪౦ చాలుక్యభీమతనయో విక్రమాదిత్య ఏకాదశమాసాన్ ।తత్తాడ
పరాజసుతో యుద్ధమల్లస్సప్తవ...

౪౧ తః॥ అమ్మరాజానుజో రాజభీమో భీమపరాక్రమః । విజిత్య
యుద్ధమల్లంతం ద్వాదశాబ్దా[న్ద...॥[4][౭॥*]

1. 'కుబ్జ' అని. 2. 'కొక్కిలిః' అని చదువవలయును. 3. 'జ్యేష్ఠో' అని.
4. అనుష్టుభ్.

౪౨ సత్పుత్రయో ర్దశరథ ప్రతిమస్య తస్య భీమస్య రామభరతో
పమయోః[1] కనీయ్యాన్ దానా[ర్ణవస్తు?]

౪౩ నృపయోః ఖలు పంచవింశత్యబ్దా నరక్ష దవనీతల మమ్మ
రాజః॥[2] [*౮॥] తస్య జ్యేష్టో[3] [నృ] పతిషు [చ]...

౪౪ ష్టి[4] విద్యాప్రవీణో యఃకర్ణాదీ న్సురతరునిభో భూరిదానేన
జిత్వా। లోకే [౭*]న్వర్థం సుచిరమద. [నా] మదానా [ర్ణ]

౪౫ వాఖ్య స్స త్రీనబ్దా నవహ దవనీ మర్ణవక్షౌమ కాన్తాం॥[5][౯॥*]
తతః ప [రం] పతింలబ్దు మనురూపమ నా[యి] కా[6] [స]

౪౬ ప్తవింశతివర్షాణి వచా రేవ[7] తపఃక్షమా॥[8] [౧౦॥*] అథ
దానార్ణావ [జా]తః [9] కలావాన్ ద్విట్తమోహరః రాజ
[—*]చాలు [క్య] చ [ం]

౪౭ ద్రో యః క్షమాతాప మపా[10] కరోత్॥[11] [౧౧॥*] బలా ద్గృ
[12]హీత్వా బలితో [ధ]రిత్రీః[13] గీర్వాణ[14] శత్రోరివ
శత్రువర్గాన్ [త్ । (శ్రీ)]

౪౮ శక్తివర్మ్మ [—*]న్ నవమా శ్చలుక్యనారాయణో ద్వాదశరక్ష
తిస్మ॥[15] [౧౨॥*] తదనుతదనుజన్మా రాజమార్తాణ్డ [భూ]

౪౯ పో విశదరుచిరరాతి ధ్వాంతవిధ్వంసదక్షః । స్సమవహాతి భువ
మబ్దా న్స ప్తసప్తాశ్వ తేజా స్స [కలవ]

1. విసర్గలోని రెండు సున్నలు గలియునట్లు చెక్కుటవల్ల నది 'రి' వలె గాన వచ్చుచున్నది. 2. వసంతతిలక. 3. 'జ్యేష్ఠో'. 4. 'ష్ఠి' అని. 5. మందాక్రాన్త. 6. 'నాయికా' అని. 7. 'చచారేవ' అని. 8. అనుష్టుభ్. 9. 'దానార్ణవాజ్జాతః' అని. 10. 'పా' వెనుక 'లి' వంటి యక్షరము వ్రాసి తుడుపబడియున్నది. 11. అనుష్టుభ్. 12. 'బలాద్గృహీత్వా'లోని 'ద' క్రింది 'గ' వత్తు తలక్రిందుగా జెక్కబడియున్నది. 13. 'ధరిత్రీం' అని. 14. 'గీర్వాణ' అని. 15. ఉపజాతి.

మూడవరేకు : మొదటి ప్రక్క

౫౦ సుమతీభృ న్మస్తకన్యస్తపాదః[1] ॥ [౧౩*॥] లక్ష్మీభ [2]ర్తుర్గని
భస్య తస్య విమలాదిత్యస్య భోడాన్వయ[3] క్షీరాంభోనిధి

౫౧ జన్మనః శ్రియఇవ శ్రీరాజరాజ [—*] ధిపః । దేవ్యా శ్చాబని[4]
రాజరాజదుహితుః కుందాంబికాయా స్సుతో య

౫౨ ః కందర్ప్ప ఇవాపరః ప్రతివసన్ లోకత్రయే స్త్రీహృది[5]॥
[౧౪॥*] బాల్యే భూషణ మభవ ద్రత్నమయీ యస్య క

౫౩ ంకంధికాకంధే[6]। గుణలుబ్ధయేవ మాలాధరయా దత్తా పతిం
[వరయా][7]॥[౧౫॥*] వేదాంభోధినిధిప్రమాణగణితే శా

౫౪ కాబ్దసంఘే[8]రవౌ సింహస్థే బలహులద్వితీయదివసే వారే
గు[రోశ్శితగో]।యుక్తే భోత్తర భద్రయా[9]వ్యతివణి

౫౫ జ్యామేతు[10]క్షమాం త్రాతుం పట్ట మధత్త యో గుణనిధిః
శ్రీరా[జ]రాజో నృపః[11]॥ [౧౬॥*]యస్యోత్తమాంగ మాబద్ధ

౫౬ మాభాత్పట్టేన భూయసా । (౹) భర్తుర్గం విశ్వంభరాభారం
జనై శా [రోపితంయ] తా[12]॥ [౧౭॥*]అపిచ॥ఖ్యాతస్సమస్తనర

౫౭ నాథకిరీటకోటిరత్నప్రభాపటలపాటలపాదపీఠః[13] యస్త్యాగవర్ష
పరిహర్షితసత్సమాజో రాజేం

౫౮ ద్రచోడ ఇతి చోడకులైకరత్నం॥[14][౧౮॥*] ఏకస్యాసిద[15]పిస
హిమవానీశ్వశస్యా[16]పతద్భిమ్మూర్ద్ధ్నిగంగా

---

1. మాలిని. 2. లక్ష్మీభర్తుర్గలో భ,ర్తుర్గలకు నడుమ తుడిపివేయబడిన 'స్య' యొకటి యస్పష్టముగ గానవచ్చుచున్నది. 3. 'చోడాన్వయ' అని చదువవలయును. 4. 'దేవ్యా శ్చాజని' అని. 5. శార్దూలవిక్రీడితము. 6. కంఠికాకంఠే 7. ఆర్యా. 8. 'సంఖ్యే' అని. 9. 'యుక్తే చోత్తరభద్రయా' అని 10. ఇచట లేఖకుడు రెండక్షరములను దిగవిడచినాడు. 'తత్రే' అని చేర్చుకొన్న సరిపోవును. 11. శార్దూలవిక్రీడితము. 12. 'యథా' అని. అనుష్టుభ్. 13. 'టలపాటలపాదపీఠః' అను భాగమున మొదట నేదో మొదట వ్రాసి తుడిచిన తుడుపుమీద చిన్న యక్షరములతో నిరికించి వ్రాయబడియున్నది. 14. వసంతిలక. 15. 'ఏకస్యాసీ'దని 16. 'నీశ్వరస్య' అని.

౫౯ విమలసలిలై స్సిభ్య[1]మానఃపవిత్రః। రాజేంద్రో యః[2] కిముత నమతామీశ్వరాణాం బహూ(నా)

౬౦ ం రత్నాలోకప్రకటిజగత్ప్రాంగణోభ్య[3] శ్శిరోభ్యః[4]॥[౧౯॥*] సద్వీపాం చతురంబురాశి[5]పరిఖాం విశ్వంభరాం[లీ]

౬౧ లయా దణ్డేనైవ విజిత్య యోదిశదిశి ప్రాతిష్టిపత్స[ర్వ్వతః] [6]స్సైర్వ్వరోద్భ్రాన్తినివారణాయ విజయ స్త

౬౨ ంభా న్స్వనామాంకి[7]తా నాలానానివ బద్ధమర్ధమనసోదర్పేణ[8] దిగ్దన్తినః॥[9] [౨౦॥*] సత్రశత్యాపరితుష్యా[10] [వంశ]వినయ

౬౩ త్యాగాభిమానోన్నతి(ం) ప్రజ్ఞావిక్రమసత్యశౌ[చ] పటుతా శౌర్య్యక్షమాదీ న్యసౌ[11]। (।)చోడేశో(మ)ధురాన్త

౬౪ కః[12]స్వాతనయా[13]మమ్మంగనామాం సతీం చాలుక్యాభరణస్య చాగ్రమహిషీం స్నేహేన యస్యాకరోత్[14]॥[౨౧॥]

౬౫ యస్మిన్ రాజని రక్షతి భూచక్ర మవక్ర ముచితమార్గే[ణ*]ణ। అభవ దబాధ మకలుష మ[దూషి]తమ

మూడవ రేకు : రెండవ ప్రక్క

౬౬ మత్సరం [ప్రజాభరితం॥][15] [రాజ్ఞో రా [జచ] లుక్యవంశలతి కాలంబస్య యస్య స్వయం శశ్వత్క్ [త్రిన రలంక]

1 'చ్య' అని. 2 'రాజేంద్రోదయం' అని. 3 'ప్రాంగణేభ్యః' అని. 4 మందాక్రాంతము. 5 రాశి' అని. 6 'దిశిదిశి ప్రాతిష్ఠిపత్సర్వ్వతః' అని. 7 ఈ యక్షరము 'కి' కంటె 'రి'ని యతిశయముగ పోలియున్నది. 8 'బద్ధమర్ధమన' యనునక్షరములు జిన్నవిగనిరికించి తుడుపుపై జెక్కబడియున్నవి. 'దర్పేణ' అని. 9 శార్దూలవిక్రీడితము. 10 'సత్రుత్యాపరితుష్య' అని. 11 ఈ యక్షరము 'ర్గను' పోలియున్నది. 12 'కః'ముం. దాక యక్షరము పొడకానవచ్చుచున్నది. 13 'స్వతనయా' అని. 14 శార్దూలవిక్రీడితము. 15 ఆర్యా.

౬౭ రోతి నితరా [ం] లో [కత్రయీకామినీం[1]] । హారలీవ[2] సుగన్ధి
చన్దనమయీల [—?]నచోలావకీమాత్రైవా [మలజా?]

౬౮ తిజల[3] కలితా [దా] కూలలక్ష్మీరివ॥[4] [౨౩॥*] యస్య శ్రీపర
గణ్డభైరవవిభోర్దోర్దణ్డ [కౌక్షేయకప్రాణోద్వాహితహా]

౬౯ స్తిమస్తిక[5] గలన్మస్తిష[—ఖాదా] శయా [।*] గృధ్రాః పక్ష
పుట న్విసాయ్యర్గ[6] వియతి [వ్యాబద్ధ]చ[క్రశ్చ] ల. [ంచ్ఛచ్ఛ?]

౭౦ త్రచయ[7] శ్రియం విదధతే వీరశ్రియ స్సంయతి॥[8] [౨౪॥*] ఏకే
నైవ హాయీహాయేన బహు[శో]............

౭౧ థాకోవా వీరభటో జయేత్ ప్రతిభటం చాస్త్రాభివర్షైస్తథా[9]।
కస్మించేదితి వి ద్ర[ు] తా ర [ణముఖాదాశ్చ]

౭౨ య్యర్పయ్యాకులా యస్యారాతయ ఏవశౌయ్యర్ మనిశం
స్కన్ధన్తిత [న్వన్తిచ॥][10] [॥౨౫।*][స్వస్తి][స*] వ్వర్లోకా

౭3 శ్రయ శ్రీవిష్ణువర్ధనమహారాజ [—ం*]ధి రాజ రాజపరమేశ్వర
పరమ భట్టా [రకః] పరమమాహే

౭౪ శ్వరః పరమబ్రహ్మణ్యః మాతో[11] పితృపాదానుధ్యాతిః[12]
త్యాగసింహాస [నాసీ] నః[ధతు? వుల]నా

౭౫. మ విషయసహిత పల్లపుగుద్రవార విషయ మధివసతః రాష్ట్రి
కూటప్రముఖా[న్కుటిం]బి [సః[13]స] వ్వాన్స

౭౬. మాహూయ మన్త్రిపురోహిత సేనాపతి యువరాజ దౌవారిక
ప్రవానాది[14] సమక్ష[15]మి [త్థ] మాజ్ఞా

---

1 'కామినీం' అని. 2 'హారాలీవ' అని. 3 'జాల' అని. 4 శార్దూలవిక్రీడితము. 5 'మస్తక' అని. 6 'పుటాన్విసాయ్యర్' అని. 7 లేఖకుడు కొన్ని మాటలను దిగవిడచినాడు. 8 శార్దూల విక్రీడితము. 9 'షైర్'లోని యైత్వచిహ్నము కొంచె మస్పష్టముగ నున్నది. 10 శార్దూల విక్రీడితము. 11 'మాతా' అని. 12 'ధ్యాతః' 13 'ప్రముఖా న్కుటుంబినః' అని. 14 'ప్రధానాది' అని. 15 'సమక్ష' లోని 'మక్ష' మొదట గుడియిచ్చి పిమ్మట నదియే తలకట్టుగ మార్పబడియున్నది.

౭౭ పహాయతి।1 యథా।2 ఖ్యాతో[౽*]స్తి రాజరాజప్రిహ్మా3 మహా రాజ4ఇతి మహాదణ్డపతిః [। *] యోమధురా

౭౮ న్తక భూభృత్కరుణారససిక్తవర్ద్ధి5 తయశోలతికః6। [౨౬॥*] రాజేన్ద్ర చోడభూపాల రాజ్యలక్ష్మీమహా

౭౯ నిధౌ [।*] రక్షణ7క్షమదక్షోగ్రమహాభుజభుజంగమః8[॥౨౭॥*] దిక్షోదక్షిణతః పురస్కృత బృహద్దణ్డ

౮౦ స్సయో విద్విణ్ణోచ్ఛోణిత9 పానగృధ్ను రపరః కాలో నవేతి క్షితః10[।*] రాజేన్ద్రక్షితిపాలకస్యమహతోమన్మాతు

నాల్గవరేకు : మొదటిప్రక్క

౮౧ లస్యా [తు*]ల స్యాదేశం11 ప్రతిపద్య తత్ క్షణతఏ వాంధ్రక్షమాం ప్రాగమత్ ।12[।౨౮॥*] అన్యో [౽*] పి దణ్డనాథో భక్తిక్లేశప్రతు

౮౨ ష్టనిజనాథః13 [।*] అమునై వాగతవా నుత్తమశోడ చ్చోడ గోనితివ్యపదిష్టః14। [*౨౯॥] ఉత్తమచోడమిలాడుడయ్యా

---

1 'జ్ఞాపయతి' అని. 2 'యథా' అని. 3 'బ్రహ్మ' అని. 4 'మహారాజ'లోని 'జ' అనుదానిని ముందటి 'రా'కును తరువాతి 'ఇ'కిని మధ్య నిరికించి చిన్నదిగ జెక్కబడియున్నది. ప్రమాదవశమున లేఖకుడు దీనిని వదలిపెట్టి తరువాత పై రెండక్షరములకు నడుమ సందుచేసికొని చెక్కినట్లున్నది. 5 'ర్ద్ధి' ఈ సంయుక్తాక్షరములో బైదానిని మొదట 'జ'గ వ్రాసి దానినే 'ద'గ దిద్దినట్లున్నది. 6 ఆర్యా. 7 'ణ'మీదయెత్వచిహ్నము గానవచ్చుచున్నది. మొదట యెత్వముతో గూడిన యొకయక్షరము వ్రాసి దానిని చక్కగ తుడువక దానిపై 'ణ'వ్రాయుట వల్ల మొదటవ్రాసిన యక్షరమునకు జెంది యెత్వ చిహ్న మట్లే నిలిచిపోయెనని తోచుచున్నది. 8 అనుష్టుభ్. 9 'విద్విట్ఛోణిత' అని. 10 'క్షితౌ' అని. 11 'శ' మొదట చెక్కనప్పుడు విడిచి తరువాత'దే' 'ప్ర'లకు నడుమ జొప్పింపబడియున్నది. 12 శార్దూల విక్రీడితము. 13 'థ' అని. 14 'వ్యపదిష్టః' అని ఆర్యా.

౮౩ సిత్యన్యో[ఽ*]పిచాగతః[1] పురుషః[।*] యఃపతిరథసేనాయాః
పతివ్రతాయాః పరేక్షణా సహానాయాః[2] [॥౩౦॥*]క

౮౪ న్నాౕటిక బలారణ్యాం[3] త్వాగ్ధుకమ మశేషతః[4] దణ్డనాథత్రయేం
[5]దృష్ట్వా మగ్నిత్రయమి వోజ్వలం॥ [6౩౧॥*]కన్నాౕ

౮౫ టద్రమిలాధీశదణ్డేశా మాధవద్రణం [।*] పరస్పరచతుర్దన్తప్రతి
ఘట్టనభీకరం[7] [।౩౨॥*]ముష్టాముష్టి క్వచి ద్దృ

౮౬ ష్టం కోశా[8]కేశ్య[భవత్ష]ణం [।*] దణ్డాదణ్డిక్వచిత్ప్రోక్తం
కున్తాకున్తి నిరన్తర[9] [ం*] [॥*౩౩॥] జఘ్నిరే[10]
నిజశరైరపి కేచి ద్ధన్వినో

౮౭ యు [ధిసమద్ధిత[11] శౌర్యాః[।*]సేనయోరపి పరస్పరబాణా
పాతజ[న్మ*]తజపవాతవివృ[త్తః][12] [॥౩౪॥*]ఖడ్గిఖడ్గదృ

౮౮ ఢఘ[ట్టన]జాతే విస్ఫులింగనివహే సులభాస్యః।[13] సద్భట[14]
భయభృతః [చ*]లచిత్తా।[15] పంచప

౮౯ ...[సన్త]పదాత్యోః।[16] [।౩౫॥*]నృత్యమివ[గజ]కబన్ధాస్తురగ
కబన్ధాశ్చ నరకబన్ధప్రముఖేః।[17] [।*][ర]

౯౦ ణమద్ధైవ విముక్తం నిజనాథావంధ్యపోషణస్యేతి ముదా।[18]
[।౩౬॥*]గజై గ్గజా వాజభిరేవ వాజినో నరై

---

1 'చాగతః' అని. 2 ఆర్యా. 3 'కర్ణాటక బలారణ్యం' అని. 4 'దగ్ధుకామ మశేషతః' అని. మొదట నేమోవ్రాసి తుడిపి పైన జెక్కబడిన వీయక్షరములు. 5 'దణ్డనాథత్రయం' అని, 6 అనుష్టుభ్. 7 అనుష్టుభ్. 8 'కేశా' అని. 9 అనుష్టుభ్. మొదట వ్రాసినది తుడిచి దానిపైన 'నిరన్తరం' అను మాట చిన్న యక్షరములలో వ్రాయబడి యున్నది. 10 'జఘ్నిరే' లోని 'జ' కడునూక్ష్మము. వెనుకటి శ్లోకములోని కడపటి యక్షరమువలె నిదియు తుడుపుపైన వ్రాసినదే. 11 'సమద్ధిత' అని. 12 స్వాగతా. 13 'శలభాఃస్యుః' అని. 14 'సద్భటాః' అని. 15 'భయభృతాః చలచిత్తాః' అని. 16 స్వాగతా. 17 'నృత్యమివ గజకబన్ధాస్తురగకబన్ధాశ్చ నరకబన్ధప్రముఖాః' అని. 18 ఆర్యా.

౯౧ ర్న్నరాస్తత్ర సమం వినాకృతాః[।*] ద్విపక్షయోః కాల వశేన సంయుగే సమాన యుద్ధం[1] సమమేవ

౯౨ నశ్యతి।[2][।౩౭॥*]భృశ మవసర ఏషనః ప్రగన్తుం దివ మను చింత్య పదాతియుగ్మముఖ్యాః [।*]దివిజి

౯౩ యువతిసంగకాంక్షయేయుః స్సమతిమథ ద్దైవదురీహయో [చభూమేః4] [॥*౩౮] ఏతద్ద్రమిలదణ్డనాథానా

౯౪ ం రాజరాజరాజ[5]బ్రహ్మమహారాజ నామధేయో స్వమాతు లస్య మధురాన్తక[దే]వస్యా

౯౫ తులాస్యాదేశః[6]ప్రాప్య కర్న్నాటక[7]దణ్డనాథై ర్య్యు[ద్ధ్వా] [త్రై]రేవ సార్ద్ధం దివంగతవా[నాశ్వ]

౯౬ నహాస్తికేనచ[బ]లేనబహా[8]బలేన చసమబలత్వాచ్చాతముద్దిశ్య కలిది[ణ్డిగ్రామే]

నాల్గవ రేకు : రెండవ ప్రక్క

౯౭ రాజరాజాశ్వర[9] [మితిశి] వాయతనమకరవం । ఉత్తమశోడ [చ్చోడగోనిత్యు?త్తమచోడమి]

౯౮ లాడుడయానితి ప్రసిద్ధావన్యావపి చోద్దిశ్య శివాయతనద్వయం [కరోతి।]...[మంగ]

౯౯ లోత్తుంగసంగీతకఖణ్డస్ఫుటితనవకర్మ్మ బల్యుపహారాద్యర్త్థాం[10][పంచాసచ్ఛాత్రాణాం]

౧౦౦ శాస్త్రస్య శ్రోతౄణాం సత్రార్త్థంచ ద్వయాధికపంచాశద్వే శ్యాభిః[।*]బ్రాహ్మణ [శ] తేన బ్రహ్మవి]

---

1 'యుద్ధ' అని. 2 వంశస్థ. 3 'సమ' అని. 4 'దురీహాయచభూమేః' అని. పుష్పితాగ్రా. 5 'రాజరాజ' అని 6 'తులస్యాదేశం' అని. 7 'కర్ణాటక' అని. 8 'బాహు' అని. 'బ'కు కుడిప్రక్క నొక నిలువుగీటు కలదు. 9 'రాజరాజేశ్వర' అని. 10 'బల్యుపహారాద్యర్థం' అని.

౧౦౧ దినా[1] హుతజాతవేదస[।*]వైశ్యైశ్తేనచ ధనదోపమేన [।*]శూద్రశతేన [బ్రహ్మాపాద కమల?]

౧౦౨ సంభూతేచసార్ధం[2] మధురాన్తకనల్లూరినామ్నా ప్రసిద్ధః కలిదిణ్డినామగ్రామ.........

౧౦౩ గ్రామాధికయోదత్తః [*] తస్యావధయః [॥*] పూర్వ్వతః కొన్నెకిసీమేవ[3]సీమా[।*]ఆగ్నేయ[తః]లిదొట్టు[సీ]

౧౦౪ మైవ సీమా । దక్షిణతః కొన్తామసీమా[।*]నైరృత్యతః వేవాకసీమైవ సీమా [।*] [పశ్చిమతః కడపట్టు]

౧౦౫ సీమైవ సీమా।వాయ[వ్య]తః దాడినాణ్టిసీమైవ సీమా।ఉత్తరతః। పోతు[ం]బత్తిసీమైవ సీమా।[ఈశానతః]

౧౦౬ పోతుంబత్తిసీమైవ సీమా । పల్లపుగుద్రవారే కడపట్టునామగ్రామః[ః-]గ్గియపూ[ణ్డి]...[దత్తత?]

౧౦౭ స్యపూర్వ్వతః[।]కలుదిణ్డిసీమైవ సీమా [।*] ఆగ్నేయతః ఏషైవ।దక్షినాతః[4] వేవా[కసీ]మైవసీమా । నరృ

౧౦౮ త్యతః[5] ఏషైవ। పశ్చిమతః[।] ఆవకూరిసీమైవ సీమా। వాయవ్యతః తామరకొలని క్రొవ్వింఢ్యేటం బొసి[।]

౧౦౯ న తల్లిక్రొయ్యు నామనదీ । ఉత్తరతః [।] కల్వసణ్డసీమైవ సీమా। ఈశానతః [।]తాడి నాణ్టసీమైవ

ఐదవరేకు : మొదటిప్రక్క

౧౧౦ సీమా। పల్లపుగుద్రవారే ఆవకూ.........

౧౧౧ త[ఃక]డపట్టి [సీ] మైవ సీమా। ఆ[గ్నేయ].........

౧౧౨ మతః కొణ్డిక ముంజలూరసీమె [వ][6].......

౧౧౩ ట్టి సీమెవ[7] సీమా। ఈశానతః కడ.

1 'విధినా' అని. 2 'సార్థం' అని. 3 'సీమైవ' అని. 4 'దక్షిణతః అని. 5 'నైరృత్యతః' అని. 6 'సీమైవ' అని. 7 'సీమైవ' అని.

౧౧౪ సపంచమహాపాత[కై] య్యుర్గో[భ]......

౧౧౫ వా యో హరేత వసు [న్ధ]......

౧౧౬ బహుభి శ్చానుపా [లి]......

౧౧౭ మ్మర్గసేతు నృపాణాం క1......

౧౧౮ భూయో యాచతే రామభ[ద]......

౧౧౯ భూపా యే పాలయన్తి మ[వ]......

౧౨౦ పమాధికత్వవిధినా శ్రీరాజ[రా]......

౧౨౧ స్త్రాదేరపరాస్తదా [వి]ధిన......

౧౨౨ శోరాచియ పెద్దిరి[భీ?]......



1 'కా' అని.

# ౧౧

# రాజరాజనరేంద్రుని మండతామ్రశాసనము

## శా స న ల బ్ధి

తూర్పుగోదావరిజిల్లా ఆలమూరు పోస్టాఫీసునకు సంబంధించిన గుమ్మిలేరు వాస్తవ్యు లగు శ్రీ యండ్ర వీర్రాజుగారి మూలమున ఈశాసనము ప్రచురణార్థము శ్రీ భారతీపత్రికాధిపతుల కడకు పంపబడెను. పరిష్కరణార్థము వారిద్వారా నా యొద్దకి వచ్చినది. రామచంద్రాపురంతాలూకాలోని మండపేటగ్రామమున ఇండ్ల పునాదులు త్రవ్వుచుండగా మూడు గజములలోతున గానవచ్చిన మట్టికుండయం దీశాసనము దొరకెనట.

## స్వ రూ పా ది క ము

వరాహముద్రతో గూడిన రాగికడియమునకు గూర్పబడిన మూడు రాగిరేకు లపై నీశాసనము చెక్కబడియున్నది. ఇందొక్కొక్క రేకుయొక్క నిడివి అం. ౯, వెడలుపు అం. ౩. ౧. రేకుల కన్నిటికిని అంచులు కట్టియున్నవి. మొదటిరేకు మొదటిప్రక్క వ్రాత లేదు. మొదటిరేకు రెండవ ప్రక్క ౧౫ పంక్తులును, రెండవరేకున కిరుప్రక్కలను, మూడవరేకు మొదటిప్రక్కను నొక్కొకప్రక్కకు పదహారేసిపంక్తులును, మూడవరేకు రెండవప్రక్క ౬ పంక్తులును మొత్తముమీద శాసనమం దంతటను ౬౯ పంక్తుల వ్రాత గలదు. కడియముయొక్క మందము అం. .౩౫, నడిమికొలత అం. ౪. భారతికార్యస్థానమునకు వచ్చువఱకు కడియము నఱకుడువడలేదు. నా కోరికమీదనే యది ఛేదింపబడినది. కడియముతోగూడ రేకుల తూకము అయిదున్నర పౌనులు, లేక సుమారు ౨౧౫ తులములు.

## ము ద్రి క

ఈ శాసనవలయములో రాజముద్రిక తాపటము సేయబడియున్నది. ఇది కలిదిండిశాసనపు ముద్రికకంటె జిన్నది; అంత చక్కనిదికూడ కాదు. దీని నడిమి కొలత అం. ౨.౬. అంచుల మందము అం. .౩. ముద్రికకు రెండుతలముల నంచులు గట్టబడియున్నవి. క్రిందివైపు అం. .౬ యెత్తును, అం. ౪.౪ చుట్టుకొలత గల బొద్దును దీర్చి దాని యడుగున నాలుగువైపులను నాలుగు పెద్దదళములును, మూల

లందు దళలేశములును గల పుష్పరూపముగ జేసి దాని యధోతలమున నొక రేకు నంటించి యా రేకును కడియము కొనలు గలియు తావు మరుగుపడునట్లు చుట్టి దాని నిటునటు గదలనీయక కడియమున కతికించి భద్రముగ దాపటము జేసియున్నది. ముద్రిక యుపరితలము దన్మధ్యమున గానవచ్చెడు 'శ్రీ త్రిభువనాంకుశ' యను పోతయక్షరముల పంక్తివల్ల రెండుభాగములుగ విభజింపబడుచున్నది. ఈ పంక్తికి పై భాగమున మధ్యప్రదేశమున నెడమముఖమై పరుగిడుచుండునట్లు గానవచ్చు వరాహబింబమును, దాని ముఖమున నెదుట శంఖమును, బుచ్ఛమునకు వెనుక డమరును గానవచ్చుచున్నవి. ఈ వరాహబింబముయొక్క వీపున నెగువ సూర్యచంద్ర ఛత్రచిహ్నములు దెలియవచ్చెడిని. పై యక్షరపంక్తికి గ్రిందిభాగమున నెడమకొన యడుగున నధోముఖముగ నడ్డముగ బండవేసిన యంకుశమును, దానికి దిగువ నెడమ వైపునుండి వరుసగ నొక చిరుగద్దెయు, చతుర్దళములతోడను, నన్నియ యుపదళములతోడను గూడిన వికసితపుష్ప మొక్కటియు, కామతోడి మొగ్గ యొకటియు గానవచ్చుచున్నవి.

## శా స న స్థి

శాసనము చక్కని స్థితియం దున్నది. చిరకాలము భూస్థాపితమైయుండిన కారణమున పెక్కుతావుల చిలుము దట్టముగ నావరించుకొనియుండినను, శాసన మెచ్చటను జెడిపోలేదు. లోతుగ జెక్కబడియుండుటచే నక్షరములు మాసిపోక స్పష్టముగ నగపడుచున్నవి. కాని శాసనగ్రంథమున దప్పు లనేకములు గలవు. దీనికి ముఖ్యకారణము లేఖకుని యజాగ్రత్తయే. శాసనము జెక్కినప్పుడు పెక్కుస్థలములయందు మాటలను దిగవిడచినాడు. చూ: పంక్తులు—4. 'చక్రవర్తిసవిక్రమః' అనుటకుబదులు 'సవిక్రమః'ను దిగమ్రింగి 'చక్రవర్తి' యనియేయని యనుష్టుభును వదలివేసియున్నాడు. 11. 'సింహాసనా' యనుటకు 'సింహానా' యనియు, 12. 'చక్రవర్తిషుగతేషు' అనుటకు బదులు 'చక్రవర్తిషుషు' అనియు వ్రాయబడియున్నది. ఇట్టివి పెక్కు. గుణింతపు తప్పుల మాట ప్రత్యేకించి చెప్పవలసినదిలేదు.

## అ క్ష ర స్వ రూ ప ము

అక్షరస్వరూపమునుగూర్చి తెలుపదగిన విశేషాంశము లెవ్వియు లేవు. క్రీ.శ. ౧౧-వ శతాబ్దపూర్వార్ధమున బుట్టిన దానశాసనములలోని యక్షరముల వంటివే ఇందలి యక్షరములును. అక్షరముల పోలికలనుబట్టి కలిదిండి నందంపూండిశాసనములు దీనికి సన్నిహితము లనదగియున్నవి. వర్ణస్వరూప మిట్లు సామాన్యమే యైనను,

నప్పటి పూర్వచాళుక్య శాసనములలో సాధారణముగ గానరాని వర్ణము లిందు రెండు పొడకట్టుచున్నవి. అం దొకటి 'ఊ' కారము. ఇప్పటి 'ఊ' కారము నిది కొంత పోలియున్నను, రూపమున గొంత భేదము దెలియవచ్చుచున్నది. డాపలివంపు గల కొడవలివంటి యాకారము దీనిది. నెత్తిపై పిడి యుండు తావున నూత్కృతమమైన యూర్ధ్వరేఖ యొక్కటి గలదు; పొక్కిలి లేదు; దీర్ఘమును సూచించుటకై రెండు భుజముల మధ్య తలను మీదికిని, తోకను గ్రిందికిని ద్రిప్పి నిలువుగ వ్రాయబడిన తొమ్మిదవ సంఖ్యను బోలిన చిహ్నమొకటి గానవచ్చుచున్నది (చూ : రే 3, ప్ర ౧, పం. ౧౪), రెండవది 'ఒ'కారము. దీనికిని, ఇప్పటి 'ఒ'కారమునకును గల భేద మత్యల్పము. తల యించుక పెద్దది; పొక్కిలి లేదు (చూ: రే 3, ప్ర ౨, పం ౨).

## గుణింతము

హల్సంయుక్త 'ఎ' కార 'ఒ'కారముల హ్రస్వదీర్ఘభేదమును సూచించుటకు ప్రాచీన శాసనములందువలె నిందును బ్రత్యేకచిహ్నమేమియు గానరాదు. సందర్భానుసారముగ బాఠకు లీభేదమును నిర్ణయించుకొనవలసియున్నది. కాని ఇ-కారముయొక్క హ్రస్వదీర్ఘభేదమును సూచించుటకుమాత్రము బ్రత్యేక చిహ్నములు వాడబడినవి. హల్సంయుక్తహ్రస్వ 'ఇ' కార మిప్పటివలెనే యక్షరము మీద వ్రాయబడిన గుడిమూలమున సూచింపబడినది; కాని ఇది దీర్ఘమైనప్పుడు ఇప్పుడు వాడుకయం దుండు గుడిమీద పొల్లునకు మారుగ గుడిలోనికి జుట్టబడిన గిఱికె మూలమున దెల్పబడినది. ఈ భేదము క్రీ. శ. ౧౦, ౧౧ శతాబ్దములనాటి తామ్రశాసనములయందు సామాన్యముగ గానవచ్చుచున్నది. అనునాసికకుబదులు సాధారణముగ ననుస్వారమే గానవచ్చుచున్నను గాదాచిత్కముగ ప్రాచీనపద్ధతి ననుసరించి వర్గసంబంధియనునాసిక వాడబడియున్నది (చూ : ౨. ౨.౪౧ అత్రాన్తరే). మఱియు రేఫ యుక్తమగు హల్లు ద్విత్వమును బొందుచున్నది (కర్త్తార్, సార్వ్వభౌమ, నిర్వ్విశేష, కర్మ్మణి, తత్సూనుర్మ్మంగి యువరాజః, విష్ణువర్ద్ధన, ధర్మ్మ-ఇత్యాది) ఇది ప్రాచీన పద్ధతి.

## భాష

ఇందలి భాష సంస్కృతము. గద్యపద్యాత్మకము. దానవర్ణన సందర్భమున వాడబడిన భాష సంస్కృతమనుటకంటె తెనుగని చెప్పుటయే యుచితము. మొదటిమాట సంస్కృతము, తక్కిన భాగమంతయు దెనుగును గల వాక్యములు

గొన్ని కలవు. ఉ. "దక్షిణమున ఊరిమధ్యమున గుంటయసీమా" "పూర్వతః వల్లూరి పొలగరుససీమా." ఇవికాక ఒక పూర్తి తెనుగువాక్యము గూడ కానవచ్చుచున్నది. "ఊరితూర్పునుండి పడమటికింబాఱిన పెద్దవీధి దక్షిణమున గృహక్షేత్రమున వూడ్ల నలువది". (పం. ౮౫-౮౬).

## శా స న గ్ర ం థ ము

ప్రస్తుతము పరిష్కృతమగుచున్న ఈ శాసనము నందంపూండి శాసనమునకు సంగ్రహీకరణ మని చెప్పవలసియున్నది. నందంపూండి శాసనములోని శ్లోకముల ననవసరములైనవానిని దిగవిడిచి వంశాదికము సంక్షిప్తముగ వర్ణింపబడినది. పౌరాణిక వంశానుక్రమణికలో గొన్ని పేర్లీ కారణమున వదలివేయబడినవి. ఈ విషయమును ప్రకరణాంతరమున నిరూపించుచున్నాను.

శాసన గ్రంథమును నాలుగుభాగములుగ విభజింపవచ్చును. (౧) పౌరాణికవంశానుక్రమణిక (పం. ౧-౨౨) (౨) చారిత్రక వంశానుక్రమణిక : మొదటిపులకేశి మొదలు విమలాదిత్యునివఱకు (పం. ౨౩-౪౩). ఈ రెండు భాగములయందును విశేషించి చెప్పదగిన యంశమేదియు లేదు. ఇంతకుబూర్వము ప్రకటితములైన రాజరాజనరేంద్రుని తామ్రశాసనములలో గానవచ్చు విషయములే ఇందును జెప్పబడినవి. (౩) రాజరాజనరేంద్రుని వృత్తాంతము. ఇతర శాసనములలో నున్నట్లే యతడు విమలాదిత్యకుందవలపుత్రుడని, శకవత్సరములు వేదాంబురాశినిధులు (౯౪౪) వర్తించుచుండ సూర్యుడు సింహగుడై యుండ బహుళపక్షద్వితీయగురువారమునాడు ఉత్తరాభాద్రానక్షత్రయుక్త వణిజిలగ్నమున నతడు రాజ్యాభిషిక్తుడాయెననియు గలదు (పం. ౪౪-౫౨) ఇవియు చిరపరిచితములే. వీని గూర్చిన చర్చ యనవసరము. (౪) దానప్రస్తావన. ప్రతిగ్రహీతి వంశాదికవర్ణన, దాన వివరణ ఇత్యాది. (పం. ౫౨-౮౯)

శ్రీ సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజాధిరాజ పరమేశ్వరాది బిరుదాంకితుడైన రాజరాజదేవుడు గుద్దవాడివిషయములో మండగ్రామవాస్తవ్యులగు రాష్ట్రకూట ప్రముఖకుటుంబులను పిలిపించి, ఆపస్తంబసూత్రుడును, భారద్వాజ గోత్రుడును, శివకుమారభట్టుని పౌత్రుడును, రామదేవుని పుత్రుడును, సమస్తభువనాశ్రయ బ్రహ్మమహారాజని ప్రసిద్ధినందిన అంకయ యనునతనికి మండయను గ్రామమున దక్షిణదిక్కున ముమ్మడిభీమకోల గొలిచి ముప్పదిపుట్ల వడ్లపట్టు పరిక్షేత్రమును, నుత్తరదిక్కున ముమ్మడి భీమకోల గొలిచి పదిపుట్ల వడ్లపట్టు జొన్నక్షేత్రమును, నొక్కపుట్టియుం బందుము వడ్ల పట్టు తోంట పడకు క్షేత్రమును బన్నసగావించి ధారాపూర్వకముగా సూర్యగ్రహణనిమిత్తమున నిచ్చితి నని తెలిపెను.

ఇట్లు దానము సేయబడిన క్షేత్రముల మేరలు:దక్షిణక్షేత్రమునకు-తూర్పు వల్లూరుపొలగరుసు; దక్షిణము ఊరినడిమిగుంట; పశ్చిమము కొలపుట్టతోడిగుంట; ఉత్తరము పెనుమాల అలమ. ఉత్తర క్షేత్రమునకు- తూర్పు చింతతోడిపుట్ట, దక్షిణము సప్తగోదావరి; పశ్చిమము భీమయరట్టడి త్రొవ్విణ్డి; ఉత్తరము గుంట. ఈ క్షేత్రములపై యచ్చవలసిన పన్నులన్నియు- యాచనము మాడ యొక్కటి తప్ప- పరిహరింపబడెను. పై జెప్పిన క్షేత్రముగాక ఊరితూర్పున నుండి పడమటికి బాఱిన పెద్దవీథి దక్షిణమున గృహక్షేత్రమున నలువది వ్రాఁడ్ల గూడ దానముసేయబడెను.

ఈ శాసనగ్రంథమువల్ల దెలియవచ్చు నూతన చరిత్రాంశములు లేవు. పేర్కొనబడిన విషయము లన్నియు సుపరిచితములే. కావున వానినిగూర్చి ప్రత్యేక ప్రస్తావన కవసరము గాన్పింపదు. ఇట్లు చర్చింపదగిన విశేషచరిత్రాంశములు గానరాకపోయినను విచారింపవలసిన విషయ మొక్కటి గలదు. అది ప్రతిగృహీతయగు

నంకయయొక్క బిరుదు. ఇతడు సమస్తభువనాశ్రయబ్రహ్మమహారాజని ప్రసిద్ధుడట. ఈ బిరుదును 'సమస్తభువనాశ్రయ' 'బ్రహ్మమహారాజ' అని రెండుగ విడదీయవచ్చును. బ్రహ్మమహారాజనునది యొక పదవిని దెలిపెడి మాట. క్రీ. శ. ౧౧౩౫ నాటి యొకానొక ముఖలింగ శాసనమున వైశ్యమారాయండొకడు గాన్పించుచుండుటచేత (SII.V. 1100) నాకాలమున బ్రహ్మవైశ్యవర్ణముల కొక్కొక దానికిని మహారాజ బిరుదాంకితుడైన యొక యధికారి యుండువాడేమో ననుసందేహము కలుగుచున్నది. ఈ పదవి చోళదేశమున మొదట ప్రచారమున నుండి చోళుల ప్రాబల్యముతో గూడ ప్రఖ్యాతివడసి దక్షిణదేశములం దంతటను వాడుకకువచ్చెను. బ్రహ్మవైశ్యమహారాయలేరాజు నాశ్రయించి యాతని ప్రసాదమున నధికారమునకు వచ్చిరో యతని పేరును దమ పదవీసూచకనామమునకు ముందుజేర్చుకొనువారు ఉదా: 'రాజరాజ బ్రహ్మమహారాజ' ఇత్యాది. ఇక 'సమస్తభువనాశ్రయ' శబ్దమును విచారింతము.

పైజెప్పినదానినిబట్టి సమస్తభువనాశ్రయ శబ్ద మొక ప్రభువు పేరు గావలసియున్నది. సమస్తభువనాశ్రయనృపుని పేరే బ్రహ్మమహారాజ శబ్దమునకు ముందు గానవచ్చుచుంటచే నంకయ యతని కొలువున నుండెనని, చెప్పవలసియున్నది. ఈ సమస్తభువనాశ్రయుడెవ్వడు? సమస్తభువనాశ్రయశబ్ద మొకవ్యక్తిని సూచింపదు. అది వట్టి బిరుదు. ఇది చాళుక్యరాజవంశమున ప్రాచీనకాలమునుండియు వ్యవహారమున నుండెను. క్రీ. శ. ౬౯౬ మొదలు ౭౩౨ పర్యంతము రాజ్యముసల్పిన బాదామిచాళుక్యరాజగు విజయాదిత్యుని కీబిరుదుండెనని యాతని రాయగడ తామ్రశాసనమువల్ల దెలియుచున్నది.[1] మఱియు క్రీ. శ. ౯౧౮ నుండి ౯౨౦ వఱకు వేంగిదేశము నేలిన ఇమ్మడియమ్మరాజవిజయాదిత్యు డను పూర్వచాళుక్య రాజున

1. Ep Ind.

కుండినట్లు అతని పాములవాక తామ్రశాసనమువల్ల దెలియుచున్నది[1]. కాని ఇది బాదామిచాళుక్యులకు గాని, వేంగీపూర్వచాళుక్యులకుగాని కులక్రమాగతమైన బిరుదు గాదు. సుప్రసిద్ధములనియు దలచుటకు వీలు లేదు. బాదామిచాళుక్యవిజయాదిత్యుని కీబిరు దుండిన ట్లాతని శాసనములలో నొకదానియందుమాత్రము జెప్పియున్నది. ఇట్లే పాములవాక శాసనమున దప్ప నమ్మరాజవిజయాదిత్యుని కీ బిరు దుండినట్లు మఱి యెందును లేదు. కావున పై జేర్కొన్న రాజు లీ బిరుదును వహించుట కేవలము గాక తాళీయ మని చెప్పవలసి యున్నది. కాదాచిత్కముగ నిట్లు బాదామి వేంగీచోళరాజులచే వహింపబడిన ఈ బిరుదును కల్యాణిచాళుక్యరాజులు కులక్రమాగత మైనదానిగ జేసికొని సుప్రసిద్ధము జేసిరి. వారి శిలాశాసనము లన్నియు 'స్వస్తిశ్రీ సమస్తభువనాశ్రయ' యనియే యారంభమగు చున్నవి. తామ్రశాసనములలోను దీని ప్రాముఖ్యము గానవచ్చు చున్నది. కేవలము కల్యాణిచాళుక్యులదిగ బరిగణింపబడుచుండిన నీ బిరుదు వేంగివాస్తవ్యుడైన బ్రాహ్మణుని కెట్లు సంక్రమించినది? రాజ రాజనరేంద్రుని మూలమున నని చెప్పవలసియున్నది. రాజరాజునకు సమస్తభువనాశ్రయుడను బిరు దున్నట్లు నన్నయభట్టు తన యాంధ్ర మహాభారతమున నుడివియున్నాడు:

"త్రిభువనాంకుశ దీప్తినిధీ సమస్తభువనాశ్రయధర్మధురంధరా
శుభయశః పరిశోభిత పూర్వదిక్ప్రభువిలాసకృపారసబంధురా."

(ఆది. 3-౨౬౫)

కావున సమస్తభువనాశ్రయ బిరుదాంకితు డగు రాజరాజ నరేంద్రునిచే బ్రహ్మమహారాజ పదవియందు స్థాపితు డగుటచే బ్రతి గృహీతయగు నంకయకు సమస్త భువనాశ్రయ బ్రహ్మమహారా జను బిరుదనామము గల్గెనని నిశ్చయముగ జెప్పవచ్చును.

1. JAHRS. II P. 247.

'సమస్తభువనాశ్రయ' బిరుదు రాజరాజనరేంద్రునికి వంశక్రమానుగతము గాదు. ఇతని తండ్రియైన విమలాదిత్యునికిగాని, పెదతండ్రియగు ప్రథమశక్తివర్మకుగాని, తాతయగు దానార్ణవునికిగాని ఈ బిరుదు లేదు. రాజరాజనరేంద్రుని కిది యుండిన ట్లతని శాసనములందు జెప్పియుండలేదు. ప్రస్తుతము బరిష్కృత మగుచున్న ఈశాసనమునందు గూడ దీనికి రాజరాజనరేంద్రుని బిరుదావళియందు తావు లేదు. ఇట్టి బిరు దతనికి గలదని యూహించియే కనుగొనవలసివచ్చినది. నన్నయభట్టు భారత మీ యంశమును స్పష్టముగ సేయకుండిన నీ సమస్తభువనాశ్రయ బ్రహ్మామహారా జెవ్వడో కల్యాణిచాళుక్యరాజుల యాశ్రితు డని చెప్పవలసియుండెడిది. కావున 'సమస్తభువనాశ్రయ' యనుబిరుదు రాజరాజనరేంద్రునికి సుప్రసిద్ధము కాదని తేలుచున్నది. మఱియొక మాట. ప్రస్తుతశాసనము రాజరాజనరేంద్రుని కడపటి దశయందు వ్రాయించినది. నన్నియభట్టు మహాభారతము నైత మారాజు అంత్యదశయందు విరచింపబడినదే. ఉన్నట్టుండి యాకస్మికముగ నతడు రాజపదచ్యుతు డై పోవుటచేతనే మహాభారతరచన కంతరాయము గల్గి యాగిపోయినది. నన్నయ మహాభారతమునందే రాజరాజునకు సమస్తభువనాశ్రయ బిరు దున్నట్లు చెప్పియుండుటచే నేకారణమువల్లనో యతడు తన రాజ్యాంతకాలమున గల్యాణిచాళుక్యులకు గులక్రమాగతమైన ఈ బిరుదును స్వీకరించినట్లు తోచుచున్నది. కల్యాణిచాళుక్యరాజుల బిరుదావళిలోనుండి రాజరాజు తన చరమ దశయందు స్వీకరించిన దిది యొక్కటియే గాదు. 'సత్యాశ్రయకులశేఖర' యనునది మఱియొకటి గలదు. రాజరాజు శిలాతామ్రశాసనములలో దీని పొడ యెచ్చటను గానరాకున్నను నన్నియభట్టే దీని బేర్కొనియున్నాడు.

"సత్యాశ్రయకులశేఖర నిత్యోదయ రాజరాజనృప సుకవిజన
స్తుత్యమహాగుణ విమలాదిత్యాగ్రతనూజ విమలధీరమణీయా".

(ఆది. 3-౨౭౪)

ఈ 'సత్యాశ్రయకులశేఖర' యనునది కల్యాణీ చాళుక్యుల శాసనములందు సర్వత్ర కానవచ్చెడి 'సత్యాశ్రయకుల తిలకం' అను దాని పాఠాంతరము. కల్యాణీచాళుక్యరాజులు దాము సత్యాశ్రయ కులతిలకుల మని ప్రతిశాసనమందును బ్రకటించుకొనియున్నారు. బాదామిచాళుక్యరాజగు మొదటి పులకేశివల్లభునికి సత్యాశ్రయు డని నామాంతరము గలదు. అతని వంశీకులగుటచే బూర్వచాళుక్యులను గూడ సత్యాశ్రయకులశేఖరులని చెప్పుకొనవచ్చును. అట్లు చెప్పుకొన్నవారు పూర్వచాళుక్యరాజులలో నెవ్వరును లేరు. రాజరాజనరేంద్రుని కీ బిరు దుండె ననుటకు సాక్ష్యము నన్నియభట్టొక్కడే. అన్యాధార మెద్దియు గానరాదు.

పై చర్చవల్ల దేలిన సారాంశ మేమనగా, గల్యాణిచాళుక్యులకు గులక్రమాగతము లగు సమస్తభువనాశ్రయ, సత్యాశ్రయకుల శేఖర యను బిరుదులను రెంటిని రాజరాజనరేంద్రుడు దన రాజ్యాంత్యదశయందు స్వీకరించెనని. దీనికి గారణము లేకపోలేదు. క్రీ. శ. ౧౦౪౫-వ సంవత్సరమున గల్యాణిచాళుక్యులు వేంగిరాజ్యమును జయించిరి; రాజరాజనరేంద్రు డప్పుడు కల్యాణకటకము నేలుచుండిన యాహవమల్ల త్రైలోక్యమల్ల సోమేశ్వరచక్రవర్తికి లొంగి యరిగాపు కావలసివచ్చెను. రాజరాజనరేంద్రుని మరదులలో నొకడగు వీరరాజేంద్రచోళదేవుడు తాను సింహాసనము నధిష్ఠింపక పూర్వము వేంగిలోని రాజకీయపరిస్థితులనుగూర్చి యిట్లు చెప్పియున్నాడు:

"భ్రాతృభ్యాం సముపేక్షితం జనపదం వంశక్రమాభ్యాగతం
క్రాంతం వైరిమహీశ్వరై రతిబలై ర్వేంగీంకళింగానపి,
జిత్వా శత్రుపరంపరా మతిబలాం భిత్వా చ దుర్గాన్నృపా
శ్రీమా న్వల్లభవల్లభక్షితిపతిః క్షేమేణ తం సోన్వశాత్"[1]

1. Ep. Ind. XXV. P. 262.

అనగా నిజసోదరుల యుపేక్షవల్ల స్వవంశక్రమాభ్యాగతమైన వేంగీ-కళింగజనపదము బలవంతులగు శత్రువులచే నాక్రమించుకొన బడగా వల్లభవల్లభక్షితిపతి (వీరరాజేంద్రుడు) వారిని జయించి పెక్కు-దుర్గములను భేదించి యాజనపదమును జయించె నని తెలియవచ్చుచున్నది. వేంగీ-కళింగజనపదము మొదటి శక్తివర్మకాలమునుండి చోళచక్రవర్తుల యధికారమునకు లోబడియుండిన రాజ్యమగుటచేత వీరరాజేంద్రుడు దానిని వంశక్రమాభ్యాగతమని చెప్పుకొనెను. వీర రాజేంద్రునికి పూర్వ మతని యన్నలు రాజాధిరాజ యిమ్మడిరాజేంద్ర చోళులు చోళసామ్రాజ్యమును క్రీ. శ. ౧౦౪౪ మొదలు ౧౦౬౪ వఱకు నొకరిపిమ్మట నొకరు పాలించిరి. క్రీ. శ. ౧౦౪౪ వఱకును వేంగీ కళింగజనపదముపై జోళుల యధికారము సాగుచుండెనని శాసనములవల్ల దెలియుచున్నది. తరువాత నెంతకాలము నడచెనో చెప్పుటకు సాధ్యముగాదు. చోళుల కడనుండి వేంగీకళింగరాజ్యము నొడిచికొన్న ప్రబల శత్రువులు కల్యాణిచాళుక్యులని వీరరాజేంద్రుని శాసనములవల్ల దెల్లమగుచున్నది. కావున క్రీ. శ. ౧౦౪౪, ౧౦౬౪ ల మధ్య కల్యాణిచాళుక్యులు వేంగీకళింగములను జయించి స్వాధీనపఱచుకొనిరని నిశ్చయముగ జెప్పవచ్చును. వేంగీకళింగములపై గల్యాణి చాళుక్యుల యధికారము సాగెనని వారి శాసనములయందే కొంత యాధారము గలదు. వరుసగ క్రీ. శ. ౧౦౪౯, ౧౦౫౩, ౧౦౫౪ ల నాడు వేయించిన మూడు శిలాశాసనములలో ఆహవమల్లసోమేశ్వరుని జ్యేష్ఠపుత్రుడగు భువనైకమల్ల సోమేశ్వరుడు దాను వేంగీపురవరేశ్వరుడ నని చెప్పుకొనియున్నాడు[1]. ఈబిరు దీత డేల వహించెనో తెలియదు. కాని, చోళశాసనములలో నీ కాలమున వేంగికళింగ జనపదము గల్యాణి చాళుక్యుల స్వాధీనమున నుండినట్లు చెప్పియుండుట చేత, భువనైకమల్ల సోమేశ్వరుడు వేంగివిజయమున బాల్గొని వేంగీ

1. BK. I. No. 90, EI. XVI, p. 54-5; BK. I No. 84.

పురమునకు బాలకు డగుటచే గద్దెనని యూహించుట కవకాశము గలదు. దీనికి బ్రోద్బలముగ క్రీ. శ. ౧౦౫౫-౬ నాటి కల్యాణి చాళుక్య శాసన మొకటి ద్రాక్షారామమున గానవచ్చుచున్నది. 'శకవర్ష ౯౭౭ గునేంటి భీమేశ్వర దేవరకుం జక్రవర్తి త్రైలోక్య మల్ల దేవర ప్రధాని నారాయణభట్ల కుంతులు కుపమవెట్టిన అఖణ్డ వర్తిలోహపుదివియ'[1] యను శాసనవాక్యమువల్ల నప్పుడు కల్యాణ చాళుక్య చక్రవర్తియగు మొదటి సోమేశ్వరుని ప్రధాని యొకడు వేంగియందుండె నని తెలియవచ్చుచున్నది. ఇట్లు చోళకల్యాణ చాళుక్య శాసనముల సాక్ష్యమును జంటించి చూడగా క్రీ. శ. ౧౦౪౯ మొదలు ౧౦౬౬ పర్యంతము వేంగి కల్యాణి చాళుక్యుల యధీనమున నుండెనని విదిత మగుచున్నది.

వేంగిదేశ మిట్లు కల్యాణ చాళుక్యుల యధీనమై యుండిన రాజ రాజనరేంద్రు డెచట నుండెనో కనుగొనవలసియున్నది. అతని శాసన ముల నన్నిటిని బరిశీలించి చూడగా నతడును వేంగియందే రాజ్యము సేయుచుండె నని తెలియుచున్నది. ఈ సందర్భమున బేర్కొ-న దగిన శాసనములు మూడు గలవు. మొదటిది నందంపూండి తామ్రశాస నము. ఇది రాజరాజనరేంద్రుని ౩౨-వ రాజ్యవర్షమున నతడు సంస్కృత ప్రాకృత పైశాచిక కర్ణాటాంధ్ర భాషలయందు కవిత సెప్ప నేర్చిన నారాయణ భట్టునకు జేసిన భూదానమును దెల్పును[2]. రాజరాజనరేంద్రుడు క్రీ. శ. ౧౦౧౯-వ సంవత్సరమున రాజ్యము సేయ నారంభించె గావున నతని ౩౨-వ రాజ్యవర్షము క్రీ. శ. ౧౦౫౧ అగుచున్నది. రెండవది నందివెలుగు శిలాశాసనము. ఇది శక వర్షము ౯౭౦ కి సరిపోవు రాజరాజనరేంద్రుని ౩౭-వ రాజ్య

1. SII. IV 1010.

2. Ep. Ind. IV P 300 f, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక. సం. ౧. పుట ౪౫.

వర్షమునాటిది. క్రీ. శకము ౧౦౫౮ కిది సరియగుచున్నది.[1] మూడవది వలివేరు శిలాశాసనము. శక వర్షము ౯౮౩ నకు (అనగా క్రీ.శ. ౧౦౬౧) సరియైన రాజరాజనరేంద్రుని ౪౧-వ రాజ్యవర్షమున జేసిన దానము నిది తెల్పును[2]. ఈ శాసనములవల్ల వేంగిదేశము కల్యాణి చాళుక్య సోమేశ్వర చక్రవర్తి యధికారము క్రింద నున్న కాలము ననే యచట రాజరాజనరేంద్రుడును రాజ్యము సేయుచుండె నని తెలియుచున్నది. ఏకకాలమున నీ యిద్దరు రాజులును వేంగియందు రాజ్యము సేయుట యెట్లు సాధ్యమైనదో కనుగొనవలయును. స్వాతంత్రులై యొండొరులతో నిరంతరము పోరుచు దేశమునంతటిని స్వాధీన పరచుకొనజాలక యొకరొక భాగమునను, మఱియొకరింకొక భాగమునను దమతమ యధికారములను సాగించుకొనుచుండవల యును. లేదా ఒకరు మఱియొకరి యాధిక్యము నంగీకరించి యరిగాపై యేలుచుండవలయును. రాజరాజనరేంద్రు డీ కాలమున దన స్వాతంత్ర్యము నిలబెట్టుకొనుటకు సోమేశ్వరునితో గాని, యితరులతో గాని యుద్ధము సేయుచుండె ననుట కాధార మేదియు గానరాదు. లభించిన శాసనములను బట్టి చూడగా నతడు స్వస్థముగ శత్రుభయ రహితముగ రాజ్యము సల్పుచున్నటు లున్నది. యుద్ధసూచన లెందును గానరావు. కావున రాజరాజనరేంద్రుడు స్వతంత్రప్రతిష్ఠకై పోరుచుండెనని చెప్పుటకు వీలులేదు. ఇక వారియం దొకరికి మఱొకరు లొంగి యాశ్రితులై ప్రభుత్వము సేయుచుండిరని యూహింప వలసియున్నది. ఈయూహ సమంజసమగునేని, రాజరాజనరేంద్రుడే సోమేశ్వరు నాశ్రయించి రాజ్యముసేయుచుండె నని చెప్పవలసి వచ్చును. ఏలన సోమేశ్వరు డశేషసామ్రాజ్య సంపద గల చక్రవర్తి హస్త్యశ్వపదాతి బలసంపన్నుడు. అంతటి వాడు కర్ణాటాంధ్రమహా

---

1. ARE 663 of 1920.
2. ARE 671 of 1920.

రాష్ట్రాది దేశములపై నిర్వక్రపరాక్రముడై నిరంకుశముగ ప్రభుత్వము సల్పుచుండు కాలమున శత్రురాష్ట్రమగు వేంగికి వచ్చి రాజరాజనరేంద్రునికి సామంతు డగుట యసంభవము. నిరంతరము చోళుల సహాయమున రాజ్యము సేయుచుండిన రాజరాజనరేంద్రుడే, చోళుల బలము సన్నగిల్లగా దేశముపై నెత్తివచ్చిన సోమేశ్వరు నెదిరించు శక్తిలేక యతనికి లొంగి సంధిగావించుకొనె నని తలచుట యుక్తము.

ఈ యభిప్రాయమును బలపఱచువిషయ మొక్కటికలదు. త్రైలోక్యమల్ల దేవుని ప్రధానియగు నారాయణభట్టు క్రీ. శ. ౧౦౫౫ ప్రాంతమున వేంగియందుండెనని పూర్వప్రకరణమున జెప్పియున్నాను. ఈ ప్రధాని నారాయణభట్టే నందంపూడి శాసన ప్రతిగృహీతయు, భారతాంధ్రీకరణమున నన్నియకు సాహాయ్యుడును నగు నారాయణభట్టని శ్రీ. శే. కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు పంతులుగారు నిరూపించియున్నారు.[1] ఇది సంగతమేని ప్రధాని నారాయణభట్టు నిజప్రభువగు త్రైలోక్యమల్ల సోమేశ్వర చక్రవర్తియొక్క స్థానాపతియై, యతని కరిగాపైన రాజరాజనరేంద్రుని సంస్థానమునకు వచ్చె ననియు, నన్నయభట్టారకునికి భారతరచన యందు దోడ్పడె ననియు, దానికి ప్రతిఫలముగ రాజరాజనరేంద్రు డతనికి నందంపూండిగ్రామము నగ్రహారముజేసి యిచ్చెననియు దలపవలసియున్నది. కావున రాజరాజనరేంద్రుడు సోమేశ్వరుని యధికారము నంగీకరించె నని దృఢముగ జెప్పవచ్చును. సామంతరాజులు దమ్మేలిన, సార్వభౌముల బిరుదావళిని వహించుట సహజమగుటచేతను, సోమేశ్వరచక్రవర్తిని బోలి తానును చాళుక్యవంశ సంభూతుడు గావునను 'సమస్తభువనాశ్రయ' 'సత్యాశ్రయ కులశేఖర'యను బిరుదులను స్వీకరించెను.

---

1. రాజరాజనరేంద్ర పట్టాభిషేకవర్ధంతిసంచిక. పుటలు. ౧౧౮-౫.

శాసనకాలము:—ఈ శాసనముయొక్క కాలము నిశ్చయించి చెప్పుటకు దగిన సాధనములు లేవు. శకవర్షముగాని, రాజ్యవర్షముగాని చెప్పియుండలేదు. 'సూర్యగ్రహణ నిమిత్తే ధారాపూర్వకమస్మాభి ర్దత్తమితి' అని యుండుటచే రాజరాజనరేంద్రుని రాజ్యకాలమున నెన్నడో యొక సూర్యగ్రహణమప్పు డీ దానము సేయబడెనని మాత్రము చెప్పవచ్చును. ఇంతకంటె సూక్ష్మముగ నీశాసనకాలమును గనుగొనుటకు వీలగునేమో చూతము. ప్రస్తుతము బరిష్కృతమగుచుండు నీ శాసనగ్రంథము నందంపూడి దానశాసన గ్రంథమునకు సంగ్రహీకరణ మని పైని జెప్పియున్నాను. నందంపూండి శాసనము రాజరాజనరేంద్రుని 32-వ రాజ్యవర్షమున, అనగా క్రీ. శ. ౧౦౫౧-వ సంవత్సరమున వ్రాయించబడెను. కావున ప్రస్తుత శాసనమున వర్ణింపబడిన దానము తరువాతికాలమున నెప్పుడో సేయబడెనని స్పష్టమగుచున్నది. క్రీ. శ. ౧౦౫౧ కిని, రాజరాజనరేంద్రుని యంతిమరాజ్యవర్షమగు క్రీ. శ. ౧౦౬౧ కిని మధ్యనున్న పదియేండ్లలో పది సూర్యగ్రహణము లుండినట్లు తెలియవచ్చుచున్నది. ఆ గ్రహణముల కాల మీ క్రింద బొందుపఱచుచున్నాను.

(౧) ౨౩ నవంబరు ౧౦౫౨
(౨) ౧౩ నవంబరు ౧౦౫౩
(౩) ౧౦ మే ౧౦౫౪
(౪) ౨ నవంబరు ౧౦౫౪
(౫) ౨౨ అక్టోబరు ౧౦౫౫
(౬) ౧౨ సెప్టెంబరు ౧౦౫౬
(౭) ౨౨ ఆగస్టు ౧౦౫౮
(౮) ౧౫ ఫిబ్రవరి ౧౦౫౯
(౯) ౧౦ ఆగస్టు ౧౦౫౯
(౧౦) ౨౦ జూన్ ౧౦౬౧

ఈ పది గ్రహణకాలములలో నేదోయొక గ్రహణమప్పుడు రాజరాజనరేంద్రు డీ శాసనోక్తదానము జేసినట్లు జెప్పవలయును. లభ్యమైన సామగ్రి నాధారపఱచుకొని చెప్పదగిన దంతయు నింతే. ఇంతకంటె సూక్ష్మముగ నీ దానకాలమును నిశ్చయించి చెప్పుటకు వీలుగాదు.

స్థలనిర్ధారణ:—దానక్షేత్రము గుద్దవాడివిషయములోని మణ్ణ గ్రామాంతర్గతమనియు, దాని హద్దులలో సప్తగోదావరినదియు వల్లూరు పెనుమాల లను రెండు గ్రామములు నుండినట్లును శాసన గ్రంథము దెల్పుచున్నది. గుద్దవాడివిషయము పూర్వచాళుక్య శాసనములలో నెన్నిటియందో పేర్కొనబడియున్నది. దీనికి గుద్రాహార విషయ మనియు నామాంతరము గలదు. కృష్ణాజిల్లాలోని యిప్పటి గుడివాడయే ప్రాచీనగుద్రాహారము, లేక గుద్దవాడి యనియు, దానికి సంబంధించిన రాష్ట్రవిభాగమునకే గుద్రాహార, లేక గుద్దవాడివిషయ మనియు పరిశోధకుల యభిప్రాయమై యున్నది. ఈ శాసనమువల్ల నది సప్తగోదావరిపర్యంతమును వ్యాపించి యుండె నని స్పష్ట మగుచున్నది.

మణ్ణ యను పేరు గల గ్రామ మిప్పుడు సప్తగోదావరీతటమున నున్నట్లు తోచదు. రామచంద్రాపురం తాలూకాలో మండపేట యను గ్రామ మొకటి యున్నది. ఈ శాసనము లభించిన స్థలము మండపేటయే యగుచేత శాసనకాలమునాటి 'మండ' కాలక్రమమున మండపేటగ మారెనేమో. సరిహద్దు గ్రామములలో నొకటి యగు వల్లూరు మండపేట సమీపమున నుండుటచే నీ యూహ సరియైన దని తోచుచున్నది. కాని యొక సంశయము గలదు. దానక్షేత్రములలో నొకదానికి దక్షిణపు హద్దు సప్తగోదావరి యని యున్నది. మండపేటపొలము సప్తగోదావరీతీరము వఱకు వ్యాపించుచున్నదో లేదో తెలియదు. ఇదియే సంశయగ్రస్తవిషయము.

సప్తగోదావరి యన్నను, గోదావరి యన్నను, నొక్క నది యొక్క నామాంతరములే. సముద్ర సంగమమునకు గొంతదూరమున నేడు పాయలుగ జీలి ప్రవహించు గోదావరికే సప్తగోదావరి యని పేరు. ఈ పాయలందు గౌతమి, కౌశిక, వసిష్ఠ, వైనతేయ లనునవి సుప్రసిద్ధములు.

ఆంధ్రపదములు:—శాసనభాష సంస్కృతమైనను దానవివరణసందర్భమున గొన్ని తెలుగుమాటలు గానవచ్చుచున్నవి. వీనియందపరిచితమైనవానిని గూర్చి ఇంచుక చెప్పవలసియున్నది.

(౧) ముమ్మడి భీమకోల (పం. ౫౭-౫౮):— ఇది యొక భూమికొలతగడ. ముమ్మడి భీమమానిక యను కొలతపాత్ర యొకటి కొన్ని శాసనములయందు బేర్కొనబడియున్నది.[1] ఈ రెండు కొలమానములును ముమ్మడిభీము డను నామాంతరము గల విమలాదిత్యుని కాలమున నిర్ణీతము లగుటచేత వీని కా పేరు వచ్చెను.

(౨) వడ్లపట్టు (పం. ౫౮) :—'అళ్లపట్టు' వంటిదే. ప్రాచీన పూర్వచాళుక్యశాసనములలో గానవచ్చెడి 'అడ్లపట్టు' శబ్దము అళ్లు చల్లుటకు వలసిన భూమియని పరిశోధకు లభిప్రాయమును వెలిబుచ్చియున్నారు. దీని ననుసరించి 'వడ్లపట్టు'నకు వడ్లు విత్తుటకు వలయు భూమి యని యర్థము జెప్పుకొనవలసియున్నది. ప్రస్తుతశాసనమున నీమాట మూడు పర్యాయములు ప్రయోగింపబడియున్నది: 'వడ్లపట్టు వరిక్షేత్రం' (పం. ౫౮), 'వడ్లపట్టు జొన్నక్షేత్రం' (పం. ౫౮-౯), 'వడ్లపట్టు తోంటపడకుక్షేత్రం' (పం, ౫౯) ఇట 'వరిక్షేత్ర' 'జొన్నక్షేత్ర' 'తోంటపడకుక్షేత్ర' పదములతో 'వడ్లపట్టు'ను జంటించి చెప్పియుండుటచేత దీనికి 'వడ్లు' అనగా వరి జల్లుటకు వలయు నేల యని యర్థవివరణము సేయుట కనుకూలము గాదు. 'వడ్లు' అనగా 'బీజములు' 'విత్తనములు' అని యర్థము జేసికొనవలయును. 'విత్త

1. ARE 748 of 1920.

నాల పట్టు' అను మాట ఇప్పటికిని నెల్లూరుమండలమున వాడుకయం దున్నది. ఇతర మండలములలోగూడ వ్యవహారమున నుండవచ్చును. ఇద్దుము వి త్తనాల పట్టు, పందుము వి త్తనాల పట్టు ఇత్యాది. కావున నీ సందర్భమున వడ్లపట్టు భూపరిమాణమును దెల్పు శబ్ద మని గ్రహింపవలయును.

(3) 'పడకు' (పం.) ౫౯): — 'ఒక్క-పుట్టియుం బందుము వడ్లపట్టు పడకుక్షేత్రంచ' అని. 'పడకు' అనగా నేమో తెలియదు. వరిక్షేత్ర, జొన్నక్షేత్రముల వలె తోంటక్షేత్ర మనక తోంటతోగూడ 'పడకు'ను జేర్చియున్నది. సార్ధానుస్వారమైన 'పడకు' శబ్ద మొకటి శబ్దరత్నాకరమున గానవచ్చుచున్నది. దీనికి 'సందు', 'గుహ' యను రెండర్థములను సీతారామాచార్యులవారు నిర్వచించియున్నారు. ఈ యర్థము లిచట ననుకూలింపవు. అరవమందు 'పడుకై, పడుకర్' అను రెండు మాటలు గలవు. వీనిలో మొదటిదానికి వ్యవసాయమున కనువైన నదీతీరభూమియనియు, రెండవదానికి వ్యవసాయమున కర్హమైన పొలమనియు అర్థమును దమిళనైఘంటికులు చెప్పుచున్నారు. తెనుగు, 'పడకు'నకును అరవ 'పడుకై' 'పడకర్'లకును జ్ఞాతిత్వము గలదు. కావున 'తోంటపడకుక్షేత్ర' మనగా తోటవ్యవసాయమునకు దగిన నేల యని గ్రహింపవలయును.

(౪) 'పన్నస' (పం. ౫౯) : — 'పన్నస'యనుమాట ప్రాచీన దానశాసనములయందు గానవచ్చుచున్నది. దీని నిశ్చయమైన యర్థ మేమో తెలియదు. పణ్ణాస, లేక పన్నాస యని ప్రాకృతమున నొక మాట కలదు. ఇది సంస్కృతపంచాశత్తునకు దద్భవము. కాని ఈ యర్థ మిచట పొందు పడదు. సందర్భమునుబట్టి చూడగా నిది భూమ్యనుభోగనిబంధనాపద్ధతులలో నొక్కటి యని తోచుచున్నది. 'పన్నస సంజ్ఞీకృత్య' అని ప్రస్తుతశాసనమున నున్నది. దాన మొసగిన భూమికి 'పన్నస' యను పేరిచ్చి, అనగా పన్నసతరగతికి మార్చి

దత్తముసేయబడెను. ఈ తరగతిభూము లే కట్టడలకు లోబడియుండ వలసెనో తెలియదు.

(౫) పొలగరుస (పం. ౬౧):—ఇది 'పొలము + గరుసు + అ' యను మాటల కలయికచే నేర్పడిన సమస్తపదము. సమాసమున 'పొలము'లోని యంత్య 'ము' వర్ణము లోపించినది. అంత్యమునందలి 'అకారము' అన్యాపేక్ష లేమిని తెల్పును. 'గరుస' అనగా 'గరుస'యే, అన్యము గాదని భావము. 'గరు'సను మాటకు 'ఎల్ల' యని యర్థము.

(౬) కొఱపుట్ట (పం. ౬౨):—కొఱ=స్వల్పమైన, లేక చిన్నదియైన పుట్ట.

(౭) అలమ (పం. ౬౨-౬౩):—'అలవ'యొక్క రూపాంతరము. 'కంచె' యని యర్థము.

(౮) రట్టడి (పం. ౬౪):—అనగా కాపు, లేక కృషీలుడు. ఇప్పటి 'రెడ్డి' పదతుల్యము. భీమియరట్టడి ఇప్పటి వ్యవహారమున భీమియరెడ్డి యగును. 'రట్టడి' శబ్దముయొక్క చరిత్ర చాల కలదు. విపులముగా నిచట వ్రాయుటకు వీలుగాదు. దీని ప్రథమరూపము 'రట్టకుడి' లేక రట్టగుడి' 'రాష్ట్రకూట' శబ్దము దీనియొక్క సంస్కృతీకరణము. 'రట్ట' = 'రాష్ట్ర', 'కుడి' - కూటశబ్దములు తుల్యార్థకములని సంస్కృతీకరణమువల్ల దెలియుచున్నది. రట్టగుడి బహువచనమున రట్టగుడ్లగుచున్నది. దీని సంగ్రహరూపములు రట్టోడి, రట్టడి; రట్టడియే రడ్డి యైనదనియు (ఉ. 'రాజానో రడ్డియానో'), రడ్డియే రెడ్డి యైనదనియు శాసనపరిశోధకుల యభిప్రాయము.

(౯) త్రోవిడ్డి (పం. ౬౪):—దీని యర్థము తెలియదు.

(౧౦) యాచనము మాడ (పం. ౬౫):—ఈ రెండుమాటలకును అర్థము సుగమమే. ఇది భూమిపై నచ్చుకొనవలసిన కరము

లలో నొకటి యని, 'సర్వాకరపరిహృతస్యాస్య యాచనము మాడ ఒకొణ్డ' యని శాసనవాక్యమువల్ల దెలియుచున్నది. కాని దీనికి యాచనము మాడ యను పే రేల వచ్చెనో తెలియదు. మఱియు నిది రాజునకు జెల్లింపవలసియుండెనో, లేక యాచకుల కెవ్వరి కేనియు వర్షాశనముగ నీయవలసియుండెనో చెప్పుటకు సాధ్యము గాదు.

(౧౧) ఒకొణ్డ (పం. ౬౫) :—ఈ రూపము భారతాది గ్రంథములందు గానవచ్చుచున్నది.

(౬౨) పుాడ్ల (పం. ౬౬) :—అర్థము తెలియదు. 'ఊరి తూర్పువాన నుండి పడమటికిం బాఱిన పెద్దవీధి దక్షిణ గృహక్షేత్ర మున పూడ్లనలుపది' (పం. ౬౪-౬౫) యను శాసనవాక్యమును బట్టి చూడగా నది 'అంకణమువంటి గృహక్షేత్ర పరిమాణమును దెల్పు మాటయని తోచుచున్నది

ఈ శాసనమునకు ఆజ్ఞప్తి కటకరాజు; కర్త నన్నియభట్టు; లేఖకుడు గండాచార్యుడు. కటకరాజ గండాచార్యుల విషయమై కలి దిండి తామ్రశాసనవ్యాసమున వ్రాసియున్నాను. వారిని గూర్చి ఇచట జెప్పదగిన నూతనాంశము లెవ్వియు లేవు.

## నన్నియభట్టు

శాసన కావ్యకర్త యగు నన్నియభట్టును గూర్చి యొక్కింత చెప్పవలసి యున్నది. ఈ శాసనగ్రంథము నన్నియభట్టు విరచితము. 'కర్తా నన్నియభట్టః' అని శాసనాంతమున గలదు. నందంపూండి శాసనమును రచియించినది కూడ నన్నియభట్టని యంద రెఱిగిన విషయమే. కాని ఈ శాసనగ్రంథములలో జాలభాగము నన్నియ విర చిత మని చెప్పుటకు వీలులేదు. నందంపూండి శాసనమున ౧౨ శ్లోకములును, మండశాసనములో 3 శ్లోకములును నన్నియభట్టరచి తము లని చెప్పవచ్చును. మణ్డశాసనములోని 'ఇంద్రో యథా',

'సంరక్షతి క్షితితలం', 'సన్మార్గేణకులం' అను నన్నయవిరచితశ్లోక త్రయమును నందంపూండిశాసనగ్రంథమున గానవచ్చుచున్నవి. ఈ కారణముచేతను, నందంపూండిశాసనములోని చాళుక్యప్రశస్తికంటె మణ్ణశాసనప్రశస్తి సంకుచిత మగుటచేతను నిది నందంపూండిశాసన గ్రంథమునకు సంగ్రహమని పలికితిని. చాళుక్య ప్రశస్తిగ్రంథము నంతటిని నన్నియభట్టు తన కప్పుడు లభించిన పూర్వ చాళుక్య శాసనములనుండి గ్రహించెను.

నందంపూండి మణ్ణశాసనములలోని చాళుక్య ప్రశస్తి నెచ్చటి నుండి నన్నియ కైకొనియెనో తెల్పుట కీ ప్రక్కపట్టికయం దందలి శ్లోకములను, నవి గానవచ్చెడి పూర్వచాళుక్యశాసనములను బొందు పఱచుచున్నాడను.

ఈపరిశీలనవల్ల నన్నియభట్టవిరచితము లనబడు నందంపూండి మణ్ణశాసనములలోని చాళుక్యవంశవర్ణనాత్మకమైన శ్లోకములు ఏడు తప్ప తక్కిన వన్నియు దత్పూర్వపు చాళుక్యశాసనములనుండి సంగ్రహింపబడెనని స్పష్టమగుచున్నది. ఆ యేడును మన కింతవఱకును లభ్యముకాని శాసనములనుండి కైకొనియుండవచ్చును.

ఇక నీ ప్రశస్తిలో గద్యభాగమునుగూర్చి కొంచెము చెప్ప వలసియున్నది. ప్రాచీనపూర్వచాళుక్య శాసనము లన్నియు గద్యాత్మకములే. దానఫలశ్రుతి శ్లోకము లన్నిటను గలవు. వాని విషయము ప్రస్తుతము చర్చింపలేదు. ఇవి 'స్వస్తి శ్రీమతాం సకలభువన సంస్తూయమాన మానవ్యసగోత్రాణాం' అని యారంభమగుచున్నవి. గుణగవిజయాదిత్యుని కాలమునుండియు వంశానుక్రమణిక దీనితో జతసేయబడినది. ఇప్పటినుండి వంశానుక్రమణికలో నచటనచట శ్లోకములను జొప్పించునాచారము ప్రారంభమైనది. మొదటి శక్తి వర్మకాలమునకు శ్లోకములసంఖ్య యతిశయమైనది. కాని విమలా

## శాసనముల పట్టిక

| ౧. శ్రీధామ్నః పురుషోత్తమస్య | రణస్తిపూణ్డి | కోరుమిల్లి | కలిదిండి | నందంపూణ్డి | మండ |
|---|---|---|---|---|---|
| ౨. తస్మాదాసీత్ | ,, | ,, | ,, | ,, | ,, |
| ౩. గంగాయమునాతీరే | ,, | ,, | — | ,, | — |
| ౪. పుత్రాస్తస్య | ,, | ,, | కలిదిండి | ,, | — |
| ౫. యేనాదాహి విజిత్య | ,, | ,, | ,, | ,, | — |
| ౬. తస్యాసీ ద్విజయాదిత్యో | ,, | ,, | ,, | ,, | మండ |
| ౭. అమ్మరాజానుజో | — | ,,* | ,, | — | ,, |
| ౮. తం యుద్ధమల్లం పరిహృత్య | రణస్తిపూండి | — | — | నందంపూణ్డి | — |
| ౯. సత్పుత్రయో ర్దశరథ | — | — | కలిదిండి | — | మండ |
| ౧౦. తత్సూనుర్వినతారాతి | రణస్తిపూండి | — | — | నందంపూణ్డి | — |
| ౧౧. ద్వైమాతురోమ్మనృపతేః | ,, | కోరుమిల్లి ♦ | — | ,, | మండ |
| ౧౨. అనుదానార్ణవా | ,, | — | — | ,, | ,, |
| ౧౩. అత్రాన్తరే | ,, | — | — | ,, | ,, |
| ౧౪. తత స్తదనుజో | — | — | — | ,, | — |
| ౧౫. తేజో యదీయ | — | — | — | ,, | — |
| ౧౬. తస్మాద్విమలాదిత్యాద్రవికుల | — | — | — | ,, | మండ |
| ౧౭. యస్సోమవంశతిలక | — | కోరుమిల్లి ॥ | — | ,, | ,, |
| ౧౮. ఇంద్రోయథా | — | — | — | ,, | ,, |
| ౧౯. సంరక్షతి క్షితితలం | — | — | — | ,, | ,, |
| ౨౦. సన్మార్గేణ | — | — | — | ,, | ,, |
| ౨౧. పిత్రోర్వ్యంశగురూ | — | కోరుమిల్లి | — | ,, | — |
| ౨౨. యస్యస్ఫార | — | — | — | ,, | — |

* పాఠాంతరము.

♦ పాఠాంతరము.

॥ 'యస్సోమవంశతిలకః' అనుటకు బదులు 'యోరక్షితుం వసుమతీం అని యారంభమగుచున్నది.

దిత్యుడు పౌరాణికవంశక్రమమును జేర్చుటచే శాసనములయందు మరల గద్యభాగ మతిశయించినది. శ్లోకములు తరుచుగ మారుచు వచ్చినను గద్యభాగమన్నిటను స్వల్పవ్యత్యాసము లున్నను నొక్క తీరుననేయున్నది. పౌరాణికవంశవర్ణన రెండు తెఱగుల గానవచ్చెడిని: (౧) 'తస్మా దాయు రాయుషో నహుషః నహుషా ద్యయాతి'—ఇది యొక పద్ధతి. (౨) 'తస్మాదాయు స్తతో నహుః తతో యయాతిః'— ఇది రెండవది. నన్నియభట్టు నందంపూండి శాసనమున మొదటి పద్ధతిని, మఙ్గ శాసనమున రెండవ పద్ధతిని అవలంబించియున్నాడు. మాటలలో నించుక భేదము గానవచ్చుచున్నను విషయమందు విశేష వ్యత్యాసము గానరాదు.

నాచే దయారుసేయబడిన శాసన మూల గ్రంథమును మాతృకతో బోల్చి సరిచూచినందులకు గవర్నమెంటు ఎపిగ్రాఫిస్టు గారగు శ్రీ రావుబహదూరు సి. ఆర్. కృష్ణమాచార్యులు బి. యే. గారికి గృతజ్ఞతాపూర్వక నమస్కారములను సమర్పించుచున్నాను.



# మూలము

## మొదటి రేకు : రెండవ ప్రక్క

౧ శ్రీధామ్నః పురుషోత్తమస్య మహతో నారాయణస్య ప్రభో
ర్నాభీపంకరుహా ద్బభూవ జగతః స్రష్ట[1] స్వ

౨ యంభూ స్తతః। జజ్ఞే మానససూను రత్రి రితి య స్తస్మా న్మనే[2]
రత్రితః సోమో వంశకరః సుధాంశు

3 రుదితః శ్రీకణ్ట[3]చూడామణిః॥[౧[4]॥*]తస్మా దభూ త్సుధాసూ తే
ర్బుధో[5]బుధనుత స్తతః। జతః[6] పురూరవా

౪ నామచక్రవర్తీ[ర్]సవిక్రమః॥౨[7]॥*]తతో జనమేజయో[౽*]శ్వ
మేధత్రితయస్యక[ర్త్తా]తతః ప్రాచీశ స్తతః సైన్యయాతి స్తతో హ

౫ యపతి స్తతః సార్వభౌమ స్తతో జయసేన స్తతో మహా
భౌమ స్తస్మా దైశానక స్తతః క్రోధానన స్తతో దవ[8]

౬ కి స్తస్మా దృభుక స్తస్మా దృక్రక[9] స్తతోమతివర స్సత్రయాగ
యాజీ సరస్వతీనదీనాథ స్తతః కాత్యాయ[న]

౭ స్తతో నీల స్తథో[10]దుష్యంత స్తతోభరత స్తతో భూమన్యు
స్తత స్సుహోత్ర స్తతో హస్తీ తతో విరోచన స్త[స్మా]

౮ దజమీల స్తతః [స]ంవరణ స్తస్య తపనసుతాయా స్తపత్యాశ్చ
సుధన్వా[11] [త]తో భీ[మసేన స్త[తః]

౯ ప్రదీపన స్తతః శన్తను స్తతో విచిత్రవీర్య్య స్తతః పాండు
రాజ స్తతః పాణ్డవా స్తే[షామ] ర్జున

౧౦ నా దభిమన్యు స్తతః పరిక్షిత్ త[12]తో జనమేజయ స్తతః క్షేముక
స్తతో నరవాహన స్తతః శతానీక

---

1 'స్రష్టా' అని చదువవలయును. 2 'న్మనే' అని. 3 'శ్రీకణ్ఠ' అని. 4 శార్దూలవిక్రీడితము. 5 'బ్బుధో' అని. 6 'జాత' అని 7 అనుష్టుభ్. 8 'దేవ' అని. 9 'దృక్షక' అని. 10 'తో' అని. 11 'సుధన్వా' అని. 12 'తతో'లోని మొదటి 'త' యొక్క తలకట్టు కొంచెం మించుమించుగా ఎత్వమువలె చెక్కియున్నది.

౧౧ స్తస్మా దుదయన స్తతః పరం తత్ప్రభృతి ష్వవిచ్ఛిన్నసన్తానే
ష్వయోధ్యాసింహా [స*] నాసీనేష్వేకాన్నషష్టిచ

౧౨ క్రవర్త్తిష్షు[గతే][1]షు తద్వంశ్యో విజయాదిత్యా[2]నామరాజ[3]
విజిగీషయా దక్షిణాపథం గత్వా త్రిలోచనప

౧౩ ల్లవ మధిక్షిప్య దైవదురీహయా లోకాన్తర మగమత్।తస్మిన్
సంకులే తస్య మహాదేవి[4]వృద్ధామాత్యై

౧౪ స్సార్ధం ముడివేము[5]నామాగ్రహార ముపగ మ్యేతద్వాస్తవ్యేన
విష్ణుభట్టసోమయాజినా దుహితృని[ర్వ్వి]

౧౫ శేష మభిరక్షితా సతీ నన్దన మసూత।[6]సా తస్యచ కుమారస్య
మానవ్యసగోత్రహారీ

రెండవ రేకు : మొదటి ప్రక్క

౧౬ తిపుత్ర ద్విపక్షక్రమోభితాని[7] కర్మ్మాణి కారయిత్వా [త
మవర్ద్ధయ]త్ [।*]సచమాత్రా విదితవృ

౧౭ త్తాన్తస్స న్నిర్గ్గత్య చలుక్యగిరౌ నన్దాం భగవతీం గౌరీమారా
ధ్య కుమా [రనారాయ]ణమాతృగణాంశ్చ

౧౮ సంతర్ప్య శ్వేతాతపత్రకశంఖపాలికేతనప్రతిఢక్కా వరాహ
లాంచన[8] మకరతోరణపంచమహా

౧౯ శబ్దబహుర్కు న్న చామర కనకదణ్డసింహాసన గంగాయమునాదీని
స్వకులక్రమాగతానినిక్షి

౨౦ ప్తాని[9]వ సామ్రాజ్యచిహ్నాని సమాదాయ కదంబగంగ భూమిపా
న్నిర్జిత్య[10] సేతునర్మ్మదామధ్యం సార్ధ

---

1 'గతే' అను రెండక్షరములును మొదట నేవో వ్రాసి తుడిచిన తుడుపుపై జెక్కబడియున్నవి. 2 'త్యో' అని. 3 'జా' అని. 4 'వీ' అని. 5 'ముడివేము' అని. 6 ఈ నిలువుగీటు సున్నవలె బహుసూక్ష్మముగ చెక్కబడియున్నది. 7 'క్రమోచితాని' అని, 8 'లాంఛన' అని. 9 'నివ' అని. 10 'న్నిర్జిత్య' అని.

౨౧ సప్తలక్షం దక్షిణాపథం పాలయామాస[।]1 తస్యాసీ
ద్విజయాదిత్యో విష్ణువర్ధన భూపతేః పల్లవా

౨౨ న్వయజతాయా2 మహాదేవ్యాశ్చ నందన[ః॥ 3॥3] తత్సుతః
పులకేరి4 వల్లభః తత్పుత్రః కీర్తివర్మా తస్య తనయః[।]

౨౩ శ్రీమతాం సకలభువన సంస్తూయమాన మానవ్యసగోత్రాణాం
తాణాం కౌశి

౨౪ కీవశ5ప్రసాదలబ్ధ రాజ్యానాం మాతృగణపరిపాలితానాం
స్వామిమహాసేనపాదాను

౨౫ ధ్యాతానాం భగవన్నారాయనా6 ప్రసాదసమాసాదిత వర
వరాహలాంచనే7క్షణ క్షణవ

౨౬ శీకృతారాతిమణ్డలానా మశ్వమధా8వభృథ పవిత్రీకృతవపుషాం
చాలుక్యానాం కుల

౨౭ మలంకరిష్ణోః సత్యాశ్రయ వల్లభేంద్రస్య భ్రాతా కుబ్జవిష్ణువర్ధనో
[అ*]ష్టాదశవర్షాణి వేంగీదేశ

౨౮ మపాలయత్ । తదాత్మజో జయసింహవల్లభ స్త్రయస్త్రింశతం
తదనుజ ఇంద్రరాజః సప్తది

౨౯ నాని తత్సుతో విష్ణువర్ధనో నవవర్షాణి తత్సూను మ్మంగి
యువరాజః పంచవింశతిం తత్పుత్రో జ

౩౦ యసింహ స్త్రయోదశ తదనుజః కొక్కిలిః షణ్మాసాన్ తస్య
జ్యేష్ఠో భ్రాతా విష్ణువర్ధన స్తము

౩౧ చ్చాట్య సప్తత్రింశత మబ్దాన్ తత్సుతో విజయాదిత్యభట్ట9రకో
[అ*]ష్టాదశ తత్పుత్రో విష్ణువ

---

1 ఈ నిలువుగీటు కడు సూక్ష్మముగ మక్కువలె గానవచ్చుచున్నది.
2 'జాతాయా' అని. 3 అనుష్టుభ్. 4 'పులకేశి' అని. 5 'వర' అని. 6 'న్నారాయణ' అని. 7 'లాంఛనే' అని. 8 'మేధా' అని. 9 'భట్టా' అని.

## రెండవ రేకు : రెండవ ప్రక్క

౩౨ ర్ధనః షట్ త్రింశతం తత్తనయో నరేంద్రమృగరాజ శ్చాష్టా
చత్వారింశతం తత్సూనుః కలివిష్ణు[వ]

౩౩ ర్ధనో[ఽ*] ద్వ్యర్ధవర్షం। తత్పుత్రో గుణగ విజయాదిత్య
శ్చతుశ్చత్వారింశతం తద్భ్రాతు వ్విక్రమాదిత్య[1]

౩౪ స్య తనయ శ్చాలుక్య[2]భీమ స్త్రింశత[ం]తత్పుతః కొల్లబిగణ్డ[3]
విజయాదిత్యః షణ్మాసా తత్సూను రమ్మ

౩౫ రాజః సప్తవర్షాణి తత్సుతం విజయాదిత్యం బాల ముచ్చాట్య
తాడపో మాస మేకం తం జిత్వా చాలుక్యవీ[4]

౩౬ మతనయో విక్రమాదిత్య ఏకాదశ మాసా తత్తాడపరాజ
సుతో యుద్ధమల్ల స్సప్తవర్షాణి।[5।*] అమ్మరా

౩౭ జనుజో[6] రాజభీమో భీమపరాక్రమః [।*] విజిత్యయుద్ధమల్లం
త[7]ద్వాదరాబ్దా[8] నపాద్భువం। [౪॥9*] సత్పుత్ర [యో]

౩౮ ర్దశరథప్రతిమస్య తస్య భీమస్య రామభరతోపమయోః కనీ
యాన్। దానార్ణ్నవా[10]మ్మనృప [యో*] రథ పం

౩౯ చవింశ త్యబ్దా నరక్ష దవనీతల మమ్మరాజః। [౫॥*][11] ద్వైమా
తుకో[12] [ఽ*]మ్మనృపతే ర్దాన నృపో రాజభీమ

౪౦ నృపతనయః [।] విద్యాకలాపచతుర[13]మహీ మహా త్సమా
స్త్రిత్ర్సః[14]।[౬॥*] అనుదానార్ణ్నవా[15] దాసీ ద్దై

౪౧ వదుశ్చేష్టయా తతః[।*] సప్తవింశతి వర్షాణి వేంగీ మహీర
నాయికా।[16][౭॥*] అత్రాన్తరే దానవరేంద్రసూనుః శ్రీశ

---

1 'తద్భ్రాతుర్విక్రమాదిత్య' అని. 2 'శ్చాలుక్య' అని. 3 'కొల్లిభిగండ' 4 'భీ' అని. 5 ఇచటి నిలువుగీటు కడు మాత్రమైవది. 6 'రాజానుజో' అని. 7 'తం'అని. 8 'ద్వాదశాబ్దా' అని. 9 అనుష్టుభ్. 10 'దానార్ణవా' అని. 11 వసంతతిలక. 12 'ద్వైమాతురో' అని. 13 'చతురః' అని. 14 'చతురంత మహీమహా త్సమా స్త్రిస్రః' అనియుండవలయును. ఆర్యా. 15 'దానార్ణవా' అని. 16 'నాయికా' అని. అనుష్టుభ్.

౪౨ త్రినవమ్మార్ణా సురరాట్సధమ్మార్ణా।యః శౌర్య్యార్శక్త్యావినిహత్య
స్త్రత్రూ1సద్వాదశాబ్దాన్ సమరక్ష దుర్వీం । [౮॥*]2[త]

౪౩ త స్తదనుజో వీరో విమలాదిత్య భూపతిః [।*] మహీ మపా
త్సమాః సప్త సప్తసప్తి సమద్యుతిః ।[౯॥3*] త

౪౪ స్మా ద్విమలాదిత్యా ద్రవిశుల4 లక్ష్మ్యాశ్చ కుందవ5మహా
దేవ్యాః।నిజగుణవశీకృతాఖిలరాజ

౪౫ 6న్యే రాజరాజవిభ7రజని8॥[౧౦॥*] యః సోమవంశతిలకః శక
వత్సరేషు వేదాబు9రాశి నిధివత్రిష్షు10 సిం

౪౬ హాగే క్కే౯।11కృష్ణ ద్వితీయదివసోత్తర భద్రికాయాం (।) వారే
గురో ర్వణిజి లగ్నవరే [ఽ*] భిషిక్తః॥12[౧౧॥*]
ఇంద్రో యథా దివ

౪౭ ముదారాయ13శాస్తధోర్వీం శౌర్య్యేణ శశ్వ దఖిలా మభి
రక్షితుం యః శ్రీవిష్ణువర్ధాన14నృపోమకు

౪౮ టం పరార్ధ్యం మూర్ధ్నా దధా న్మణిమూాఖ15విభాసితాశాం।16
[౧౨॥*]సంరక్షతి క్షితితలం క్షపితారివర్గ్గ మార్గ్గ17

౪౯ ణ యత్రా18నయశాలిని మానవేన। ప్రితాః ప్రజ19నిజపవిత్ర
చరిత్రతోయైః ప్రక్షాలయని కలిక20

---

1 'శత్రూన్' అని. 2 ఇంద్రవజ్రా. 3 అనుష్టుభ్. 4 'కుల' అని. 5 'కుందవ' అని. 6 'న్యో' అని. 7 'విభు' అని. 8 ఆర్యా. 9 'వేదాంబు' అని. 10 వర్తిషు' అని 11 ఈ నిలువుగీటుకు బదులిచట నొకచుక్క కలదు. నిలువుగీటీశాసనమున క్రమక్రమముగ సూక్ష్మతరమగుచువచ్చి కడపట చుక్కయై మాఱినది. 12 వసంతతిలక. 13 'ముదారయ' అని. 14 'వర్ధన' అని. 15 'మూర్ధ్నా౽దధా న్మణి మయూఖ' అని. 16 వసంతతిలక. 17 ఈ పంక్తిలోని 'వర్గ్గమార్గ్గ'లోను, ౫౦-వ పంక్తిలోని 'సన్మార్గ్గ'లోను'గ్గ'యను నక్షరము స్థూలదృష్టిని 'గ్గో'వలె గాన్పించినను సూక్ష్మముగ బరిశోధించిన నది 'గ్గ' యనియే చెప్పవలసియున్నది. 18 'యత్ర' అని. 19 'ప్రీతాః ప్రజాః' అని. 20 ప్రక్షాలయన్తికలిశా' అని.

౫౦ లకలంకపంకం॥1[౧౩॥*]సన్మార్గేణ కులం కలాగమపరిజ్ఞానేన2
శుద్ధాం ధియ ద్దీనానాథ జనార్తి3 తార్థనివహా

౫౧ త్యాగేన లక్ష్మీం సిరాం4 సంపూర్ణా5 మలచంద్రికావిశ
దయాకీర్త్యా6 జగద్గీతయా మోదిక్చక్ర మలంక

౫౨ రోతి నితరాం చాలుక్యచూడామణిః।7[౧౪॥*] స సర్వలోకా
శ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజధిరాజో8రాజ

౫౩ పరమేశ్వరః పరమభట్ట9 రకః పరమబ్రహ్మణ్యః10 రాజరాజ
దేవో గుద్దవాడివిషయే మణ్ణ

౫౪ నామగ్రామ మధివసతో రాష్ట్రకూటప్రముఖా11కుటుంబినః
సమాహ్వాయ12 సర్వప్రధానసమ

౫౫ క్ష మిత్థ మాజ్ఞపయతి13 [।*] యథా ఆపస్తంబసూత్రాయ
భారద్వాజగోత్రాయ శివకుమ14

౫౬ రభట్టస్య పౌత్రాయ స్వధర్మానుష్ఠానపరస్య రామదేవస్య
పుత్రాయ సమస్త భువనాశ్ర

౫౭ శ్ర15యబ్రహ్మమహారాజ ఇతి ప్రసిద్ధాయ అంకయనామ్నే
మణ్ణదక్షిణక్షేత్రే ముమ్మడి

౫౮ భీమకోల ము16ప్పదిపట్ల వడ్లపట్టు వరిక్షేత్రాం17 [।*] ఉత్తర
దిశిముమ్మడిభీమకోలం బదివుట్లవడ్ల

1 వసంతతిలక. 2 'పరిజ్ఞానేన' అని. 3 'జనార్థి' అని. 4 'స్థిరాం' అని. 5 'సంపూర్ణా' అని. 6 కీర్త్యా' అని. 7 శార్దూలవిక్రీడితము. 8 'రాజాధిరాజో' అని. 9 'ట్టా' అని. 10 'బ్రహ్మణ్యః' అని. 11 'ప్రముఖా' అని. 12 'సమాహూయ' అని. 13 'మాజ్ఞాపయతి' అని. 14 'కుమా' అని. 15 'శ్ర' రెండుపర్యాయము లనావశ్యకముగ జెక్కబడియున్నది. 16 ఇది ప్రాచీన 'ము' వలెగాక ఇప్పటి 'ము' వలె వ్రాయబడియున్నది. 17 'త్ర' అని.

౫౯ పట్టు బొన్నక్షేత్రం1చ[౧*]ఒక్కొ-పుట్టియుంబ[ం]దుమువడ్లపట్టు
తోంటపడకుక్షేత్ర [ం]చ పన్నససంజ్ఞీకృ

౬౦ త్య సూర్యగ్రహణనిమిత్తే ధారాపూర్వ్వకమస్మాభి ర్దత్
త్తమితి విదితమస్తు వః [।*] అత్ర దక్షిణక్షే

౬౧ త్రపన్నససీమానః పూర్వ్వతః వల్లూరి పొలగరుస సీమా॥
దక్షిణతః ఊరిమధ్యమున గుం

౬౨ టయ సీమా॥ పశ్చిమతః కొఅపుట్టతోడి గుంటయసీమా॥
ఉత్తరతః పెనుమాల అల

౬౩ మసీమా॥ ఉత్తరక్షేత్రపన్నససీమానః పూర్వ్వతః చిన్తతోడి
పుట్టయసీ॥2దక్షిణ3స_త్త

మూడవరేకు : రెండవ ప్రక్క

౬౪ గోదావరియసీమా॥ పశ్చిమతః బీమియరట్టడి త్రోవిడ్డియసీమా॥
ఉత్తరతః గుంటయ

౬౫ సీమా॥ సర్వ్వకరపరిహృత స్యాస్య యాచనముమాడ ఒక్కొ-ణ్ణ4
[౧*]ఊరితూప్పునననుణ్ణి పడుమ

౬౬ టికిం బాతిన పెద్దవిధి5 దక్షిణమున గృహక్షేత్రమున పూ6డ్ల
నలువది [।*] అస్యోపరి న కేన

౬౭ చి ద్బాధా కరణీయా యః కరోతి సం7 పంచమహాపాతక
యుక్తో భవతి [॥*] తథా8 చోక్తంవ్యాసేన [॥*] స్వదత్తాం

---

1 'జొన్నక్షేత్రం' అని. 2 'సీమ' అని. 3 'దక్షిణతః' అని. 4 ఒక్కొణ్డ' అని. 5 'వీథి' అని. 6 మొదట 'మ' వ్రాసి తరువాత దాని కొమ్మును దుడిచి 'పూ'గ మార్చినట్లున్నది. 7 'సః' అని. 8 'తథా' అని.

౬౮ పరదత్తాంవా యోహరేత వసున్ధరాం [।*] షష్టింవర్ష[9]
సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమి[॥*[10] ౧౫॥]రితి
[॥*]ఆజ్ఞప్తి

౬౯ రస్య కటకరాజః [।*] కర్త్తా నన్నియభట్టః [।*] లేఖకో
గణ్డాచార్య్యః॥

---

9 'షష్టివర్ష' అని. 10 అనుష్టుభ్.


MAP TO ILLUSTRATE
THE REIGN OF
RĀJARĀJANARĒNDRA
R. Ganges
UTTARALĀḌA
VANGA
TAKKANALĀḌA
R. Mahanadi
KŌSALA
CAKRAKŪṬA
KALINGA
ODDA
KALYANI
R. Godavari
ETAGIRI
R. Bhima
KOLLIPAKA
PITHĀPURAM
R. Kistna
VĒNGĪ
RĀJAMAHĒNDRAVARAM
MUSANGI
R. Thungabhadra
KALIDINDI
BEZAWĀDA
NOLAMBA VADI
NELLŪRU
KĀLAHASTI
KĀÑCĪ
GANGA VADI
TALAKAD
R. Kauvery
GANGAIKONDACŌLAPURAM
TANJORE
TIRUVAIYAR
SIMHALA
ARABIAN SEA
BAY OF BENGAL
68
72
76
80
84
88
32
28
24
20
16
12
8

# రాజరాజనరేంద్రుని కలిదిండితామ్రశాసనము

మొదటి రేకు - రెండవప్రక్క



రెండవ రేకు - మొదటిప్రక్క



రెండవ రేకు – రెండవ ప్రక్క



మూడవ రేకు – మొదటి ప్రక్క



నాలుగవ రేకు - రెండవప్రక్క



ఐదవ రేకు - మొదటిప్రక్క



# రాజరాజనరేంద్రుని మండతామ్రశాసనము

మొదటి రేకు - రెండవప్రక్క



రెండవ రేకు - మొదటిప్రక్క



# మార్పులు, చేర్పులు, హెచ్చరికలు

[ఇది చారిత్రకవ్యాస సంపుటి గాన ఈ క్రింది వానిని ముందుగా సవరించుకొనుట మంచిది]

## మార్పులు

| పుట | పంక్తి | ఉన్నది | మార్పు |
| --- | --- | --- | --- |
| 8 | 24 | న్యవివజ్ఞానము | వవ్యవిజ్ఞానము |
| 9 | 9 | | శివాజీ |
| 13 | 18 | గుతియైన | గుతియైనది |
| 28 | 1 | తెనుగు | ముందు తెనుగు |
| ,, | 25 | నీ శాత్తరా | పీ శాత్తరా |
| 31 | 15 | నిర్యాణానంతర | నిర్యాణానంతరము |
| 43 | 10 | నిర్జతులై | నిర్జితులై |
| ,, | 16 | శాకాభంగ | శాశాభంగ |
| 56 | 5 | రెండవసింహవర్మ | సింహవర్మ |
| 92 | 15 | 'ఇి' 'ఈ' | 'ఇ' 'ఈ' |
| ,, | 18 | ఆగుడితో | ఆగుడిలో |
| 93 | 1 | తత్కారణ | తత్కారణ |
| 95 | 9 | సంస్కృత | సంస్కృత |
| ,, | 11 | శాసనములం | శాసనమునం |
| 97 | 12 | నిల్చియుండు | నిచ్చియుండు |
| 125 | 11 | భవన్నారా | భగవన్నారా |
| 145 | 19 | కాచ్చు | కావచ్చు |
| 147 | 4 | రేకవ | రేవక |
| ,, | 18 | సిదాంతము | సిద్ధాంతము |
| 148 | 23 | దుర్గక్రమణ | దుర్గాక్రమణ |
| 150 | 18 | రాజ్యాదిత్యుడు | రాజాదిత్యుడు |

| పుట | పంక్తి | ఉన్నది | మార్పు |
|---|---|---|---|
| ,, | 20 | మఱియుక | మఱియొక |
| 154 | 20 | అంకితముల్ల | అంకితమువల్ల |
| 190 | 7 | గణగ | గుణగ |
| 202 | 16 | రక్షించు | శిక్షించు |
| 209 | 25 | కలదని | కందని |
| 247 | 7 | సల్పిరి. | సల్పెను. |
| 263 | 20 | నజ్ఞాతమో | నజ్ఞానతమో |
| 277 | 5 | రాక్రణ్ణాం | రాక్రణ్టాం |
| ,, | 10 | నొట్టునెత్తు | నెట్టునెత్తు |
| 281 | 14 | ధమ్మ్రదో | ధమ్మ్రఽదో |
| 284 | 6 | వేళ్య | వేళ |
| ,, | 16 | నిహతుడై | నిహతుడైన |
| 292 | 18 | తామపట్టిక | తామ్రపట్టిక |
| 293 | 13 | తత్పుతః | తత్పుత్రః |
| ,, | 24 | నొకసంవత్సర | నొకటిన్నరసంవత్సర |
| 297 | 16 | డొకయేడు | డొకటిన్నరయేడు |
| 299 | 20 | విష్ణువర్ధనుడు | ప్రథమవిజయాదిత్యుడు |
| 325 | 23 | సోత్క్రణాం | సోత్క్రణ్ఠాం |
| 327 | 19 | క్రీ. శ. ౭౩౭ | క్రీ. శ. ౭౪౭ |
| 356 | 12 | నధిషించిన | నధిష్ఠించిన |
| 366 | 8 | నిరారించి | నిర్ధారించి |
| 376 | 13 | ౯౪-౩-౯౪౪ | ౯౪౩-౯౪౪ |
| 377 | 18 | నేలకాలమున | నేకకాలమున |
| 381 | 9 | వము | వ్యము |
| 387 | 14 | రాబ్యము | రాజ్యము |
| 394 | 21 | సుత్తచోడ | సుత్తమచోడ |
| 409 | 8 | ంకంధికా | ంధికా |
| ,, | 11 | బలహులల | బహులల |
| 410 | 18 | రాజేంద్రోద్ధయం | రాజేంద్రోయం |

| పుట | పంక్తి | ఉన్నది | మార్పు |
|---|---|---|---|
| 411 | 11 | య్యా ఞ్ పర్యా ఞ్ | య్యఞ్ పర్యాఞ్ |
| 412 | 6 | బృహద్దణ | బృహద్దణ్ప్రచణ్డ |
| 413 | 7 | క్వచిప్త్రో క్తం | క్వచిత్ప్రోక్తం |
| ,, | 17 | వాజభిరేక | వాజిభిరేవ |
| 414 | 4 | దివిజి | దివిజ |
| 416 | 5 | రామభ[ద] | రామభ[ద్రః] |
| 423 | 9 | వేంగిచోళరాజులచే | వేంగిచాళుక్యరాజులచే |
| 439 | 19 | సతఃపాండు | స్తతఃపాండు |
| 440 | 12 | త్రిఫుత్ర | త్రిపుత్ర |
| 441 | 18 | తత్సుత్రో | తత్పుత్రో |
| 442 | 21 | కొల్లిభిగండ | కొల్లభిగండ |
| 444 | 7 | ౹రాజరాజ | రాజరాజ |
| ,, | 24 | 17. 'త్ర' అని | 17 'త్రం' అని |



# చేర్పులు

పు. 41. పం. 9. యేలుబడిక్రిందికి—యేలుబడి క్రిందనే యుండెను. మధురపాలకుడు ఢిల్లీసుల్తానుపై దిరుగబడి యరవదేశమునంతటిని తన యధికారము క్రిందికి

123. తాణ్డివాడశాసనము నాల్గవరేకు పాఠము.

1. బహుభిశ్చానుపాలితా [।*] యస్యయస్యయదా భూమి (స్త)
స్యతస్య

2. తదాఫలమ్ [॥*] స్వదత్తాం పరదత్తా (త్తాం) వా యత్నాద్రక్ష
యుధిషి(ష్ఠి)ర

3. మహీం మహీమతాంశ్రేష్ఠ ధర్మాచ్ఛ్రేయోనుపాలనం [॥*]
4. ఆస్ఫోటయన్తి పితరో వల్గన్తి ప్రపితామహాః ॥ (।)
5. భూమిఁజాతా కులేజాతః (1) సనస్త్రాతా భవిష్యతి ॥

## హెచ్చరిక

ఈక్రిందివానిలోని 'ఴ' ను తమిళ ழ వలె చదువుకొనవలెను.

| పుట | పంక్తి | శబ్దము |
|---|---|---|
| 218 | 15 | ధఴగ, న్వఴది |
| 281 | 5 | పాగఱ్తైయె |
| 296 | 11 | చోఴని |
| 311 | 17 | నోఴ(ళ)ంబ |
| 314 | 18 | పాఴల్చోళ |
| 315 | 7, 11, 15 | ,, |
| 328 | 23, 24, 25 | చోఴ |
| 337 | 4 | దఴై (ళై) |
| 345 | 4 | సోఴ...ఇన్పుఴోలి |
| ,, | 5 | తేనిఴచ్చిన |

